# అంకురార్పణ

నాలుగు కాలాల పాటు నిలిచి, నలుగురికీ తోడ్పడుతూ, ప్రజా జీవితాన్ని పురోగమింపజేసే సాహిత్యాన్ని ప్రచురించాలన్నదే మా లక్ష్యం.

ఆరోగ్యకరమైన రచనల్ని ప్రజల కందించటం కోసం, అనేక కష్ట నష్టాల నెదుర్కొని, ఉన్నత ప్రమాణాలను సాధించిన ప్రచురణకర్తలు మన కున్నారు. అయితే, నానాటికీ యీ రంగంలో పెరిగిపోతున్న వ్యాపారదృష్టి ఫలితంగా, పోటీకి తట్టుకోలేక అనేక సంస్థలు ఆగిపోయాయి, కొన్ని నూతన సంస్థలూ వెలిశాయి.

ప్రస్తుతం వున్న మార్కెట్ పరిస్థితుల దృష్ట్యా మేం తీసుకొచ్చే ప్రచురణలు కొంత విలక్షణంగానే ఉంటాయి. వీటికి సహృదయులైన పాఠకుల ఆదరాభిమానాలు ఎంతయినా అవసరం. మంచి పుస్తకాలు విరివిగా వెలుగులోకి తీసుకురావటానికి పాఠకుల ఆదరాభిమానాలు ఎల్లప్పుడూ ఉంటాయన్న విశ్వాసం మాకుంది. ఆ విశ్వాసంతోనే తొలి ప్రచురణగా మీ ముందు యీ పుస్తకాన్ని వుంచుతున్నాం—

—*ప్రచురణకర్తలు*

# ఎందుకీ ముందు మాట?

ఇవి, 1974-77 సంవత్సరాలలో "ఈనాడు" ఎడిటర్‌గా నేను రాసిన సంపాదకీయాలు. అయితే అదొక సంధికాలం. దిన పత్రికకు అసలు ఎడిటోరియల్స్ అనవసరమని భావించి, వారానికి రెండో మూడో సంపాదకీయాలతో సరిపెట్టుకుంటే చాలు నన్న ధోరణి గల పత్రికాధిపతి ఒక విచిత్ర మనో దౌర్బల్యానికి లొంగిపోయిన కాలం అది. ఈ పద్ధతి వద్దు వద్దన్నా వినకుండా మూర్ఖత్వం కొన్ని నెలలపాటైనా మూటకట్టుకున్న దినాలవి. "నీ పత్రిక ఏం చెప్పదలుచుకుంది?" అని చైతన్యంతో పాఠకులు వేల సంఖ్యలో ప్రశ్నిస్తూ, ఉత్తరాలు గుప్పించవలసివచ్చిన ఘడియలవి. ఆంక్షలు వేరు, పరిమితులు వేరు. ఈ రెండింటికీ వ్యత్యాసం, చెరిగిపోయిన విషమ దశ కూడా అదే. పత్రికకు 'పాలసీ' నిర్ణయించలేక సంపాదకీయాలకు మాత్రం ఒడ్డు పొడవుల కొలతలు తీసేవాడు పత్రికాధిపతి అయిన చోట అన్ని విలువలూ గుంట పూలు పూస్తాయి. రాయలేని వాళ్ళు, అక్షరార్థం తెలియని అజ్ఞానులు పత్రికాధిపతులు గానే గాక చీఫ్ ఎడిటర్‌లుగా చెలామణీ అవుతున్న ప్రతిచోటా ఇదే తంతు ! ఇలాంటి పెద్దమనిషిని చూడబట్టే వేణుగోపాల శతకకర్త అక్షరం తెలియనివాడు ఆకారపుష్టి వల్లనే 'పండితుడై' పోయాడని చమత్కరించాడు !

"దైవం" అంటూ ఒకటి లేకపోతే వెంటనే సృష్టించడం అవసరమన్నాడు వెనుకటికో పెద్దమనిషి. అలాగే అబద్ధాలూ, యుద్ధాల సృష్టి కూడా ! స్వార్థం ఎంత పనైనా చేయిస్తుంది: వ్యాపారం చింతపండైనా చిట్‌ఫండైనా ఒకటే; ఆయిల్ పరిశ్రమైనా ఆముదాల వ్యాపారమైనా అంతే. వర్తక వాణిజ్యాలు పెరగాలన్నా, లాభాలు తీయాలన్నా దేశాల మధ్యనో, ప్రజల మధ్యనో, పార్టీలకూ జనాలకూ మధ్యనో, వారి తాలూకు గ్రూపుల మధ్యనో లేదా మంత్రుల మధ్యనో తగాదాలు పెంచాలి, తన్నులాటలు తేవాలి, పొయ్యి పెట్టాలి, తనబొజ్జ పెంచుకోవాలి-ఇదీ యుద్ధాలు తెచ్చే కజ్జాకోరు పాలసీ, వ్యాపార తత్వం. ఆయిల్ వ్యాపారి పత్రికాధిపతి కూడా అయితే పెట్రోలు ఖర్చులేకుండానే పచ్చగడ్డి కూడా భగ్గున మండుతుంది. చరిత్రలో అలా ఎన్నిసార్లో మంటలు లేచాయి కూడా !

లోకవ్యవహారం మాత్రమే లోచనకూ ఆలోచనకూ సాధనంగా ఉంచుకోగల పత్రికాస్వేచ్ఛను కాస్తా వ్యాపారస్వేచ్ఛగా దిగజార్చినప్పుడు ఈ మంటలు తప్పవు.

నూటికి తొంభైమంది ఆశించే పత్రికా స్వేచ్ఛ వేరు, వ్యాపార పత్రికాస్వేచ్ఛ వేరు. అందుకనే ఇంగ్లాండ్‌లో సి. పి. స్కాట్ లాంటి మహానుభావులు పెద్దమనిషి తరహాగా మధ్యస్తంగా వెళ్ళి "Comment is free, facts are sacred' అని పత్రికా స్వేచ్ఛకు ముద్దయిన హద్దులు ఏర్పరిచారు. కాని తెలుగు వ్యాపారు లలో కొందరికి ఈ మాత్రపు హద్దులుకూడా కిట్టవు. ఇలాంటి కొందరు పాశ్చాత్య పత్రికా లోకం సాధారణంగా శిరసావహించిన సంప్రదాయాలనేగాక దేశీయ పత్రికా ప్రపంచంలో స్థిరపడిన ఉత్తమ ఆనవాయితీలను కూడా కాలదన్నుతున్నారు. వాస్త వాలను తారుమారుచేసి "మసిపూసి మారేడుకాయ"గా చూపితేగాని హెచ్చు కాపీలు అమ్ముకోలేని స్థితికీ, దుస్థితికీ వీరు దిగజారుతున్నారు. అడ్డదారులలోనేగాక అంద మైన పద్ధతులద్వారా కూడా పాఠకుల అభిరుచులకు అందాలు దిద్దవచ్చునని అక్షరార్థం తెలియని ఈ అజ్ఞానులకు తోచదు. అందుకని ఇలాంటివాళ్ళు చేస్తున్నపని-స్కాట్ సూత్రాన్ని ఆచరణలో తెనిగించడానికి మారు తెగదెంచడమూ, తిరగతోడడమూ ! దీని ప్రకారం ఇప్పుడా సూత్రాన్ని కాస్తా మార్చి "Facts Are Free, Fetters To Editors'"(నీకు తోచిందే వార్త, ఎడిటర్ల కలాలకు సంకెళ్ళు') అన్న కొత్త నీతిగా వీరు చదువుకోమంటున్నారు!

ఒకప్పుడు స్పెయిన్‌కు వలసగా ఉన్న క్యూబాలోనూ కరిబియన్ సముద్ర ప్రాంతంలోనూ పట్రోలియం గనులకూ, ఇతర ఖనిజ వనరులకూ గుత్తాధిపతిగా ఉన్నవాడు "ది న్యూయార్క్ జర్నల్" అధిపతి విలియమ్ రాండోల్ఫ్ హర్ట్ (Rondolph Hearst). తన ఆయిల్ నిధుల్ని పెంచుకోవాలి, లాభాలు గుంజాలి. కాబట్టి స్పానియార్డులకూ క్యూబన్లకూ మధ్యఅప్పటికిలేని యుద్ధపరిస్థితిని తన స్వార్థం కోసం సృష్టించాలి. సరిగ్గా ఆ పనే చేశాడు హర్ట్. అమెరికా ప్రభుత్వ యుద్ధ ప్రక టనకు దారితీసే వాతావరణాన్ని కల్పించిపెట్టాడు! క్యూబా వెళ్ళి వార్తలు, ఫోటోలూ పంపించ వలసిందిగా రెమింగ్టన్ అనే ఫోటో జర్నలిస్టుకు పని పురమాయించాడు. తీరా క్యూబా వెళ్ళిన ఆ విలేకరి అక్కడి పరిస్థితిని పరిశీలించి "ఇక్కడ అంతా శాంతంగా ఉంది, ఇప్పుడప్పుడే మీరు ఊహిస్తున్న ఘర్షణలు, కల్లోలం ఇక్కడ మచ్చుకైనాలేవు," అని ఒక టెలిగ్రామ్ పంపాడు. "తిరిగి న్యూయార్క్ వచ్చే స్తున్నా" అని కూడా చెప్పాడు. వెంటనే కజ్జాకోరు హర్ట్ "వద్దు, రావద్దు, క్యూబా లోనే ఉండిపో, నే నడిగిన ఫోటోలు కల్పించి పంపించు, నేను యుద్ధం సృష్టిస్తా" అని తిరుగు టెలిగ్రామ్ కొట్టాడు !

తన లాభంకోసం యుద్ధం కావాలి. జనం చావాలి; తన సంపద పెంపుదల కోసం యుద్ధం తెస్తాడు, తంపులు పెడతాడు, గ్రూపులు కడతాడు, 'గుంపులో గోవింద' అంటాడు, లేని కథలు అల్లుతాడు, ఆమాటకొస్తే కట్టుకథలనే తన అన్న పానీయాలుగా ఆరగిస్తాడు. అదేమంటే - "ఇదే జర్నలిజం" అని ఎదురు నమ్మ

మంటాడు! అమెరికా నుంచి ఆంధ్రప్రదేశ్ వరకూ కొందరు పత్రికాధిపతులలో వ్యాపిస్తున్న జాడ్యం ఇది. బాధ్యతలు తెలిసిన స్వేచ్ఛకేగాక పాత్రికేయ వృత్తి స్వచ్ఛతకు కూడా ఈ ధోరణి కళంకం తెచ్చిపెడుతోంది. ఈ మచ్చను మాపగల తాయత్తు దారితప్పిన పత్రికా వ్యాపారివద్ద దొరకదు, జర్నలిస్టుల వద్దనే లభిస్తుంది. అదే - మూకుమ్మడి నిరసన.

జర్నలిస్టులను నియమించుకోవడం ద్వారా పత్రికను సమాజ ప్రయోజనాల రక్షణకు అనువైన దుర్గంగా దిద్దితీర్చాలన్న లక్ష్యంఉన్న పత్రికాధిపతులు వేరు. కాని, "నేను డబ్బుతో జర్నలిస్టులను కొనేయగలను, జర్నలిస్టులు అంటూలేరు, సబ్-ఎడిటర్ లంటే అనువాదకులు మాత్రమే" అని ఒక నిర్దిష్టమైన వృత్తి ధర్మాన్ని కించపరచే చోట మంచి విలువలు పెరగవు; ఆ బాపతు పత్రికాధిపతులే వేరు. వేమన ఉబుసు పోక అనలేదు: "పురుషులందు పుణ్య పురుషులు వేరయా!" అందరూ పత్రికాధి పతులే, కాని ఉత్తమ పత్రికాధిపతులు వేరు!

హర్ట్‌లాంటి పుండాకోరులూ, కలహప్రియులూ ఉన్నచోట వర్ధిల్లేది మాత్రం జర్నలిజం కాదు - పత్రికా వ్యాపార గూండాయిజం! పరాయిభాషకు ఎన్నివర్ణాలో తన తల్లి భాషకు ఎన్నిఅక్షరాలో తెలియనివాళ్ళు ఉభయ భాషాప్రవీణులుగా చెలామణి కావాలని చూస్తు తమను పాత్రికేయులుగా చీఫ్ ఎడిటర్‌లుగా ముద్ర వేయించుకోవాలని తపన పడుతున్నారు. జర్నలిజాన్ని వృత్తిగా స్వీకరించి, కష్టించి పోషించు కుంటున్న పాత్రికేయులందరికీ ఈ తప్పుడు ధోరణి ఒక సవాలు. తమ ఉనికినే వెక్కిరిస్తున్న ఈ వెకిలితనాన్ని జర్నలిస్టులు అందరూ తూర్పారబట్టి తిప్పికొట్టాలి. ఈ చెడు సంప్రదాయాన్ని చీల్చిచెండాడాలి. అలా చేయనంత కాలం-పాత్రికేయుల వృత్తిలో ఉద్దండులైన కోటంరాజు రామారావు, కుందూరి ఈశ్వరదత్, ఖాసా సుబ్బా రావు, చలపతిరావు, నార్ల వెంకటేశ్వరరావు లాంటి వారి కృషిని కూడా మాఫీ చేయగల కుహనా పాత్రికేయులు తెలుగుదేశంలో కూడా స్థిరపడిపోతారని గుర్తుంచు

"ఎడిటర్" అంటే లాటిన్ భాషలో "ఎడరే" (Edare) అని. అంటే - "One who revises, corrects or arranges the contents and style of work of others" అనీ prepare an edition of and others work or set in order for publication అనీ అర్థం. కాని స్వతహాగా ఇవేమీ చేయనివాడే ఇప్పుడు చీఫ్ ఎడిటరట!

అయితే రచయితలుగా, ప్రసిద్ధ పాత్రికేయులుగాఉన్న సమర్థులైన పత్రికాధి పతులు ప్రపంచంలో లేరా? ఉన్నారు. ఇంగ్లాండ్‌లో "Daily Mail" లాంటిపత్రిక లకు ధనాధిపతిగా ఉన్న మేటి నార్త్ క్లిఫ్. అలాగే అక్కడి "ఎక్స్‌ప్రెస్" గ్రూప్ అధిపతి లార్డ్ బీవర్‌బ్రూక్. వీరు సవ్యసాచులు. ఏ వేషం వేసినా అలాంటివాళ్ళకు చెల్లుతుంది. చివరికి నిన్నగాక మొన్న బ్రిటన్‌లో "Sale of the Century" గా

ప్రసిద్ధికెక్కిన "ది టైమ్స్"ను కొనివేయగలిగిన తామ్సన్‌కూడా శతాధిక పత్రికలకు అధిపతి అయికూడా తాను ఛైర్మన్‌గానే ఉండిపోయాడు. మన దేశంలో గొలుసు పత్రికల అధిపతి గోయెంకా కూడా ఈ సంప్రదాయాన్ని పాటించాడు.

ఒక హర్డు పోతే మరొక మర్డోక్ (Murdoch) వస్తూనే ఉంటాడు. కాని హెరాల్డ్ ఇవాన్స్‌లాంటి ఖానుడు ఏ "టైమ్స్"లోనో మళ్ళీ ఉదయించడానికి టైమ్ పడుతుందని మరచిపోరాదు! ఇర్వింగ్ వాలెస్ "ది ఆల్‌మైటీ" నవలలో సృష్టించిన దుష్ట పత్రికాధిపతి పాత్ర లండన్ వీధులలోనేకాదు, హైదరాబాద్ వీధుల్లో కూడా మనకు తటస్థిస్తూంటుంది!

మన దేశంలో ఒక్క Statesman దినపత్రికను మినహాయిస్తే ఏ పత్రికకూ "విధాన పొత్తం" ("Policy Book") లేదంటారు. వ్యాపార సూత్రాలు బహుశా ఇలాంటి పాలసీనిర్ణయానికి ఆటంకమేమో మనకి తెలియదు! కాని పత్రికలకు ప్రత్యేకించి మిత్రులూ, శత్రువులూ అంటూ ఉండరు కాబట్టి సూక్ష్మార్థంలో కాకపోయినా స్థూలార్థంలోనైనా ఒక "పాలసీ బుక్" అవసరం కాదా? కొన్నిచోట్ల "పాలసీ బుక్" ఉండదుగాని, పత్రిక శైలినీ, దాని సరళినీ శాసించే Style Book ఉంటుంది. లండన్ "టైమ్స్" అనుభవాన్నిబట్టి చూస్తే దాని అధి పతులు పత్రిక పాలసీని దాని Articles of Associationలోనే పొందుపరిచారు. అయితే ఇలా పాలసీతోపాటు ఆ పత్రంలోనే ఎడిటర్ల స్వేచ్ఛకు హామీ పడుతూ అందుకు తగిన రక్షణలను కూడా చేర్చిన పత్రికలు మాత్రం - "లండన్‌అబ్జర్వర్", "ఎకానమిస్ట్."

అంతేకాదు, బ్రిటన్‌లోని Kemsley గ్రూపు పత్రికలకు "ఎడిటర్-ఇన్-చీఫ్" ఉండడం ఒక సంప్రదాయం. అయితే అందులో కూడా ఓ మంచి ఆనవాయితీని అనుసరించారు. మొత్తం సంస్థకు "చైర్మన్" ఉన్న వ్యక్తి వృత్తిరీత్యా జర్నలిస్టు అయి ఉంటే తప్ప అతణ్ణి చీఫ్ ఎడిటర్ అని గానీ, Editor-in Chief అనకూడదని తీర్మానించుకున్నారు. కాని మన దేశంలో "సంకర వ్యాపారి" పత్రికా సంపాదకుడనిపించుకోవాలన్న తహ తహ మన తెలుగు వ్యాపారితో మరింతగా బలపడడం .అనారోగ్యంగా భావించాలి. కేవలం ఇది నా అధిక్షేపణ కాదు., అనుభవం. ఇది వ్యక్తి దూషణ కాదు, సమష్టి ప్రయోజనం పోషణ; ఇది అబద్ధాలకు కాళ్ళు తెచ్చే యత్నం కాదు, అసత్యాల కాళ్ళు విరగగొట్టవలసిన అవసరాన్ని గుర్తింపజేసే ప్రయత్నం.

ఈ నా సంపాదకీయాలను స్థల, కాల నిర్ణయంతోపాటు విషయా సక్తినిబట్టికూడా విభజించి, ఒక పద్ధతిలో పొందుపరచడానికి తోడ్పడిన సహచర పాత్రికేయ మిత్రులకు నా కృతజ్ఞతలు.

హైదరాబాద్

## ఇదీ వరస...

# సుందర స్వప్నం

ఉలితో ఊహలకు రూపాలు కల్పించి శిలకు కళాకాంతులు తెస్తాడు శిల్పి. కుంచెపట్టుకుని ఎంచుకున్న మంచి భావాలకు రూపురేఖలు తొడుగుతాడు చిత్రకారుడు. బాకులుగా చాకులుగా దూసుకుపోగల శబ్దచిత్రాలు సృష్టించి భావోచితంగా నగిషీలు చెక్కి నిస్తబ్ధతనూ నిబిడాంధకారాన్నీ చీల్చగల చండశాసనులు కవీ, రచయితా. గుండె గొంతుక విప్పి బండరాళ్ళను సహితం కరిగించి కదిలించగలవాడు గాయకుడు. హృదయవైశాల్యంలో వీరందరికీ ప్రతినిధి పత్రికా సంపాదకుడు.

అందరివీ స్వప్నాలే, సుందర స్వప్నాలు. కాని బొరుసునుచూపి బొమ్మను దాచకూడదు. తమ కోర్కెలకుకూడా వాస్తవ రూపమిచ్చి తమ గొంతుకు వంతుకలిపి, చైతన్యం కలిగించి, దారిద్ర్య బాధలనుంచీ ఇతర సామాజిక చెడుగులనుంచీ విముక్తి చేసి, తమనూ అందని స్వప్నసీమకు, కాదు కాదు, అందుకోగల స్వర్గసీమకు అందరికీ సుఖశాంతులిచ్చే సమతా సంక్షేమ సరిహద్దులకు చేర్చమంటున్న వాళ్లు— సామాన్యప్రజలు. ఈ ప్రజల మనోభావాలకు అద్దంపట్టి, చిత్రికలుపట్టి భావ సమైక్యతను సాధించి, వారిని సానతీర్చిన జాతిరత్నాలుగా దిద్దుకోగల అపురూప సాధనాలు పత్రికలు.

ఈ ప్రజలకే మనం నేడు బ్రహ్మరథం పట్టవలసిఉంది. వారి సమస్యలను పత్రికలు ప్రతిబింబించాలిగాని పైకి పొక్కకుండా అణచకూడదు. వారి విజ్ఞాపనలకు అవి వేదికలు కావాలి. వారి ఆశయాలకు అవి అద్దం పట్టాలి. వారి బాధలను అర్థం చేసుకోవాలి. వారి అభ్యుదయానికి అనునిత్యం అక్షర రూపం ఇవ్వాలి. ఈ మహదాశయంతో ప్రారంభమయ్యేవే ఉన్న పత్రికలు. ప్రజల "చేతిఎత్తుబిడ్డలు"గా అల్లారుముద్దుగా వర్ధిల్లవలసినవి పత్రికలు. పాఠకుల ఆదరాభిమానాలే వాటికి ఆస్తికి మించిన ఆస్తీ, ఆయుష్షూ. దినపత్రిక గుండెలో చప్పుడుచేసేవి గులకరాళ్లుకావు, ఊబుసు

పోకలుకావు — ప్రజలసమస్యలూ, దేశసమస్యలూ మాత్రమే, వారి సాంస్కృతిక విలువలు మాత్రమే. ఏ పత్రికఅయినా తాను పుట్టి, పెరుగుతున్న ప్రాంతానికి ప్రాతినిధ్యం వహిస్తుందేగాని, దాని మనస్సుమాత్రం ప్రాంతీయం కాదు, కాజాలదు.

మరొక దినపత్రిక సుందర నగర ప్రవేశం చేస్తున్న ఈ శుభసమయంలో తెలంగాణా ప్రజలకు వందనాలు. సాంస్కృతిక, రాజకీయ దాస్యాలనుంచి వారికి విమోచనం కల్గించిన మహనీయులకు శ్రద్ధాంజలి. బానిసబంధనాలలో మగ్గిన ప్రజలే నిజమైన త్యాగమూర్తులని మట్టినుంచి పుట్టిన మహావీరులనీ నిరూపించడానికి తెలంగాణా ఒక నిదర్శనం.

జాతీయోద్యమంలో తెలంగాణా ప్రాంతానికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఒక నాటి సంస్థానప్రజల చరిత్ర వారి సొంతగొడవ కాదు, అందరి బాధ, సకలాంధ్ర ప్రజల బాధ. కనీసం సమావేశ స్వేచ్ఛకైనా నోచుకోగల్గిన ప్రాంతాలు, రాష్ట్రాలు కొన్ని కాగా, అసలు వేషభాషలకూ భావప్రకటనా స్వేచ్ఛకీ గొడ్డలిపెట్టు పడిన చరిత్ర తెలంగాణాది! అందువల్లనే తెలంగాణా ప్రాంతంలోసాగిన గ్రంథాలయోద్యమాలు, ప్రబలిన సాహిత్య సాంస్కృతిక, భాషా ఉద్యమాలు తుదకు ఒక మహావెల్లువై రాజకీయ స్వాతంత్ర్యసమరానికి దారి తీశాయి.

విజ్ఞాన చంద్రికా గ్రంథమండలితో ఆరంభమైన తెలంగాణా సాంస్కృతికోద్యమం విశాలాంధ్ర అవతరణతోగాని తృప్తిపొందలేదు. ఉత్తర–దక్షిణ భారతాలమధ్య విశ్వసించదగిన సేతువై, భిన్నసంస్కృతులకు హేతువై, రకరకాల చీకాకుల మధ్యనే అభ్యుదయం సాధిస్తున్నది మన రాజధానీ నగరం. తెలంగాణాలో యువశక్తిని సమీకరించి ప్రజలలో నవ చైతన్యం కల్పించినవారు మాడపాటి, మందుముల, సురవరం, జమలాపురం, బూర్గుల, రామానంద తీర్థ, రావి నారాయణరెడ్డి, దేవులపల్లి. మహిళా ఉద్యమ సారథులైన మాడపాటి మాణిక్యమ్మ, నడింపల్లి సుందరమ్మ–శేముషీ సంపన్నులైన విదుషీమణులు. కాకతీయులకే కాదు కాకలు తీరినవారందరికీ కార్యరంగంగా వర్ధిల్లింది వరంగల్లు. నాటి విమోచనకవితా సంచలనంలో కాళోజీ, దాశరథి, ఆళ్వారుస్వామి అగ్రగాములు. ఈ సుముహూర్తాన వీరందరికీ మరొక్కసారి శతాధికవందనాలు.

తెలుగు పత్రికలు, మాతృభాషా దినపత్రికలు ఒక్కనాటి కాదు—గుండెను గుడి చేసుకున్న తెలుగువాడు ఎక్కడ ఉంటే అక్కడికివెళ్ళి పలకరించాలి, వెలుగులై విజ్ఞాన పులుగులై విహరించాలి.

— "ఈనాడు" హైదరాబాద్ ఎడిషన్ ప్రారంభసంచిక సంపాదకీయం.

# రేపటి తెలుగునాడు

సంతోషం, సంరంభం ఒకవైపు, సమస్యలు సందేహాలు వేరొకవైపు. ఇది తెలుగువారికి కొత్త ఏమీ కాదనవచ్చు. ప్రశ్న, పురోగతికి అని నమ్మినవారు అనకపోవచ్చు. జరగక జరగక ఒక మహాయజ్ఞం-కాదు మహాయత్నం జరుగుతుంటే ఈ అపశ్రుతి ఏమిటని కొందరు ప్రశ్నించవచ్చు. కాని తెలుగుల అభివృద్ధిని మనసారా కాంక్షించే వారెవరైనా, ఆ 'ప్రగతి' అపమార్గం పట్టకూడదని ఆశించే వారెవరైనా, మనస్సులోని మాట చెప్పక తప్పదు.

నిజానికి మహాసభలు మంచికోసం, తెలుగు ప్రజలలో మరింతగా జ్ఞాన జ్యోతులు వెలిగించడంకోసమే జరగాలి. అవి మనవాళ్ళలో పేరుకున్న మండి తనం పోగొట్టాలి. ప్రజలు ప్రగతి మార్గాన్ని నిర్ద్వంద్వంగా నిర్దేశించగల చండశాసనులు కావాలి. ఆ వెలుగులో ప్రజాజీవన విధానంలోనే సమూలమైన మార్పులకు నాంది జరగాలి.

కాని ఇందుకు మన [illegible]రాజు చరిత్రలు, అటువంటి సాహిత్య పొగడ్తలు, స్తోత్రపాఠాలు తోడునీడ కాజాలవు. కొత్తదనాన్ని ఆహ్వానించమనేది, కదిలించమని, నిద్దుర వదిలించమని పాతరోతను తలకెత్తుకోడానికి కాదు. ఎందులోనైనా ముసుగు మహాప్రమాదం. పాత సంస్కృతీ సంప్రదాయాలను కీర్తించి కాపాడేయత్నంలో, ముంచుకువస్తున్న మార్పులకు 'ససేమిరా' అనగల ప్రయత్నం కూడా వుంటుంది. మౌఢ్యం చాపక్రింద నీరులా చోటు చేసుకుంటుంది. ప్రపంచ తెలుగు మహాసభలు ఇటువంటి ప్రయత్నాలకు ముసుగు కాగలవా ?

అనుమానానికి ఆధారం వుంది. మహాసభలు జరపడానికి ముందు చాల రోజులుగా ఆంధ్రసంస్కృతీ, సంప్రదాయాల గురించి, శిల్పకళా వైభవం గురించి గుర్తుచేస్తున్నారు. నిజమే ఇది మంచి కోసమేనని నమ్ముతున్నాం. కాని మహాసభలు దగ్గర పడినకొలదీ కొత్తవింతలు కనిపిస్తున్నాయి. ఇవి

వారు రాజులు, తరాజులే కానివ్వండి, సామంతులు, కామందులే కానివ్వండి. బలవంతులు మనుగడకోసం పడనిపాట్లు లేవు. పత్రిక వాణిజ్యాలతో పాటు వ్యభిచారవృత్తిని అనుమతించడం కాదు, అక్షరాల మన ఆంధ్రదేశపు రాజులు ప్రోత్సహించి, పోషించారు! వీరి మతాభినివేశంకూడా స్వైరం వెర్రితలలు వేసింది. రాచరికానికి నష్టంలేని మార్గంలో ప్రజల తలలపై రాచపుండు పెట్టారు. తగిలించి తమాషా చూశారు. పాలించినవాడు గట్టెక్కాడు. పాలితుడు మట్టికలిశాడు.

ప్రజలలో మనోవికాసమన్నది నాడు పనిగట్టుకుని జరిగిన కృషిఫలితం కాదు. మతావేశంలోకి జనాలను నెట్టిన ఫలితంగా జాలువారిన అపురూపమైన కళాఖండాలు తిరిగి ఆ రాచరికం వైభవంకోసమే, దాని ప్రాభవంకోసమే, దాని ప్రచారంకోసమే వినియోగపడినాయి. కాని, కష్టజీవులైన శిల్పులను కార్యం నెరవేరిన తరువాత కాలదన్నారు. వాళ్ళ కుటుంబాల ఆలన, పాలన పట్టించుకున్నవారు లేరు.

నిండు పేరోలగాలు, భువన విజయాలు పెద్దన్నలకు శేకూర్చినన్ని మేళ్లు, చిన్నన్నలకు ఒనగూర్చలేదు. అదే గొప్ప అనుకున్న కవికుమారులను "స్వామిభట్టుగారి హయాంలో కవిసామ్రాట్టు నొసటిరాతకన్న వారకాంతల సౌభాగ్యరేఖే గొప్ప"ది పొమ్మన్నాడు తెనాలివాడు! ఇది నాటి రాచరికంపట్ల, వారిని అంటకాగే తత్వంపట్ల నాటి జనాలకున్న నిరాదరణపు నిట్టూర్పు.

అందువల్ల ఆర్థిక వ్యవస్థను, దాని నిర్వాహకుల విధానాలను క్షుణ్ణంగా పరిశీలించనంతవరకు మనకు స్వర్ణయుగాలు తప్ప ప్రజల 'ఖర్మ' యుగాలు కనిపించవు.

మన కళాఖండాలను, సంస్కృతిలోని మేళ్ళను భద్రపరచుకో వలసిందే. పురావస్తు సంచయంగా పట్టం కట్టవలసిందే. కాని, వాటిని చూపి పాతదనంలోని సాంఘి కార్థిక చెడుగులతోపాటు ఈనాటి చెడుగులనుకూడా, భద్రపరచుకోడానికి చేసే ప్రయత్నాలను మనం ద్వేషించాలి, నిరసించాలి, వడివడిగా వాటినుంచి విడివడిపోవాలి.

అనుసరించే ఆర్థికవిధానం ప్రజా సమ్మతమైనప్పుడే, జాతిసంపద కలవారి "చేతి ఎత్తుబిడ్డ" కానప్పుడే, ప్రజలకు సంస్కారం అబ్బుతుంది, వారి సంస్కృతి పెరుగుతుంది. ప్రజలను కొలదిమంది కోసంగాక మొత్తం జాతి కోసం కార్యరంగంలోకి దించినప్పుడు, ఆ విశ్వాసం జనాల బుర్రలలో నాటుకు పోయినప్పుడు, ప్రజాకళలు, ప్రజాసాహిత్యం పుట్టుకువస్తాయి.

మరి ఇంత పురోగతి సాధ్యంకావాలంటే భాషలో మార్పులు రావాలి. కృతకమైన బంధాలు తెగిపో[illegible] ఆరికంపె కొలదిమంది పెత్తనం ఆలోచనలపై ఆధిపత్యానికి మార్గం వేస్తుంది. అది తిరిగి భాషను బంధిస్తుంది. అర్ధ శతాబ్దం క్రితం తెలుగు గడ్డపై గిడుగు, గురజాడలు ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమానికి [illegible] జరిగి [illegible]పై రెండేండ్లకు కూడా సంపూర్ణ విజయం [illegible] సిగ్గుపడాలి." మూగ చెప్పినవారి ము[illegible]కి కూడా కళాశాల గ్రంథా[illegible] [illegible]న విద్యార్థుల నెత్తిపై నేటికీ రుద్దుతున్నారు. [illegible]వానికి అను[illegible] [illegible]ష్ట పంటల [illegible]తాంతులే, భాషకుకూడా అడ్డు [illegible]పలుకుతున్నారు. "తెలుగుదేశపు [illegible]బోర్డులకే పరిమితమైన భాష. ఏనాడో ప్రతి[illegible]లు ప్రామాణ్యంలోకి తెచ్చిన భాషవుంది. విశ్వ విద్యాలయాలు ఇంకా "గోడమీద పిల్లివాటం"గా వుండి వూగిసలాడుతున్నా[illegible] అగ్రహారపు భాషకు కాలంచెల్లినా, వారి ఆగ్రహపరిధులుదాటి ప్రభు[illegible] [illegible]లయాలు ముందడుగు వేయలేక పోతున్నాయి. ఈ నాటికి తెలుగు అధికారభాషగా ఆచరణలో పూర్తిగా అమలులోకి రాలేదు. తెలుగును అధికార భాషగా ప్ర[illegible]టమని ఇంగ్లీషులో ఉత్తర ప్రత్యుత్తరాలు నడు[illegible]న్నారు! ఇలా ఒకవైపు ఇంగ్లీషుపై వ్యామోహం, వేరొకవైపు ప్రాచీనతపై మోజు కలిసి – మాతృభాషాభివృద్ధిని కుంటుపరుస్తున్నాయి. చివరికి తెలుగు పట్టభద్రులకు ప్రాధాన్యమే లేదు. ఉపాధి చూపలేనప్పుడు [illegible]విద్యాలయాలలో వీరికి సీట్లు కల్పించాలన్న ఉబలాటం దేనికి ?

'ఇంట గెలిచి రచ్చగెలవాలి" [illegible]ని, ఇంట గెలవనివ్వనందుననే, పరాయి దేశాలకుపోయి రీసెర్చిలు చేస్తున్న తెలుగువాళ్ళు ఎందరో వున్నారు. పేదావిక లైబ్రరీకోసం, ఉపాధికోసం ఇంత ఖర్చుచేసుకుని, పరిశోధన సాగించుకోమని సబ్సిడీలు ప్రకటించి, అట్టివారి మేధస్సును తెలుగుదేశానికి వినియోగించుకునే యోగ్యత మనకు లేదు.

ఈ పరిస్థితులు మారాలి. ఇవి తీర్మానాలతో జరిగే పనికాదు, తీర్థయాత్రలతో ముగిసేకార్యం అంతకన్నా కాదు. ప్రచారపు మోజులనుంచి బయటపడి నిజమైన ప్రజాభ్యుదయంకోసం కృషి చేసినప్పుడే ఇది సాధ్యం.

మన తెలుగు జాతి ప్రతినిధులంతా ఒక్కచోట కలవడం గొప్పవిషయం. కాని ఈ అభిమానం దురభిమానంగా మారకూడదు. వెర్రితలలు వేయరాదు. ఛమిడిపాటి వారన్నట్లు, తల కట్లతోనే ("కచటతప"లు, "గజడదబ"లు). తల తిరిగిపోకుండా వుండాలంటే, ఆలోచించి, ఆచరించవలసిన సమస్యలలో సమైక్యత ఒకటి. పునాది ప్రాంతీయం కాకూడదు, ప్రధానం దేశసమైక్యత. ఐక్యతాభావాన్ని సాధించి, బంధించగల సూత్రాలు మనకు కావాలి.

తెలుగు మహాసభల అధ్యక్షోపన్యాసంలో ముఖ్యమంత్రి సూచించిన రాష్ట్రి సమైక్యత, ప్రజల మధ్య చెలిమి, ప్రారంభోపన్యాసంలో ఉపరాష్ట్రపతి సూచించిన సంప్రదాయపు సంకెళ్ళను బ్రద్దలుకొట్టడం గానీ—కొన్ని సూత్రాలకు బద్ధమై జరగవలసిన పనులు.

రేపటి తెలుగునాడుకు కొత్త వెలుగునివ్వాలి. ఎలా? ఈనాడు మన మధ్య పేరుకుపోయిన కల్మషాన్ని కడిగివేసుకోవాలి. ఇరవై ఏడేండ్ల స్వాతంత్ర్యం తరవాతకూడా మన రాష్ట్రంలో అక్షరాస్యుల సంఖ్య 20 శాతానికి మించ దనుకున్నప్పుడు, మన రారాజుల కాలాలలో నిరక్షరాస్యతను ఆధారం చేసుకుని వర్ధిల్లిన "సంస్కృతి" కొలదిమందిది గాక, ప్రజలది ఎలా అవుతుంది? నికృష్టమైన జీవితాలు గడుపుతున్న అసంఖ్యాకులైన సామాన్య ప్రజలు సంపూర్ణంగా పాలు పంచుకోగల పరిస్థితులను, చరిత్రను మనం సృష్టించుకోవాలి.

ఈ పని, నేటికి చెక్కు చెదరని కులవ్యవస్థలో, అసమ ఆర్థిక సంబంధా లలో అక్రమ ధనార్జనకు అవకాశమున్న పరిస్థితులలో సాధ్యపడుతుందా? ఎప్పటికన్న నేడు కుల, మత పిచ్చి పెరిగిపోయింది. విజ్ఞాన శాస్త్రపు అంచు లనుకూడా తాకనివ్వకుండా యజ్ఞాలమోజు బూజులా పట్టుకునేవుంది. వర్ణాలు, వర్గాలు ఏలుబడి సాగిస్తున్నాయి. స్థాయిలో భేధమేతప్ప అస్పృశ్యత అసలు తొలగలేదు. ఏనాటికన్నా ఈనాడు బలహీన వర్గాలపై దౌర్జన్యాలు మితిమీరి పోయాయి. అవినీతి పెచ్చరిల్లింది. ఏస్థాయిలో జరిగే ఎన్నికలు గమనించినా, "నోటు"కి ఓటు తాకట్టు పడిపోయింది. రాజకీయ పక్షాలమధ్య వివాదాలకు ప్రాంతాల ప్రజలు పావులై, ప్రాంతీయ ధోరణులకు ప్రాపకం లభించింది. ప్రజలలో నిరక్షరాస్యత అజ్ఞానం ఇందుకు ముడిసరుకులయ్యాయి.

వీటన్నింటి ప్రభావం విద్యార్థి యువజనులపైన ప్రబలంగావుంది. ప్రజలలో సమభావం, సంస్కారం, హేతుదృష్టిని పెంపొందించవలసిన "మాస్ మీడియా"- రేడియోలు, సినీమాలు, మౌఢ్యాన్ని పెంచుతున్నాయి, నైతిక విలువలను దెబ్బతీస్తున్నాయి, ఎవరికి ఎవరూ కానట్టే మనిషిలోని మంచిని తుంచి వేయగల బీజాలకు "నారుపోసి నీరు" పెడుతున్నారు.

ఇవి చిల్లరమల్లర సమస్యలు కావు. జాతిని అధఃపాతాళానికి క్రుంగ తీయ గలవి. నాడిని చూసి, గుండె స్పందనను కనిపెట్టవచ్చు. మన సమాజపునాడి కూడా జాతి గుండెజబ్బుకు కారణాలు సూచిస్తోంది. అందువల్లనే విజ్ఞులైన వారు, మేధావులంతా శస్త్రవైద్యులుగా మారాలి. జాతి సంపదమీద బ్రతుకు తున్న మనం, సమాజపు వనరులు ఆధారంగా కులుకుతున్న మనం, జాతికి ఋణపడివున్నాం. ఋణ విమోచనం జరగాలి.

సాంఘిక చెడుగులపట్ల నిర్లక్ష్యం మనకి పనికిరాదు. దృష్టిదోషం తొలగించుకోవాలి. సామాజికమైన స్పృహ కల్గించుకోవాలి. అందుకు హేతువాదాన్ని ఆశ్రయించాలి. అది అధారంగా, మానవ చరిత్రలో అంతర్భాగమైన తెలుగుదేశపు చరిత్ర తీరుతెన్నులను పరిశీలించాలి. ఆస్థాన పండితలోకపు మైకంనుంచి కాకుండా, ఆసాంతం సామాన్యప్రజల స్థాయినుంచి, వారి విశాల ప్రయోజనాలకోసం, వారిలో పరిపూర్ణమైన మార్పుకోసం కృషిచేయాలి. కృషి ఫలితాలను జనాలకు చేరువగా చేర్చాలి. ప్రజల ఆర్థికపరిస్థితులను అర్థం చేసుకోవడం పైననే, వ్యవస్థకు కావలసిన మార్పులను తలకెక్కించుకోగల్గుతాం- మార్గాలు చూడగల్గుతాం. అంతవరకు మనం ఆశించే సమైక్యత గాని, సంప్రదాయపు సంకెళ్ళవిచ్ఛేదనంకాని పూర్తిఅనుభవంలోకి రాజాలవు. అంతవరకు, మనకు కనిపించే అభివృద్ధి కొలదిమందికే పరిమితం; అది ఉపరితల సౌభాగ్యం. లోలోపల కుళ్ళు మాత్రం గూడుకట్టుకునే వుంటుంది. జన జీవాలను తినివేస్తూనే వుంటుంది.

ప్రజలు పాత్రధారులుగా వున్న చరిత్రే చరిత్ర, కళే కళ, ఆ సాహిత్యమే సాహిత్యం. ఆకలి గొన్నవాడికి తాత్విక బోధలు చేయడం, కడుపుచిచ్చు చల్లారనివాడికి కళావైభవం చూపించడం- విశాలహృదయానికి నిదర్శనమేమో కాని, విజ్ఞత అనిపించుకోదు ! కుంచెలూ, కలాలు కాసుకి దాసులైననాడు, ఆ కళాఖండం సుందరంగా కన్పించినా, అడవికాచిన వెన్నెలే, ఆ కవిత మధురంగావున్నా అరణ్యరోదనమే !

అందుకే ఈ సమస్యలన్నింటిని తగు ఓపికతో, దీక్షతో అంతకుమించిన దక్షతతో, నిర్మలమైన మనస్సుతో పరిశీలించుకోవాలి, పరిష్కరించుకోవాలి. ఆనాడు, మన సంస్కృతి కొత్తపుంతలు త్రొక్కుతుంది, కొత్తదారులు చూపుతుంది, కొత్త వెలుగులు వెదజల్లుతుంది. అప్పుడది తెలుగుతల్లికే కాదు, దేశమాతకే అమూల్య కంఠాభరణం అవుతుంది.

మరి "పిల్లిమెడలో గంట" కట్టేదెవరు? కట్టగలిగినవారికే హారతులు పడదాం; కైమోడ్పులు సమర్పించుదాం. అదిగో, ఆ రోజున, ఆ శుభముహూర్తాన మనసారా స్వాగతం చెబుదాం. రండి; అందుకోండి :

"వీరగంధము తెచ్చినారము వీరులెవరో తెల్పుడీ !"

# ఇరులు తొలగి, సిరులు కురవాలంటే...

అంతా నరుని చేతిలో పని. నలుగురిని కలపడం, నలుగురిని వేరుచేయడం అతనికి సాధ్యం. నారు పోసేదీ వీడే, నీరు పోసేదీ వీడే. మనుషులను మలచేదీ, చెడగొట్టేదీ అతనే. 'హీరో''లకు "జీరో''లకు సృష్టికర్త అతను. మట్టినుంచి మహావీరులను సృష్టించగలవాడు, మట్టిబొమ్మలను చేసి కూర్చోబెట్టగలవాడూ మానవుడు. ఒక్కముక్కలో, ఈ జగన్నాటక సూత్రధారి మానవుడేకాని మరొకడు కాడు. అతడొక మంచి చెడుల పూర్ణకుంభం.

"నిద్రలో అందరి ముఖాలు నిజాయితీగానే వుంటాయి, నిద్రలేచిన తరువాత గాని వారి ప్రవర్తన తెలియదు.'' అక్షరసత్యం.

ఆరోజు ఇంగ్లీషు క్యాలెండర్ ప్రకారం నూతన సంవత్సరాది. ఆమాటకొస్తే ఆధునికయుగంలో, ఎక్కడోకాదు, మన దేశంలో, ఎక్కువ పంటలు చేతికి వచ్చేదికూడా ఈ నెలలోనే. నాగరికతకు నాగలి పునాదిగా నరుడు నవ ధాన్యాలు పండించుకొనడానికి ఋతువులు ఎన్నిక చేసుకుని, నియమ బద్ధమైన నడతకు ఒక క్యాలెండర్ ఏర్పరచుకున్నాడు. ప్రకృతి వైపరీత్యాలకు కారణాలు తెలుసుకోలేని నాడు కలగుండు పడిపోయిన మానవుడు భయంకొలదీ "బ్రహ్మరాక్షసుల''ను సహితం కొలిశాడు. ఇప్పటికీ కొలుస్తున్నాడు! అయితే "విధి''మీద విశ్వాసంవున్నా విధుల నిర్వహణలో వెనుకాడ లేదు. ప్రకృతిశక్తులను వరుసగా జయించుకుంటూ వచ్చాడు. వస్తున్నాడు. ఎప్పటికప్పుడు కొత్తను ఆహ్వానించి, చరిత్రగతిని మార్చాడు. మార్పునొల్లని శక్తులను చెత్తకుండీలోకితోసి తాను చరితార్థుడయ్యాడు. శాస్త్రీయ దృక్పథాన్ని అతను పెంపొందించుకోకపోతే, అంధ విశ్వాసాలు తొలగి ఆత్మ విశ్వాసం అతనిలో గూడుకట్టుకొనకపోతే మానవ నాగరికతకు విలువలేదు. చరిత్రలేదు, చరితార్థత లేదు.

నేడు పూర్తిగా చీకట్లు తొలగాయా అంటే, లేదు. చీకటి బజార్లు, చీకటి రాజకీయాలు, చీకటి వ్యాపారాలు, విలువలు, చీకటి విశ్వాసాలు ఉన్నంత కాలం మానవునికి సంపూర్ణ ప్రగతి దుర్లభం. ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొనగలిగిన మానవుడు, తోటి మానవుడు తనకు తెచ్చిపెట్టే ఉపద్రవాలను కూడా ప్రతిఘటించకపోతే అభ్యుదయానికి అర్థం లేదు. ఆనందానికి తావులేదు. కొత్తసంవత్సరానికి కొత్తదనమే రాదు.

మానవుని ఉనికికి, ఉత్సాహానికి, ఉత్కృష్టతకు అవసరమైన కనీసపు ముడి సరుకు - తిండి, బట్ట, వసతి, విద్య. ఈ నాల్గింటిని సామాన్య మానవునికి దక్కనివ్వనినాడు, సంపద ఉత్పత్తికి ప్రధాన కారకులైన శ్రమజీవులనుంచే ఉపద్రవంవచ్చి పడుతుంది.

ఈనాడు, కొత్త సంవత్సరంనాడు, పరస్పరం శుభాకాంక్షల మధ్య ఆనంద పారవశ్యంలో కొన్నిచోట్ల-ఫ్రెంచి షాంపైన్, జర్మన్ మోసెలీ, స్కాచ్ విస్కీ ఇటాలియన్ క్లాసికో షియాంతీ, అమెరికన్ "నయాగరా", ఆస్ట్రేలియన్ బరోసా, హంగేరియన్ బకాౌర్, స్విస్‌డిజాలీ, ఇండియన్ బీర్, లేదా ఏదీ అందనిచోట సారా, నాటుసారా, అవధులు దాటి కూడా పారవచ్చు !

కాని "నిన్న ముగిసిన ఏడాదిలో నా తప్పిదాలకు నేడు పడేది పూల వర్షం కాదు, రాళ్ళవర్షం" అన్న స్పృహ ప్రతిఒక్కరికి అవసరం. అది కలగక పోతే, మరిన్ని తప్పిదాలకే నూతన సంవత్సరం నాంది పలుకుతుంది.

ఈ అప్రమత్తత పాలకులకు, పాలితులకు అవసరం. అందుకే మానవుణ్ణి మరచిపోకూడదు. ఇరులు తొలగి సిరులు కురవాలంటే ఇది కనీసపు షరతు. అది నెరవేరకపోతే ప్రారంభం కాగలదే బేషరతు ప్రతిఘటన !

# సమాజంలో మహిళ

వేదనలేని బ్రతుకు వ్యర్థం. ఆవేదన జీవికి ప్రధానం. ఆలోచన, ఆవేదన మనిషిలో చేతనా జ్వాలలు రగిలించగల ఉవిటీలు. ఆ చైతన్యం ఒక్కరి సొమ్ము కానప్పుడు, అది సంఘ పరమైనప్పుడు, సామూహిక కృషి సమాజాన్ని దిద్ది తీర్చుతుంది. వ్యక్తులను కదలిస్తుంది. వారిలోని అజ్ఞాత విజ్ఞాన శక్తులను ప్రబుద్ధంచేస్తుంది. కొండలను పిండి జేస్తుంది. అజ్ఞానం అంతరించడానికి, మానవశక్తి అజేయం కావడానికి - అదే, అదే కారణం. ప్రపంచ మహిళా సంవత్సరంలో ప్రమద లందరు గుర్తించవలసిన శక్తి యిదే, యిదే.

ఈ శక్తి అవిభాజ్యం అనుకున్నప్పుడు మానవసమాజ జీవితంలో, సామాజిక వ్యవస్థలో స్త్రీ- పురుషుల బాధ్యత కూడా అవిభాజ్యం కావాలి. గతం పేరిట, మతం పేరిట అలుముకున్న అంతస్తులు తొలగాలి. పాత బంధాల రోతలు, "పవిత్ర" గ్రంథాల రాతకోతలనుంచి, ఇతర అమానుష ప్రభావాల నుంచి స్త్రీ విముక్తి పొందాలి. ఆధునిక వ్యాపార నాగరకతలో, విపణి వీథిలో వస్తు విక్రయ ప్రకటనలకు తానొక వినియోగపు సరకు గాకుండా స్త్రీ ధ్వజమెత్తాలి. "స్త్రీ"కి సమాజ జీవితంలో, ఆచరణలో, లేని గౌరవ ప్రపత్తులన్నీ ఆమెకు తొడిగిన రకరకాల పేర్లలోనే కన్పిస్తాయి. ఉన్న స్వతంత్ర ప్రతిపత్తి ఇంటి చాకిరీకి, వంట వార్పులకూ, మా అయితే అంతస్తు కొలదీ క్లబ్బులకు పరిమితమైంపే. వ్యాపార నాగరకతలో ఆమె ఒక విలాస వస్తువుగా మాత్రమే పరిగణనలో వుంది. మానవ సంపద సద్వినియోగం కాకుండా స్తబ్ధుగా వున్న దేశాలలో మనదొకటి. సమాజావసర ఉత్పత్తి కార్యక్రమాలలో, దేశాభ్యున్నతికి జరగవలసిన కృషిలో స్త్రీ పాత్రను కృత్రిమ బంధాలతో పరిమితం చేశారు. ఇందుకు సంప్రదాయాలు తోడైనాయి; పాత శాస్త్రాలు నీడగా నిలిచాయి. అన్నింటికీ మించి "ఆస్తి"పై పురుషుని ఆధిక్యం ఆమెను, పేరుపెట్టకుండానే 'బానిస' స్థితికి దిగజార్చి వేసింది. ఆవిడ అయితే మరమనిషి, లేదా పనిమనిషి !

మాతృస్వామిక వ్యవస్థలు అంతరించడానికి, పితృస్వామిక వ్యవస్థలు (పురుషాధిక్యం) అవతరించడానికి కారణమైన ఆస్తి హక్కు అసమ స్థితికి, అశాంతికి, మహిళలలో మరింతగా భద్రతా రాహిత్యానికి దారితీసింది. కాలక్రమంలో సంస్కర్తలు సహృదయంతో మార్పులు తీసుకురావడానికి ప్రయత్నించినా, అవన్నీ "మహాసముద్రంలో నీటిబొట్టు"గానే మిగిలి పోయాయి. కట్నాలు, కానుకలు, వివాహాలు, విడాకులు, వేశ్యావృత్తి - అన్నీ, నేటికీ పరిష్కారమార్గాల కోసం ఎదురు చూస్తున్నాయి. సంస్కర్తల కృషి పరిమితమైంది. సంఘంలో సమూలమైన మార్పులు తెచ్చే బాధ్యత ప్రభుత్వానిదైంది. అసలుసమస్య ముందుకువస్తోంది. అదే "ఆస్తి హక్కు." ఇది చేయని పనిలేదు; దాంపత్యాలు చెడగొడుతుంది; పెళ్ళిళ్ళు రద్దు చేస్తుంది; స్త్రీ- పురుషసంబంధాలలో, మానవసంబంధాలలోనే, స్త్రీల మధ్యనే పోర పొచ్చాలు పెడుతుంది. కొందరిని సంపన్నులుగా, మరికొందరిని ఆపన్నులుగా మార్చగల రసాయనశక్తి ఈ ఆస్తిహక్కు! మహిళలో చైతన్యం సంఘా నికి చేటు అన్న భావనే ఈ అడ్డుగోడలు సృష్టించింది.

యూరప్‌లో, అమెరికాలో కంటే మహిళా లెజిస్లేటర్లు మన దేశంలో ఎక్కువ అని సంతృప్తి పడనక్కరలేదు. జనాభాలో 50 శాతంగా వున్న మన మహిళలలో ఎంత మందికి ఎదుగుదలకు సమానావకాశాలున్నాయన్నది అసలు ప్రశ్న. అక్షరాస్యతలో కూడా వీరిదే అథమస్థానం. పల్లెపట్టులలో వీరి స్థితి మరీ దుర్భరం. కార్మిక మహిళల స్థితి మరీ ఘోరం. నేటికీ పురు షునితో సమానపనికి స్త్రీకి సమానవేతనం లేదు- కట్నాన్ని నేరంగా పరిగ ణించడం లేదు; విడాకుల విషయంలోనూ సమానత లేదు; ఇక, చెప్పరాని కన్నీటి గాథలమధ్య కాలుజారిన మహిళలను "వేశ్యలు"గా చిత్రించి, కులుకు తున్న సామాజిక వ్యవస్థలో మార్పేలేదు...

నిజానికి కొత్త సృష్టికి పురిటి నొప్పులు తప్పవు. కొత్త జీవితాన్ని యివ్వడం లోనే జనని ఉపాధ్యాయిని; కొత్త మనస్సు ఇస్తుంది, కొత్త శరీరాన్నితొడుగు తుంది. సరికొత్త పౌరజీవితానికి ప్రారంభోత్సవం చేస్తుంది. ఉగ్గుబాలతో 'ఆస్తిహక్కు'నుగాక, అందరికి మంచిని ఆశించి దేశభక్తిని రంగరించిపోసి నప్పుడు ఆ పౌరుడు ఉత్తముడౌతాడు. ఈ శిక్షణ, క్రమశిక్షణ, మౌఢ్యం వల్ల అబ్బదు. శాస్త్రీయ దృక్పథంతో మనిషిని మలచాలి. అతని జీవితం మలుపు తిరగాలి. మట్టిముద్దలనుంచి మహావీరులు సృష్టి కావాలి. అప్పుడే శ్రేయోదాయక సమాజానికి అవసరమైన ఉత్పత్తి శక్తులు తామరతంపరగా వృద్ధిచెందుతాయి. ఈ పనిని చేయగలవారు ఇద్దరే ఇద్దరు: మహిళ, మహోపాధ్యాయుడు. ఇందుకుగాను - ముందు పరాశ్రయ జీవితం నుంచి స్త్రీ విముక్తి కావాలి. అయితే ఇది వ్యవస్థ మార్పుతో ముడిపడివున్నసమస్య.

ఆ చైతన్యం మహిళలో కలగడానికి మనఃపూర్వకంగా చేయూత నివ్వవలసినవాడు పురుషుడు; ఆ స్థితికి ఎదిగి రావలసిన వ్యక్తి మహిళ. మానవ మేధస్సు అందుకోగలిగిన ఆధునిక మహోన్నత శిఖరాలన్నింటిని - కళాసాహిత్యాలు, శాస్త్ర సాంకేతిక ప్రమాణాలు, రాజనీతి, పరిపాలనా దక్షత-మహిళా లోకమూ అధిరోహించ గల్గుతుంది.

మాతృత్వ దశలో తన కలలకొక రూపు ఏర్పడి, అవి ఫలిస్తున్న సమయంలో వేదనాఘడియల మధ్యనే ఆహ్లాదంగా శిశువు జననానికి కారకురాలు కాగలిగిన ఈ మాతృమూర్తి, సామాజిక - రాజకీయ విప్లవాల పురిటి నొప్పులను కూడా భరించి, కొత్త సమాజాన్ని అందించగల సత్తా, సాహసమూగల శక్తిస్వరూపిణి కూడా. ప్రపంచ మహిళా సంవత్సరం, ఈ కొత్త ప్రపంచ సృష్టికి. ఇందిరాగాంధి చెప్పినట్టు "పస్తులు లేని సవ్య ప్రపంచసృష్టికి ప్రమద లందర"ని సమైక్యం జేయాలి.

# సాహసోపేతమైన తీర్పు

మనస్సుపెట్టి ఆత్మవిమర్శ చేసుకుంటే వ్యక్తులుగాని, పాలకులుగాని మంచిదారికి మళ్ళడానికి అవకాశాలు లేకపోలేదు. అధికారం వాస్తవపరిస్థితులను గమనించలేని అంధత్వాన్ని మూటగట్టుకుంటే చెప్పలేముగాని, చాపక్రింద నీటిని పసికట్టకుండా వుండలేదు. దేశంలో రకరకాల అవినీతికర చర్యలవైపు పెచ్చరిల్లగా, ప్రజాస్వామ్య విలువలను పరిరక్షించగల దిక్సూచిగా అలహాబాద్ హైకోర్టు తీర్పు వచ్చింది.

లోక్‌సభకు ప్రధాని ఇందిర రాయబరెలీ ఎన్నిక చెల్లనేరదని ఆమె ఎన్నికలో అవినీతికి పాల్పడినందున ఆరేండ్లపాటు ఎట్టి ఎన్నికలోను పోటీ చేయడానికి అనర్హురాలని జస్టిస్ సిన్హా చెప్పిన తీర్పు వ్యక్తిగా శ్రీమతి గాంధీకి మాత్రమే వర్తించేది కాదు. స్థూలంగా అది నేటి భారత ప్రజాస్వామ్య జీవనంలో, ముఖ్యంగా పార్లమెంటరీ జీవితంలో పాతుకుపోయిన, పేరుకుపోయిన, జీర్ణించుకుపోయిన అవినీతి ధోరణులపైన, చర్యలపైనకూడా పెద్ద తీర్పుగా భావించాలి. దేశవ్యాప్తమైన ఈ అవినీతికి, దేశాధిపతిని ప్రతినిధిగా చేయడంకంటే, పాలక పక్షంతోపాటు ప్రతిపక్షాలుకూడా ఈ పంకిలంలో పాలుపంచుకోక తప్పదు. ధనదాహంలో, ఓటర్లను అవినీతికి ప్రోద్బలం చేయడంలో అన్నిపక్షాలు "తిలాపాపం తలాపిడికెడు"గా అందుకొనక తప్పదు.

రాజాజీలాంటి వృద్ధ కాంగ్రెస్ నాయకులు సహితం-ఎన్నికలకు ఆరునెలల ముందే మంత్రివర్గాలు రాజీనామాలు చేసి, ఆపద్ధర్మ ప్రభుత్వాల ఆధ్వర్యంలో ఎన్నికలు నిర్వహించుకొంటే, నైతిక విలువలు నిలవడానికి ఆస్కారముంటుందని సూచించారు. కాని జనరల్ ఎన్నికల్లో మనం ఈ సూత్రాలు పాటించలేదు. అధికార పక్షానికి, ప్రతిపక్షానికి మధ్య పూడ్చలేనంత గండి ఏర్పడింది. ఫలితంగా ఎన్నికలలో అధికార పక్షానికి వున్నన్ని అవకాశాలు,

యం(తాంగం బలం (పతిపక్షాలకు కొరవడింది. విధానానికి (ప్రాశస్త్యం కంటే గెలుపు (ప్రధానమై, అడ్డదారులు ఆదర్శమైనాయి.

చివరికి కోర్టు తీర్పులుకూడా ఖాతరు చేయని దశ వచ్చింది. ఇందుకు తాజా ఉదాహరణ-పరిమితులకుమించి ఎన్నికలలో ధనం ఖర్చు చేసినందుకు కాం(గెస్ సభ్యుడు చావ్లా ఎన్నిక చెల్లనేరదని, రాజకీయ పార్టీలు అభ్యర్థులకు పెట్టే ఖర్చు అభ్యర్థులుచేసిన ఖర్చు(కిందనే జమ అవుతుందనీ సు(ప్రీంకోర్టుయిచ్చిన తీర్పు. కాగా ఈ తీర్పును (తోసిరాజని పార్టీపెచ్చించే ధనాన్ని అభ్యర్థి చేసిన ఖర్చుగా భావించరాదని (ప్రజా (ప్రాతినిధ్య చట్టాన్ని సవరిస్తూ (ప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీచేసింది. ఇది నిజానికి చట్టాన్ని అగౌరవపరచడం, కోర్టును ధిక్కరించడంతప్ప మరొకటి కాజాలదు. నిన్న (ప్రధాని కేసులో తీర్పు వచ్చే వరకు ఆమెకు సంబంధించిన పిటీషన్‌తోసహా మొత్తం 180 మంది అభ్యర్థుల పిటీషన్లు కోర్టులలో మురుగుతున్నాయి. సు(ప్రీంకోర్టు చావ్లా కేసులో యిచ్చినతీర్పు కాం(గెస్ (పతిష్ఠను దెబ్బతీయగా, కొత్త ఆర్డినెన్సు రక్షించ జూసింది. అల్లాబాద్ హైకోర్టు తీర్పు అసలు (ప్రధాని ఎన్నికనే కొట్టివేసింది. నిజానికి 1974 అక్టోబర్ నాటి సు(ప్రీంకోర్టు తీర్పు పూర్తిగా అమలు జరిగే పక్షంలో అసలు దేశంలో అన్నిరాజకీయపక్షాల భవితవ్యం తేలిపోతుంది. రాష్ట్రాలలో, కేం(ద్రంలో 7000 మందికిపైగావున్న లెజిస్లేటర్లలో, స్థానిక సంస్థలకు ఎన్నికైన వెయ్యిమంది (ప్రతినిధులలో, చట్టం నిర్దేశించిన పరిమితు లలో ఎన్నికలకు ఖర్చుపెట్టిన లెజిస్లేటర్లు బహుకొలదిమందే వుంటారు. అందు వల్ల అల్లాబాద్ కోర్టు తీర్పు (ప్రధానిని వ్యక్తిగతంగా పేర్కొన్నప్పటికీ, మొత్తం నేటి అవినీతికర ఎన్నికలవిధానం, (ప్రచారం, వ్యయపద్ధతులపైననే అది (వేటుగా పరిగణించాలి.

ఇప్పటికయినా జాతీయ జీవనంలో నైతిక విలువల పునరుద్ధరణకు నాయ కులు నడుం కట్టడం మంచిది. ఇందుకు అవసరమైన మౌలికమైన సంస్క రణలను, తీ(వమైన మార్పులను సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో (ప్రవేశపెట్టడం మొదటి షరతుగా వుండాలి. అది నెరవేరనంతవరకూ పాలకపక్షంలో వున్నా, మరి ఏఉన్నత స్థానంలోవున్నా చేసే ఉపదేశాలు ఇతరులకు పాండి త్యంగా మాత్రమే మిగిలిపోతాయి. జస్టిస్ సిన్హా తీర్పు కేవలం సాహసోపేత మైనదే కాదు, రాజ్యాంగం, (ప్రజా(ప్రాతినిధ్య చట్టాలలోని కనీసపు విలువలను (ప్రజాస్వామ్య పద్ధతులలో కాపాడుకోవచ్చునన్న విశ్వాసాన్నికూడా రూఢి పరుస్తున్న తీర్పు. ఇట్టి తీర్పులను ఔదలదాల్చడం అన్ని పక్షాలవారు నేర్చు కోవలసిన పాఠం, గుణపాఠం. ఇది (ప్రధానమం(త్రితోనే (ప్రారంభం కావడం (శ్రేయస్కరం కాదా ?!

# కిం కర్తవ్యం?

వెతుకులాటవల్ల జనించేది నాయకత్వం కాదు విశిష్టమైన సంప్రదాయాలు, అనుభవాల పరిపక్వత, కనీసపు నైతిక విలువలు, తక్షణ స్వప్రయోజనం కోసం గాక, దేశ విశాల ప్రయోజనాల దృష్ట్యా జనతను కదలించగల సామర్థ్యం, పరిపాలనా దక్షత - నాయకత్వ లక్షణాలు. ఇది, మార్కెట్లో సరకును ఎంపిక చేసుకున్నంత తేలికైన విషయం కాదు. ఎంతటి సంక్షోభంలోనైనా, ఈ వాస్తవాన్ని విస్మరిస్తే దేశానికి, ప్రజలకు ఒనగూడేది శాంతి కాదు, అశాంతి; విప్లవం కాదు, వినాశం; అభ్యుదయం కాదు, అరాచకం.

వెనకటికి ఎవరో మాటవరసకి "ఈ ప్రపంచాన్ని ఏలగలవారు ఇరువురే వున్నారు - వారు ఇంగ్లాండ్ రాజు, స్పేడ్స్ రాజు" అన్నారట. దానికి ధోల్పూర్ రాణా జవాబిస్తూ "కాని ఇండియాలో ఒకరు కాదు, 400 మంది పాలకులు వున్నారన్న సంగతి అతడు మరచి పోయాడ"ని చెప్పాడట! కాని వీరంతా ఒక రత్నంముందు (సర్దార్ పటేల్ ముందు) గింపెడు గులకరాళ్ళయిపోయిన సంగతి తరువాత ఇలాటి "రాణా" లందరికీ తెలిసి వచ్చింది!

ఎస్టేట్లు పోయినా పదవిని ఒక కుటుంబపు "ఎస్టేట్"గా భావించకుండావుంటే, అధికారంలో వున్నవారు తమనేగాక, దేశాన్ని కూడా తీర్చిదిద్దుకోగల్గుతారు. దేశానికి ప్రత్యామ్నాయ నాయకత్వం లభించేవరకు, అరాచకం అందలం ఎక్కకుండా, ఇప్పటి మాత్రపు అభ్యుదయాన్నికూడా వెనక్కి నెట్టివేయగల శక్తులకు అవకాశం దక్కకుండా వుండడమే శ్రేయస్కరం. జాతీయోద్యమంనాటి నాయకత్వం తరం అంతరించిన తరువాత, రెండవ దశ నాయకత్వంలో అంతో ఇంతో ఇండియా ప్రతిష్ఠను, ఇంటా బయటా ప్రతిబింబించగల శక్తిగా శ్రీమతి ఇందిరవుంది. దేశ, వైదేశిక విధానాలలో తీవ్ర లోపాలు లేకపోలేదు. చేతలకన్నా మాటల పాలు జాస్తిగాకూడా వుండ

వచ్చు. అనుభవ పాఠాలకన్నా, అభినయ పాఠాలు ఎక్కువకావచ్చు. ప్రకృతి వైపరీత్యాలకంటే మానవ కల్పితమైన కరవులూ, బ్లాక్ మార్కెట్లూ మన 'నిత్యావసర సరకులు'గా మారవచ్చు; అంతకంటే కూడా, మూడింట రెండు వంతుల జనాభాకు కూడు, గుడ్డ, వసతి అంతంత మాత్రంగానే వుండవచ్చు.

కాని వీటిని పరిష్కరించగల సమర్థులు లభించే వరకు ప్రజల విశేషాభిమానాలు నేటికీ చూరగొంటున్న ఇందిర నాయకత్వం ప్రస్తుతపరిస్థితులలో అనివార్య మనిపిస్తుంది. నేడు దేశంలోవున్న ఏ ఒక్క రాజకీయపార్టీ అట్టి ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని అందించగల స్థితిలో లేదన్నది గుజరాత్ ఎన్నికలు నిరూపించాయి. ప్రత్యామ్నాయశక్తి లేనందుననే నేటి ఈ త్రొక్కిసలాట. అందుకు కూడా మూల్యం చెల్లించవలసింది ఎవరో కారు, ప్రతిపక్షాలవారే.

పార్లమెంటరీ వ్యవస్థలుగల బ్రిటన్ లాంటి దేశాల్లో పెరిగినంత స్థాయిలో ఇక్కడ నాయకులు ఎదిగిరాలేదు. అక్కడ అందరూ మాక్డోనాల్డ్‌లు, లాయిడ్ జార్జిలు, అట్లీలు, చర్చిల్స్ కాలేకపోయినా, కనీసం కొందరైనా మాక్మిలన్‌లు హీత్‌లు, విల్సన్‌లూ కాగిలవారున్నారు. ఒకప్పుడు జాతీయ సంక్షోభకాలంలో బ్రిటన్ ప్రధానిని పట్టుకుని పేరోలగంలో "అధికారం చాలించు. ఆఫీసు తాళాలు యిలా ఇవ్వు" అనగల్గిన ధీమా లాయిడ్‌జార్జికే దక్కింది. అట్టి ప్రత్యామ్నాయ శక్తిని దేశానికి చూపగల సత్తా లేనందుననే ఇక్కడ సందు గొందులలో "బెకబెకల"తోనే సరిపెట్టుకుంటున్నాయి ప్రతిపక్షాలు.

అందువల్ల ఇందిర పాలనలో ఎన్ని లోపాలువున్నా, హామీలకు విలువలేని పరిస్థితులు ఎన్నివున్నా, కాంగ్రెస్ నాయకత్వంలో ఈనాడున్న వెల్తిని పూడ్చగలశక్తి ఇందిరను మినహాయించి మరొకరికి లేదు. అలాగే కాంగ్రెస్‌ను మినహాయించి ఏకైక పక్షంగా జాతీయస్థాయిలో ప్రభుత్వాన్ని నిర్వహించగల ప్రత్యామ్నాయ శక్తికూడా ప్రస్తుతానికి కనపడడం లేదు. ఉన్నా సంఘటితం కాలేదు. అది కనబడిననాడు ఇందిర తొలగినా కాంగ్రెస్‌తొలగినా దేశానికి చెడుకంటే మంచి జరుగుతుంది. ఆ మంచి ఇప్పటికన్నా ప్రగతిశీలమైనదైతే దేశాభివృద్ధి ప్రచండ వేగాన్ని అందుకొంటుంది.

# వారసత్వ తీర్మానం

దారిద్ర్యం విలువ ఆకలిగొన్నవాడికి తెలుస్తుంది; శ్రమవిలువ కష్టజీవికి తెలుస్తుంది; పురుటినొప్పులు శిశువునుకనే తల్లికి ఎరుక; అలాగే రాజకీయసంక్షోభం లోతుపాతులు, ఆ సంక్షోభానికి గురి అవుతున్న రాజకీయ పార్టీలకు తెలుస్తుంది.

అల్లాబాద్ హైకోర్టు తీర్పువల్ల ఉత్పన్నమైన పరిస్థితులలో ప్రధానమంత్రి హోదాలో వున్న శ్రీమతి ఇందిర భవితవ్యం సంగతి ఎలావున్నా, తీర్పువల్ల కాంగ్రెసు పార్టీలో అంతర్గతంగా వున్న కొన్ని బలహీనతలు మాత్రం బయట పడ్డాయి. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ శ్రీమతి గాంధి నాయకత్వం పట్ల వ్యక్తం చేసిన "పరిపూర్ణ విశ్వాసం," ఆమెకు వ్యక్తిగత విజయమే కావచ్చు కాని ఆ "విశ్వాసాన్ని" వెలిబుచ్చడానికి ముందు లోలోపల జరిగిన త్రొక్కిసలాట మాత్రం కాంగ్రెసు సంస్థ పెరుగుదలకు నిదర్శనంగా భావించలేము. నెహ్రూ తర్వాత అంతటి, అంతకంటే మించికూడా ఇందిర చైతన్యం కల వ్యక్తి కాదనలేము; పార్టీ వ్యూహరచనలోను, ఎత్తుగడలలోను ఆమె అందె వేసిన చెయ్యి, తిరస్కరించలేము; సదస్యులను సంమ్మోహింపజేసి, ప్రత్యర్థులను ఇటే తూలగొట్టగల వాగ్ధురి కల నాయకురాలు, అవునంటాం. కాని కాంగ్రెస్ 1969లో చీలినది లగాయతూ, ఇందిర నాయకత్వంపై "విశ్వాసం తోనే" అటు వాళ్ళు ఇటు, ఇటు వాళ్ళటూ ప్లేటు ఫిరాయించారని చెప్ప జాలం. ఈ రోజుకీ వాలును బట్టీ, వీలును బట్టీ ఇందిర పడవను ముంచజూచే వారున్నారు. చుక్కానే అందడం లేదు. కాని వీరికి లేనిదీ, ఇందిరకి వున్నదీ ఆత్మస్థైర్యం, సాహసం, తెంపరితనం.

పార్లమెంటరీ పార్టీ ఆమోదించిన తీర్మానం వరస చూస్తే ఇందిర పట్ల అనుచరులకు గల విశ్వాసం కంటే, తన అనుచరులను ఇందిర అనుమానించగల అవకాశం రావచ్చు. నిజానికి ప్రజాస్వామ్య సంప్రదాయాలలో విశ్వాసం

గల వ్యక్తిగా ఆమె! తానే శాశ్వతంగా ప్రధానిగా ఉండాలని కోరుకోజాలదు సరిగదా, సి.పి.పి. తీర్మానించినట్టు తన నాయకత్వం "అనివార్యమని" ఆమెగా ఎన్నడూ భావించదు. భావించిన నాడు నాయకత్వానికి ఆమెగా తగదు.

కాంగ్రెస్ నాయకత్వం, దేశ నాయకత్వం గ్రామకర్ణాలు, మున్సబుగిరీలలాంటి వారసత్వం కాదు. ఆనువంశిక లక్షణమూ కాదు. కాదు కనకనే గాంధీ కాలంలో బోసు-పట్టాభి మధ్య, నెహ్రూ కాలంలో టాండన్-కృపలానీ మధ్య అధ్యక్ష పీఠానికి పోటీలు జరిగాయి. స్వాతంత్ర్యానంతరం ప్రధాని పదవులకు నెహ్రూకు వారసుడుగా లాల్‌బహదూర్‌శాస్త్రి, అనంతరం ఇందిరాగాంధి వచ్చారు.

కాని, దేశానికి కోర్టుల వల్లనో, రాజకీయ ప్రత్యర్థులవల్లనో సంక్షోభాలు చిక్కులురావని ఎవరూ వూహించజాలరనడానికి అల్హాబాద్ తీర్పు ఒక నిదర్శనం. కాగా అట్టి ఆకస్మిక పరిస్థితులను తట్టుకొనడానికి, యుద్ధాలలో మాదిరి, ద్వితీయశ్రేణి నాయకత్వాన్ని పెంచి, పోషించుకోవడం అవసరం, అనివార్యం. జాతీయస్థాయి నాయకులను, జనసామాన్యాన్ని కదలించగల వారిని ఏరాష్ట్రమూ, ఏ రాష్ట్ర కాంగ్రెస్‌పార్టీకూడా పెంచుకోలేక పోయిందని సి.పి.పి.సమావేశం నిరూపించింది. పెంచుకోలేక తమ వైఫల్యమనే "ముళ్ళకిరీటాన్ని" ఇందిర నెత్తిన "విశ్వాసం"గా తొడుగుతోంది ! నిజానికి ఇందిర తనవరకు చాకచక్యంతోనే నిర్వహించుకు రావచ్చు. కాని తదనంతరం సంస్థను కాపాడుకురాగల మెళకువ లేమిటన్నదే ప్రశ్న !

గాంధీ ఏ పదవీ లేకుండానే నాయకత్వం వహించగలిగారు. అవసరమనుకున్నప్పుడు తన వారసునిగా శక్తినిబట్టి నెహ్రూని అగ్రభాగాన నిలబెట్టారు. కాని ఎన్నడూ ఫలానావారి నాయకత్వమే "అనివార్యమని" చెప్పి, సంస్థ భవితవ్యానికి ముందునుంచే "సీళ్ళు" వేసుకోలేదు. అలాంటి పని, సంస్థకు ప్రత్యామ్నాయ నాయకత్వం లేదన్న వాదును జనంలో స్థిరపరుస్తుంది. ఇది సంస్థను మరింత బలహీన పరుస్తుంది. ఇది తగదు.

# ఇక మంచిది కాదు

అల్హాబాద్ హైకోర్టు తీర్పువల్ల ఏర్పడిన పరిస్థితి సుప్రీంకోర్టు నిర్ణయంవల్ల మరింతగా జటిలమయిందేగాని కుదుటపడలేదు. స్వతంత్ర భారత న్యాయస్థాన చరిత్రలోనూ, రాజకీయ చరిత్రలోను సుప్రీంకోర్టు తాజా నిర్ణయం ప్రధాన మంత్రి హోదాకే ఒక అగ్నిపరీక్ష.

ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఇప్పటికి వచ్చిన రెండు తీర్పులలోను హైకోర్టు నిర్ణయంకంటే కూడా సుప్రీంకోర్టు ఉత్తరువువల్ల దేశపు ఉన్నత పదవి నధిష్టించిన వ్యక్తి విలువ, గౌరవ ప్రతిష్టలు మరికొంత దెబ్బతింటాయి.

ప్రతిష్ఠ పదవివల్లనే కాదు, ఒక్కొక్కప్పుడు పదవీ పరిత్యాగంవల్లకూడా సిద్ధిస్తుందని, స్థిరపడుతుందని కృష్ణయ్యర్ ఉత్తర్వు ఫలితంగా ఇక నిర్ణయానికి రాకతప్పదు. ఇది లీగల్ సమస్యకన్నా వ్యక్తిత్వం సమస్య; రాజకీయ శషభిషలకన్నా నైతికవిలువల ప్రాశస్త్యానికి సంబంధించిన సమస్య. ఇందిర ప్రధాని పదవిలో కొనసాగివచ్చునట; కాని ప్రజా ప్రతినిధిగా ఎన్నికైన వ్యక్తి ఎన్నికను కోర్టు రద్దు చేసినందున, దానిపై అప్పీలు విచారణ ఫలితం తేలేవరకు ఆమె పార్లమెంటు సభ్యులుకారు, ప్రసంగించజాలరు, ఓటుహక్కు లేదు, సభ్యత్వ బాధ్యతల నిర్వహణకు కనీస ప్రతిఫలానికికూడా అనర్హురాలట. అంటే ఏ ఎన్నికపై ఆధారపడి ఆమె మెజారిటీ రాజకీయపక్షానికి పార్లమెంటరీపార్టీ నాయకురాలుగా ఎన్నికై ప్రధాని పదవికి వచ్చారో, ఆ ప్రజా ప్రాతినిధ్యపు హక్కును ఆమె తాత్కాలికంగానైనా కోల్పోతారు. అయినప్పుడు, కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకురాలుగా ఆమెనే ఎన్నుకున్నట్టు ఎన్నిసార్లు ధృవీకరించినా, అది కోర్టు తీర్పువల్ల "నేల విడిచిన సాము" గానే, బీటలు వారిన భవంతి మాదిరిగానే వుండిపోదా ?

పార్లమెంటు ఉభయ సభలలో దేనిలోను సభ్యులుగాని వ్యక్తి ప్రధానిగా కొనసాగడానికి వీలు కల్పించే నిబంధన రాజ్యాంగంలో లేదు. ఉన్న 68 వ

ఆర్టికల్ అయినా ప్రధాన మంత్రి హోదాను లేదా మంత్రి హోదాను పెంచేది కాదు. కృష్ణయ్యర్ పేర్కొన్న ఆ నిబంధన, ప్రధాని హోదాను ఒక అటార్నీ జనరల్ స్థాయికి కుదించడమే అవుతుంది. అదీగాక, రాజ్యసభ సభ్యుడు సహితం మంత్రిగా నియమితుడయినప్పుడు ఆరు నెలల్లోపు ప్రత్యక్ష ఎన్నికద్వారా లోక్‌సభకు రావలసివున్న పరిస్థితులలో చరిత్రలోనే సరికొత్త సంప్రదాయం నెలకొనడం మరింత విచిత్రం!

అందువల్ల ఈ త్రొక్కిసలాటలో ఇందిర తమ ఉన్నత స్థానాన్ని హుందాగా కాపాడుకోలేరు. సుప్రీంకోర్టు తాజా నిర్ణయంవల్ల ఆమెకు ఏర్పడిన పరిస్థితి అసాధారణం, దుర్భరం, దుస్సహం. ప్రజలపట్ల ఆమెకుగల అనురాగం, ప్రేమాభిమానాలు, ఆదర గౌరవాలు ప్రజలకు తెలుసు. తన అప్పీలు పెండింగ్‌లో వున్నంతకాలమైనా ఇవి మరింత దిగజారకుండా వుండాలన్నా, తన పదవీ విరమణను సాధించడమే పరమధ్యేయంగా పెట్టుకున్న కొన్ని ప్రతిపక్షాలకూ, వ్యక్తులకూ మరింత అవకాశం లేకుండా చేయాలన్నా, ఆమె మరొక్కసారి పునరాలోచించడం మంచిది. అగ్నిపరీక్షలో ఉత్తీర్ణులు కావడానికి అవసరమైన ముడిపదార్థం ఏ కవిలకట్టలూ చూపవు, ఏ చట్టాలూ యివ్వజాలవు, ఏ కోర్టులూ అందించజాలవు. నైతిక ప్రమాణాలే తిరిగి వ్యక్తి విలువను పెంచుతాయి. పెరిగిన అంతస్తుతో తిరిగి ఆ వ్యక్తినే ప్రజలు మరింతగా ప్రేమిస్తారు, ఆదరిస్తారు, అనుసరిస్తారు.

మోతీలాల్ కుటుంబం, నెహ్రూ కుటుంబం అశేష త్యాగాలు చేసిందీ, ఇబ్బడి ముబ్బడిగా ధనం ఆర్జించి పెడ్తున్న న్యాయవృత్తులను పరిత్యజించిందీ కేవలం పదవులకోసం కాదు. ఆ ఉత్తమ సంప్రదాయాలుకల కుటుంబ సభ్యురాలు ఇందిరా "ప్రియదర్శిని." ప్రజాసేవ పదవిలోనే లేదని ఆమెకు తెలుసు. తన జీవితానికి వన్నెకాదు, కళంకం తెచ్చే పరిణామాలు (ఇందుకు కారకులెవరైనా) ముప్పిరిగొంటున్నప్పుడు పునరాలోచనలో కూడా ఆమె మార్గదర్శి కావడం సముచితం కాదా?

ఉన్నత స్థానం ఒక పిరమిడ్ లాంటిదన్నారు. దానిని అందుకోగలవి రెండే రెండట: సరీసృపాలు, గద్దలు! కాని మనం మానవులం. నైతిక పునాదులపైన, ప్రజాస్వామ్య సంప్రదాయాలపైన మెట్టుమెట్టుగా ముందుకు సాగి, ఆ సోపాన పంక్తులు ఆధారంగా వ్యక్తిత్వం మొహరు వేసుకోవడం అవసరం, కడిగిన ముత్యంలా బయటపడడం ఆవశ్యం.

# 'పాత పుణ్యం' చాలదు

"పాత పుణ్యం"తో బ్రతికే రోజులు పోయాయి. తాతలు నేతలు తాగారంటే చాలదు. అలాగే మా జాతి నేతలు "అంత వారు, ఇంతవారు" అనుకుంటేనే చాలదు. గతాన్ని తరచి, వర్తమాన పరిణామాలను సక్రమంగా బేరీజు వేసుకుంటేనే మనిషికీ, మహా సంస్థకు పునరుజ్జీవనం. అది లేనినాడు పునఃపతనమే. అప్పుడు పాతకూడా రోతగానే జనం జమకడతారు.

ఈ రోజు జాతీయ కాంగ్రెస్ జన్మదినం. నిజంగా ఆ పార్టీ కార్యకర్తలు పర్వదినంగా జరుపుకోవలసిన రోజే ఇది; నూతనోత్సాహాన్ని పొందవలసిన రోజే ఇది; సరికొత్త జవసత్వాలను తొడగవలసిన దినమే ఇది. కాని— ఈనాటి నాయకత్వం వారి కార్యకర్తలకు, దేశానికి ప్రజలకూ, ఆశిస్తున్న త్యాగాలుగాని, చరిత్రగాని సృష్టించగల స్థితిలో వున్నారా అన్నది పెద్దప్రశ్న. తొలి ఉద్యమ నాయకులు, స్వాతంత్ర్యసమరమూ, ఆశించిన అమూల్యమైన ఫలితాలు సామాన్య భారతీయునికి ఎంతవరకు దక్కాయి అని ప్రశ్నించుకోవలసిన రోజు ఇది. నేడు అన్ని రంగాలను ఆవరించిన సంక్షోభానికి కారకులెవరని తరచి తరచి ప్రశ్నించుకోవలసిన రోజు కూడ ఇదే.

నేటికి 89 సంవత్సరాలు చరిత్ర నిండిన ఒక మహా సంస్థకు, ఉండవలసిన లక్షణాలు లేవు. అవినీతి, ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి నాడు అంటరానివైతే అవే నేడు సంస్థ నిర్వాహకులకు ఆదర్శ ప్రాయాలయ్యాయి.

ఇక కార్యకర్తలకు చరిత్రబోధలు వినిపించగల స్తోమత, నైర్మల్యం, తాహతు నేటి నాయకత్వానికి లేదు.

ఆ మహాసంస్థ 89 ఏండ్ల చరిత్రలో తొలి రెండు దశాబ్దాలు ప్రజలలోకి చొచ్చుకుపోలేక పోయినా, ఆ దరిమిలా గోఖలే, తిలక్, గాంధి, పటేల్, సి. ఆర్. దాస్, జవహర్‌లాల్, సుబాస్ బోసుల కాలంలో సంచలనం సృష్టిం

చింది. దేశ సమస్యలను జనంలోకి తీసుకువెళ్ళింది. తన పరిమితులలో జనతను కదలించింది. స్వరాజ్య సాధనలో తన పాత్ర నిర్వహించింది.

నేటి నాయకత్వం నిష్ఠతో, శిక్షణతో అమలు జరపగలిగితే స్వరాజ్య సాధనా యత్నంలో నాటి కాంగ్రెస్ నాయకత్వం సూచించిన కనీస కార్యక్రమాలు ఎన్నో వున్నాయి. కాని అవి ఆశించినట్టు అమలు జరగలేదు, "పాతనీరు పోయి కొత్తనీరు"వచ్చినా, కార్యకర్తలను ఉత్సాహపరచి నడిపించగల నాయకత్వం దానికి కొరవడింది. ఎన్నికల మీద వున్న మోజు ఎన్నుకున్న ప్రజలపై వుండడం లేదు. విశ్వాసం అవిశ్వాసంగా మారుతోంది. కాంగ్రెస్‌కు ఒక పరిపూర్ణమయిన రూపం ఇచ్చిన లాహోర్, కరాచీ కాంగ్రెస్ తీర్మానాల లోని ప్రకటిత కార్యక్రమాలు పెక్కు బూజుపట్టి పోయాయి. అదేమిటని అడిగినవాడు "తిరుగుబాటుదారు" అవుతున్నాడు, అడగనివాడు వంధి మాగధుడు అవుతున్నాడు.

"సంపూర్ణ స్వేచ్ఛను, తమ కాయకష్టాన్ని, శ్రమ ఫలితాన్ని అనుభవించి, నిత్యావసరాలను తీర్చుకోగల భారత ప్రజల హక్కు అవిచ్ఛిన్నమైనది... ప్రజలను ఈ హక్కుల నుంచి దూరంచేసి, వారిని అణచడానికి ఏ ప్రభుత్వ మైనా సిద్ధపడితే, అట్టి ప్రభుత్వాన్ని మార్చుకొనే హక్కు, లేదా తొలగించే హక్కు, ప్రజలకు వుంది" అని స్పష్టంచేసిన లాహోర్ కాంగ్రెస్ (1930) తీర్మానం కాని—

"మంత్రులకు, సివిల్ సర్వెంట్స్‌కు జీతాలు పరిమితం చేసి, కార్మికులకు కనీస వేతనం ప్రకటించాలి ... దేశంలోని అన్ని ప్రధాన పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీన పరచుకొని నడపాలి" అన్న కరాచీ తీర్మానం కాని—

ఎంతవరకు అమలు జరిగాయన్న ప్రశ్న నేడు ప్రతినాయకుడు, కార్యకర్త వేసుకోవాలి. రాజ్యాంగానికి ఎన్ని సవరణలు తెచ్చుకున్నా, అధికారం చేతులలో వున్నా, ప్రజల దైనందిన జీవితాన్ని మరింత బరువు భారంగా మార్చుతున్న ప్రస్తుతపు ఆర్థిక వ్యవస్థలోని లోటేమిటో గ్రహించాలి. ప్రణా ళికా బద్ధమైన విధానం చేపట్టిన సోషలిస్టు దేశాలలో లేని నిరుద్యోగం, ఆకలి చావులు, మన లక్ష్యం "సోషలిస్టు తరహా సమాజ స్థాపన" అని ప్రకటించు కున్నప్పటికీ, మనలనే ఎందుకు పీడిస్తున్నయో తెలుసుకోవాలి.

రాజ్యాంగ నిర్ణయ సభలో నెహ్రూ ప్రకటనలు ఈ జాడ్యానికి కారణాలు చూపాయి. ఇరవయ్యో శతాబ్దపు సమస్యలకు పందొమ్మిదవ శతాబ్దపు చిట్కాలు పరిష్కారమార్గాలు కాజాలవని పండిట్‌జీ "విథర్ ఇండియా" బోధపరచింది. నెహ్రూ ఇతర గ్రంథాలకు వచ్చిన ప్రాచుర్యం ఈ పుస్త

కానికి రాలేదు, కాదు, రానివ్వలేదంటే, ఆ కారణాలనుకూడా నేటి కాంగ్రెస్ యువతరం పరిశీలించాలి. పరిశీలించి నేటి సమస్యలకు పరిష్కారమార్గాలు వెతకాలి.

చరిత్ర చెప్పే పాఠం ఇదే; నీతి ఇదే. ఇరవైతొమ్మిదేండ్ల స్వాతంత్ర్యం అనంతరంకూడా సామాన్య ప్రజల ఈతిబాధలకు హేతువేమిటో, ఎవరు కారకులో తెలుసుకున్ననాడు తిరిగి మహోజ్వలమైన చరిత్ర సృష్టించుకోగల్గుతారు, కొండలను పిండగల్గుతారు, దండిగల మనుషులవుతారు.

# విజేతలకు నీరాజనాలు

సారథిలో కరకుదనం వుంటే, రథం ముందుకు చరచరా సాగిపోతుంది. ఆయుధం పట్టుకున్న వారి ఆశయబలం, అపజయాలను కడచి, అంతిమ విజయం సాధిస్తుంది. చరిత్రకు కొత్త సృష్టినిస్తుంది. బాధల అగాధాలను పూడ్చి, నిజమైన అనుబంధాలకు ద్వారాలు తెరుస్తుంది. మోడుపోయిన ప్రజల జీవితాలను చిగురింప జేస్తుంది. జీవితాన్ని సుఖమయం చేసుకో డానికి పడే తపనలో, చేసే ప్రయత్నంలో, అవసరమైతే ఆ జీవితాన్నే చిరు నవ్వుతో ఒడ్డగల ప్రజలు శాంతికాముకులుకాక మరెవరుకాగలరు ? అధర్మ యుద్ధాన్ని పాతిపెట్టడంకోసం, శాశ్వత శాంతి స్థాపనకోసమే ధర్మయుద్ధం. దీనిని నిరూపించినవారు వియత్నామీయులు, ముప్ఫైఏళ్ళు, కాదు-ఏభై ఏళ్లు, కాదుకాదు- నూరేండ్లకు పైగా ధర్మయుద్ధంలో గడుపుతున్న వియత్నాం ప్రజ లకు ఈనాటికి, "మే" దినానికి తుది విజయం, అఖండ విజయం లభిం చింది. అది వైశాల్యం కోసం దేశం కాదు, జనాభాకోసం జాతి అంతకన్నా కాదు. వియత్నామీయులు ఇన్నేళ్ళు పడిన కష్టనష్టాలవల్ల, చేసిన త్యాగాల వల్ల సృష్టించిన చరిత్రవల్ల ఆ దేశానికి అంత విలువ, ఆ ప్రజల కంతటి గౌరవం సిద్ధించాయి.

చరిత్రలో కడచిన యుద్ధాలన్నిటికన్నా దీర్ఘకాలమేగాక, పరమ పాశవిక మైన యుద్ధ భీభత్సానికి గురైన దేశం వియత్నాంకు మించినది లేదు. గ్రీస్ చరిత్రలో సిరాక్యూజ్‌పై రోమన్లు జరిపిన దారుణమారణకాండ కూడా, ఆధునిక సామ్రాజ్యవాదుల చర్యలముందు దిగదుడుపే. మార్నీ, మిడ్వే, స్టాలిన్‌గ్రాడ్‌లవద్ద సంకులసమరాలతో, అంతకన్నా మిన్నగానే సైగాన్ కైవసం కోసం జరిపిన పోరాటాన్ని పోల్చుకోవచ్చు. ఇది మరొక "దీన్ బీన్‌పూ."

ఫ్రెంచివాళ్ళు పాదం మోపడంతో ప్రారంభమైన ఇండో-చైనా జాతీయ విమోచనోద్యమం, ప్రధానంగా వియత్నాం స్వాతంత్ర్య సమరం, తుదకు

అణ్వస్త్ర యుగంలో అమెరికన్ సామ్రాజ్యవాదంపై ఘన విజయంతో ముగింపుకు వచ్చింది.

వ్యాపారం పేరిట సామ్రాజ్య విస్తరణతో వ్యవహారాలు చక్కబెట్టుకునే రాజ నీతికి, సామ్రాజ్య తృష్ణకు ఇక కాలం చెల్లిపోయిందని వియత్నామీయులు మరొకసారి రుజువు చేశారు. చరిత్ర పాఠాలు రుచించని ఫ్రెంచి, జాపనీస్, జర్మనీ, బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులంతా-ఎవరికివారు ఎదుటివారి ఓటమికోసం ఎదురుచూస్తూ, వలస ప్రజలను యుద్ధాలలోకి దించారు. తలా ఒక సమిధ వేశారు. మహాగ్నిగుండం రగిల్చారు. వేల, లక్షల కోట్ల రూపాయలు వెచ్చించారు. కాని ప్రజాశక్తి జల్దుకుని ఆ అగ్నిగుండం లోనే యుద్ధ ప్రేరేపకుల్ని మిడతల్లా మాడ్చివేశారు.

జినీవా సంధులన్నారు, పారిస్ ఒప్పందాలన్నారు. ఈ సంధులూ, ఒప్పం దాలు మరింతగా యుద్ధవిస్తరణ కోసమేనని వియత్నాం ప్రజలు తెలుసు కున్నారు. అందుకే పరాయి రాజ్యాల కీలుబొమ్మలైన దిన్‌దీమ్‌లు, థియూలు, హాంగ్‌లు, బిన్‌మిన్‌లూ-ఆఖరి ఘడియలలో ఆర్తనాదాలు చేసినా, శాంతి ప్రలాపాలు పలికినా, ప్రజలు మోసపోలేదు. శాశ్వత శాంతికోసం రక్తం కన్నీళ్ళు ఓడ్చి ధర్మయుద్ధాన్ని కొనసకంటా సాగించారు.

చరిత్రలో కని విని ఎరుగని స్థాయిలో విషవాయువులు ప్రయోగించినా, పంటలు ధ్వంసం చేసినా, లక్షలమంది నేలకొరిగినా ఆ వీరజాతి త్యాగ పటిమ మొక్కవోలేదు. నిరంతర యుద్ధంలో కూడా అనితరసాధ్యమైన ఓర్పు, సహనం ప్రదర్శించారు. వియత్నాం విభజనను ససేమిరా అన్నారు. కృత్రిమ విభజనను వ్యతిరేకించి అన్నదమ్ముల మధ్య ఐక్యతకోసం-ఉత్తర, దక్షిణ వియత్నాంలు రెండింటా ప్రతిఘటనను పెంచి, తుది విజయం సాధిం చారు. ప్రజా వ్యతిరేక పాలనలో క్రమ్గుతున్న దక్షిణాది సోదరులకు అండదండలు చేకూర్చడంలో ఉత్తర వియత్నాం రిపబ్లిక్ భరించిన బాధలు, నష్టాలు, సహించిన కష్టాలు, నెలకొల్పిన చరిత్ర-మరొక ఇతిహాసం.

సోషలిస్టు దేశాల అండదండలు, ఇతర దేశాల ప్రజల ఆదరాభిమానాలు వియత్నాం విమోచనను మరింత త్వరితం చేశాయి.

ఇప్పటికి ఇండో-చైనాలో రెండు ప్రధానమైన దేశాలు వియత్నాం, కంబో డియా-పూర్తి విముక్తి సాధించినట్టే. మిగిలింది లావోస్. తక్కిన రెండు దేశాల విమోచన లావోస్ విమోచనను మరింత సులభతరం చేయగల అవ కాశాలున్నాయి. 1967లో ఏర్పడిన మూడు దేశాల ఐక్య ప్రతిఘటనోద్య మం లక్ష్యం యిదే. ఆసియాలో అమెరికా కుట్రలకు దేవిడీమన్నా చెప్ప

గల శుభదినం యిదే-ఆసియాలో బలాబలాలలో రాగల పెనుమార్పులకు ఇది నాంది !

వియత్నాం ధర్మ యుద్ధానికి సారధ్యం వహించిన తొలి విప్లవ నేత హోచి మిన్ కలలు ఫలించాయి.

"రోకటి పోటులో ఎన్ని బియ్యం నలగాలో! దంచిన తరువాత అవి ప్రత్తిలా తెల్లబడతాయి. మనుషులకూ-డా అదే వరవడి-ఈ నికృష్ట జీవిత కర్మాగారమే చికిలిపట్టిన చంద్రహాసాలుగా మార్చుతుంది" ("ఖైదులో కవితలు").

ఈ విశ్వాసమే వారిని పరిపూర్ణ విజయానికి చేర్చింది. తిరిగి ఈ ఆశయమే వారిని త్వరితగతిని జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలలోకి సమీకరించ గల్గుతుంది, యుద్ధావశేషాలను తొలగించుకుని మరింతగా వెలుగులు చిమ్ముతూ వర్థిల్లజేస్తుంది. అందుకే ఈ శుభసమయంలో వీరులకు మన శతసహస్ర వందనాలు, నూతన ప్రభుత్వానికి శుభాకాంక్షలు.

# కృష్ణమీనన్ శుక్లపక్షం!

గంజాయి మొక్కలమధ్య తులసి మొక్క, గులకరాళ్ళమధ్య ఆణిముత్యం ఎన్నికకు వచ్చేది - వాటినుంచి ఇవి బయట పడినప్పుడే.

ఒడ్డున ఉన్నవాడికంటే నీటిలో దిగినవాడికే దాని లోతు తెలుస్తుంది. సాగర మధనంలో కోలాహలాని కెంత చోటుందో, హాలాహలానికీ అంత చోటూ ఉంది.

రాజకీయాలు కూడా అంతే. రాజనీతికి వ్యక్తులను పెంచడం ఎంత తెలుసో, త్రుంచడం కూడా అంతే తెలుసు.

అమాత్యుడు 'మన' అనుకున్నప్పుడు సరకు తక్కువైన వాడినైనా అమాంతం పైకి లేపుతుంది. 'పర' అనుకున్నప్పుడు మేరుపర్వత సన్నిభ మహా పురుషుణ్ణయినాసరే అంత అమాంతంగానూ అఖాతంలోకి నెట్టివేస్తుంది.

డెబ్భై ఎనిమిదేండ్ల జీవితంలో అర్ధశతాబ్దం పాటు అహోరాత్రులు తను ఆశించిన, విశ్వసించిన, సర్వతంత్ర స్వతంత్ర నవభారతంకోసం శక్తికొలదీ శ్రమించి నిన్ననే కన్నుమూసిన వెంగాలిల్ కృష్ణ కృష్ణమీనన్‌కు - భారత రాజకీయ చదరంగంలో ఘటిల్లిన 'అదృష్టం' కూడా ఇలాంటిదే.

బ్రతికున్నన్నాళ్ళు ఆయనకు 'కమ్యూనిస్టు' (కాకపోయినాసరే) అనో, మటి అనో ముద్రవేసి, కాకుల్లా పొడవడానికి ప్రయత్నించిన వాళ్ళు, కేంద్ర మంత్రివర్గం నుంచి ఆయనను తొలగించేవరకు నిద్రపోని వాళ్ళు- ఈ రోజున అందరితో కలిసి నాలుగు కన్నీటి చుక్కలు రాల్చడం తేలికే. కాని ఆయన మూర్తిని అర్థం చేసుకుని, ఆయన భుజం కాసినవాళ్ళు నాటికీ, నేటికీ అరుదే.

భారత జాతీయ కాంగ్రెస్‌కు నిశ్చితమైన అంతర్జాతీయ దృష్టి ఇంకా అలవడని రోజుల్లో - చదువు సంధ్యల కోసం లండన్ వెళ్ళి, బ్రిటిషు లేబర్‌పార్టీ నాయ

కులతో సంబంధాలు పెంచుకుని, తార్కిక దృష్టిని అలవరచుకున్నవాడు మీనన్. "ఇండియా క్లబ్", "ఇండియా హౌస్"-మీనన్ పేరుకు మారు పేర్లయ్యాయి.

హెరాల్డ్ లాస్కీ వంటి హేమాహేమీల క్రింద నడచిన "లండన్ స్కూలు ఆఫ్ ఎకనామిక్స్" నిర్వహించిన పరీక్షలలో మీనన్ సమాధాన పత్రం అస మానమైనదిగా ఎంచి, నేటికి మోడల్ ఆన్సర్ పేపరుగా వుంచారు.

దేశ స్వాతంత్ర్యం కోసం లండన్, ఆయనకు వొక వేదిక అయింది. లేబర్ పార్టీతో, సోషలిస్టులతో సంబంధాలు వ్యష్టి ప్రతిభనుచాటుకోడానికి కాదు, భారత దేశ ప్రజల సమష్టి ప్రయోజనం కోసం పెట్టుకున్నవి. అయన కేవలం జాతీయవాది కాడు, సోషలిస్టుకూడా. ఆయనకు సెయింట్ పాంక్రాస్ లేబర్ పార్టీతో అనుబంధం భావిభారత దర్శనానికొక వేదిక. 1930 లలో బ్రిటిష్‌పార్టీ నాయకులకంటే అక్కడ ప్రజలకు ఎక్కువ సన్నిహితుడైన వ్యక్తి మీనన్. ఆ రోజుల్లో ఆయన నడవని నడవా లేదు, పాల్గొనని ప్రద ర్శనా లేదు, చేయూతనివ్వని సభా లేదు, సమావేశమూ లేదు. ఇంతటి ప్రతిభ, మరింతటి శేముషీకల వ్యక్తి కాబట్టే ఒక దశలో లేబరు గ్రూపుకి నాయకుడయ్యాడు. ముక్కుకు సూటిగాపోయే మనిషి కాబట్టి తలకు 'బొప్పిలు' కట్టాయి. ఒక దశలో తాను పార్లమెంటరీ అభ్యర్థిగా నిలబడి కూడా, అభ్యర్థిత్వ ప్రకటనపై వచ్చిన విభేదాల మూలంగా, ప్రకటించిన లక్ష్యంపై రాజీ లేనందున, తాను ఓడిపోవలసి వచ్చింది.

సరికొత్త విదేశాంగ నీతికి, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రెండు రాజ్య కూటాలమధ్య అలీన విధాన రాజకీయాలకు, అలీన ప్రపంచాన్ని ఇతర సభ్యదేశాలకు తెలియ చేయడానికి ఆద్యుడు మీనన్ అని చెప్పుకోవచ్చు.

1935 నుంచి జవహర్లాల్ నెహ్రూతో ఆయనకు ఉన్న సంబంధాలు పంటికీ, పెదవికీవున్న సంబంధం లాంటివి. నెహ్రూ వైదేశిక నీతిని దిద్ది తీర్చ డంలో, కాంగ్రెస్‌కు ప్రపంచ దృష్టిని కల్పించడంలో మీనన్ పాత్ర అమోఘ మైనది, అసమానమైనది. రాజ్య కూటాల మధ్య "అతలా కుతల" మవు తున్న అలీన భారత దేశాన్ని అప్రమత్తంగా ఒడ్డెక్కించడానికి ఆయన ఐక్య రాజ్య సమితిలోను, బయటా చేసిన కృషి అనితరసాధ్యం.

విజయలక్ష్మి పండిట్ భారత ప్రధాన ప్రతినిధే కావచ్చుగాని, కొరియా, కాశ్మీర్ సమస్యలపై సమితిలో మీనన్ ప్రవేశం విధాన రూపురేఖలనే మార్చి వేసింది; ఇండియా ప్రతిష్ఠను అంతకుముందుకంటే వేయిరెట్లు ఇనుమడింప జేసింది. ఏడున్నర గంటలపాటు మీనన్ తర్కం లెక్క కోసం కాదు,

ఇండియావాదనకే ఏనుగుబలాన్ని యిచ్చింది. కొరియన్ సమస్యపై ఆయన ప్రతిపాదనలు "ఫార్ములా మీనన్" అని ఆయనకి శత్రువులనుంచికూడా ప్రశంసా పత్రాలు తెచ్చిపెట్టింది!

వ్యక్తిత్వం కలవాడైనా కొందరు నాయకుల మాదిరి ఎన్నడూ ఆయన "నేను", "నేను సూచించినట్టు" అననే లేదు. "ప్రభుత్వం" అనేవాడు, లేదా "కాంగ్రెస్" అనేవాడు, ఇంకా విస్తృతార్థంలో "ఇండియా" అనే ఉదాహరించేవాడు. జీవితంలో నిరాడంబరం, నడవడికలో నమ్రత, అవసరమైనచోట కాఠిన్యం ఆయన సొమ్ములు.

ఇట్టి అసాధారణ వ్యక్తిని కాంగ్రెసు, కేంద్ర మంత్రివర్గం ఇముడ్చుకోలేక పోయాయి. కాని దేశశ్రేయస్సుకోసం ఉద్వాసన చెప్పవలసిన శక్తులకు మాత్రం మంత్రివర్గంలో పీఠాలు దక్కాయి. దిక్కవలసిన వ్యక్తికి ఉద్వాసన జరిగింది. మంత్రిత్వ శాఖలలో రక్షణోత్పత్తుల విభాగాన్ని ప్రారంభించి, పోషించినవాడు ఆయనే అయినా, సరిహద్దు వివాదం పేరుతో బలిపశువును చేసింది తిరిగి ఆయననే !

ఈ ఒక్క సన్నివేశమే కాదు, మీనన్ ఆశించిన నవభారతానికి ఆదిలోనే తూట్లుపడిన మరికొన్ని ఘటనలు వున్నాయి; ఆనాడు రాజ్యాంగం ముసాయిదా రూపకల్పనకు ఒక నిపుణుల సంఘాన్ని నియమించింది కాంగ్రెస్. మీనన్‌తో సమాలోచించి రచించమన్నాడు నెహ్రూ. దానిపై అనేక రోజులు శ్రమించి మీనన్ తయారుచేసిన రాజ్యాంగం ప్రతి "అధికారం పాలకుల చేతులలో కాదు, ప్రజల చేతుల్లో వుండాల"ని నిర్దేశించింది. సోషలిస్టు సంక్షేమ రాజ్యంగా పరివర్తన జరగాలని చెప్పింది. కాని అది బుట్టదాఖలైన విషయం ఎంతమందికి తెలియనిచ్చారు ? మీనన్ మాటల్లోనే చెప్పాలంటే అది "నిష్ఫలమైన ప్రయోగమై" పోయింది ! కొందరు చెబుతున్నట్లు ఆయన నోరుపారవేసుకునే మనిషే అయితే, ఈ చర్యపై యింకా పెద్ద విమర్శే విసిరి వుండేవాడు, విసరలేదు !

కాని మీనన్ రాజకీయ ప్రాభవం, పతనం ఒక్క సత్యాన్ని చాటి చెబుతున్నాయి: రాజకీయాలకు మించిన జూదం లేదేమో ! ఒక అనుభవజ్ఞుడు చెప్పినట్టు రాజకీయాలు గుర్రప్పందెం లాంటివి. ఆ పరుగుపందెంలో పాల్గొనేవాడు పడిపోడంలో కూడా వడుపు ప్రదర్శించడం ఎలాగో తెలుసుకోగల్గి వుండాలి. ఆ వడుపు కృష్ణమీనన్‌కు లేదు. అందుకే దొరికిపోయాడు. అయినా అతని మూర్తి భారత రాజకీయాలలో తరిగిపోయేదీకాదు చెరిగిపోయేదీ కాదు.

# ఆకలి ఆగ్రహ పరిధులు

అన్యాయానికి, అక్రమానికి తలొగ్గరాదన్న నిశ్చితమైన దీక్షవల్లనే మహా విప్లవాలు పుట్టుకొస్తాయని కడచిన ప్రపంచ చరిత్ర చెబుతోంది. "అఖండ తేజస్సుతో సంకెళ్ళు ఛేదించుకొని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మానవులు పొందడానికి అన్యాయం ఒక అధారం" అని ఏనాడో రోమన్ పార్లమెంట్ స్పష్టం చేసింది. "ఉబుసుపోకనో, సరదాకోసమో, కేవలం మార్పుకోసమో ప్రజలెన్నడూ తిరుగుబాటు చేయరు; దుర్భర జీవితంవల్లనే, బాధలవల్లనే, ఓరిమి నశించినందువల్లనే ప్రతిఘటనకు తలపడతారు" అని సలీ **(Sully)** చెప్పాడు.

అనంత ప్రజా బాహుళ్యం నిరంతరం అకలికి తాళలేకనే, దారుణమైన విప్లవాలను సృష్టించాయి. "స్టార్ ఛాంబర్" అత్యాచారాలను కూడా లెక్క పెట్టకుండా ఇంగ్లీషు విప్లవం వచ్చింది అందుకే. ఫ్రెంచి విప్లవం పుట్టుకొచ్చిందీ ఇందుకే.

మహాజనుల సమస్యలు కేవలం మహాసభలతోను, తీర్మానాలతోను పరిష్కారం కావు. ప్రపంచ దేశాల అహార సమస్య పరిష్కారానికి "వ్యూహం" పన్నేందుకు రోమ్‌లో జరుగుతున్న మహాసభ అసలు సమస్యను, ప్రక్కదారులు పట్టించకుండా వుండాలంటే, తీసుకోవలసిన జాగ్రత్తలు వేరు, అనుసరించవలసిన విధానంవేరు, పాటించవలసిన నియమాలే వేరు. ప్రపంచ జనాభా పెరుగుదలను అరికట్టే ప్రయత్నంలో భాగంగా నిర్ణయాలు తీసుకుంటే, అసలు సమస్యను అది స్పృశించ జాలదు, పరిష్కరించజాలదు. నేరానికి ఒడిగట్టినవాడు అది మాఫీ కావడంకోసం అవినీతికి అందెవేసినట్లే, వలస దేశాల సంపదకు, ప్రజల మూల్గులను శతాబ్దాలుగా పీల్చి పిప్పిచేసిన వలస సామ్రాజ్యవాద శక్తులు తిరిగి "ప్రపంచ ఆహార నిల్వలకు" తమ వాటా విరాళమిస్తామని చెబితే చాలదు. ఇన్నాళ్ల ఆసియా, ఆఫ్రికా, లాటిన్

అమెరికాలను అన్ని సౌఖ్యాలకు దూరంచేసి, ఈ త్రిఖండ దేశాల ఆర్థిక వ్యవస్థలను స్వాతంత్ర్యానంతరం కూడా దోచుకుంటున్న సామ్రాజ్యవాద శక్తులు చివరికిప్పుడు తీవ్రమైన ఆకలి దప్పులకు కూడా కారకులయ్యారు.

ఒక సంక్షోభం కాదు; ఆహారం, ధరలు, వాణిజ్యం, కరెన్సీ, ఆయిల్, ఎరువులు, సర్వ రంగాలలో నేడు కనిపిస్తున్న సంక్షోభం అన్ని దేశాలకు ఒకలా లేదు. తరుగుదేశాలు కొన్ని, తినమరిగిన దేశాలు కొన్ని; సంపన్న దేశాలు కొన్ని, బడుగు దేశాలు మరికొన్ని. అయితే కరవుకాటకాలు, సరకుల కొరత సంపన్న దేశాలకంటె బడుగుదేశాలే ఎక్కువ అనుభవిస్తున్నాయి. అన్ని దేశాల నాగరికతలు ఒక్కసారే ప్రభవిల్లక పోయినా, ప్రభవిల్లిన నాగరిక దేశాలను (అవే ఈనాటి వర్ధమాన దేశాలు) వలస సామ్రాజ్య శక్తులు పూరాగా దోచి, జీవచ్ఛవాలుగా మిగిల్చాయి. నీగ్రోల, అరబ్బుల, ఇండియన్ల, తదితర వర్ణజాతుల కాయకష్టాన్ని దోచుకుని వారి మృత కళేబ రాలమీద సంపదను, ఐశ్వర్యాన్ని పెంచుకున్నాయి అమెరికా, యూరప్‌లు. ఈ నగ్నసత్యాన్ని దాటవేయడానికి అవి ఎంచుకున్న సూత్రీకరణలు: జనాభా పెరుగుదలను క్రమబద్ధంచేయడం, బడుగుదేశాలు తిరగబడకుండా మెతుకులు రాల్చడం, అంతర్జాతీయ మార్కెట్‌లో వర్ధమాన దేశాల సరకులకు ధరలు పలక్కుండా చేయడం, బ్రెజిల్‌నుంచి ఇండియావరకు సంపన్నదేశాలు అనుసరిస్తున్న విధానం- మానవ సంక్షేమంకోసం కాదు, ఆకలిగొన్న మాన వుల అస్థిపంజరాలపై వ్యాపారంచేసి, తమ వాణిజ్యాభివృద్ధికి, ఆర్థికదోపిడీకి ఈ దేశాలను లాభసాటి కేంద్రాలుగా చేసుకోడానికే. అప్పులిచ్చినవాళ్ళు వూరుకోరు, ఊబిలోకి దించారు; అసల్సు అలాగే వుండి, వడ్డీలు తీర్చలేని దుస్థితిలో వర్ధమానదేశాలు ఉన్నాయి. దీనిఫలితంగా, దేశీయ పరిశ్రమలను పెంచడానికి, వ్యవసాయాన్ని వృద్ధిచేయడానికి తగిన ఆర్థిక వనరులు కోల్పో తున్నాయి. విదేశాలపై అధారపడవలసి వస్తోంది. తిండీ, బట్ట, ఇల్లూ- మానవ మనుగడకు ఆధారమని తెలిసికూడా తగిన ఏర్పాట్లు చేసుకోలేక పోతున్నాయి. పోషకాహారం కరవై, ఆకలి మరణాలసంఖ్య పెరుగు ఆకలి, ఆగ్రహపరిధులు దాటుతోంది.

అయితే- ఇంతటి దుర్భర పరిస్థితులలో కూడా మానవుడు ఆత్మవిశ్వాసం పోగొట్టుకోలేదు. ప్రపంచంలో ఈ పరిస్థితికి కారకులైనవారిపై ధ్వజ మెత్తడానికి ప్రపంచ సంస్థను తనతో కలసి రమ్మంటున్నాడు సామాన్య మానవుడు. ప్రపంచ సమస్యలను ప్రక్కదారులు పట్టించకుండా, సాహ సంతో ఎదుర్కొని సజావుగా పరిష్కరించు కుందామని చాటుతున్నాడు.

రోమ్ సభ వర్ధమాన దేశాలకు ఒక కనువిప్పు కావాలి. ఆహారంకోసం సంపన్న దేశాలవైపు అర్రులు చాచకుండా, దేశీయ వనరులను సమీకరించుకుని, విదేశీ పెట్టుబడులను, లాభాల తరలింపును అటకాయించి, స్వయం సమృద్ధం కావడానికి వర్ధమానదేశాలు సమైక్యం కావాలి. పెట్రోల్ వనరులతో అమెరికా, యూరప్‌ల ఆటకట్టించగలిగిన అరబ్బులు, మిగతా వర్ధమాన దేశాలకు ఆదర్శప్రాయం కావాలి. ఇందుకు జాతీయ ప్రభుత్వాలకు మనస్సు ఉండాలి; ప్రజలు వత్తిడి చేయాలి.

# మహిళలు : సమస్యలు

మహిళా న్యాయవాదుల సదస్సులు దేశవ్యాప్తంగా జరిగాయి. ఈ సదస్సులలో చాలా సమస్యలు ముందుకు వచ్చాయి. మహిళల సంక్షేమం గురించి పలువురు పెద్దలు అభ్యుదయ భావాలు ప్రకటించారు. హక్కుల పత్రాలు సమర్పించారు. ఈ సమాజంలో స్త్రీలు ఎన్నిరకాల అకృత్యాలకు, అనాదరణకు గురి అవుతున్నారో వెల్లడించారు. ఆస్తి పంపిణీలో ఎన్ని అవకతవకలు జరుగుతున్నాయో, కట్నపిశాచి ఎలా వెంబడిస్తోందో కూడా చెప్పారు.

నిజానికి చివర పేర్కొన్న రెండు సమస్యలే చాలు–మహిళలకు మన సమాజంలోగల ప్రతిపత్తిని రూఢిపరచడానికి. అంతేగాదు ఎన్నో అగచాట్లకు అవాంతరాలకు లోనై సంస్కరణలు ఒక ఉద్యమంగా సాగించిన మహనీయులైన సంఘ సంస్కర్తల కృషి కూడా కాలక్రమంలో ఎందుకు వమ్ము కావలసి వచ్చిందో కూడా ఈ రెండు సత్యాలే నిరూపించుతున్నాయి. ఆర్థిక విప్లవం లేకుండా ఎంత చిత్తశుద్ధితో జరిగే సంఘ సంస్కరణైనా పరిపూర్ణం కాజాలదు అని స్పష్టమవుతోంది.

పురుషుని ఆధిక్యానికి కారణమైన ఆస్తిహక్కు స్త్రీకి కూడా ఒనగూడినపుడు ఈ వ్యత్యాసం తొలగుతుందంటారు కొందరు. ఇది దైన్యస్థితిలో మాతృమూర్తికి ఉదయించే వేదన, అరణ్యరోదన. కాని జన్మహక్కుగా ఆస్తిహక్కు మనిషికి రద్దు అయిననాడు స్త్రీ-పురుష భేదం సర్వత్రా అంతరిస్తుందనీ, విద్యా వైజ్ఞానిక రంగాలన్నిటా అప్పుడు సమాన ప్రతిపత్తి లభిస్తుందనీ వీరు ఆలోచించరు.

మహిళ ఉత్పత్తికీ, పునరుత్పత్తికీ కేంద్రం (అదే ప్రొడక్టివ్, రిప్రొడక్టివ్). సంతానోత్పత్తికే కాదు, సరకుల ఉత్పత్తికీ కారకురాలు. కాని జరుగుతున్న పని స్త్రీని మొదటిదానికే ఎక్కువగా పరిమితం చేశారు పురుషులు. బానిస

చేశారు. విలాస వస్తువుగా మార్చారు. ఇప్పటికీ చదువుకున్న మహిళల సంఖ్య పరిమితం కాగా, కోట్లాది సాధారణ మహిళలు కూలీలుగా ఇంటి చాకిరీకో, వంటవార్పులకో పరిమితమయ్యారు. ఒకవైపున అంతో ఇంతో ఆస్తిగల కుటుంబాల్లో కట్నాల వేలంపాటలు పశువుల సంతలో పాటలను మించిపోతున్నాయి. "రాజ్యాంగంలో మహిళలకు ఎన్ని హక్కులు కల్పించామో కోట్లాది మహిళలకే తెలియద''ని ఇందిర చెప్పినమాట ఇందుకే! కాని రాజ్యాంగం అన్ని హక్కులతోపాటు ఆస్తిహక్కునూ స్థిర పరచింది, అందుకే ఈ త్రొక్కిసలాట. శారదా చట్టం అమలు జర గడం లేదనీ, కట్నాల నిరోధక చట్టం కాగితంమీద ఉండిపోతున్నదనీ చెప్పినా... — అసలు కారణం ఇదే. ఆ ప్రత్యేకపుహక్కు (ఆస్తి హక్కు) ప్రత్యేక ప్రతిపత్తి పొందుతున్నంత కాలం అమలులో ఉండేది "మితాక్షర'' న్యాయమే గాని మరొకటి కాదు. దీనిచుట్టూ గూడు కట్టుకుని కూర్చున్నవే - - బహుభార్యాత్వం, విడాకులు, నిరుద్యోగ సమస్యలలో ఏకపక్షన్యాయం. చట్టాలు ముస్లింలవి అయినా, హిందువులవైనా అనాదిగా, సనాతనంగా వస్తున్న దుస్సంప్రదాయాలు తొలగాలంటే పెద్ద శస్త్ర చికిత్స జరగాలి. ఆస్తిహక్కు ఆధారంగా స్త్రీ - పురుషుల సాంఘిక బాధ్యతల విభజన మొత్తం సమాజానికే చేటు. దురదృష్టవశాత్తు మహిళా సంవత్సరం ఈ అంశంపైన కాకుండా మరి వేటి వేటిపైనో కేంద్రీక రించింది !

# 'గో రా'

తేట మనసులు, తేనెతలపులు అందరికి రమ్మంచే రావు. అంత మాత్రాన అవేవో పూర్వజన్మ సుకృతం క్రింద తేల్చివేసి, యధావిధిగా సంచరించలేము. సమాజ సంపర్కం, కలివిడి సంస్కారం, అన్నింటికీ మించి విశ్వజనీన దృష్టి మనిషి మనసును తీర్చిదిద్దుతాయి. విశ్వాసాలను క్రమబద్ధం చేస్తాయి, తద్వారా తాను మంచి అనుకున్న నిర్ణయాలను అమలు జరిపిస్తాయి.

"కడుపులో కత్తెర, నోట పంచదార"కు అలవాటుపడిన నేటి సంఘ జీవనంలో అటువంటి విశిష్టజీవులు వున్నారంటే నమ్మశక్యం కాకపోవచ్చు కాని నిన్న స్వర్గస్థులైన గోపరాజు రామచంద్రరావు అట్టి గొప్ప వ్యక్తులలో ఒకరు. గాంధీ సంప్రదాయంలో పెరిగినవారు చాలమంది వున్నారు. కాని వారి పెరుగుదల కేవలం ఆహార్యంలో అనుకరణవరకే నిలిచిపోయింది. కాని, ఆచరణకు రాలేదు. గోరా రాజకీయాలలో సర్వోదయవాదిగానే కాక సంఘజీవనంలో అతి నిరాడంబరుడుగా గొప్ప సంస్కర్తగా ఎదిగివచ్చిన వారు.

ఇతరులకు బోధించడమే పాండిత్యంగా భావించకుండా ఆ బోధలను తన జీవితానికే గాక, మొత్తం తన కుటుంబానికే వర్తింపచేశారు. బహుశః ఆంధ్రదేశంలో ఏ తండ్రీ వేయనంతటి ముద్రను తన కుటుంబంపైన వేసిన వ్యక్తి ఆయన ఒక్కడేనేమో !

బయట సంస్కరణ వివాహాలు, వర్ణాంతర వివాహాలు చేయించడమేకాక, ఇంటిల్లపాదినీ ఆ సంప్రదాయానికి గురిచేసినవారు గోరా. సంస్కరణ వివాహాలలో ఒకప్పుడు సోషలిస్ట్ భావాలు, కమ్యూనిస్టు భావాలుగల యువకులు ముందడుగు వేశారు. కాని ఆ పరిణామం కేవలం కొలదిమంది వ్యక్తుల వరకే పరిమితమయింది. తమ కుటుంబాలను వారు ప్రభావితం చేయలేక

పోయారు. రచ్చ గెలిచేముందు ఇంట గెలవలేక పోయారు. మూఢవిశ్వాసాలతో ముందుకు సాగుతున్నారు, కాని ఇందుకు విరుద్ధమైన ఘనత గోరా కుటుంబానికి మాత్రమే దక్కినదంటే అతిశయోక్తి కాజాలదు.

మానవుని మనుగడను మానవుడే తీర్చుకోవాలన్న విశ్వాసం నాస్తికుడు గోరా. తెలుగునాట నాస్తిక మత ప్రచారంలో దాని వ్యాపి ప్రభావంలో గోరా పాత్ర అమోఘం.

గాంధీ రాజకీయ సంప్రదాయంలో ఎదిగిన గోరా కాంగ్రెస్ పావలా సభ్యత్వంతో తృప్తిపడలేదు. స్వాతంత్ర్యానంతరం రాజకీయ సంస్థలలో పేరుకు పోయిన కుళ్ళును చూసి, సర్వోదయవాదిగా మారారు. వృద్ధ కాంగ్రెస్ వాదులు కొందరిలో బయలుదేరిన నైరాశ్యం ఈయనకు కూడా ప్రాకింది. 'పార్టీ లెస్ డెమోక్రసీ' ప్రబోధకులలో ఒకరయారు. రాజకీయ విశ్వాసాలు ఎలా వున్నా గోరా గొప్ప సంఘ సేవకుడు, ప్రజల అభిమాని. అందుకే ఆయన తరం వారికే గాక, ఈ తరం వారిలో కొందరికి కూడా ఆయన పట్ల అంతటి ఆదరాభిమానాలు.

# ఉద్యోగపర్వం

"ఉద్యోగం మనిషికి ఉపాధిని, ఆరోగ్యాన్నీ కల్పిస్తుంది, సహనం అబ్బిస్తుంది. నీతికి, నియమానికి దారి చూపెడుతుంది. నిరంతరం ఉపాధి కల్పన వల్ల, శ్రమకు తగిన జీతం యివ్వడం వల్ల సమాజానికి సంపద, సంతృప్తి, సంతోషం సంప్రాప్తిస్తాయి" అన్నాడు సుప్రసిద్ధ అమెరికన్ వక్త డేనియల్ వెబ్‌సర్.

ఈ సత్యాన్ని అతనే చెప్పనక్కర్లేదు. నిరుద్యోగ పీడిత సమాజాలకు, దేశాలన్నింటికీ ఇది స్వానుభవమే. ఆమాటకొస్తే అన్ని దేశాల స్వాతంత్ర్య ప్రకటనలలో లిఖితమైన తొలి పాఠం కూడా యిదే. ఇంకా చెప్పుకోవాలంటే, "మాగ్నకార్టా" లగాయతు మాడిసన్ "బిల్ ఆఫ్ రైట్స్" (హక్కుల పత్రం), అందరూ ఆమోదించినట్టు చెప్పుకుంటున్న సమితి "మానవ హక్కుల ప్రకటన" వరకూ - అందరికీ, స్వేచ్ఛాసమానత్వాలు, భావ స్వాతంత్ర్యం, అంతరాత్మ స్వేచ్ఛ, సమావేశ స్వేచ్ఛ, ప్రభుత్వోద్యోగం పొందగల సంపూర్ణ స్వేచ్ఛను గుర్తించినవే; వీటిని కాగితంమీద కాకుండా కార్యాచరణలో అన్ని ప్రభుత్వాలు అమలు జరపాలని ఆదేశించినవే; అనుమానం లేకుండా మన రాజ్యాంగంలో కూడా పొందుపరచుకున్నవే యివి.

కాని ఇప్పుడు మన దేశంలో ఒక కొత్త సమస్యను ప్రభుత్వాలు లేవనెత్తుతున్నాయి. "రాజకీయ పార్టీలతో సంబంధమున్న యువకులకు ప్రభుత్వోద్యోగాలు నిషిద్ధం" అన్న ధోరణి ప్రబలింది. ఇటీవల మన రాష్ట్ర శాసనసభలో కూడా ఇది ప్రస్తావనకు వచ్చింది. ప్రజాస్వామ్యం గురించి, దాని రక్షణ గురించి మనం ఆందోళన పడుతున్న సమయంలోనే ఈ ఆలోచన రావడం మరింత విచిత్రం. ఒకనాడు నిర్దిష్టమైన నేరాలకు పాల్పడి, శిక్షలు అనుభవించిన వారు సహితం పెద్ద పెద్ద ఉద్యోగాలలో వుంటున్నప్పటికీ, ఇతర బాధ్యతాయుత పదవులను అలంకరిస్తున్నప్పటికీ, ఒక రాజకీయ

సిదాంతంలో విశ్వాసం కలిగివున్న వారికీ, లేదా ఒక పార్టీతో 'రణ సంబంధం వున్నవారికీ ప్రభుత్వోద్యోగాలను నిషేధించబూనడం - అసలు భావ స్వేచ్ఛనే అరికట్టడం కాదా ?

పార్టీ రహిత ప్రభుత్వమేదైనా అధికారంలో వున్నప్పటి సంగతేమో గాని, పార్టీ ప్రభుత్వాలు అధికారంలో వున్నప్పుడు, ఈ నియమం, ఈ నిషేధం, జాతి పెరుగుదలకు తోడ్పడదు. ఆలోచనలో కుంటుతనం ఆచరణలో అరాచకానికి నాంది. పైగా ఈ నిషేధాన్ని వర్తింపజేస్తే, నిరుద్యోగ సమస్య అంతరించదు సరికదా పెరుగుతుంది. సమాజంలో ఏ అభిప్రాయాలూ, ఏ భావాలూ లేనివాడంటూ ఏ ఒక్కడూ వుండడు. లేనివాడు మనిషేకాడు. అప్పుడు ఓటు హక్కుకి విలువే లేదు. క్రిమినల్ కేసులలో వున్నవారు మినహా మిగతావారందరి గురించి రంధ్రాన్వేషణకు దిగిననాడు, అది సరికొత్త "మెకార్థీజాని"కే దారి తీస్తుంది. పైగా ఏ "అవాంఛనీయ కార్యకలాపాలకు యువకులు ఆకర్షితులు కావడానికి" ఏ నిరుద్యోగం కారణమని మనం భావిస్తున్నామో, ఆ కారణానికి మరింత బలం చేకూర్చడమే అవుతుంది. ఈ సూత్రం అన్ని రాజకీయ పక్షాలకు సమానంగా వర్తించిననాడు ఇక మనకు దక్కేది యువభారతం మాత్రం కాదు !

మన హైకోర్టు ముందుకు ఇప్పటికి ఇటువంటి కేసులు మూడు వచ్చాయి. మూడింటిపైన శ్రీ చిన్నప్పరెడ్డి బెంచ్ తీర్పులు యిచ్చివుంది. అవి పత్రికలలో వచ్చాయి. మూడవ తీర్పు 1974 నవంబర్ 5న యిచ్చారు. అందులో ఆయన అమెరికా మాజీ ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ మాటలను పేర్కొన్నారు. టీచర్లను, యువకులను పబ్లిక్ సర్వెంట్స్‌ను వారి అభిప్రాయాలకు, చట్టబద్ధంగా చెలామణిలోవున్న రాజకీయ పక్షాలతో వారికివున్న సంబంధాలు కలిగి ఉన్నందుకు వారిని బెదరించడం, బాధించడం, ఉద్యోగంనుంచి ఉద్వాసన చెప్పించడం దేశాన్ని ఏ అధోగతికి నెడుతుందో ఐసెన్ హోవర్ చెప్పిన మాటలను ఉదాహరించారు. ఈ పద్ధతివల్ల "స్వేచ్ఛా ప్రభుత్వం బలహీనపడిపోయి, అంతరించిపోతుంద"న్నాడు ఐసెన్‌హోవర్. అంతే గాదు "తప్పువిశ్వాసాలు కలవారనిచెప్పి ఉద్యోగావకాశాన్ని నిరాకరించడం ద్వారా మనదేశ యువకులలో స్వేచ్ఛా భావాలను, భావ ప్రకటనను అడ్డుకొనబోవడం అసలు జాతికి భవిష్యత్తునే నిరాకరించడం అవుతుంది." అని శ్రీ చిన్నపరెడ్డి వ్యాఖ్యానించారు.

మనకు తోచనప్పుడు, సంప్రతించడం కోసమే, సంప్రతించి అనుసరించడానికే మనకు రాజ్యాంగమూ, దాని శాఖలు ఏర్పడ్డాయి. వీటిలో భాగంగా

వున్న కోర్టులను గౌరవించడం, వాటి తీర్పులను శిరసావహించడం ప్రజా స్వామ్యపద్ధతి అవుతుంది. "ప్రజాస్వామ్యంలో భిన్నాభిప్రాయం శక్తి వంతమైన ఆయుధం. ఆందోళన పౌరుని హక్కు" అని సుప్రీంకోర్టు యిచ్చిన తాజాతీర్పు (నవంబర్ 14-74) ఇందుకు భిన్నమూ కాదు.

కేవలం అనుమానాలపైన, తప్పుడు నివేదికలపైన ఆధారపడి సాత్త్విక వాదులూ, అభ్యుదయ వాదులైన సకో్క, వాంజెట్టీల ఉద్యోగాలను ఊడ బెరికి, చివరికి చేయనినేరానికి వారిని బంధించి, పరిమార్చిన ఉదాహరణలు అమెరికన్ న్యాయశాస్త్ర చరిత్రలో వున్నాయి. ఆ ధోరణిని మళ్ళించిన ప్రముఖులలో జస్టిస్ విలియం డగ్లస్ ఒకరు. ప్రముఖ రచయిత గాల్స్‌వర్దీ "జస్టిస్" నాటకం బ్రిటిష్ న్యాయశాస్త్రంలో, న్యాయశాఖ నిర్వహణలోనే పెను మార్పులకు దారితీసి, చివరికి ప్రభువర్గాలు సహితం అతనికి అభి నందన లేఖ రాసేటట్టు చేసింది! వినిపించుకోగలవారికే ఈ విన్నపాలు.

అందువల్ల ప్రజాస్వామ్య సంప్రదాయాలు బాగా వేళ్ళూను కొనవలసిన మన దేశంలో, శైశవదశలోనే వాటికి కళంకంతెచ్చే పనులు ప్రభుత్వాలు చేయ రాదు. విశ్వాసాలలో మార్పు విద్యవల్లా వివేకాన్నీ, చైతన్యాన్నీ పెంపొం దించగల చర్చలవల్లా మాత్రమే సాధ్యపడుతుంది. మనిషిలో వాంఛ నీయమైన ప్రవృత్తికీ, ప్రభుత్వ నడవడికకూ అప్పుడే స్థిరత్వమూ, గౌరవమూ, ప్రతిష్ఠా ఒనగూడతాయి.

# నిర్ణయం మంచిదే, కాని ....

రాష్ట్ర విద్యామంత్రి విద్యారంగానికి సంబంధించి, చాలా ఆసక్తికరమైన సంస్కరణలు కొన్ని ప్రకటించారు. వాటిల భాగంగానే, క్రం రాహిత్యానికీ బాధ్యులైన, విద్యాభ్యాసంలో ప్రగతిని చూపించని విద్యార్థులను స్కూళ్ళ నుండి వేరుచేసి, ఇళ్ళకు పంపించివేయాలనికూడా నిర్ణయించారు. మంచిదే.

అయితే "పిడుగుకీ, బియ్యానికీ" ఒకే మంత్రం వాడకూడదు. విద్యావ్యవస్థలో ఇటీవల నెలకొన్న "క్రమశిక్షణకు," సకాలంలో స్కూళ్ళు పని చేయడానికి కూడా అత్యవసర పరిస్థితి ఎంతో దోహదం చేసిందని మంత్రి చెప్పినమాట మన ఆత్మ శిక్షణ సామర్థ్యాన్ని మరింతగా ప్రశ్నించేదిగావుంది. ఉద్యోగులు ఆఫీసులకు, ఉపాధ్యాయులు, విద్యార్థులు విద్యాలయాలకు సకాలంలో హాజరై, విధులు నిర్వహించడానికి మనకు మరొక మార్గం లేనంతటి చెండితనం మనలో పేరుకుపోయిందా ?

నిజానికి గతంలో కూడా అత్యవసర పరిస్థితి మనకు లేకపోలేదు. పాకిస్తాన్, చైనాలతో వచ్చిన యుద్ధ సమయాలలో కూడా ఈ పరిస్థితి వుంది. దేశ ప్రజలు ఒక్కుమ్మడిగా రక్షణ బాధ్యతలు నిర్వహించారు. ప్రభుత్వానికి అండగా నిలిచారు. అత్యంత క్రమశిక్షణతో ఉత్పత్తి రంగాలు పని చేశాయి. కాని ఆ పిమ్మట కొంతకాలానికి మరల క్రమశిక్షణారాహిత్యం అలముకుంది. ఉత్పత్తి కుంటుపడింది. రాజకీయపక్షాల మధ్య స్పర్ధలు బలిశాయి. అవి విద్యారంగానికి ప్రాకాయి. అందువల్ల ఎప్పటికప్పుడు కొన్ని ప్రత్యేక "పరిస్థితులు" ఉత్పన్నమైతే తప్ప మనలో క్రమశిక్షణ తాత్కాలిక బలపాటం కావడం హాస్యాస్పదం కాదా ?

ఆత్మశిక్షణకు ఆదర్శపంతమైన భౌతిక పరిస్థితులు, విద్యా విధానం అవసరం - ఈ విషయంలో కేవలం టీచర్లని, విద్యార్థులను నిందించి లాభం లేదు. "మానవాత్మలకు ఇంజనీర్లు"గా మసలుకోవలసిన ఉపాధ్యాయుల స్థితిగతులను మనం మార్చాలి. సక్రమమైన జీతాల స్కేళ్ళను నిర్ణయించడం ద్వారా ప్రయివేట్ ట్యూషన్స్‌ను నిషేధించాలి. పాఠశాలల్లో ప్రొక్కిసలాట కూడదు. ఉన్నత ప్రమాణాలు నెలకొనడానికి క్లాసుల్లో విద్యార్థుల సంఖ్య, టీచర్ల తలకుమించిన బరువుగా వుండరాదు. అలాగే బెత్తంతో అమరని శిక్షణ, చిత్త ప్రవృత్తిని మార్చుకుంచే వస్తుంది. విద్యా సంస్కరణలూ కూడా ఏడాది, ఏడాదికి మార్పుచెందకూడదు. దీర్ఘకాల ప్రణాళిక వల్ల విద్యా వ్యవస్థకు క్రమపద్ధతి అలవడుతుంది. అంతేగాని విద్యార్థుల మనసులను, కుదుట పడనివ్వకుండా, సంస్కరణలపేరిట అనునిత్యం ప్రయోగశాలలుగా మార్చడం మంచిది కాదు.

మన బిడ్డలకు అందించే విద్య, కట్నాలకు, కానుకలకు అనువైన వ్యాపార సరళిలో కాకుండా సంఘ ప్రయోజనాన్ని ముందుకు నెట్టి తద్వారా తాము (విద్యార్థులు) కూడా లాభించ గలిగేటట్టు వుండాలి. చదువుకు, జీవిత ప్రయోజనానికి అనుబంధం ఏర్పరచేదిగా వుండాలి. దేశ శ్రేయస్సు ప్రధానం కావాలి. ఒక్క మాటలో-అధ్యయనానికి, అనుభవానికి లంగరందాలి. ఈ లక్ష్యాన్ని సాధించిననాడు క్రమశిక్షణ ఎవరూ చెప్పకుండానే అబ్బుతుంది. అది ఎప్పటికీ నిలిచి చెక్కు చెదరని యోగ్యతగా వుంటుంది. అసలు చెబితే అబ్బేది క్రమశిక్షణ కాదు. ఆత్మ సంస్కారం అన్నది సంఘ చైతన్యంపై ఆధారపడి వుంటుంది. ఆ చైతన్యం కలిగించగల బాధ్యత ఆర్థిక, విద్యావ్యవస్థలది కావాలి. అందుకు నడుం కట్టాలి.

విద్యామంత్రి ఆశించిన మంచి, కేవలం ఆశగానే మిగలకుండా వుండాలంటే రాష్ట్ర, జాతీయ స్థాయిలో ప్రతిపాదించిన సంస్కరణలను వెంటనే అమలులోకి తెచ్చుకోవలసిన అవసరం వుంది.

# కాలదోషం పట్టిన రెవిన్యూ బోర్డు

(బ్రిటిష్ హయాంనుంచి ఈనాటివరకు మన దేశంలో ఎంత వ్యతిరేకత ఎదురైనా కొనసాగుతున్న పరిపాలనా యంత్రాంగం ఏదైనా ఉంటే అది రెవిన్యూబోర్డు మాత్రమే. ఆలస్యానికి, అవరోధాలకు, ఇంకా అనేక అవకతవకలకు ఆలవాలమైన ఈ వ్యవస్థ, ఈస్టిండియా కంపెనీ భూభాగాల ఏలుబడికోసం 1787 లో ఏర్పాటైంది. రాకపోకల సౌకర్యాలు అంతగా లేని ఆ రోజుల్లో కలెక్టర్ల కార్యకలాపాలను పర్యవేక్షించడంతో మొదలై, కాలం గడచినకొలదీ భూమిశిస్తుతోపాటు, వివిధ ఆదాయాల సేకరణ అజమాయిషీ బాధ్యతలుకూడా చేపట్టి తన బరువు తనకే ఎక్కువైనంతగా రెవిన్యూబోర్డు పెరిగింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంనుంచి వారసత్వంగా వచ్చిన ఆంధ్ర రెవిన్యూబోర్డు, నవాబ్ సర్ సాలార్‌జంగ్ ఏర్పాటుచేసిన మున్షీఖానా స్థానే 1865 లో ఏర్పడిన హైదరాబాద్ రెవిన్యూబోర్డు సమైక్య రాష్ట్రం అవతరించినప్పుడు విలీనమై ఆంధ్రప్రదేశ్ రెవిన్యూబోర్డు రూపొందింది. ఆరుగురు మెంబర్లు, డజన్ల సంఖ్యలో గెజిటెడ్ అధికారులు, అంతకంటే తక్కువ స్థాయిలో ఐదారు వందలమంది ఇతర ఉద్యోగులు- ఇదీ రెవిన్యూబోర్డు బలగం. మరేశాఖకు ఇంత మందీ మార్బలం లేరంటే అతిశయోక్తి కాదు. ఆరుగురు మెంబర్లు నిర్వహించే వివిధశాఖలలో 161 రకాల వ్యవహారాలు ఉన్నాయి. కాగా, ఇందులో కొన్ని అందరూకలసి నిర్వహించేవైతే, మరికొన్ని ఇద్దరో, ముగ్గురోకలసి నిర్వహించేవి, ఇంకా కొన్ని ఎవరికివారు నిర్వహించవలసినవి.

ఇంతటి చరిత్ర కలిగిన రెవిన్యూబోర్డును రద్దు పరచాలని 19 వ శతాబ్దం నుంచీ ఆందోళన సాగింది. హైదరాబాద్ రెవిన్యూబోర్డు నాలుగుసార్లు రద్దు కాగా ఆంధ్రబోర్డు మాత్రం అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వచ్చింది. 150 సంవత్సరాలలోనూబోర్డు నిర్వహణపై పలువురుపలువిధాల వ్యాఖ్యానాలు

చేసారు. 1831 లో అప్పటి రెవిన్యూబోర్డు సీనియర్ మెంబర్ లుషింగ్టన్ "ఆటంకకరం, అసమర్థం, అధిక వ్యయకరం" అని బోర్డును విమర్శించారు. అటుతరువాత 106 సంవత్సరాలకు అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రధాని హోదాతో శ్రీ సి. రాజగోపాలాచారి "రద్దు సంగతి ఇప్పుడెందుకు లె"మ్మని దాటవేశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నియమించిన మరో రెండుమూడు సంఘాలుకూడా రద్దును వ్యతిరేకించాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత శ్రీ బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన 1957 లో ఏర్పడిన ఒక కమిటీబోర్డును రద్దుచేయాలని సిఫారసు చేసింది. సిఫారసును అమలు పరచడానికి మంత్రి వర్గ ఉపసంఘంకూడా ఏర్పాటైంది. కాని, చిత్రమేమిటంటే ఉపసంఘం అసలు సమావేశమే కాలేదు. ఎందుకు కాలేదో ఎవరికీ అంతు చిక్కలేదు. శ్రీయుతులు వి. ఓ. రాజు, సుందరయ్య, తెన్నేటి లాంటి దిగ్గంతులు సభ్యులుగా ఏర్పాటైన రామచంద్రారెడ్డి కమిటీకూడా బోర్డును రద్దుచేయాలన్నది. ఐనప్పటికీ బోర్డు రద్దు కాలేదు. పరిపాలనా సంస్కరణ సంఘం సైతం ఒక విధంగా బోర్డురద్దునే అనుకూలించింది. బోర్డును రద్దు చేస్తామని గత సంవత్సరం మార్చిలో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రకటించి, దానిని అమలుపరిచే మార్గాలు రూపొందించడానికి నియమించిన కైవార్ కమిటీ మాత్రం రద్దు ప్రతిపాదనను అడుగడుగునా వ్యతిరేకిస్తూనే కొన్ని ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు చేసినట్టు వింటున్నాం.

ప్రజలనుంచి, ప్రజాప్రతినిధులనుంచి తీవ్రవ్యతిరేకతను ఎదుర్కొని రెవిన్యూ బోర్డు అస్తిత్వాన్ని ఇంతకాలం నిలుపుకొన్నదంటే విశేషమే ! అదృశ్యంగా దానికున్న అండదండలు ఘనమైనవే ! కాని, ఇప్పుడు పరిస్థితులు చాలా మారాయి. ఇక రెవిన్యూబోర్డు కొనసాగడానికి వీలులేదు. 1803 నాటి శాసన నిబంధనలను తు. చ. తప్పక పాటిస్తున్న రెవిన్యూబోర్డు ఈనాటి అవసరాలను తీరుస్తుందా ! ప్రధాన మంత్రి ఇరవై సూత్రాలలో ఆరేడు సూత్రాలు గ్రామీణ ప్రజలకు భూములకు సంబంధించినవి కదా ? త్వరిత గతిని అమలు జరగవలసిన ఈ కార్యక్రమాలకు రెవిన్యూబోర్డు తోడ్పడుతుందా ? ఇంతకాలంగా రెవిన్యూబోర్డు సాధించిన ఘన కార్యాలేమిటి ? రాష్ట్రంలో భూముల లెక్కలు ఇంతవరకు సమగ్రంగా లేవు. సెటిల్మెంట్ సర్వే పూర్తికాలేదు. భూముల మంజూరుకు సంబంధించిన తగాదాలు తీరలేదు. కనీసం నాలుగునెలల వ్యవధిలేకుండా వ్యవహారాలు ఒడ్డెక్కడం లేదు. కారన్‌వాలీసు కాలంనాటి జిల్లా వ్యవస్థ మారలేదు. దశాబ్దాలనాటి ఎస్టేట్ వివాదాలు ఫైళ్ళలో ఇంకా నిద్రిస్తున్నాయి. ఆంధ్రలో "అడంగల్" తెలంగాణాలో "పహానీపత్రక్" అవకతవకలు తొలగలేదు. జాయింట్ పట్టాల

విభజనచట్టంవచ్చి 11 సంవత్సరాలైనా సగంకంటే ఎక్కువ కేసులే ఇంకా మిగిలి ఉన్నాయి. కనీసం ఆదాయాల వృద్ధికికూడా బోర్డు చేసిందేమీలేదు. ఇంతటి ఘనత వహించిన రెవిన్యూబోర్డును రద్దు చేయడానికి తక్షణ చర్యలు తీసుకోవలసిఉంది. నదీజలాల సమస్యపట్ల అనుసరించిన సాహసోపేత వైఖరిని ఇందులోనూ అనుసరించవలసిఉంది. కాలదోషంపట్టిన చట్టాలను నిబంధనలను తిరిగి రూపొందించవలసిఉంది. అధికార ప్రయోజనాల దృష్ట్యాకాక ప్రజోపయోగం దృష్ట్యా విధానాలను మలచుకోవలసిఉంది. భూమిశిస్తు, నీటితీరువా, భూసంస్కరణలు, వాణిజ్యపన్నులు, సెటిల్మెంట్, సర్వే, ఆబ్కారీ మొదలైన శాఖలను నలుగురైదుగురు కమిషనర్లకు అప్పగించి, అవసరమైన రెవిన్యూకు సంబంధించిన అప్పీళ్ళకోసం ప్రత్యేకం ట్రిబ్యునళ్ళను నియమించాలి. ఇప్పుడున్న సిబ్బందినే సక్రమంగా పంపిణీచేస్తే అదనంగా అయ్యే వ్యయంకూడా ఉండదు. ఒకవేళ ఎక్కువ ఖర్చు చేయవలసి వచ్చినా ప్రభుత్వం వెనుకాడవలసిన పనిలేదు. పటిష్టమైన యంత్రాంగం ఏర్పరచుకొంటే పాలనా సామర్థ్యమూ ఆదాయమూ పెరుగుతాయి. మారిన కాలానికి అనుగుణంగా నడచుకోవడం అధికారులకూ శ్రేయస్కరం.

# విడాకుల చట్టం

"ఆలుమగల కలహం అద్దంమీద పెసరగింజంత" సే పేనని అంటారు. కల హం ముదిరిపోనంతవరకే కలయిక. ముదిరితే కట్టుబాటుకే చేటు. సామెత బాగానే వుందిగాని యీ ఛిద్రాలు అంతవరకూ ఎందుకు వస్తాయన్నది ప్రధాన సమస్య. ఆస్తి పాస్తులూ, ఆర్థిక పరిస్థితులూ, వ్యక్తుల నడవడికా వైవా హిక జీవితాన్ని పెంచటంలోగాని, తుంచటంలోగాని నేడు కీలకపాత్ర వహిస్తు న్నాయి. అసమానతలను తొలగించి సర్వులనూ బంధించగల నియమబద్ధ మైన ఆర్థిక, సామాజిక వ్యవస్థ రూపు దిద్దుకోనంతకాలం, అన్ని వర్గాలకూ, మతాలకూ వర్తించగల ఏకైక సివిల్ కోడ్ వల్లకూడా ప్రయోజనం లేదు. "ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" కాని యీ "ప్రేమకు" ధనస్వామ్యం నిర్ణయించిన విలువలు వేరు. నియమాలే వేరు. మగవారి ధాష్టీకానికి ప్రాణపదమైన ఆయుధాలు డబ్బూ, దాని నుంచి పుట్టి పెరుగుతున్న దబాయింపు. ఆడది ఒక భోగి వస్తువు. నిజా నికి పశుప్రాయమైన దశను దాటలేని పసివాడుకాదు మగవాడు. కాని అత నికి ఆ దశను కల్పించింది ఆస్తిహక్కు. దానితో సంక్రమించినదే తానేమి చేసినా చెల్లుబడి కాగలదన్న భరోసా. ఆ దండితో ఏ అన్యాయానికైనా, మరే అక్రమానికైనా పాల్పడతాడు, తిడతాడు, కొడతాడు. వీలుకాన ప్పుడు చట్టాన్నే అడ్డం పెట్టుకుంటాడు - కాలయాపన కోసం. అదే స్త్రీ చేస్తే భర్తకూ ఏవగింపు, సంఘానికీ యీసడింపు. మన సమాజంలో అనేక కుటుంబాలలో (సంపన్నులలో సైతం) భార్యాభర్తల మధ్య పొర పొచ్చాలకూ గృహచ్ఛిద్రాలకూ, స్త్రీలకన్నీటిగాథలకూ యివి హేతువులు. అంతేగాని సరదా పడి ఎవరూ విడాకుల కోసం వివాహ బంధాన్ని తెంచుకో జాలరు!

ఈ పరిస్థితిని మెరుగుపరచేదే పార్లమెంటు ఆమోదించిన విడాకులచట్టం. విడాకులనుసులభతరంచేయడం, అటువంటికేసులనుఏళ్ళూ,పూళ్ళూ నానబెట్టకుండా త్వరగా తేల్చడం, ఇంతవరకూ అమలులోవున్న చట్టాలలోని అవకతవకలను తొలగించడం... ఈ చట్టం ప్రధాన ఉద్దేశాలు. ఈ చట్టం వల్ల కొన్ని మంచి ప్రయోజనాలు వున్నాయి. తెలియని వయస్సులో (18 ఏళ్ళలోపు) జరిగిన పెళ్ళిళ్ళను రద్దు చేసుకునే హక్కు, విడాకులు ఇచ్చుకునే హక్కు కూడా విడాకులకు డిక్రీ వచ్చినతర్వాత ఏడాదిపాటు వేచి వుండకుండా పరస్పరం సమ్మతించిన ఆ నెలలోనే వివాహం చేసుకోవచ్చు. వివాహాల రిజిస్ట్రేషన్ విధిగా జరగాలన్న నిబంధన వల్ల విడాకుల కేసులలో మహిళల ప్రతిపత్తి పెరగవచ్చు.

అయితే యీ చట్టం వల్ల కొన్ని చిక్కులు కూడా లేకపోలేదు. 15-18 ఏళ్ళ లోపు జరిగిన వివాహాలను రద్దు చేసుకునే హక్కును ఒక్క మహిళకే కల్పించారు. దీనిని పురుషునికి కూడా వర్తింప జేయడం మంచిది. అలాగే భార్యా భర్తలలో ఎవరైనా పరొకరితో "ఒక్కసారి అక్రమ సంబంధం" ఏర్పరచుకొన్నా విడాకులు ఇచ్చుకోడానికి చట్టం అనుమతించింది. ఈ నిబంధన సవ్యమైనదిగా తోచడం లేదు. వివాహ జీవితంలో పరస్పరం క్షమించుకోవడానికి, పాతగాథలు మరచిపోవడానికి, సర్దుబాట్లకూ ఎప్పుడూ అవకాశం వుంటుంది. విచ్చలవిడితనం కానరాకుండా నాలి ముచ్చులా ప్రవర్తించడం, ఇతర బలీయమైన కారణాలు వుంటే తప్ప, వివాహ వ్యవస్థను యథేచ్ఛగా "నిత్యకల్యాణం పచ్చతోరణం"గా మార్చడం మంచిదికాదు!

# జన్మ — 'పునర్జన్మ'!

ప్రకృతికి 'దాసోహం' చెప్పినప్పటికీ మానవునికి జీవరహస్యం తెలియలేదు. అజ్ఞాత శక్తులను కనుగొనలేక ఆకునూ, పోకనూ అంటూ అతీత శక్తులను ఊహించి ఉపాసించాడు. "కస్త్వం ? కోహం ? కుతోజాతా ఇయం విసృష్టిః" అని ఋక్కుల రూపంలో (నీవు ఎవరు ? నేను ఎవరు ? సృష్టి రహస్యం ఏమిటి ?) ప్రశ్నించుకొన్నాడు. ఇప్పుడు విజ్ఞానశాస్త్రం అనే ఆయుధంతో ఆ రహస్యాలను ఒక్కొక్కటిగా ఛేదిస్తున్నాడు. అణువు, పరమాణువు, కణ, శకలాదుల మర్మాన్ని తెలుసుకొన్నాక తనను తానే కనుగొంటున్నాడు. తనలోని అజ్ఞాత శక్తుల బండారాన్ని రచ్చకీడుస్తున్నాడు. ఈ జిజ్ఞాస విశ్వకల్యాణానికి వినియోగపడితే ఈ మహత్తర విజయాలను ప్రతి ఒక్కరూ ఆహ్వానిస్తారు. అటువంటి ఘనకార్యాన్ని కొలది రోజుల నాడే అమెరికాలోని మసాచూ సెట్స్ సాంకేతిక పరిశోధనా సంస్థ, హార్వర్డ్ సంస్థ శాస్త్రవేత్తలూ డాక్టర్స్ హాన్స్ జోచిమ్ ఫ్రిట్జ్, మాక్సన్ సింగర్ సాధించారు. జీవి వారసత్వ లక్షణాలను నిర్ణయించే "జీన్"ను 1970 లోనే ప్రయోగశాలలో కృత్రిమంగా రూపొందించిన ప్రసిద్ధ భారతీయ రసాయనిక శాస్త్రవేత్త ఖొరానాకు వీరిద్దరూ సహచరులు. అయితే ఖొరానా ఆనాడు "ఈస్ట్" (పులియబెట్టే సూక్ష్మజీవి) కణాలలో ఉండే జీన్స్ వంటి కృత్రిమ 'జీన్'ను సృష్టించగలిగాడేగాని, దానిని మరొక జీవకణంతో అంటు కట్టలేదు. ఇప్పుడు ఆయన సహచరులు ఆపని చేసి దిగ్విజయం సాధించారు. "కోలీ" అనే ఒక బాక్టీరియా (సూక్ష్మజీవి) జీవకణంలో ఎలాంటి 'జీన్' ఉంటుందో అలాంటి దాన్నే — దాని రసాయనిక పదార్థాలనూ, భౌతిక లక్షణాలనూ పసికట్టి తగుపాళ్ళలో వాటిని మిశ్రమంచేసి ఒక కొత్త 'జీన్'ను కృత్రిమంగా తయారుచేశారు. ఈ కృత్రిమ 'జీన్'ను ఆ బాక్టీరియా

జీవకణంలో ప్రవేశ పెట్టారు. కొత్త జీన్ చావలేదు. సహజమైన జీన్ మాదిరే జవ, జీవాలు పోసుకొని పనిచేసింది.

"పుట్టుకతోపుట్టినబుద్ధి పుడకలతోగానిపోదు" "వాడివంశమే అంత" "మూడేళ్ళప్పుడు ఏ బుద్ధి ఉందో ముప్పై ఏళ్ళొచ్చినా అంతే" అని మనం అనుకొంటూంటాం. ఇకమీదట ఆ సందేహాలూ, సంశయాలూ పాత రోత క్రింద చెలామణీకాగల అవకాశాలు పెరుగుతున్నాయి. జీవ రహస్యం తెలుసుకొంటే వారసత్వ లక్షణాలను మార్చుకోవచ్చు. ప్రస్తుతం పిపీలికంతో ప్రారంభమైన ప్రయోగం బ్రహ్మాండమైనశక్తిని ప్రదర్శిస్తున్న ఈ మానవుడికి వంశపారంపర్యంగా వస్తున్న వారసత్వ లక్షణాల మార్పిడితోగాని పూర్తి అయ్యేటటులేదు. ముందు ముందు ఇలా మనిషి జీవకణాలలోకి కూడా కొత్తగా ఆరోగ్యకరమైన "జీన్స్"ను చొప్పించడం సాధ్యపడినప్పుడు—చికిత్సకు లొంగని వ్యాధులు కూడా పరారు చిత్తగించవచ్చు; బుద్ధి మాంద్యం తొలగించవచ్చు; చర్మం రంగులు మార్చుకోవచ్చు; ముక్కు-ఆకారం మారవచ్చు; ఆ మాటకొస్తే "జీన్" లక్షణం-జుట్టు ఎలాఉండాలో, గోళ్ళు ఎలా పెరగాలో ఆదేశించడం. ఇన్సులిన్‌లాంటి ప్రోటీన్‌ను, ఎడ్రినాలిన్ వంటి హార్మోన్లను "ఇలా నడుచుకో" అని కంట్రోల్ చేసేది కూడా ఈ "జీనే". తిన్న పదార్థాన్ని అరిగించడం దీనికే చేతనవును. ఇలా ప్రకృతి చేస్తున్న పనులను ఈ మానవుడే కృత్రిమంగా చేసే రోజులు దగ్గర పడుతున్నాయి! అప్పుడు నిజంగా ఇది జన్మకాదు. నిజమైన 'పునర్జన్మ'గా మానవులు భావిస్తారు. !

మసాచూ సెట్స్‌సంస్థలో జరిగిన కొత్తప్రయోగంలానే, జీన్‌ను మార్పిడి చేసేందుకు ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి, లండన్, స్టాన్‌ఫోర్డ్ వైద్య విశ్వవిద్యాలయాలలో కూడా విశ్వప్రయత్నాలు జరుగుతున్నాయి. అయితే కొన్ని సూక్ష్మ జీవులతో జరిపే ఈ ప్రయోగాల సందర్భంగా ప్రయోగశాలలో కట్టుదిట్టమైన జాగ్రత్తలు తీసుకొనకపోతే, కృత్రిమ జీవులు ప్రయోగశాల విడిచి బయటపడినట్టయితే అవి క్రిమి సంహారక ఔషధాలకు కూడా లొంగకుండా కోట్లాది ప్రజలకు హాని కలిగించవచ్చునని శాస్త్రవేత్తలు హెచ్చరికలు చేశారు. ఇలాంటి ప్రమాదకరమైన కృత్రిమ జీవులలో ఒకటి "ఆంట్రోమీడా స్ట్రెయిన్." ఇటువంటి ప్రమాదాలు లేకుండా జాగ్రత్తపడితే ఈ వైజ్ఞానిక విజయాన్ని మానవాళి తన ఉజ్వల భవిష్యత్తుకు శుభంగా పరిగణిస్తుంది. తప్పితే అశుభంగానే భావిస్తుంది. !

# ఇదీ-శాశ్వత పరిష్కారం

మన గ్రామసీమలలో ఏడాదికి రు. 2500కు లోపు ఆదాయం కల సన్నకారు రైతుల రుణాలను మాఫీ చేయాలని ప్రభుత్వం నిర్ణయించినట్లు ప్రకటించారు. ఇది చాల సమయోచిత నిర్ణయం. లక్షలాది చిన్న రైతులకు ఊపిరిసల్పే చర్య కాగల్గుతుంది. గ్రామీణ రుణభారం తొలగించేందుకు ఇటీవల తలపెట్టిన ప్రతిపాదనలో ఇదొకటి. అయితే ఎన్ని వందల కోట్ల మేర ఈ రుణభారంవుందో లెక్కలేదు.

ఈ ప్రకటన మన ప్రస్తుత గ్రామీణార్థిక వ్యవస్థను పీడిస్తున్న కొన్ని దుర్గతలను చెప్పక చెబుతోంది. కౌలుదారులు, సన్నకారు రైతులు, మధ్యతరగతి రైతాంగం, ధనిక భూస్వామ్య వర్గాలుగా చీలివున్న నేటి వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో- నిత్యావసర సరకుల ధరల పెరుగుదలవల్ల, పరపతి కొరతవల్ల హెచ్చు బాధలకు లోనవుతున్నవారు చిన్నరైతులు, కౌలుదారులే. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ధరల పెరుగుదలవల్ల లాభించినదీ ధనికరైతులే. నేడు "సస్య విప్లవం"వల్ల సొంత పెట్టుబడులతో ఎక్కువగా ప్రయోజనం పొందుతున్నవారూ మోతుబరులే. సామాన్య రైతుకు ప్రతిదీ కొనబోతే కొరివి, అమ్మబోతే అడివిగావుంది. పరపతిగాని, పనిముట్లుగాని, అరువుగాని, ఎరువుగాని చిన్నరైతుకు అందుబాటులో లేవు. పెట్టుబడులు అందించగల పరపతి సంస్థలు కూడా "మొత్త చూసి పీట" వేస్తున్నాయి. వడ్డీ వ్యాపారుల పీడ వారికి యింకా తొలగలేదు. రైతాంగ వ్యవస్థలో దళారులుగావున్న మాజీ జమీందార్లకు రు. 600 కోట్ల పైచిలుకు నష్టపరిహారంగా యిచ్చుకోవడంవల్ల వ్యవసాయాభివృద్ధికి పెట్టుబడులు కరవైనాయి. ఉన్న పెట్టుబడులు పట్టణాలకు ప్రాకుతున్నాయి. వీటన్నింటి ఫలితం- మధ్యతరగతివారు సన్నకారు రైతులుగాను, చిన్న రైతులు కౌలుదార్లుగాను,

కూలీలుగాను మారుతున్నారు. ఈ రోజున సన్నకారు రైతాంగానికి ఋణ విమోచన పథకాన్ని ప్రకటించడమే ఇందుకు సాక్ష్యంగా చెప్పుకోవచ్చు.

బ్రిటిష్ పరిపాలనలోను, ఆ తర్వాతకూడా కొన్ని చట్టాలు వచ్చాయి. 1895-1946 మధ్య అయిదుసార్లు రైతాంగ రుణభారాన్ని అంచనావేశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నారాయణస్వామి నాయుడు కమిటీ రైతాంగ రుణభారం రు. 218 కోట్లు అని తేల్చింది. ఇందులో 80 శాతం మధ్య తరగతి, పేద రైతాంగమే మోస్తున్నదని చెప్పారు. ఆ దరిమిలా రుణభారం తొలగించేందుకు తనఖా బ్యాంకులు, పరపతి సంస్థలు ఎన్నో వెలశాయి. సాంద్ర వ్యవసాయ పద్ధతులు, పైలట్ ప్రాజెక్టులు ఎన్నో వ్యవసాయాభి వృద్ధికోసం ప్రారంభించాం. అయినా ప్రభుత్వం కల్పిస్తున్న సౌకర్యాలవల్ల లాభిస్తున్నవర్గం వేరైంది. ప్రభుత్వం ఎన్నిరుణాలు యిచ్చినా దాని బొక్కసం ఖాళీకాకుండా వుండాలంటే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం అవసరం. ఈ సూత్రం కొత్తది కాదు. 1936 లోనే జాతీయ కాంగ్రెస్ వ్యవసాయ సమస్యల పరిశీలనకు ఏర్పాటుచేసిన కమిటీ దున్నేవానికి భూమినిచ్చి యాజ మాన్యపు హక్కును తొలగించ మన్నది. అప్పుడు వ్యవసాయాభివృద్ధికి తగిన పెట్టుబడి వనరులు అవే సమకూరుతాయి. "మన పథకాలలో, స్వయంగా సాగుచేయని వ్యక్తులు పారిశ్రామిక వేత్తలుగా వ్యవసాయంలో చెలామణి కావడానికి వీలులేదు. పెట్టుబడిదారీ పద్ధతిలో వ్యవసాయం రైతాంగాన్ని కేవలం వేతనకూలీలుగా మార్చివేస్తుంది"అని హెచ్చరించింది.

అందువల్ల సన్నకారు రైతుల రుణభారాన్ని ఇప్పుడు రద్దు చేసినా మౌలిక మైన సంస్కరణలు రానంతవరకు తిరిగి రుణభారానికి ఈ రైతులు గురి కాబోరన్న గ్యారంటీ లేదు.

# ఇందిర వినూత్న ప్రయోగం

అధికారంలో ఉన్నవారు ఆదర్శవంతమైన ప్రయోగాలు చేసినపుడు, వాటికి తాత్కాలికపు విలువ కాదు, శాశ్వత ప్రయోజనం సిద్ధిస్తుంది. సంక్షోభాల చౌరాస్తాలో ఉన్న భారత దేశానికి ప్రధాని ఇందిర మరొక కొత్త ప్రయోగాన్ని ప్రతిపాదించారు. ఒకరకంగా ఇది నవ భారతంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి బీజాలు నాటుతుంది. మన గమ్యాన్ని సుగమం చేస్తుంది. దేశ రాజకీయ వ్యవస్థను ఎలా పటిష్టం చేసుకోవాలి, విద్రోహ చర్యల బారి నుంచి దానినెలా పరిరక్షించు కోవాలి, అన్నవిషయంపైన జాతీయస్థాయిలోనే విస్తృతంగా చర్చలు సాగించాలని శ్రీమతి గాంధి సూచించారు. ఇది సాహసంతో కూడిన సూచన. ఇందులో ప్రమాదాల కన్నా ప్రయోజనాలే ఎక్కువ. ఇంకొక మాటలో చెప్పాలంటే, ప్రస్తుత రాజ్యాంగం, రాజకీయ స్వాతంత్ర్యం పొందిన ప్రజలు ఆచరణలో ఆర్థిక స్వాతంత్ర్యం సాధించుకొనడానికి వీలైన పద్ధతులలో చేర్పులూ, మార్పులూ పొందవలసి ఉంటుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, వ్యవస్థ మంచిదైతేనే చాలదు, ఎంచుకున్న వ్యవస్థను తృంచివేసే చర్యలను నిరోధించగల రక్షణలను రాజ్యాంగంలో పొందుపరచుకోవాలనే. నిజానికి మన రాజ్యాంగంలో ఆస్తిహక్కు కల్పించిన రక్షణలన్నీ ప్రజాబాహుళ్యం విశాల ప్రయోజనాలకు కాకుండా, కొలది మంది స్థితిపరుల స్వార్థంకోసం ఎలా వినియోగపడుతూ వచ్చాయో కడచిన 25 ఏండ్ల అనుభవం చాటి చెబుతోంది. ప్రభుత్వమే ఉద్దేశించిన పథకాలను ఆచరణలో ఎలా స్వార్థపరులు అడ్డుకోగలిగారో తెలుసు. అందుల్లనే రాజ్యాంగంలో మౌలికమైన మార్పుల అవసరం ఉంది. అయితే ఈ

మార్పులు ప్రభుత్వాల సుస్థిరత మాత్రమే ప్రధానంగా కాకుండా, ప్రజల జీవితంలో నిండువున్నమి పూయించగల మార్పులుగా ఉండాలి. ఆవెంటనే ప్రభుత్వాల అస్తిత్వం కూడా పదిలమవుతుంది.

అయితే ప్రాథమిక సమస్య ఇక్కడ ఎదురవుతోంది; మనం ఎంచుకునే వ్యవస్థ ఏది? సోషలిజమా? కేపిటలిజమా? మిశ్రమ ఆర్థిక రాజకీయవ్యవస్థా? 1946 నాటి రాజ్యాంగ నిర్ణయ సభలో పండిట్ నెహ్రూ రాజ్యాంగ లక్ష్యాల గురించి తీర్మానం ప్రతిపాదిస్తూ ఇలా స్పష్టం చేశారు : "నేను సోషలిజాన్నే ఎంచుకుంటున్నాను. భారతదేశం కూడా సోషలిజాన్నే కోరుకుంటుందని ఆశిస్తున్నాను. సోషలిస్టు వ్యవస్థ ఏర్పాటుకు వీలైన రాజ్యాంగాన్ని ఇండియా రూపొందించుకోగలదనే ఆశిస్తున్నాను. ఆ మాటకు వస్తే యావత్ప్రపంచానికీ సోషలిస్టు మార్గం తప్ప మరొకటిలేదు."

ఈ మాటలు చాలా స్పష్టంగా ఉన్నాయి. అందులో రెండు అర్థాలకు తావు లేదు. గుంజాటనకు అవకాశం లేదు. శషభిషలకు అసలే ఆస్కారం లేదు. ఇప్పుడు ప్రధాని ఇందిర కూడా సోషలిజం మన మార్గం అంటున్నారు. అయితే రాజ్యాంగంలో సోషలిస్టు వ్యవస్థ మన ధ్యేయం, సంకల్పం అని నిర్ద్వంద్వంగా పేర్కొనక పోవడం వల్లనే, రబ్బరులా సాగుతోంది రాజ్యాంగం. దాని చాటున భిన్న వ్యాఖ్యానాలు వినిపిస్తున్నాయి. ఇప్పుడు మన వ్యవస్థకు ఉన్నది సోషలిస్టు స్వభావం కాదు. ఇందిర చెప్పినట్లు "ఆదర్శంలో సోషలిజం." అందువల్ల మనసుపెట్టి దీనిని తిరగదోడవలసిఉంది. ఆచరణలో, ప్రజల అనుభవంలో, సోషలిజంగా ఈ ఆదర్శాన్ని మార్చుకోవలసి ఉంటుంది. వివిన్న భాష్యాలకు వీలుకల్పించని విధంగా సోషలిజాన్ని మనం నిర్వచించుకుని, ముందడుగు వేసిననాడు ఏ శక్తులనుంచి ఈనాడు భారత ప్రజాస్వామ్యానికి ప్రమాదం వాటిల్లినదని భావిస్తున్నామో, ఆ శక్తుల ఆట కట్టించ గలుగుతాము. కాబట్టి మిశ్రమ ఆర్థిక వ్యవస్థనే మనం "సోషలిజం"గా ఎక్కువకాలం చెప్పుకోలేము.

సోషలిజం ఎంత విదేశీభావమో, కేపిటలిజం కూడా అంతే. భారతీయ పరిస్థితులకు అనుగుణమైన సోషలిజాన్నే ఇందిర ప్రతిపాదిస్తున్నారు. ప్రబోధిస్తున్నారు. అయితే ఉత్పత్తి సాధనాలు, వాటిపై ఆధిపత్యం, ప్రజల అవసరాలను గుర్తించిన ప్లానింగ్, ఉత్పత్తిశక్తుల పెరుగుదల వీటికి

సంబంధించిన సోషలిస్ట్ మౌలిక సూత్రాలు సప్త సముద్రాలు దాటినా చెక్కు చెదరనివి. భూములు, పరిశ్రమలు, బ్యాంకులు, గనులు ఎవరి ఆధీనంలో ఉంటాయో- వారిదే దేశాధిపత్యం. వారిదే సంపదా, సౌభాగ్యమూ. ఈ సోషలిస్ట్ సూత్రాన్ని ఇందిర ఏ మేరకు ప్రభుత్వపరం చేసుకుంటారో ఆ మేరకు అమె దిగ్విజయం సాధించగలుగుతారు. అప్పుడది ప్రజల సౌభాగ్యసీమ అవుతుంది. దీని పటిష్టత పైననే మన సెక్యులరిజం, ప్రజా స్వామ్య సౌధం పునాదులు కూడా ఆధారపడి ఉంటాయి. అందువల్ల మన రాజకీయ వ్యవస్థను పటిష్టం చేయడానికి దేశవ్యాప్తంగా జరిగే చర్చలలో ఈ ప్రాథమిక సత్యాలను విస్మరించరాదు. రాగ ద్వేషాలకు లోను గాకుండా, వాస్తవికమైన, క్రియాశీలమైన ప్రతిపాదనల ద్వారా ఇందిర ఆలోచనా ధోరణిని పరిపుష్టం చేయడం మేధావుల బాధ్యత.

# కట్నాలూ - కానుకలూ

మన కృష్ణశాస్త్రిగారు "ఏడాది పొడుగునా" అని ఒక రూపకం రాశారు. అందులో ఇద్దరు అమ్మలక్కలు ఎక్కడా చోటు దొరకనట్టు మంచినీళ్ళ బావి వద్ద బాతాఖానీ వేస్తారు! కట్నపిశాచం "సూరమ్మ" కుటుంబాన్నే వెన్నాడిందో, "పేరమ్మ" సంతానాన్నే పీడించిందో సంభాషణ మొరటుగానే సాగినా సారాంశం నాటికి నేటికీ ఒకటే :

"మెల్లకంటి కైదెకరాల్
పల్లపు చేనుకు చెల్లు!"

అని ఒకరంటే :

"కట్నాలూ కానుకలూ
కావలిసొచ్చాయా ?
బోలెడంత చదువు చదివి
పొయ్యే కాలమా ?"

అని వేరొకరు అంటారు. అదేమంటే "కావలిస్తే ఆసంగతి కాంతాన్నడుగు" అని మన మొగాలమీదే వడ్డిస్తారు.

అవును. మనలాంటి సమాజాలలో కట్న పిశాచికి బలి అవుతున్న "కాంత"లు అనేకమంది. రామమోహన్‌రాయ్ రేయింబవళ్ళు ప్రచారం చేసి ప్రజల మనస్సులలో పాతుకుపోయిన కొన్ని మూఢ విశ్వాసాలను వదలుకొనేటట్టు చేయవచ్చు; సతీసహగమనాన్ని మాన్పించనూ వచ్చు. అలాగే మన వీరేశలింగం పంతులు 'నాబొందో' అంటూ నడుం కట్టుకొని కొన్ని బాల్య వివాహాలను మాన్పించవచ్చు; వితంతు వివాహాలనూ జయప్రదంగా నిర్వహించి ఉండనూ వచ్చు; గురజాడ కన్యాశుల్కాన్ని ఎత్తిపొడిచి దానిని మాన్పించడానికి నాటక రాజాన్నే రాసి ఉండవచ్చు. కాని వరకట్న పిశాచం

ఉందే, అది పుట్టి పెరుగుతూ వస్తున్నది దుర్మార్గపు ఆర్థిక వ్యవస్థ ఆధారం గానేనని ఒప్పుకోక తప్పదు. ఈ సత్యాన్ని బెంగుళూరులో ఇటీవల ఉధృత మైన వరకట్న వ్యతిరేక ఉద్యమం అనుభవాలే చాటి చెబుతున్నాయి. సంస్కరణ ఉద్యమాలన్నీ ఒక దశవరకు ఫలించి ఆ దరిమిలా పాల పొంగులా చల్లారిపోవడానికి ప్రధాన కారణం - సమాజం గురించీ, దాని ఆర్థిక పునాదుల గురించీ స్పష్టమైన అవగాహన లేనందువల్లనే. "తల్లిదండ్రులకు ఇష్టమైతే తలారివాడికైనా" ఇచ్చి పెళ్ళిచేయవచ్చునన్న రోజులుపోయి, ప్రేమి కులు నిర్ణయించుకొన్నా పీటల మీద పెళ్ళిళ్ళు కూడా రద్దుకావడంలో మతలబు అంతా ఇక్కడే ఉంది. ఆస్తి హక్కు ప్రాబల్యం లేకపోతే అంతస్తులు అంత రిస్తాయి. ప్రేమ వివాహాలు బతుకుతాయి. ప్రజ్ఞకు ప్రభలు పడతారు.

కట్న పిశాచి నిర్మూలన కోసం చట్టాలు చేసినా ప్రయోజనం కన్పించదు. బాల్య వివాహాల రద్దుకోసం కంకణం కట్టుకొన్న "శారదా చట్టానికీ, 1961 నాటి వరకట్న నిషేధ చట్టానికి ఆచరణలో ఎంత విలువ ఇస్తున్నామో మన కుటుంబ జీవితాలే సాక్ష్యం. పెళ్ళీడు వచ్చీ, వివాహ యోగ్యతపొందని ఎంత మంది ఆడపిల్లలు అసమానతల ఆర్థిక చక్రం విషపు కోరలకు బలి అవుతున్నారో మనకు తెలియనిది కాదు. అప్పోసప్పో చేసి బిడ్డలకు పెద్ద చదువులు చదివించినా, ఆ విద్యనే ఆస్తిగా భావించని వరుని గొంతెమ్మ కోర్కెలెలా ఉన్నాయో కూడా మనకు తెలుసు. పైగా ఈ సమస్య నిరుద్యో గంతో కూడా ముడిపడి ఉన్నందున ఆర్థిక దుస్థితిలో ఉన్న విద్యావంతులైన మగ పిల్లలు కూడా పెళ్ళీడు వచ్చీ, పోషించుకోలేని స్థితిలో వివాహాలకు వాయిదాలు కోరడమూ చూస్తున్నాం. అంతేగాదు. ఎన్ని చట్టాలు చేసినా, కట్నం అడిగేవారి గురించి కూపీతీసి రిపోర్టుచేయమని చెప్పినా, అది నిబంధ నలను తు.చ. తప్పక పాటించడమే అవుతుందిగాని ఈ సమస్యకు పరిష్కారం ప్రస్తుతపు వ్యవస్థలో అంత తేలికకాదు. ఎందువల్ల? వివాహం అయితే చాలునన్న అవసరం వెన్నాడుతున్నప్పుడు కట్నాలూ, కానుకలూ ఇచ్చే వారూ, పుచ్చుకొనేవారూ పరస్పరం ఫిర్యాదులు చేసుకోరు. నేటి సమాజంలో స్మగ్లింగ్‌తో పోటీ పడగల రాకెట్ ఇది. అంతర్జాతీయ మహిళా సంవత్స రాన్ని దశాబ్దాన్ని కూడా ధిక్కరించిపోగల సత్తా దీనికి ఉంది. అయితే కొంత మంది యువకులు "నవజీవన బృందావన నిర్మాతలు" కాబట్టి వారికి స్వాగతం చెప్పవలసిందే.

# వయస్సు ఏభై సంవత్సరాలు

భారత స్వాతంత్రోద్యమం ఒక మహా సాగరం. దానిని ఈదుకొని తాము ఒడ్డు చేరి, ప్రజలనుకూడా దరి చేర్చడానికి ఏక కాలంలో కాకపోయినా, భిన్నదశలలో ఉద్యమించిన రెండు మహా సంస్థలు - జాతీయ కాంగ్రెస్, కమ్యూనిస్టుపార్టీ. రాజకీయ సిద్ధాంతాలు వేరు కావచ్చు, పద్ధతులు భిన్నం కావచ్చు, కాని పరస్పరం ప్రభావితమైన పక్షాలు ఈ రెండూ. జాతీయ కాంగ్రెసుకు తొంభై సంవత్సరాలు, కమ్యూనిస్టుపార్టీకి యాభై సంవత్సరాలు. వయస్సులో 40 సంవత్సరాలు తేడావున్నా, నాలుగు రోజుల వ్యవధిలో రెండింటి ఉత్సవాలు ఘనంగా జరుగబోతున్నాయి. కమ్యూనిస్టు పార్టీ స్వర్ణోత్సవం నేడు. జాతీయ కాంగ్రెస్ మహోత్సవం 29 న.

భారత కమ్యూనిస్టుపార్టీ పుట్టుక తాష్కెంట్‌లోనా, కాన్పూర్‌లోనా అన్న విషయమై అల్లుకున్న వాదోపవాదాలు ఎలా వున్నా, అంతర్జాతీయ కార్మికోద్యమంలో భాగంగా, భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో విశిష్టమైన పాత్ర నిర్వహించింది ఈ పార్టీ. ప్రపంచ శ్రామిక వర్గానికి ఒక స్వరూప మిచ్చి, విప్లవ స్వభావాన్ని కల్పించినది అక్టోబర్ మహా విప్లవం. రష్యాలో దీని విజయం సోషలిజం స్థాపనావకాశాలను రూఢిపరచడమేగాక, సోషలిస్టు భావాలు ప్రపంచ వ్యాపితంగా యువకులలో బలీయంగా నాటుకుపోవడానికి దోహదం చేసింది. ఈ సద్దుకు హద్దులు లేవు. అది భారత జాతీయ స్వాతంత్ర్య సమర సరిహద్దులను కూడా తాకింది. దీని ప్రభావం కాంగ్రెస్ పార్టీ పైన పరోక్షంగా వుంటే, ప్రత్యక్ష ప్రభావం ఫలితం కమ్యూనిస్టు పార్టీ అవతరణ.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులను దేశం నుంచి వెళ్ళగొట్టడం ఒక్కటే ఈ పార్టీ లక్ష్యం కాదు; స్వాతంత్ర్య సమరాన్ని సోషలిస్టు మార్గం పట్టించి, మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థకు ఆస్కారం కల్పించని సోషలిస్టు, కమ్యూనిస్టు

వ్యవస్థను నెలకొల్పడం ప్రధానమైన ఆదర్శం. ఈ ఆదర్శం వృద్ధులలో, యువకులలో ఒక సంచలనం కల్గించింది. రాళ్ళను కరగించింది. అక్టోబర్ విప్లవ ఫలితాలను కళ్ళారా చూస్తున్నారు. దొరతనం ఆమోదించక పోయినా, దొంగచాటుగానైనా సాహిత్యం అన్ని వర్గాల ప్రజలకు చేరింది. ఈ నూతన సంచలనం - జాతీయ కాంగ్రెస్‌లోని యువ నాయకత్వాన్ని, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను ఒక ఊపు వూపింది. మార్క్సిజం గురించి పండిట్ నెహ్రూ ఆ దరిమిలా ఎటువంటి వ్యాఖ్యానం యిచ్చినా, ఆనాడు, మనసు చెదరని రోజులలో "మార్క్సిజం చదవని వాడికి అంధత్వం" ఏర్పడుతుందని చెప్పారు.

మరొకవైపునుంచి చూస్తే, కమ్యూనిస్టుల ప్రభావం జాతీయ కాంగ్రెస్‌లో పెరుగుతూ వచ్చింది. వీరు చాలా కాలంపాటు ఉన్నత స్థానాలలో కూడా వున్నారు. అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులుగా పని చేశారు. కాంగ్రెస్ - సోషలిస్టులుగా వున్నారు. చివరికి వ్యక్తిగత హింసావాదాన్ని ఆరాధించిన టెర్రరిస్టులు సహితం శాస్త్రీయ సోషలిజాన్ని ఆశ్రయించవలసి వచ్చింది; చరిత్ర ప్రసిద్ధికన్న పెషావర్, కాన్పూర్, మీరట్ కుట్రకేసులు కమ్యూనిస్టు ఉద్యమంలోని మణిపూసలను ప్రపంచానికి చాటి, చూపించాయి. వీటి కొనసాగింపులే పార్వతీపురం, హైదాబాద్ కుట్రకేసులు. కమ్యూనిస్టు పార్టీ అవతరణ భారత సామాజిక జీవితంలో మరొక గొప్ప పరిణామానికి దారితీసింది. పెక్కు కార్మిక, కర్షక సంఘాలతోపాటు, సాంస్కృతిక ఉద్యమం దేశవ్యాప్తంగా అలుముకుంది. ఇది తిరిగి పార్టీ పటిష్ఠతకు ఒక వేదిక అయింది. అంతర్జాతీయత లక్ష్యంగా కల ఈ పార్టీ జాతీయోద్యమంలో కొన్నితప్పటడుగులు వేసినా, శక్తిమంతమైన పోరాటాలు నడిపింది. ఈఉద్యమాలలో వేలసంఖ్యలో యువ కిశోరాలను కోల్పోయింది. స్వతంత్ర భారత ప్రభుత్వ విధానాలను కొంతవరకు మలచడంలో వీటి ప్రభావాన్ని ఎవరూ కాదనలేరు.

ప్రస్తుతం దేశంలో పటిష్ఠమైన రాజకీయపక్షంగా కాంగ్రెస్ తరువాత చెప్పదగినది కమ్యూనిస్టు పార్టీయే. సిద్ధాంత సంక్షోభంలోపడి రకరకాల పేర్లతో పలురకాల గ్రూపులుగా కొందరు విడిపోయినా, భారత ప్రభుత్వ ప్రధాన విధానాలన్నింటికి బాసటగా నిలచిని పార్టీ నేడు కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే. ఇప్పుడు సోషలిజం ధ్యేయంగాకల రెండు పార్టీలు - కాంగ్రెస్, కమ్యూనిస్టు. దేశ సామాన్య ప్రజలను ఆ గమ్యంవైపుగా ఎంత చాకచక్యంతో, మరెంతటి సమయస్ఫూర్తితో, ఇంకెంతటి మెళకువతో నడిపించగలవో చరిత్ర చెప్పాలి.

# శాస్త్రవేత్త తత్త్వ చింతన

పలికేవాడు శాస్త్రవేత్త కావచ్చు, పలికించేది తత్త్వచింతనే కావచ్చు, కాని మానవతావాదాన్ని హేతువాదాన్నీ పెంచి పోషించేదే తత్త్వదృష్టి. అయితే అందుకు జోనస్‌సాక్‌తో సాటిరాగలవారు కొలదిమందే ఉంటారు. చరిత్రలో తాత్త్వికులైన రాజులు ఉన్నారు, రాజనీతిజ్ఞులు ఉన్నారు. అలాగే మానవుని శరీర ధర్మాలను అనుక్షణం పరిశీలిస్తూ జీవశాస్త్రంలో, జీవకణ శాస్త్రంలో ఆధునిక "కణాదు"డైన సాక్ పరిశోధన పోలియో వాక్సిన్‌ను కనిపెట్టడంతోనే ముగియలేదు. శాస్త్రవేత్తా, వైద్యుడూ ప్రాణదాతలు కాబట్టి నైతిక విలువలను పెంచుకోవడం ద్వారా కూడా ప్రపంచాన్ని దారిద్ర్యంనుంచీ, మూఢవిశ్వాసాలనుంచీ విముక్తం చేయాలని కోరుతున్నారు. కొందరు ఉబుసుపోని తత్త్వవేత్తలలా కేవలం భాష్యానికే పరిమితంగాక డాక్టర్ సాక్ జీవశాస్త్ర పరిశోధనలనుంచి పొందిన అనుభవం ద్వారా, మానవాళి మనోవికాసమే "సమష్టిజీవనాన్ని" పెంపొందిస్తుందని విశ్వసిస్తున్నాడు. కొందరి దృష్టిలో శాస్త్రవేత్త ప్రాణదాత కాదు, భక్షకుడు. అలాగని లోగడ కవి కీట్స్ భావించాడు. ఛార్లెస్ స్నో, ఓపెన్‌హైమర్, ఆల్డస్ హక్స్లీ మరికొందరూ ఈ ధోరణినే అనుసరించారు. ఇలాంటివాళ్లు నేటికీ ఉన్నారు. శాస్త్రవేత్తలకు నైతిక ధర్మాలులేవని వీళ్ళ ఊహ. ఇందుకు వీరు చెప్పేకారణం- శాస్త్ర విజయాలు వినాశానికి తోడ్పడినంతగా విశ్వకల్యాణానికి దోహదం చేయడంలేదని. ఇది తప్పని డాక్టర్ సాక్, నెహ్రూ అవార్డు ప్రదానోత్సవం సందర్భంగాచేసిన ప్రసంగం నిరూపిస్తోంది. సాక్ ప్రసంగం సదస్యులను వైద్యశాస్త్రం సాధించిన విజయాలతోనేగాక నైతిక విలువల ప్రబోధంతోకూడా మత్తిల్ల జేసింది !

తొలి అటంబాంబు ప్రయోగం వార్త విన్నప్పుడు మనస్సు కకావికలై పోయిన ఐన్‌స్టైన్ ఇలా అన్నాడు: "ఇంతకూ తప్పిదం యూరేనియంపు బద్దలుకొట్టి

అపారశక్తిని పుట్టించడం కాదు. అగ్గిపుల్లను కనిపెట్టినదానికంటే నాగరికతకు యూరేనియం విచ్ఛిత్తివల్ల ఎక్కువ ప్రమాదం లేదు. కాని ఇంతకూ తెలుసుకోవలసింది- మానవాళి భవితవ్యం మానవుల నైతిక ప్రవర్తనపైన ఆధారపడిఉందని... దీనికి పరిష్కారం ప్రజల మనస్సులలోనే ఉంది." నేడు డాక్టర్ సాక్ చెబుతున్నది కూడా అదే. ఈ మానవ మేధస్సును మరింత సుందర ప్రపంచాన్ని సృష్టించుకొనేందుకు వినియోగించ మంటున్నాడు. పరస్పర సహకారం, సౌమనస్యం ఆధారంగా ఇతర ప్రకృతి శక్తులను జయించినట్టే పశు ప్రవృత్తినీ, అహంకారాన్నీ విడనాడి, ఆరోగ్య సౌభాగ్యాలవైపుగా శరీరాన్నీ, మనస్సునూ నడిపించు కోమంటున్నాడు. మనస్సు ఉంటే మార్గం లేకపోలేదు. వినియోగంలోకిరాని విజ్ఞానం మానవునిలో ఇంకా ఎంతో ఉంది. కావలసిందల్లా మనస్సు అజ్ఞానాన్నీ, మౌఢ్యాన్నీ వదలించుకోవడం ద్వారా ఈ అజ్ఞాతశక్తికి కూడా పని కల్పించుకోవచ్చు. ప్రధాని ఇందిర ఇటీవల దేశప్రజలను అలవరచుకోవాలని ప్రబోధించింది కూడా ఈ శాస్త్రీయ దృష్టినే. ఈ సవాలునే సాక్ కూడా మనకు విసురుతున్నాడు. విజయాలను సాధించే మానవుడు విలయాన్ని చేజేతులా సృష్టించుకోకూడదు. అందుకే సైన్స్, టెక్నాలజీల అభివృద్ధితో సాధించే ఈనాటి విజయాలను చూసి భావితరాలు "మనలను తెలివైన పూర్వీకులుగా గౌరవించేటట్టు మనం వ్యవహరించాలి గాని ముందు తరాల బాగోగులకోసం నేటి అవకాశాలను సద్వినియోగం చేసుకోలేని దద్దమ్మలుగా భావించుకొనేటట్టు ప్రవర్తించరాదు" అన్నాడు సాక్.

# పెద్ద బుర్ర-చిన్న బుద్ధి

"తెలివి ఎవడి సొమ్మురా ?", "తెలివి మాలిన వాడిని ఊరవతలకు తరమాలి" వాడి "బుర్ర తాటికాయంత, బుద్ధి చింతపిక్కంత" "పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు"—ఇవి సాటివారి తెలివితేటలను అంచనా కట్టడానికి మన వాళ్లు తరచు వాడుతూ వుండే సుకులు, నానుడులు. జింజాంత్రోపస్, జావా, నియాండర్తల్, సోలో, స్టీన్‌హోమ్ దశలు దాటిపోయి హోమో సెపైన్స్‌గా అవతరించి, ప్రకృతిపై అధికారం చెలాయిస్తున్న ఈ మానవుల తెలివి తేటలను లెక్కకట్టడానికి కొత్త విద్యలొచ్చాయి. వాటిలో "ఇంటెలిజన్స్ కోషెంట్" అనే కొలబద్ద ఒకటి. ఈ కొలబద్ద పుచ్చుకున్న వారి బుద్ధి కొలత మనకు తెలియదుగాని, కొలది రోజులనాడు ఢిల్లీలో 604 మంది వయోజనులను పరీక్షించారట. ఫలితం వారందరూ "మాంచి" తెలివి తేటలుగల వారుగా జ్ఞాన పరీక్షలు నిర్వహించిన వారు నిర్ణయించారట.

మెదడు అభివృద్ధి చెందినది లగాయతు మానవుడు ఆహార సేకరణ దశ నుంచి ఆహారోత్పత్తి దశకు చేరుకుని, క్రమంగా ప్రకృతిలోని అన్ని వనరులు వినియోగించుకుని, విశ్వాంతరాళ రహస్యాలను ఛేదించుతూ వస్తున్నాడు. ఇది సామాజికంగా, సామూహికంగా సాగుతున్న కృషి. రోజుకు కొన్ని వేల పదాలు సృష్టి అవుతున్నాయి; వందలాది శాస్త్ర ప్రయోగాలు జరుగుతున్నాయి. శబ్దార్థ చంద్రికలు ప్రతి ఏటా కొత్త ఎడిషన్‌లు వేసుకోవలసిన పరిస్థితులు వచ్చాయి. బయోమెడిసిన్ వచ్చి, వంశపారంపర్య లక్షణాలను (జినెటిక్ కోడ్) బద్దలుకొట్టి పెనుమార్పులను సృష్టిస్తోంది. ఈ పరిస్థితులలో "కోషెంట్" పరీక్షల నిర్వహణ "పని లేనివాడు-పిల్లితల" సామెతనే గుర్తుకు తెస్తుంది. మనిషి మానసిక పరిణతిని, అతని వయస్సుతో భాగహారాలు, తీసివేతలతో నిర్ణయించే చాతుర్యం ఒక రకమైన గారడీవిద్య! దీనికి పరిసరాలతోగాని, పోషకాహార నిబంధనలతోగాని సంబంధం లేదు.

తమకంటే ఇతర జాతులన్నీ తెలివితక్కువవి, అందువల్ల అవి స్వాతంత్ర్యానికి అనర్హమని యూరోపియన్ వలసదార్లు, సామ్రాజ్యవాదులు చెబుతూ వచ్చే వారు. తెల్లవాడు తెలివిగలవాడు, నీగ్రో బానిసగానే వుండాలన్నారు. కాని బానిసజాతులే చివరికి తిరగబడి, విమోచన పోరాటాలు సాగించి, వైజ్ఞానికంగాకూడా వృద్ధిచెందుతున్నాయి. అసమ ఆర్థికవ్యవస్థల అసలు రహస్యాన్ని ప్రజలు తెలుసుకోకుండా, సాగుతున్న దోపిడీని మరింతగా సాగించుకొనడానికి వీలైన కొన్ని గ్రంథరాజాలు వెలశాయి. కొందరు ఉత్తమ రచయితలూ వెలుగొందారు. ఇది నిజం కాకపోతే ''స్నేహితులను ఎలా సంపాదించాలి'' అని రాసిన డేనీల్ కార్నీజీ, అదే చేతితో డబ్బు ఎలా సంపాదించాలి, కోటీశ్వరుడివి ఎలా కావాలి అన్న పుస్తకాలు రాయడు. అలాగే పార్కిన్‌సన్‌లూ, లారెన్స్ పీటర్లూను. జ్ఞానానికి కూడా వొంకదార్లు వుంటాయి.

అసలు మానవుని సగటు మెదడు బరువు మూడుపౌన్ల పైచిలుకు వుంటుందని అంచనా. మరి రష్యన్ రచయిత తుర్గనీవ్ మెదడు ప్రపంచంలోకెల్లా పెద్దది. బరువు నాలుగు పౌన్ల చిల్లర. కాగా అనటోల్ ఫ్రాన్స్ మెదడు ప్రపంచంలోకెల్లా చిన్నది. బరువు రెండు పౌన్ల పైచిలుకు మాత్రమే. ఈయన ఫ్రెంచి రచయిత. ఇద్దరూ ప్రపంచ సాహిత్యంలో పేరు ప్రఖ్యాతి కలవారే. మరి ఎవరు వీరిలో తెలివిమాలిన వారని చెప్పుకుందాం ? ! అందుకే అసలు మెదడన్నది మనకు వుంటే, సక్రమంగా దానిచేత ఎలా చాకిరీ చేయించుకోవాలో అప్పుడే తెలుస్తుంది ! బుర్ర పెద్దదై బుద్ధి చిన్నదైతే ప్రమాదం కాని, బుద్ధి మంచిదై బుర్ర చిన్నగా వున్నా ఫరవాలేదు !

# తెలుగు లిపిలో, భాషలో వెసులుబాటు

భావాన్ని బట్వాడా చేసేది భాష. భాషను వాడేవాడు మనిషి. ఈ రెండు శక్తులమధ్య అవరోధాలేవైనా వుంటే, అవి మనిషి కల్పించుకున్నవే. మనిషి పెరుగుదలను అడ్డుకునేవారు ఎందులోను ఎదుగుదలను సహించలేరు. భాష విషయంలోనూ ఇది సత్యమే.

తెలుగు భాషలో, లిపిలో రావలసిన సంస్కరణల గురించి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా జరిగిన చర్చలలో పలువురు పెద్దలు చేసిన సూచనలు ఆలోచించదగినవిగా వున్నాయి. విద్యావేత్తలు, భాషావేత్తలు, విశ్వవిద్యాలయాధిపతులు, ప్రభుత్వం మధ్య సమన్వయం వుంటే, ఎన్నో మంచి మార్పులు తీసుకురావచ్చునన్న ఆశ, ఈ చర్చలసరళి కలిగించింది.

తెలుగుభాష సౌలభ్యం గలదిగా భావించిన జె. బి. హెచ్. హాల్డన్, వీలుంటే జాతీయభాష కాగల సత్తా దీనికి వుందని ప్రశంసించాడు. కాని ఇంకా కృత్రిమ బంధాలతో మన భాష ఇబ్బందులు పడుతున్న విషయం ఆయనకి తెలిసి వుండకపోవచ్చు.

కృతకమైన గ్రీక్, లాటిన్ బంధాలనుంచి విడివడిన యూరోపియన్ భాషలు, ముఖ్యంగా ఇంగ్లీషు ఇంతగా ఎదిగి, రాజ్యాలు ఏలడం చూస్తున్నాం. ప్రపంచ భాషలనుంచే గాకుండా, ఇంగ్లీషుభాష తెలుగునుంచికూడా తెలివిగా తెగువతో కాపీకొట్టి, కొత్తపదాలను అరువు తెచ్చుకుని, పరువును పెంచుకుంటోంది. ఇందులో ప్రతిష్ఠకన్నా సౌలభ్యానికే ప్రాధాన్యం. స్తబ్ధత కన్నా పెరుగుదలకే ప్రాముఖ్యం. అంత సులభంగా పరభాషా పదాలను

స్వీకరించుకోగల స్థాయికి అది ఎదిగివచ్చింది. మన భాషకూడా పెరగా లంటే తప్పుడు కట్టుబాట్లు తొలగక తప్పదు.

పారిశ్రామిక విప్లవం, శాఖోపశాఖ లవుతున్న విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక పరి జ్ఞానం అనునిత్యమూ మనకు కొత్తపదాలను కుప్పలుగా పోస్తున్నాయి. ఈ పదసృష్టి ఎంతటి కుంభవృష్టిగా వుందంటే, ఇంగ్లీషులోని ఎంతటి ప్రామాణిక నిఘంటువైనా అనతికాలంలోనే పునర్ముద్రణలు అందుకోవలసి వస్తోంది. అది ఎయిర్‌లైన్స్ పదం కానివ్వండి, ఫైర్ బ్రిగేడ్‌కు సంబంధిం చిన కొత్తమాట కానివ్వండి, వెంటనే గ్రంథస్థం కావలసిందే.

ఇలా మన చుట్టూ వున్న ప్రపంచం విజ్ఞానశాస్త్ర విజయాలతో ఎన్నో మెట్లు ఎగబ్రాకిపోతోంది. ఆ వేగాన్ని అందుకోవాలి. అందుకు భావంలోనూ, భాషలోనూ కట్టుకున్న మడులు, దడులూ తూలగొట్టాలి. భాషకు గ్రాహ్య శక్తి అపారం ఆశక్తి గ్రహించేవాడికి కూడా వుండాలి. అప్పుడు కొత్త మెరుగులు కనపడతాయి. వెలుగులు చూడగలుగుతాం. దుష్ట సమాసాలు కొన్నిచోట్ల దొర్లినప్పటికీ, కొన్ని ఇంగ్లీషు మాటలు కలసిన తెలుగు పదాలు వున్నప్పటికీ, శైలి చెడకుండావుంటే, శబ్దమాధుర్యం కలిగివుంటే, అర్థ గౌరవానికి భంగం లేకుంటే సహించాలి.

ఆదరణ లేనిచోట ఏదీ నిలబడదు. భాష అసలే నిలవజాలదు. ''అలు'' ''అలూ''లు ఏ పండితుడికీ చెప్పకుండానే, మధ్యలో అడ్డుకున్నా అడుగంటి పోయాయి. ''బండిరా''ల బ్యారికాడ్స్ కొందరికింకా ఇంపుగానే వుందేమో గాని వాటికీ కాలం చెల్లినట్టే. 'ఇణ్యా'లు ఇంకిపోతున్నాయి. 'అరు', 'అరూ'ల కొమ్మలు కూలిపోతున్నాయి. అర్థానికి, భావానికీ గౌరవం రావా లంటే పనికిరాని కట్టుబాట్లు పోవాలి. అనువాదాలు అంతే. అనేక ప్రభుత్వ ప్రచురణలుచూస్తే, సంస్కృతమే మేలనిపిస్తాయి. అంతకన్నా ఏ పిశాచాల భాషో తేలిక అనిపించుతాయి. అనువాదాల విషయంలో చేయితిరిగిన ప్రాతి కేయుల సహకారం ప్రభుత్వం పొందడం అవసరం.

మనకువున్న మరొక పెద్దసమస్య- ముద్రణాయంత్రాల ప్రవేశంతో, పత్రికల వ్యాప్తివల్ల, లిపిలో ఏర్పడింది. ఇందులో గణనీయమైన సంస్కరణ అవసరం. భాషావేత్తలు పరిశోధించి పొల్లులూ, వత్తులసంఖ్యనూ తగ్గించ గలిగితే, కొన్ని కొండగుర్తులు రూపొందించగలిగితే, ఇంగ్లీషులో మాదిరే

మన వర్ణమాలలోకూడా గొప్ప విప్లవంరావచ్చు. అది మరింత సువర్ణమాల కావచ్చు. రోమన్ లిపిని అనువదించడం మంచిది అనేది ఇందువల్లనే అయివుంటుంది.

ఈ పరిణామం ముద్రణలో సౌలభ్యానికి దారి తీస్తుంది. అక్షరాల అమరికలో అందం వస్తుంది. స్థల దురాక్రమణ పరిధితగ్గుతుంది. పొందిక కుదురుతుంది. ఇంకా సుందరంగా వుంటుంది. పాఠకులకు కనులపండుగా, కంపోజిటర్లకు సులభంగాను వుంటుంది. టైపురైటర్లకు పని తెములుతుంది. టైపిస్టులకు పనిభారం తగ్గుతుంది.

# పునర్నవం

చక్రానికి చలనశక్తి ఉన్నప్పుడు ఆగదు. అలాగే కాల చక్రం అది ఎవరికోసమూ నిలిచిపోదు. దాని గతి వేగాన్ని అందుకోవడం ఋతువుకి ధర్మం. అలాగే చరిత్ర అనే చక్రగతిని ఎవరూ అడ్డగించ లేరు. కాల గర్భంలో కలిసిపోయిన శకాలన్నీ ఈ సత్యాన్ని నిరూపించాయి. ఒకనాడు ప్రకృతికి దాసుడు మానవుడు. నేడది అతని చేతిలోని కీలుబొమ్మ. అరణ్యాలు చెలిగిన వాడు, అగడ్తలు పూడ్చిన వాడు, కొండలను తొలచిన వాడు, రాళ్ళను మలచిన వాడు, సహాయ శూరుడై అందని కుందేటి కొమ్మను సాధించుతున్న వాడు - ఎన్నైనా చేయగలడు. విధ్వంసం, నిర్మాణం అతని జీవితం నేర్పిన పాఠం. చెలగి బ్రతుకుతున్న వాడు. తను ముందడుగు వేయడానికి ప్రతి బంధకం అనుకున్న ప్రతిదానిని ప్రక్కకు నెట్టుతాడు. తన అభ్యుదయానికి చేదోడు, వాదోడు కాగలిగినది పాతదైనా సరే ఆహ్వానించి, అవసరాలు తీర్చుకుంటాడు. కొత్తపాతల మేలు కలయికతో జీవితంలో ఎప్పటికప్పుడు పునర్నవం సాధిస్తాడు.

పాతసంవత్సరానికి వీడ్కోలు, కొత్తసంవత్సరానికి స్వాగతంపలుకుతున్నాం. ఎందుకు? జమకోసం జననం కాదు; నవ్యతను ఆహ్వానించే మానవులం పుట్టుకతోనే సరిపెట్టుకోలేము. వృద్ధి, క్షయాలను బేరీజు వేసుకుంటాం, లోటు పాట్లను సరిదిద్దుకుంటాం. మలినాన్ని కడిగి వేసుకుంటాం. తిరిగి చలనంతో అభ్యుదయం సాధిస్తాం.

ప్రతి కొత్త సంవత్సరంలో భారతీయులకు అటువంటి శక్తి అవసరం. అది ఎవరి దానధర్మాలవల్లనో, దయాదాక్షిణ్యాలవల్లనో సంక్రమించేది కాదు. మనోధైర్యం, ఆత్మవిశ్వాసం, ఆస్తిలాగా సంక్రమించేవి కావు. పడిలేచే పసిపాపకు వున్నంత ఆత్మవిశ్వాసం కూడా ఎదిగిన మానవులకు లేకపోతే

జీవితం వ్యర్థం. మన సంఘాన్ని, మన ఆర్థిక వ్యవస్థను పీడించుతున్న జబ్బులకు కారకులు ఈ మానవులే, ఈ వ్యవస్థలే.

కులాలతో, సవాలక్ష ఉపకులాలతో, భిన్నమతాలు, సంస్కృతులతో, విపరీతమైన ఆర్థిక వ్యత్యాసాలతో నిండివున్న మన సమాజానికి మరమ్మతు ఒక్కరోజులో జరిగే పనికాదు. ఈ మాట ప్రతి ఏటా చెప్పుకుంటున్నాం. కాని కొత్త సంవత్సరంలో కూడా ఈ పాతపాట పనికిరాదు. ఇరవై ఏడేళ్ళ తరువాత ప్రభుత్వమే సోషలిజం తన విధాన ప్రకటనగా పేర్కొన్నందున—కొత్తమార్పులు రాగలవని ఆశిస్తాం. ఈ ఆశను ఆచరణ సాధ్యం చేసుకోవడానికి వీలైన చలనం మనలో పుట్టాలి.

దేశానికి సంపద కొరతలేదు, సరకు కొరతలేదు. మానవబలగం ఇబ్బడి ముబ్బడి అయినా సామాన్యుడికి చేసిన బాసలు మరచిపోయాం. కొత్త భాష నేర్చి— మాటలతో అన్నార్తుల కడుపు నింపుతూ వచ్చాం. నెహ్రూ "విథర్ ఇండియా" చదివినవారికి ఒక్క విషయం గుర్తుండకపోదు; "ఒక్క వరలో రెండు కత్తులు ఇమడవు. కలవాడి ఓటు హక్కు, లేనివాడి ఓటు హక్కు ఒక్కటి కాజాలవు...అసలు ఓటుతోనే కడుపు నిండదు. అసలు సమస్య సరకు లేకపోవడం కాదు. పెట్టుబడిదారీ విధానం వైఫల్యం, సోషలిజం విజయం అంతా సరకు పంపిణీలోనే వుంది. స్వార్థ ప్రయోజనాలకి చోటు చూపనిదే సోషలిజం".

ఈ మౌలికమైన ఆలోచన ప్రభుత్వానికి అవసరం కాదా? ప్రజలలో అట్టి చైతన్యం కల్పించడం అవశ్యంకాదా? అది కల్గిననాడు ఆనాడు భారత చరిత్రలో కొత్త కథ మొదలై కోటానుకోట్ల గుండెలు కదులుతాయి. కదలబారిన చేతులు దేశ స్వరూపాన్నే మార్చుతాయి.

# అమృతమూ - విషమూ

అతి సర్వత్ర వర్జయేత్ - అన్నారు. తిండిలోనూ అంతే, తిప్పటలోనూ అంతే. ఇక మందుమాకుల సంగతి చెప్పనే అక్కరలేదు. బేదులకూ, వాంతులకూ ఒక ప్రధాన కారణం ఈ 'అతే'. అలాగే ఎంతటి ప్రాణ రక్షణ మందులైనా వైద్యుడు వాడినా, రోగి పుచ్చుకొన్నా ఫలితం వ్యాధి నయం కాకపోవడానికి ఒక్కో సందర్భంలో ప్రాణహానిగా పరిణమించ డానికీ కూడా-ఈ 'అతే' కారణం. అందుకే గ్రీకులు ఔషధాలకి పెట్టిన 'ఫార్మకాన్' అన్న పేరులోనే మందుకు "విషమూ-అమృతమూ" అన్న అర్థముంది. అంటే అన్ని మందులూ ఎలా విషపదార్థాలో, అన్ని విష పదార్థాలూ అలాగే అమృతోపాయాలు అని అర్థం. ఇక మతలబు అంతా వాటి వినియోగంలోనే ఉంది. వైద్యశాస్త్రం, ఔషధ పరిశ్రమ ఈ ఇర వయ్యో శతాబ్దంలో సాధించినంత ప్రగతి మరెన్నడూ సాధించలేదు. చికిత్సకు ఇంతకుముందు లొంగని న్యుమోనియా, టి. బి, టైఫాయిడ్ కలరా, పోలియోవంటి పెక్కు వ్యాధులు ఇప్పుడు పరారు చిత్తగిస్తున్నాయి. మరికొన్ని పెదవ్యాధులకూ మందులు తయారవుతున్నాయి. కాని ఆధునిక వైద్యం, కొత్త మందులూ, ప్రాణరక్షణ కారకాలైన యాంటీ బయాటిక్స్ తామరతంపరగా అందుబాటులోకి వస్తూన్నందువల్ల- డాక్టర్లలో, రోగులలో అజాగ్రత్త శాతంకూడా పెరిగింది. రకరకాల మందులు మార్కెట్లోకి రావడంవల్ల, డ్రగ్‌కంట్రోల్ కూడా చేయి దాటిపోయి, క్యాటలాగ్‌లో ఇచ్చిన మందుల స్వభావం కూడా తెలుసుకోకుండా యధేచ్ఛగా వాడే ప్రమాదం ఏర్పడింది. సరిగ్గా ఈ ప్రమాదం గురించే భువనేశ్వర్ సైన్స్ కాంగ్రెస్‌లో సుప్రసిద్ధ వైద్యశాస్త్రవేత్త, కలకత్తా నేషనల్ మెడికల్ కాలేజి ప్రొఫెసర్ ఎస్. ఆర్. దాస్‌గుప్తా హెచ్చరించవలసి వచ్చింది. మందుల వినియోగం గురించి విస్తృత స్థాయిలో ప్రజలను శాస్త్రీయ పద్ధతులలో చైతన్యవంతు

లను చేయవలసిన అవసరం ఎంతఉందో దీనివల్ల స్పష్టమవుతోంది. అలాగే వ్యాధి నివారణ కృషిలో డాక్టర్లు పాటించవలసిన మెళకువల ప్రాధాన్యాన్ని కూడా ఇది నొక్కి చెబుతోంది.

మానవుని ప్రాణమే ఒక రసాయనం. పెక్కు జీవకణాలతో కూడిన ఈశరీరంలో ఎప్పటికప్పుడు ఎన్నోరసాయన ప్రక్రియలు జరుగుతూంటాయి. శరీరం ఎంత రక్తపు కూడో అంతటి క్రిముల సముదాయం కూడా - విద్యుచ్ఛక్తిలో పాజిటివ్, నెగిటివ్ శక్తులు ఉన్నట్టే, శరీరంలోఉండే బాక్టీరియా (మైక్రోబ్స్) జీవులలో మన శరీర దార్ఢ్యాన్ని పెంచేవి కొన్ని పుడుతూంటే, వాటి సరసనే తుంచేవి కూడా పుట్టి పెరుగుతూంటాయి. ఇలా మన ఆరోగ్యాన్ని పెంచే క్రిములు "ప్రగతి జీవులూ", నష్టపరచేవి "ప్రగతి నిరోధక" జీవులూ. మనం ఏ మందు తీసుకొన్నా దాని శక్తినిబట్టి ఈ రెండురకాల క్రిములలో ఏదో ఒకటి ఆశ్రయిస్తుంది; రెండోది నిరాకరిస్తుంది. సహజంగా మనకుచేసే 'సుస్తీ'లలో 80 శాతం, మందులు వాడకుండానే సర్దుకుపోతాయి. ఎటుతిరిగి 20 శాతం జబ్బులకే మందులూ మాకులూ అవసరం. అందువల్ల తుమ్ముకూ, జలుబుకూ కూడా పెన్సిలిన్‌లాంటి యాంటీబయాటిక్స్ వాడితే మేలుకంటే కీడు ఎక్కువ జరుగుతుంది. పెన్సిలిన్ అక్రమ వినియోగంవల్ల కొన్ని సందర్భాలలో రోగులకు ఎలర్జీ రావడమేగాక, ప్రాణ హాని కలిగిన ఉదాహరణలుకూడా ఉన్నాయి. ఎందువల్లనంటే మన శరీరంలో రకరకాల బాక్టీరియా (క్రిములు) ఉన్నందున, అవి పరస్పరం అదుపు చేసుకోబట్టే ఆరోగ్యం నిలబడుతుంది. ఏ ఒక్కరకమూ మరోరకం బాక్టీరియాకు హానికరంగా పరిణమించేంత సంఖ్యలో వృద్ధిచెందదు. ఈపరిస్థితులలో పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్‌వంటి యాంటిబయాటిక్స్‌ను అమితంగా వాడితే- రోగ కారకక్రిములను చంపబోయి వాటిని అదుపుచేసే మంచి క్రిములను కూడా చంపివేస్తాయి. ఫలితం మానవుని శరీరంలో రోగ నిరోధకశక్తి నశించడమేగాక, బతికిఉన్న క్రిములు పెచ్చుమీరి యాంటీ బయాటిక్స్‌కే ఎదురు తిరుగుతాయి. అపుడు వైద్యుని మాత్రరోగికి నిజంగానే వైకుంఠ యాత్రగా తయారవుతుంది. గనుకనే యాంటీ బయాటిక్స్‌ను సర్వరోగ నివారిణి'గా వాడకూడదంటారు.

# 'ఓల్గా సే గంగా'

ఇది మహాపండితుడు రాహుల్‌సాంకృత్యాయన్ మానవ ఇతిహాసంలో ఒక సువర్ణ ఘట్టాన్ని, ఒక చారిత్రక సన్నివేశాన్ని వివరించుతూ తన గ్రంథానికి పెట్టుకొన్న పేరు. క్రీస్తుపూర్వం ఆరువేల ఏళ్ళ క్రితం ఇండో - యూరోపియన్ జాతులు కారుచీకటిలో కాంతిరేఖల కోసం ఎదురు చూస్తున్న దశలను సుందరంగా బహుపసందుగా వర్ణించిన పుస్తకం - 'ఓల్గా సే గంగా'. రష్యాలోని ఓల్గానదీ కరకట్టలు నివాస కేంద్రాలుగా క్రమంగా మధ్యాసియా నుంచి గంగానదీ తీరంవరకూ మానవ సమూహాలు కదలివచ్చి తమ రూపురేఖలను ఎలా తీర్చిదిద్దుకొన్నవో కథారూపంలో చెప్పిన కమనీయ గాథ. ఓల్గా తరంగాలకూ. గంగాజలాలకూ ఏర్పడిన అనుబంధం అది. ఈనాడది మూడు పూవులూ, ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నదంటే ఆశ్చర్యపోనవసరం లేదు. ప్రధాని ఇందిర ప్రారంభించిన సోవియట్ పర్యటన జాతుల మధ్య సుదీర్ఘ కాలంలో ఏర్పడిన ప్రత్యక్ష పరోక్ష సంబంధాలను మరింతగా పటిష్ఠం చేస్తుంది. ఆమెకు మంగళవారంనాడు మాస్కోలో లభించిన అఖండ స్వాగతం ఇటీవలి కాలంలో రెండు దేశాల మధ్య రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక, శాస్త్ర, సాంకేతిక రంగాలలో పెంపొందుతున్న సాన్నిహిత్యానికి తిరుగులేని ఉదాహరణ.

ప్రపంచంలోని ప్రథమ సోషలిస్టు రిపబ్లిక్ సోవియట్ యూనియన్. దోపిడీ వ్యవస్థను రూపుమాపి దారిద్ర్యాన్ని, నిరక్షరాశ్యత, నిరుద్యోగ భూతాలనూ సాగనంపి ప్రజల శక్తియుక్తుల పరిపూర్ణమైన అభివృద్ధికి అన్ని అవకాశాలు కల్పించిన దేశం అది. వలస బానిసత్వం నుంచి బయటపడి రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకొని ఆర్థిక స్వాతంత్ర్యం కోసం, స్వయంపోషక ఆర్థికవ్యవస్థకోసం తపనపడుతున్న దేశం ఇండియా. అంతేకాదు. సోషలిస్టు రిపబ్లిక్‌గా ప్రకటించుకొని ఉన్నత శిఖరాలను అందుకోవాలని ఎదురు

చూస్తున్న దేశం మనది. రాజ్యాంగాన్ని ప్రజలకు సన్నిహితంచేసి, దాని ఆదర్శాలను సాధించుకొనేటట్టు చేయాలని తహతహలాడుతున్న దేశం మనది. ఈ సమయంలో ఇందిర సోవియట్ పర్యటనవల్ల ఇండియా పొందగల ప్రయోజనాలే అధికంగా ఉంటాయి.

ఆసియాలో శాంతికి, సుస్థిరతకు ఇండో - సోవియట్ సంబంధాలు దోహదం చేస్తాయి. ఇటీవల భారత ఉపఖండం రాజకీయాలలో వస్తున్న పరిణామాలు కూడా ఈ విశ్వాసాన్ని దృఢపరుస్తున్నాయి. 1971 నాటి ఇండో - సోవియట్ స్నేహ సంధి ఇందుకు పటిష్ఠమైన పునాదులు వేసింది. పాకిస్తాన్, చైనాలతో దౌత్య సంబంధాలను పునరుద్ధరించడానికి, మైత్రీ సంబంధాలను పెంపొందించుకోడానికి ఇండియా చేసిన చొరవ క్రమంగా సత్ఫలితాలనిస్తోంది. శ్రీలంక, నేపాల్‌లతో సంబంధాలు మరింతగా బల పడుతున్నాయి. అటు అమెరికాతో ఒక దశలో బెడిసిన సంబంధాలు కూడా క్రమంగా మెరుగవుతున్నాయి. ఈ విధంగా ఆసియాలో పలుకుబడి, ప్రభావాలకోసం లాపత్రయపడుతున్న మూడుఅగ్రరాజ్యాలతోనూ-అమెరికా, రష్యా, చైనాలు - మన సంబంధాలు కొత్తపుంతలు తొక్కుతున్నాయి. హిందూమహాసముద్ర ప్రాంత దేశాలు అశాంతికి దూరంగా ఉండాలంటే ఈ మూడు అగ్రరాజ్యాల మధ్య పోటా పోటీలు కూడా తగ్గిపోవాలి. అందుకే ప్రధాని ఇందిర చెప్పినట్టు ఉద్రిక్తత సడలి సౌమనస్య వాతా వరణం నెలకొనాలంటే "హెల్సింకీ సద్భావం" ఒక్క యూరప్‌కు పరిమిత మయితేనే చాలదు. అది ఆసియావంటి ఇతర ఖండాలకూ, దేశాలకు సహితం వ్యాపి కావాలి.

# మనది ఏ 'మతం'?

"ఇంటికి ఉండగా దోసెడు మజ్జిగనీళ్ళు పోయరు. కాని వల్లకాడులో పాడి యావులనే దానం చేయ" గల విశిష్ట సాంప్రదాయం మనది. విద్యార్థుల సర్టిఫికేట్లలో, ఉపాధికోసం ఉద్యోగాన్వేషణలో ఉన్నవారి దరఖాస్తు ఫారాలలో కులం చెప్పనిదే, గోత్రం విప్పనిదే, మతం రాయనిదే ఒప్పనిది మన ఆచారం. "కోటి విద్యలు కూటికొరకే" అన్నది నిజమే అయితే—ఈ కులగోత్రాలు, వర్ణ సూత్రాలు కూడా వాటిలో భాగమనే ఒప్పుకుతీరాలి. కాని ఆ మాట చెబితే కన్నెర్ర చేసేవాళ్ళు ఉన్నారు అటువంటి వారిలో మతోద్ధారకులు కొందరు. వీళ్ళకు ముందుచూపు లేదు. ఇతరులకు ఉంటే ఇష్టపడరు. గతం పాతరలోకి, మతం జాతరలోకి జనాలను నెట్టడం ద్వారా, తమ కులావతారాన్ని, పీఠాధి పత్యాన్ని కాపాడుకో జూస్తారు. ఈసారి "హైందవమతం" పేరిట ఇటీవల జరిగిన సదస్సులు ప్రపంచ హిందూ సమ్మేళనంగా అవతరించడమే ఇందుకు నిదర్శనం.

మన దేశంలో కులవ్యవస్థకు సూత్రం కట్టిన వాళ్ళే మానవుల అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని మరిన్ని దేవుళ్ళను సృష్టించారు. తిండి కోసం వెతుకులాట, వెంపరలాట సామాన్య మానవులను ఈ వైపుకు మరింతగా నెట్టింది చివరికి, "చీకటినుంచి వెలుగులోకి నడిపించ"మన్న ఉపనిషత్ వచనం కూడా అజ్ఞానంలో బాధలలో వున్న వాడి గోడును మాత్రమే స్ఫురింపచేస్తుంది.

మనం చరిత్ర పాఠాలలో విన్నవి, చదివినవి బౌద్ధ, క్రైస్తవ, ఇస్లాం మతాల గురించేగాని "హైందవమతం" గురించికాదు. రాధాకృష్ణ పండితుడు సహితం భారతీయుల ధర్మాల గురించి చెప్పారేగాని "హైందవమతం" గురించి ప్రస్తావించలేదు. మన దేశం బహుళ జాతుల, భిన్నభాషల, బహుళ సంస్కృ

తుల సమ్మేళనం, వైదిక సాహిత్యం ఆధారంగా వర్ధిల్లిన కులవ్యవస్థ, అటు వంటి వ్యవస్థకు, మౌఢ్యానికి చోటివ్వని బౌద్ధాన్ని కూడా మలినంచేసి మార్చి వేయగల్గింది. విగ్రహారాధనకు చోటు కల్పించని చోటకూడా విగ్రహాలు [illegible] భౌతికవాద ధోరణులు తలెత్తకుండా చేయడంలో మన కుల వ్యవస్థకు, పీఠాధిపతులకు [illegible] పాత్ర వుంది.

నిజానికి అన్ని ఆదిమ సంస్కృతులు పెక్కుమంది ప్రజల అభివృద్ధి దశలను సూచిస్తున్నాయి. వేర్పాటు ధోరణిలో కాకుండా సన్నిహితంగా నివసిస్తూ పరస్పర సంబంధాలు కల ప్రజల సామూహిక కృషి ఫలితం సంస్కృతి. ప్రాచీన గ్రీకులు, వేద కాలంనాటి ఇండియన్లు ఇలాంటి సంబంధాలు కలిగివున్నవాళ్ళే. సింధు నాగరికత అని చెప్పుకునే హరప్పా మొహంజదారో ప్రజలు ఒక్క జాతి వారు కారు. కనీసం నాలుగు జాతులకు - ప్రోటో ఆస్ట్రిలాయిడ్, మెడిటిరేనియన్, ఆల్పినాడ్, మంగోలాయిడ్ - చెందిన వారు. కదిలి వచ్చిన ఆర్యులూ కలగలిసిపోయారు. అందుకే ఇండియా, జాతుల సంకీర్ణ మహాభారతం తప్ప మరొకటి కాదు. కాబట్టి మనకు 'హైందవమతం' అంటూ ప్రత్యేకించి లేదు ఉన్నవి అన్ని జాతుల మధ్య సంబంధంవల్ల ఏర్పడిన ఆచార వ్యవహారాలు, కొన్ని ధర్మాలూను "హైందవ మతం" పునాదులు దేవుళ్ళ దయ్యాలలో కంటే కులవ్యవస్థలోనే గూడుకట్టుకుని ఉన్నాయి. ఈ పునాదులు తొలగనంతవరకు మన బుద్ధులూ వక్ర మార్గంలోనే నడుస్తూంటాయి.

# నేటి "సంక్రమణం" : ఒక సవరణ

ఎవరి నమ్మకాలు వారివి, ఎవరి విశ్వాసాలు వారివి. సహజీవనంతో యివన్నీ సమాన ధర్మాలు. పంటలనుబట్టి "పండుగ"లు పబ్బాలుఏర్పడినా, నక్షత్రరాశికి, మానవుని మంచి చెడులకు పీట ముడిపెట్టి ఖగోళశాస్త్ర విజ్ఞానాన్ని సహితం స్వార్థప్రయోజనాలకు వాడుకునేవాళ్లు ఎప్పుడూ వుంటారు. భూమి సూర్యునిచుట్టూ తిరుగుతుందని, గుండ్రంగా వుందని శతాబ్దాల క్రితం చెప్పిన గెలీలియోను గేలిచేసి, రచ్చకీడ్చి, "తిరగదు, బల్లపరుపుగానేవుందని" చెప్పమని బలవంతంచేస్తే, తాత్కాలికంగా ఒప్పుకున్నాడు. కాని కోర్టు అవరణలోకివచ్చి ప్రక్కనున్నవారి చెవులుకొరికి "భూమి సూర్యునిచుట్టూ తిరుగుతుంది, గుండ్రంగావుంది" అని ఊదాడు. శాస్త్రాన్ని కాదనలేము మసిపూసి మారేడు కాయగా మార్చలేము.

కాని స్వార్థం చోటుచేసుకుంటే మసి పూయగలం. దోచుకునేవాడి చేతులో చివరికి పండుగకూడా దండుగకాదు. "ఉత్తరాయణం పుణ్యకాలమని చెబితే "ఎవరికిబాబూ" అని ప్రశ్నించం? పుణ్యదినాలను పాపకార్యాలకు ప్రాతిపదికలుగా చేసుకుని జైత్రయాత్రలు కొట్టిన రాజులున్నారు. సంక్రాంతి - సంక్రమణం - మంచి నడవడిక, పేరు మాసిపోయి, రాజ్య విస్తరణ జరిపిన వారున్నారు. యజ్ఞయాగాలు చేసిన వారున్నారు. నరబలులు సాగించిన వారున్నారు. బహుశా డల్‌హౌసి "సంక్రమణ" సిద్ధాంతంకూడా సంక్రాంతి నాడే ప్రారంభమైనదేమో కైఫీయతులు చూడాలి! దోచుకునేవాడికి అన్నీ మంచి కాలాలే. కాని పీడితుడికి పండగకూడా పీడకలే. కట్ట బట్టలేక, నిలువ నీడలేక ఇటు చలిబాధకు, అటు 'పులి' బాధకు అతడు బలి కావలసిందే. మనకున్న 27 నక్షత్రాలూ, రాశులలోను ఒక్కటీ పేదవాడి 'రాత'ను మార్చిందిలేదు! రాశినిబట్టి మనిషి 'వాసి' మారుతుందనడం భ్రమ. అదే నిజమైతే చక్కని నడవడికగల (సంక్రమణం) సూర్యుని దృష్టిలో అందరి

'గీత'లు బాగుండవలసింది ! ఇది వాస్తవం కాకపోతే దేశంలో నూటికి 40 మందికిపైగా కటిక దారిద్రంలో మ్రగ్గవలసిన అవసరంలేదు.

ఆది మానవునిది అజ్ఞానం. ఆధునిక మానవుని విజ్ఞానం. అజ్ఞానంలో అక్షర వేదమైంది గ్రుడ్డి ఆరాధన. కాగా ఇది ప్రకృతిని లొంగదీసుకుంటున్న వారి పట్ల శిక్షావేదం కాకూడదు. మౌఢ్యాన్ని పెంచే సూక్తిముక్తావళి కాకూడదు. మత దృష్టికి మజావాణీ హక్కు కాకూడదు. వృత్తినిబట్టి, సేద్యాన్నిబట్టి కొన్ని పండుగలేర్పడితే, వాటికి దైవత్వం ఆరోపించి, పిచ్చిపందాలుకట్టి సంఘజీవనానికి చిచ్చు పెట్టుకున్నవాళ్ళు మనవాళ్ళు. రోమన్ తాలిం ఖానాలలో "కరణాయుధులు" మాదిరి మనం "చరణాయుధుల"ను పెంచాం. అవే కోడిపందాలు, పులిజూదాలు. జనం దృష్టిని మళ్ళించి, ఆస్తితగాదాలు తీర్చుకోడానికి ఆయుధాలు పట్టినవాళ్ళు కామందులు. చాళుక్య, కాకతీయుల నుంచి రాయల గరువాలవరకు సాగిన చరిత్ర వెనుక ఈ గాథలు కూడా వున్నాయి. బొబ్బిలినుంచి కారెంపూడివరకు నేలతల్లికి అమర్చినవి వట్టి రంగివల్లులుకావు. కోడిపందాల కామాటం ద్వారా ఆస్తిదాహం, అధికార దాహం రణరంగాలకు తోరణాలుకట్టింది. భూమీ, పంటసిరి ఒకరిది. కరవు కాటకాలు వేరొకరివంతు. సభాపతి పదవికి శూద్రుడు అనర్హుడయ్యాడు. దాన ధర్మాలు పుచ్చుకుని తృప్తిపడమన్నారు. అంటే యాచకవృత్తి అయాచితంకాబట్టి, రెండు బూరెలు, నాలుగు గారెలు పుచ్చుకోవడం, ఆరోగ్య దాయకమన్నారు ! అదీ, ఆ రోజువరకే. ఏరువాకను కొలిచినా, ఏకవీరను కొలిచినా- పైరూ, పేరూ కొలదిమందికే హక్కు భుక్తమయ్యాయి. కోడి పందాలు, గంగిరెద్దు త్రిప్పడం, దాసరి వేషాలు, దసరా వేషాలు తిరిపానికి లేనివాళ్ళకు దక్కిన తిప్పలు !

ఈ పరిసితిమారాలి, సంక్రాంతిలో మార్పురాదు. మన సంక్రమణంలో, సంస్కారంలో మార్పురావాలి. మనిషి తనేమిటో తెలుసుకోవాలి. జీవి తానికి కొత్త అర్థాన్ని చెప్పుకోవాలి. సమాజాన్ని మార్చుకోవాలి. ఇదే నేటికి మా సవరణ. ఈ ఉత్తరాయణం ఇందుకు తోడ్పడితే అదినిజంగా 'పుణ్య' కాలమే ! మిత్రాయణమే !!

# చిరునవ్వులో చిన్న రహస్యం

జర్మన్ మహాకవి గెటే కూడా జీవితాన్ని ఆనందంగా గడపాలని ఎప్పుడూ అనుకొంటూ ఉండేవాడట. మరి అనుభవంలో ఏ అవాంతరాలు వచ్చి పడ్డాయో ఆనందం తాత్త్వికార్థాన్ని కొంచం తారుమారుచేసి ఇలా చెప్పాడు.

"ఆనందమే జీవిత పరమార్థం కాదు
అందుకే తెలివిగా బ్రతుకు
జీవితం నీ కిచ్చిన అవకాశం ఒక్కటే !
సమున్నతంగా శిరస్సెత్తుకొని నిలబడు
లేదా కూలిపో, లేదా జయ పతాక నెత్తు
జయమో ! అపజయమో ! ఒకే ఒక్క దారి
విరామ మెరుగక పరిశ్రమించు
సమ్మెటగా మారు లేదా దాగలిగా మారు."

జీవితం ఒక కర్మాగారం, ఒక మహాసముద్ర మథనం. ఆటుపోట్లు అన్నిం టికీ తట్టుకొని నిలబడాలన్నదే దీని సారాంశం. ఒక రోజు కోలాహలం. మరొకరోజు హాలాహలం. ఈ ద్వైవిధీభావం ఉండబట్టే మానవ జీవితానికి ఇంత విలువేమో. భిన్నత్వంలో ఏకత్వం ప్రదర్శిస్తున్న భారతదేశంలో దాని వైశాల్యాన్నిబట్టీ, జనాభానుబట్టీ పెక్కు సమస్యలు ఉన్నాయి. వీటిని చిరునవ్వుతో ఎదుర్కొని ముందుకు నడవాలిగాని బాధల బరువుతో భయకంపితులై పోయి బ్రతకవద్దని ప్రధాని ఇందిర చెబుతున్నారు.

నిజానికి సంతోషం సగం బలం అన్నారు. అయితే సంతోషాని సుఖం. సుఖానికి మూలం కనీసపు జీవితావసరాలు తీరడం. ఈ అవ సరాలు తీరడం అన్నది ఆర్థిక స్తోమతపై ఆధారపడి ఉంటుంది. ఈసత్తా దేశసంపదనూ, పంపిణీ పద్ధతినీ ఆశ్రయించి ఉంటుంది. పండిట్ నెహ్రూ

ఒకప్పుడు అన్నారు : "కరెన్సీ మార్పులు ఋణదాతలకూ, ఋణగ్రస్థులకూ ఒకేవిధమైన ప్రయోజనాలను చేకూర్చజాలవు" అని. అందుకే జీవితంకోసం నేడింతగా తొక్కిసలాట !

జనాభాలో అత్యధిక సంఖ్యాకులు సామాన్య ప్రజలు. కష్టాలను కాచి వడపోసినవారు. అందుకే ఇబ్బందులున్నా తరచు నవ్వు మొగాలతోనే ఉంటారు. ఉన్నంతలోనే సుఖంగా ఉండడానికి ప్రయత్నిస్తారు. కొందరు కడుపులో కత్తెర పెట్టుకొని నోట పంచదార చూపిస్తారు. కాగా మరి కొందరు గుండెల్లో గునపాలు దించుతున్నా ఉలుకరు, పలుకరు. ఇంకొందరు తడిగుడ్డలతో గొంతులు కోస్తూనే చిరునవ్వులు చిలకరిస్తారు. ఇలా చిరునవ్వులన్నవి సంఘ జీవనంలో రకరకాలు. అయితే ఏ దుశ్చింతా ఎరుగని, పాపం, పుణ్యం, అశుభం, శుభం తెలియని పసిపాపల మొగాలలోని మందహాసాలే నిజమైన చంద్రహాసాలూ, ఆనందదాయకాలూ !

# వివాహాలు : ఉద్యోగాలు

"పిచ్చి కుదరనిదే పెళ్ళికాదు, పెళ్ళి కానిదే పిచ్చి కుదరదు" అని సామెత. అలాగే ఇప్పుడు ఉద్యోగాలు ఇస్తే వర్ణాంతర వివాహాలు లేకపోతే లేదు అన్న వాదన వినిపిస్తోంది. నిజానికి ఇలాంటి షరతులకు మూలం మన ప్రస్తుత సామాజిక వ్యవస్తే. జీవితపు విలువలు వ్యాపార సరళిలో నిర్ణయమవు తున్నాయి. అలాగే సంస్కరణలు కూడా ఆ పరిధికే పరిమితమయి పోతు న్నాయి. ఆర్థిక పునాదులతో నిమిత్తం లేని ఏ సంస్కరణ అయినా కొలది మంది వ్యక్తుల విషయంలో జయప్రదం కావచ్చు, కాని అది ఒక మహోద్య మంగా వర్ధిల్ల జాలదు. కేవలం సంస్కరణకూ, విప్లవాత్మక సంస్కరణకూ మధ్య ఉన్న వ్యత్యాసం అంతా ఇక్కడే ఉంది. ఇప్పటికి మనం బాల్య వివాహాలు, శారదా చట్టం, వర్ణాంతర, మతాంతర వివాహాలను గురించీ, వాటి మంచి చెడులను గురించీ తర్కించుకొంటున్నామంటే మహనీయులైన సంఘ సంస్కర్తల కృషి పూర్తిగా ఫలించలేదన్న మాటేకదా ! వివాహ వ్యవస్థ కూడా ఇతర సాంఘిక సమస్యలతో పాటు ఆర్థిక వ్యవస్థతో పీట ముడి వేసుకొని ఉంది.

"కాసు కలవాడేను మనిషోయ్" అన్న సత్యం అను నిత్యమూ ప్రత్యక్షమవు తున్న సమాజంలో విద్యా, వివాహ విలువలు నిర్ణయమవుతున్నాయి. తల్లి దండ్రుల ఆలోచనలనూ, బిడ్డల మనో భావాలనూ ఆ ధోరణిలోనే మలు స్తున్న వ్యవస్థ మనది. కలవాళ్ళు కట్నాలు, కానుకల కోసమే ఎగబడు తున్నారు. లేనివాళ్ళు మరొక కారణంగా వీటిని స్వీకరించ గోరుతున్నారు. ఒకరిది ఆబ. వేరొకరిది ఆర్తి. సంస్కరణ భావాల వ్యాప్తికి నేటి చదు వులు సానుకూలంగా లేవు. లాభాపేక్షను పెంచే పద్ధతులు మన పాఠ్య గ్రంథాలు నూరిపోస్తున్నాయి. ఇన్ని బెడదల మధ్య మన సామాజిక, ఆర్థిక వ్యవస్థా, దానిపై ఆధారపడిన వివాహ వ్యవస్థా నలిగిపోతున్నాయి.

చదువుసంధ్యలూ, మంచి బుద్ధులూకాదు కట్నాలూ, కానుకలూ ప్రమాణాలవు తున్నాయి. పశువుల సంతలోని బేరసారాల ధోరణి మానవ సమాజంలో కూడా ప్రవేశించి, చీకాకు పెడుతోంది. విద్యావంతుడైన యువకుడు విద్యా వతితో పాటు కట్నంకూడా ఆశిస్తున్నాడు, లేదా తోబుట్టువుకు కట్నం ఇవ్వా లన్న మిషతో తన వివాహానికి కట్నాన్ని ముడిపెడుతున్నాడు. లేదా చదు వులకైన ఖర్చును రాబట్టుకొనడం కోసమే ఈ పని అంటాడు. పలుకుబడి కలవారు ఉద్యోగాల ఎరచూపి కట్నాలు ఇచ్చి పిల్లల్ని తెచ్చుకొంటున్నారు. ఇదంతా ఏమిటి? ఆర్థిక వ్యవస్థ చుట్టూ ఏర్పడిన విషమ చక్రం.

కేవలం వర్ణాంతర వివాహాలు చేసుకున్నవారికి ఉద్యోగాలు రిజర్వు చేసినంత మాత్రాన ఈ చక్రబంధాన్ని ఛేదించలేము. ఆర్థిక దుస్థితిలో ఉండికూడా అప్పోసప్పోచేసి చదువుకొన్నా, మమత లుండికూడా మనువు లభించక కాలం గడుపుతున్నవారు వేలసంఖ్యలో ఉన్నారు. ఆర్థిక సమస్యను పరిష్కరించ లేకపోతేనే పక్కదారులు వెదుక్కోవలసివస్తుంది. రిజర్వేషన్లవల్ల కుల, మత వ్యవస్థలు అంతరించకపోగా అవి స్థిరపడిపోయే ప్రమాదం ఉంది. ఇది వివాహ వ్యవస్థకుకూడా వర్తిస్తుంది. అందువల్ల మనం ఆశించవలసిందీ, కోరవలసిందీ- కృత్రిమ సంబంధాలు కాదు. ప్రేమనూ, అనురాగాన్నీ పెంచగల సమ సమాజ వ్యవస్థనే. ఇందుకు ఆర్థిక వ్యవస్థలో మౌలికమైన మార్పు అవసరం.

# శాస్త్రీయ దృష్టి

సుప్రసిద్ధ పాశ్చాత్య ఖగోళశాస్త్రవేత్త గెలీలియో "భూమి గుండ్రంగా ఉంది"న్నాడని చెప్పి ఆ వాదంవల్ల తమ మత ప్రచారానికి ప్రజలలో విలువ తగ్గిపోతుందని కంగారుపడిన మతాధిపతులు కొందరు ఆయనను కొరతవేయ జూశారు; భావాలు మార్చుకొనకపోతే భరతం పడతాం, ప్రాణాలు తీస్తాం అని బెదరించి న్యాయస్థానంముందు బోనెక్కించారు. అక్కడ మాత్రం "భూమి గుండ్రంగా లేద"ని చెప్పినా, న్యాయస్థానం బయటకు వచ్చిన తరవాత మాత్రం తన పక్కనేఉన్న సహచరుల చెవుల్లో "అవును భూమి గుండ్రంగానే ఉంది. సూర్యునిచుట్టూ తిరుగుతూనే ఉంది" అని నెమ్మదిగా గొణిగాడట. మౌఢ్యమూ దాగదు, శాస్త్రమూ దాగదు. అయితే మూఢ విశ్వాసాలు మూటగట్టుకొని ఊరేగేవారివల్ల ప్రజలకూ, సంఘ పురోభివృద్ధికీ ఎంతటి ఆటంకమో, వినాశమో ఈ ఉదాహరణ తెలుపుతుంది. అందు వల్లనే ప్రధాని ఇందిర ప్రసిద్ధ భారతీయ ఖగోళశాస్త్రవేత్తా, హేతువాదీ, శతాబ్దాల క్రితం తన కాలంనాటి పాతరోతలను ఈసడించుకొన్న ఆర్యభట 1500 వ జన్మదినోత్సవం సందర్భంగా దేశప్రజలకు విశిష్టమైన ఉద్బోధ చేశారు. ఆమె ఉద్దేశంలో "శాస్త్రీయదృష్టిని అలవరచడం పౌరబాధ్యతలలో ఒకటి. ఇదేదో ఉబుసుపోని మాట కాదు. వర్తమాన ప్రపంచంలో జీవించే ప్రతిఒక్కరికీ శాస్త్రీయ దృక్పథం ప్రాథమికం. మన జీవితాలను అంధకారంలోకి నెట్టిన మౌఢ్యాన్ని తుడిచిపెట్టడానికి మనకు శాస్త్రీయమైన ఆలోచనా ధోరణి అవసరం."

"జ్ఞానమే శక్తి" అన్నవాడు బేకన్. "జ్ఞానం ప్రధానం" అన్నవాడు శంకరుడు. ఈ జ్ఞానాన్ని కోల్పోయి ప్రజల అమాయకత్వం పెట్టుబడిగా అంధ విశ్వాసాలనేగాదు, అంతస్తులు పెంచుకోజూసేవాళ్ళు అజ్ఞానులు కారు, నిజమైన అరాచకవాదులని కూడా మనకు తెలుసు. నిజానికి సంఘ

శ్రేయస్సును కూడా కాదని మార్పులను అడ్డుకోజూస్తున్నవాడు ఈ మానవుడే గాని ప్రకృతికాదు. కనీసం ప్రకృతి తన రుతు ధర్మాన్ని తప్పదు. పైగా సమ నిష్పత్తిలో అది పరివర్తనా క్రమాన్ని ప్రశాంతంగా నెరవేర్చుకొంటుంది. ఎటుతిరిగీ పరివర్తనను ప్రతిఘటించ జూస్తున్నది మానవుడే. ఇక్కడగానీ, మరెక్కడైనాగానీ విజ్ఞానశాస్త్ర పురోభివృద్ధిని కొన్నాళ్ళు మతాధిపతులూ (చర్చిలూ, దేవాలయాలు) ఆటంకపరచజూస్తే మరికొన్నాళ్ళు పీఠూ, ప్రభువర్గాలూ కలిసి ప్రతిఘటించజూశారు. అంతవరకు పేరుకొన్న అంధ విశ్వాసాలను, ఛాందసాలనూ ఒక్కొక్క శాస్త్రపరిశోధనవచ్చి ముక్కలు ముక్కలు చేస్తున్నప్పుడు ఈ ప్రతిఘటన మరీ తీవ్రరూపం దాల్చుతుంది. పదహారవ శతాబ్దంలో కోపర్నికస్ పరిశోధనల అనంతరమే క్రైస్తవ మత ప్రచారానికి నెమ్మదిగా తూట్లు పడ్డాయి. అయితే ఈ పరివర్తన జాన్‌డోనే హేతువాదదృష్టి అనంతరంగాని వేగాన్ని పుంజుకోలేదు; ఈ భూమండలం "మహావిశ్వంలో ఒక శివారు" అన్నాడు. "నూతన తత్వచింతన అన్నింటినీ నిలవేసి ప్రశ్నిస్తోంది" అన్నాడు. చివరికి దేవుణ్ణి విశ్వసించిన ఫ్రాన్సిస్ బేకన్‌కూడా తన కెదురైన బిషప్ లందరికీ క్రమంగా గౌరవ సూచకంగానే "టాటా" చెబుతూ "విమోచన పొందిన ఆధునిక మానవుని మతం సైన్స్‌తప్ప మరొకటి" లేదు పొమ్మన్నాడు. ఇక "దేవుడు అస్తమిస్తున్నా"డని లౌక్యంగా ప్రకటించాడు. ఇండియాలో చార్వాకులూ, సాంఖ్యులూ ఆ పని చేశారు. అయితే హేతువాదులు పెట్టిన భిక్షకు వారి అనంతరం ఛాందసవర్గాలు శిక్ష విధించి తిరిగి మౌఢ్యానికి పట్టంకట్టాయి. ఈజిప్టులో ఇఖనాటెన్‌కూ, ఇండియాలో బుద్ధునికీ జరిగిన "శాస్తి" అదే! అలాగే మన రాష్ట్రంలోకూడా కింది స్థాయిలో మంత్రులూ, కొందరు శాస్త్రవేత్తలూ కప్పలకు పెళ్ళిళ్ళు చేయిస్తున్నారు, వానలకోసం అభిషేకాలు చేయిస్తున్నారు, బాబాలను ఆశ్రయిస్తున్నారు. బుద్ధికుశలతను చంపుతున్నారు.

# ఉగాండాలో "తాతాచార్యులు"

ప్రపంచంలో "ఏడు వింతలు" అని పరమాద్భుతమైన ఏడు కట్టడాల గురించిన కథ విన్నాం కాని ప్రపంచంలో ఏడుగురు వింతమనుషుల గురించి మనం యింకా వినలేదు. ఒకవేళ అటువంటి "మహానుభావులు" ఎవరైనా వుండే పక్షంలో మొదటి వ్యక్తిగా ఉగాండా అధ్యక్షుడు అమీన్‌నే పేర్కొనవలసి వస్తుంది. ఈయన మన "తాతాచార్యులు" లాంటివాడు. "తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా, వీపు తప్పలేదు" అంటారు. అలాగే నెలలో ఉగాండా రాజధాని కంపాలా పౌరులందరూ "అమీన్ ముద్రాంకితులు" కానున్నారు. 'సిసలైన' జాతీయవాదానికి, కాదు ఆత్మీయవాదానికి చిహ్నంగా ఈ పని జరగబోతోంది. ఆఫ్రికా సమైక్యతా సంఘం శిఖరాగ్ర చర్చల సందర్భంగా అమీన్ బొమ్మ వున్న ప్రత్యేక దుస్తులు ధరించితీరాలని ఒక ఉత్తరువు జారీ అయి కూర్చుంది.

ఇటీవల అమీన్ చర్యలు అంతర్జాతీయ వింతలు-విశేషాలుగా వాసికెక్కాయి. ఒకసారి క్యాబినెట్ మంత్రిణి విదేశయాత్రలో ఎవరి ప్రేమకో పాత్రురాలయ్యిందని అదొక నేరంగా పరిగణించి, ఆమె ఉద్యోగానికి ఉద్వాసన చెప్పాడు అమీన్. నిన్న గాక మొన్న, ఒక బ్రిటిష్ లెక్చరర్‌పై విధించిన ఉరిశిక్షను రద్దు చేయడానికి సరాసరి బ్రిటిష్ రాణి తనను వేడుకుంటేనే గాని శిక్ష రద్దు చేయబోనని భీష్మించాడు. ఇండియన్లను, ఇతర విదేశీయులను వెళ్ళగొట్టేవరకు నిద్రపోనివాడు అమీన్. ఆయన ఆత్మాభిమానం అంతటిది; అభిజాత్యం మరంతటిదీను. "శంఖులో పోస్తేనేగాని తీర్థం" కాదన్నట్టు, తన చిత్రం ముద్రించిన దుస్తులు వేసుకుంటేనే గాని ఆఫ్రికన్లు కారని శాసించడం అంతంతమాత్రపు జీవులకు సాధ్యం కాని పని.

నిజానికి ఆఫ్రికన్ నాగరికత వేరు, అమీన్ సంస్కృతి వేరు. ప్రాచీన మానవుని తొలి ఉనికిపట్టులలో విశిష్టమైన స్థానం ఆఫ్రికా ఖండానికి వుంది.

"నేను నిష్కళంకమైన ఆఫ్రికావాసిని, శంకించకండి" అని ఘనంగా చాటుకున్న స్వాహిలీ సంస్కృతికి అది నిలయం. నైలునదీ నాగరికతకు శిరస్సు ఉగాండాలో విక్టోరియా సరస్సు-కాని స్వేచ్ఛాజీవులను శాసించే శంఖ చక్రాలకు, శంకించే 'ముద్ర' లకు ఆఫ్రికన్ నాగరికత విరుద్ధం. నిర్గుణ, నిరాకార ప్రతిమలు వాళ్ళకీ వున్నాయి; మహిమలున్నాయి, మందిరాలున్నాయి, రాజప్రాసాదాలు వున్నాయి. కాని ఎవరూ ఏనాడూ ఏ దేవుడూ శాసించని బొమ్మల్ని, బొరుసుల్ని తన పేరిట మంది ఛాతీలపైన మందంగా పటం కట్టిస్తున్నాడు. ఇదొక రకమైన ఆధునిక "స్వస్తిక్' ముద్ర కాదు కదా ?

మెక్సికోలో బయలుదేరిన "మాషిమో" **(Machismo)** వ్యాధి ఉగాండాకు వ్యాపించివుంటుందేమో ! ఈ జబ్బుకి ఒక అర్థం-జబ్బబలం! రెండో అర్థం నిరాశ, నిస్పృహల వల్ల తనపై తనకే విశ్వాసం లేనందున ఇతరులను కడగండ్ల పాలుచేయటం. అన్యాయం చూసి ఎదిరించలేనివాడు ఇంట్లో ఆలుబిడ్డల్ని రాసిరంపాన పెడ్తుంటాడు. అలాంటిదే ఇదీను; వైద్యశాస్త్రానికి కూడా లొంగని ఈ రుగ్మతను పోగొట్టడం ఎవడి తరమూ కాదు. వెనకటికి చర్చిల్ కాబోలు అన్నాడు : "ఉగాండా కథల కాణాచి, విచిత్ర భూమి" అని. ఈ ఉగాండా విచిత్ర వీర్యుని మనోవికారాలు గమనిస్తున్న అక్కడివారు బహూశా "ఈ జీవితంపు నౌకన్ దరిచేర్చ్బతరమే, అమీన్ పాదములాశ్రయింపకన్" అనుకుంటూ వుండి వుండాలి మరి !

# పులుల సమావేశం: మేకల ప్రయోజనాలు

మేకల ప్రయోజనాలను పులులు తీర్చుతాయా? తీర్చజాలవని బడుగు జీవుల అనుభవం. అలాగే రంబొలే (ఫ్రాన్స్)లో సమావేశమైన ఆరు అమిత సంపన్న దేశాలైన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, ఇటలీ, జపాన్‌లు పులులు అయితే ఇతర వర్ధమాన దేశాలన్నీ మేకలు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొంటున్న సమస్యలకు ప్రపంచ దేశాలన్నిటితో సమావేశం జరిగితే ప్రయోజనం ఉంటుంది. కాని ప్రపంచ ఆర్థిక సమస్యల పేరుతో ఆరు సంపన్న రాజ్యాలు జరిపే చర్చలు, ఆ చర్చల వలన ప్రయోజనాలు ఇతరుల కన్నా, ఆ ఆరు దేశాలకే పరిమితం. మూడు రోజుల సమావేశంలో, పదమూడు గంటల చర్చలలో, సంపన్న దేశాల రంబొలే ఆర్థిక శిఖరాగ్ర సమావేశంవల్ల ఫలితం కూడా ఇదే.

పెట్రోలు ధరల పెరుగుదలకు ముందే సంపన్న దేశాలని పేరు గాంచిన ఈ ఆరు రాజ్యాలు తరతమ భేదాలతో తీవ్రమైన ద్రవ్యోల్బణ పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి, నిత్యావసర సరకుల ధరలు పెరిగిపోయాయి. నిరుద్యోగం పెరిగి పోతోంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ముందు పొడసూపిన ఆర్థిక సంక్షోభ లక్షణాలతో అవి తీసుకుంటున్నాయి. అంతేకాదు సంపన్న దేశాల కరెన్సీల విలువలు కూడా స్థిరత్వాన్ని కోల్పోయాయి, ఎగుమతి-దిగుమతి వాణిజ్యంలో అమెరికాతో సహా పెక్కు యూరప్ రాజ్యాలు విపరీత నష్టాలకు గురైనాయి. వాటికి నాయకత్వం అమెరికన్ డాలర్ ది అయినందున' డాలర్ ఎదుర్కొంటున్న అస్థిర పరిస్థితుల తీవ్ర ప్రభావం ఇతరదేశాల కరెన్సీలపై పడింది. ఇతర దేశాల కరెన్సీ విలువలను మరింత దెబ్బతీసేందుకు, తన కరెన్సీ (డాలర్) విలువను మరింత పడిపోకుండా జాగ్రత్త వహించేందుకుగాను అంతర్జాతీయ ద్రవ్య వ్యవస్థపై తనకు గల పెత్తనాన్ని వినియోగించుకున్న అమెరికా, ద్రవ్య వ్యవస్థతో బంగారానికి గల సంబంధాలను త్రెంచివేసింది. మార్కెట్ రేట్లకు అనుగుణంగా డాలర్ రేటును ఇష్టానుసారం సర్దుబాటు చేసుకోవడానికి (ఫ్లోటింగ్) చర్యలు తీసుకుంది. ఇది

గమనించిన ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీలు కరెన్సీల మధ్య నిశ్చలమైన రేటును నిర్ణయించాలని పట్టుబట్టుతున్నాయి. యూరప్‌లోని సంపన్న దేశాల మధ్య తలెత్తిన ఈ స్పర్ధలు, వైరుధ్యాలు పరిష్కారం కోసమే రంబొలే సమావేశం ఏర్పాటయింది.

మరొకమాటలో చెప్పాలంటే యూరప్ సంపన్న దేశాలు అమెరికా సారథ్యంలో ఇకముందుకూడా చేయబోయే పని- తమ ఆర్థిక వ్యవస్థలు ఎదుర్కొంటున్న సంక్షోభ ఫలితాలను వర్ధమాన దేశాలపైకి నెట్టబోవడమే. అందుకే ప్రపంచదేశాలతో కలిసికాకుండా గుడిపూడి జంగాల గుసగుసలు రంబొలే సమావేశంలో ప్రాధాన్యం వహించాయి. అందువల్లనే పరస్పరం చుక్కెదురుగా వుంటున్న అమెరికా, ఫ్రాన్స్‌ల మధ్య ఆర్థిక పరమైన సయోధ్య కుదిరింది. పౌండ్ విలువ కోల్పోయి పెన్నీ ఖరీదుకు దిగిన బ్రిటిష్ విల్సన్ "ఆర్థిక పునరుజ్జీవం" గురించి సమావేశానంతరం ఆశాభావం వెలిబుచ్చారు. అమెరికన్ ఫోర్డు "మన నిరుద్యోగులందరికి ఇక ఉద్యోగాలు లభిస్తాయి, ద్రవ్యోల్బణం తగ్గిపోతుంది" అన్నాడు.

కాని వీరి యీ ఆనందం అంతా వర్ధమానదేశాల దారిద్ర్య పరిస్థితిని వినియోగించుకుని, మరిన్ని కఠినమైన షరతులకు వాటిని గురిచేయడంవల్లనే సాధ్యపడుతుంది. తమ వలసలుగా వున్నప్పుడూ ఈ సంపన్న దేశాలు వర్ధమాన దేశాలను పీడించాయి. స్వతంత్ర దేశాలుగా అవతరించిన తరువాత దోచుకుంటున్నాయి. అసమ ఆర్థిక సంబంధాలు, రుణాలమంజూరులో కఠిన షరతులు ప్రపంచ మార్కెట్‌లో ధరవరలను తమకు అనుకూలంగా నిర్ణయించడం ద్వారా సంపన్న దేశాలు వర్ధమానదేశాల ఆర్థిక వ్యవస్థలను తారుమారు చేస్తున్నాయి. ఇందుకు ఉదాహరణ ఇండియా పరిస్థితి. సంపన్న దేశాలు "సహాయం" పేరుతో అందించేవి ప్రధానంగా ఋణాలేగాని గ్రాంట్లు కావు. అంతేగాదు తమ సరకులను కొనుగోలు చేస్తేనే ఋణమిస్తామని సంపన్న దేశాలు విషమ షరతులు విధించుతున్నాయి. ఈ వాస్తవాన్ని శ్రీ వి. బి. రాజు ఇటీవల కామన్‌వెల్త్ పార్లమెంటేరియన్ల సభలో కూడా స్పష్టం చేశారు. ఈ చర్యల ఫలితం 81 వర్ధమాన దేశాల ఋణభారం ఎనిమిది కోట్ల 80 లక్షల బిలియన్ డాలర్లకు పెరిగింది. ఇండియా ఎగుమతుల ద్వారా పొందుతున్న ఆదాయంలో 25 శాతం ఏటా ఋణాలు చెల్లగట్టుకోడానికే మరలుతోంది. ఇక ఇండియా "పొందే విదేశీ సహాయం"తో 70 శాతం ఋణాలపై వడ్డీలు చెల్లించడానికే సరిపోతోంది. అంటే వెయ్యి కోట్ల ఋణంలో తిరిగి 700 కోట్లు వడ్డీల తీర్మానం క్రింద జమ పడుతోంది.

# సహారాలో సాహస యాత్ర

చింత చచ్చినా, పులుపు చావలేదు. మహాసామ్రాజ్యాలు అంతరించుతున్నా నేటికీ వాటి ఏలికల మత్సరం తొలగలేదు. పలు ఖండాలలో పెక్కు - దేశాలు స్వాతంత్ర్యం పొందినా, మరికొన్ని ప్రాంతాలు స్వేచ్ఛా నాగరికత లకు చాలా దూరంగానే ఉన్నాయి. ఈ మహర్నాటకంలో దుష్ట పాత్రలు నిర్వహిస్తున్న పాత సామ్రాజ్యాలు పోర్చుగల్, స్పెయిన్‌లు. ఇంట్లో వీటికి ఈగలమోత తొలగకపోయినా బయట పల్లకీమోత ఇంకా వినిపించజూస్తు న్నాయి. కాళ్ళక్రింద భూమి కదలి కంపనలు పుట్టిస్తున్నా పోర్చుగల్ పాల కుడు టిమార్‌నుంచి, అంగోలానుంచి వైదొలగకుండా, రక్తపాతం కలిగిస్తూనే వున్నాడు.

అలాగే జనరల్ ఫ్రాంకో తాను మరణశయ్యపై ఉండికూడా, స్పానిష్ వలస అయిన పశ్చిమ సహారాకు ఐచ్ఛికంగా స్వాతంత్ర్యం ప్రకటించడానికి ఇష్టపడ్డం లేదు. తొంభై ఏళ్ళనాటి వలస పాలనను అంతమొందించేందుకు ఇప్పుడు మొరాకో ప్రజలు సహారా వైపుగా శాంతి సాధనకోసం అనంత యాత్ర ప్రారంభించారు.

ఇది ఎడారిలో నవ్య జీవనంకోసం తలపెట్టిన మహాయాత్ర. సహారాలో సరికొత్త పూలు పూయించే సాహసయాత్ర.

అట్లాంటిక్ కోస్తాలో వాయవ్య ఆఫ్రికాలో ఉన్న "స్పానిష్ సహారా" (అదే పశ్చిమ సహారా), వలస పాలకులను మినహాయిస్తే మూడు ఆఫ్రికన్ దేశాల మధ్య వివాదంగా తయారయింది. ఉత్తరాన మొరాకో, తూర్పున మారి టేనియా, ఈశాన్యదిశను ఆల్జీరియా ఈ సహారాపై ఆధిపత్యంకోసం పెనుగు లాడుతున్నాయి. ఈ పెనుగులాటలో వలస శక్తి అయిన స్పెయిన్‌పైన ఈ మూడు దేశాలు ఐక్య సంఘటనగా పోరాటం సాగించేకన్నా, మూడూ

మూడు మార్గాలు అనుసరిస్తున్నాయి. ఆంతరంగిక కల్లోలంతో తీసుకుం టున్న స్పెయిన్ చేతులు పటిష్ఠం కావడానికి అరబ్బుల అనైక్యత ప్రధాన కారణం అవుతోంది. పశ్చిమ సహారాకు స్వాతంత్ర్య ప్రదానం చేయాలని నిర్ణయించికూడా స్పెయిన్ ఆ నిర్ణయాల్ని అమలు జరపకుండా వాయిదా వేయడానికి సైన్య సమీకరణ చేస్తోంది. పశ్చిమ సహారాలోని 60 వేల మంది జనాభాకు స్వపరిపాలన హక్కును నిరాకరించ జూస్తోంది.

మొరాకో రాజు మూడు లక్షల 50 వేల మందితో సహారాలో ప్రవేశించడానికి తలపెట్టిన యాత్రసాఫల్యం, ఆల్జీరియా, మారిటేనియాల సంపూర్ణసహకారంపై మాత్రమే ఆధారపడి ఉంటుంది. లేకపోతే స్పెయిన్ ఆ యాత్రికులను రక్తపాతంలో ముంచెత్తడానికికూడా వెనుదీయదు. "ఇది దండయాత్ర కాదు, మా పూర్వీకుల జన్మస్థలానికి పునరావాస యాత్ర" అని మొరాకో ప్రకటించినా స్పెయిన్ వినిపించుకోలేదు.

అయినా నివాసయోగ్యంకాని ఎడారికోసం ఈ కొట్లాట కొందరికి విచిత్రంగా కనిపించవచ్చు. కాని ప్రపంచంలో అత్యంత పెద్ద ఎడారి అయిన సహారా ఒకనాడు నాగరికతకు పుట్టిల్లు. సువిశాల ప్రాంతాలు, సారవంత సీమలు కాలక్రమంలో అగ్నిపర్వతాలు బ్రద్దలై మాణిక్య భూములను మరు భూములు చేశాయని శాస్త్రవేత్తలు నిశ్చయించారు. అపారమైన ఫాస్ఫేటు ఖనిజాలు లభిస్తాయని తేల్చారు. నీగ్రోయిడ్ తెగలు, బర్బరులు, అరబ్బులకేగాక, వేలాది యూరోపియన్లకుగూడా అది నివాస స్థలమైంది. భూగర్భ జల నిధులు ఉన్నందున, తిరిగి సహారా భూములను సేద్యయోగ్యం చేయవచ్చునని భావిస్తున్నారు. కనుచూపుమేరలో ఇసుక తిన్నెలు, ఇసుక సముద్రాలు తప్ప కళ్యాణ సీమలు కనిపించని సహారాను మానవునికి మరింత వాస యోగ్యం చేసుకోడానికి ప్రయత్నం జరుగుతోంది. ఒకనాడు కేవలం సార్థవాహులకే(ఎడారి వర్తకులు) పరిమితమైన భూములు, సామాన్యుని జీవనానికి స్వాగతం పలుకవలసిన రోజులివి. ఈ తరుణంలో, వలస దోపిడీకి శతాబ్దాలుగా గురయిన అరబ్బులు, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికికూడా చాలా దూరంగా ఉన్న ఈ సమయంలో సొంత భూములలో పాదం మోపడానికే పెద్ద త్యాగాలు చేయవలసి వస్తోంది.

అరబ్బుల శాంతి యాత్రను భద్రతామండలి నిరోధించడం కన్నా పశ్చిమ సహారాను స్పెయిన్ విషకౌగిలినుంచి విముక్తి చేసి, నిజమైన శాంతిని సాధించడం శ్రేయస్కరం.

# విశ్వాసాలలో వైవిధ్యం, వైరుధ్యం

మనది సెక్యులర్ విధానం. కొందరు దీనిని మతాతీత లౌకిక వ్యవస్థ అంటే, మరికొందరు సర్వ మత సమ్మేళనమే సెక్యులరిజం అన్నారు. అందువల్ల విశ్వాసాలు రబ్బరుగా సాగగల ఒక విచిత్ర పరిస్థితి మనది. నిరక్షరాస్యతలో పెక్కు అంధ విశ్వాసాల మధ్య సతమతమవుతున్న మన దేశ ప్రజలకు ముందుచూపు ప్రసాదించగల మేధావులు, వెనుకచూపు కల్పించడం ప్రమాదం. ఇక శాస్త్రవేత్తలే ఈ పనికి దిగితే అది మరింత ప్రమాదభరితం. ఎందువల్ల? అంతటి "మేధావి కూడా ఈ మాట చెప్పాడు" అని సామాన్యులు మరింత మోసానికి గురికాగల అవకాశంవుంది. ఇటీవల బెంగుళూరులో జరిగిన ఒక గోష్ఠిలో భాభా అణుశక్తి కమిషన్‌కి చెందిన డాక్టర్ రామన్న హస్త సాముద్రికంలో తన విశ్వాసాన్ని ప్రకటించారు. అది పత్రికలలోకి చొచ్చుకు వచ్చింది. ఖగోళ రహస్యాలను ఛేదించుతున్న మానవుడు మనోవికాసం పొందకపోతే శాస్త్రవేత్త అయినా చేతి వాసిమీదనే ప్రగతి లెక్కలు కట్టుకుంటాడని రుజువైంది. లోగడ ఒకసారి సర్ సి వి. రామన్ తిరుపతి దేవుని సందర్శనకోసం బెంగుళూరు శాస్త్రవేత్తల సభనే ఒకరోజు వాయిదా వేయడం జరిగింది !

ఈ విశ్వాసాలు విచిత్రమైనవి. వీటిలో ఎంతటి వైవిధ్యం వుందో మరంతటి వైరుధ్యం వుంది. మానవజాతి అంతా ఒకటే. కాని ఖండానికి, దేశానికి, ఒకే దేశంలో వివిధ ప్రాంతాలకు, ఒకే ప్రాంతంలో నాలుగు మూలలా నాలుగు రకాల విశ్వాసాలు. మన తెలుగు వాళ్ళలో ఎంతటి మూఢ విశ్వాసాలున్నాయో, అంతటి లౌక్యమూ, వ్యవహార జ్ఞానమూ, భౌతికవాద దృష్టీ వున్నాయి. భారత, రామాయణాలను పూజించే వీరు వాటినే "భారతం బొంకు, రామాయణం రంకు"గా వర్ణించారు. అలాగే "ప్రాణం పోకడ, వాన రాకడ" తెలియదనే అన్నారుగాని, అదేదో జన్మకర్మ అనలేదు.

యాక్సిడెంట్‌గానే భావించారు. జీవితంలో కొన్ని బాధలు, ఆశాభంగాలు, అనుకున్న పనులు కాకపోవడం, ఆశించినది ఫలించకపోవడం— వీటికి కార్య కారణ సంబంధం వుందని హేతువాద దృష్టితో తెలుసుకొనలేకనే, నిరాశా వాదానికి చోటివ్వడం జరుగుతుంది.

ఈ విశ్వాసాలు ఒక్కతీరుగా లేవు. మనకు నల్లపిల్లి కనపడితే ఏమో అను కుంటాం. ఈజిప్షియన్లకు అదే 'శుభం' అట ! పొడుగాటి వేళ్ళున్నవాడు డబ్బు ఖర్చు పెడతాడని స్కాట్లాండ్‌వారి నమ్మకం. చేతికి అదనంగా ఒక పిచ్చివేలు పుడితే జీవితంలో "అదృష్టం" అన్నారు. కాని అలాంటి వేలు వున్న బీదవాళ్ళు అలాగే వున్నారు. పిల్లవాడికి బ్రతికివున్నవాడి పేరు పెడితే ఇద్దరిలో ఎవరో ఒకరు చస్తారని చెబుతారు. కాని చనిపోయిన తాత పేరు పెట్టినా మూడేళ్ళవాడికి కూడా నూరేళ్ళు నిండిన ఉదాహరణలున్నాయి. "పదమూడవ నంబరు" ప్రమాదమన్న పాశ్చాత్యుల విశ్వాసం ఖండాంత రాలు దాటి ఇండియాలోకూడా చెలామణిలోకి వచ్చింది. కాని తేదీలను తొలగించలేముకదా! మళ్ళీ మూడు సంఖ్య ఆరాధ్యం: "ముచ్చటగామూడు" కీడు కాదుట !

మనం నలుగురిలో ఉమ్మిస్తే సభ్యత విరుద్ధంగా భావిస్తాం. రోమన్లు శుభంగా భావిస్తారు. మూడు సిగరెట్లను ఒక్క పుల్లతో వెలిగించరాదని స్వీడిష్ వారంటారు. కాని అసలు రహస్యం ఈ ప్రచారం చేసినవాడు అక్కడి అగ్గిపెట్టెలరాజు. గల్లాపెట్టి నింపుకొనడానికి గొప్ప చిట్కా. చివరికి భావా లలోనేగాక, పడకలో కూడా 'వామపక్షా'న్ని నిరసించే వాళ్ళున్నారు! ఇలా ఎన్నో, ఎన్నెన్నో వైవిధ్యాలు, వైరుధ్యాలు. "బుద్ధి జాడ్యజనితోన్మాదుల్" ఎవరోకారు, ఈ మానవులే ! !

# చైతన్య మారుతం

పైరు గాలి పంటకూ ఒంటికీ మంచిది. అలాగే చైతన్య పవనాలు దేశానికీ, జాతికీ శ్రేష్ఠమైనవి. చైతన్యం ఉన్నచోట "గాలి యంత్రాలు" (విండ్ మిల్స్) అవసరం లేదు. పరిణామం సృష్టిరహస్యం. ప్రాణికోటికి అవసరం. పాతనీరు వదలించుకోకపోతే నది ఎంత పవిత్రమైనదైనా పాచి పడుతుంది. కొత్త నీరు ఎక్కాలి. సంఘ జీవనంలో కూడా ఈ పరిణామం అనివార్యం. దానినే మార్పు అంటాం, లేదా పరివర్తన అంటాం. రాజకీయ, సాంఘిక, ఆర్థిక రంగాలలో ఈ మార్పు అవసరమనీ, యథాస్థితికి కంచు కోటలుగా ఉన్న "కొందరికి పరివర్తన అంటే భయమ"నీ, కాని మార్పును "అడ్డుకో జూడడమే ప్రమాదమ"నీ ప్రధాని ఇందిర చెప్పారు. ఆమెకు చరిత్ర తెలుసు. చారిత్రక సత్యాలు తెలుసు. ప్రజాస్వామ్య సంప్రదాయాలు తెలుసు. అయితే ఆచరణ అవసరం. "సామాన్య ప్రజలకు కలగవలసిన పరిపూర్ణమైన న్యాయం వారికి దక్కడం లేదు. ప్రజాబాహుళ్యానికి కాగితం మీద మాత్రమే హక్కు లున్నాయిగాని ఆచరణలో వారు అనుభవించడం లేదు....ఇలాంటి వ్యవస్థ తమను విస్మరిస్తోందని భావించినప్పుడు ఆ వ్యవస్థను వారు ఎందుకు సహించాలి" అని ఆమె ప్రశ్నించారు. అసమానతలను రూపుమాపడంలో విఫలమైతే రాగల పరిణామాలను కూడా ఆమె సూచన మాత్రంగా హెచ్చరించారు. వినదలచుకొన్న వాళ్ళందరూ పరోక్షసారి దానిని చరిత్రపాఠంగానే తీసుకోవాలి. అతివాదానికీ, మితవాదానికీ మధ్యమ మార్గంగా ఆమె హేతువాద దృష్టితో దేశ సమస్యలపు చూపే పరిష్కార మార్గం ఒక వినూత్న ప్రయోగం.

సామాజిక మార్పులు ఆనువంశిక లక్షణాలు కావు. ఆర్థిక వ్యవస్థలూ, వాటి కార్యకలాపాల చరిత్రే మార్పు. అది ప్రతికూలమైనదీ కావచ్చు, ప్రగతి శీలమైనదీ కావచ్చు. ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తిసాధనాలకూ మధ్య సంబం

ధాలు ఈ పరివర్తనలో ప్రధాన పాత్ర వహిస్తాయి. దిక్కులను కుదిపినా, శాసించినా ఇవే. డార్డనేల్స్‌పై వాణిజ్యపరంగా ఆధిపత్యంకోసం గ్రీకులు పాకులాడి ఉండకపోతే ఆగమీనాన్, ఎచిలస్, హెక్టార్ పేర్లు చరిత్రకు ఎక్కేవి కావు. వెయ్యినౌకల నక్షత్రకాంతుల సౌందర్యంతో ముఖకవళికలు దీపించినందువల్ల హెలెన్ ప్రసిద్ధి కెక్క లేదు—"ఈలియం" మీదికి వెయ్యి నౌకలతో దాడి వెడలబట్టి కోటికి పడగలెత్తబట్టి ప్రపంచానికి తెలిసింది. పర్షియాతో రోమ్ యుద్ధాలు చేసింది ఆర్థికాధికారం కోసమే. పశ్చిమ రాజ్యాలు తల పెట్టిన పవిత్ర యుద్ధాలు (క్రూసేడ్స్) ఆసియా దేశాలను ఉద్ధరించడానికి కాదు—వర్తక మార్గాలను స్వాధీన పరచుకొని పెత్తనం చెలాయించడానికే. ఫ్రెంచి విప్లవం వచ్చింది ఓల్టేర్ రచనలవల్లనో, రూసో రాతలవల్లనో కాదు, ఆర్థికాధికారంకోసం మధ్య తరగతివర్గాలు గొంతుచించుకొని చేతులు కలిపినందువల్లనే, ఈ పరిణామాలన్నింటిలోనూ ప్రజలు మూగ జీవులై ఉన్నన్నాళ్ళు దోచుకొనే వారి ఆటలు సాగాయి. అవి సాగనప్పుడు చరిత్ర కొత్త మలుపు తిరిగింది. అదే మార్పు. ఆ పరివర్తనను అడ్డుకొన్న శక్తులు అడుగంటాయి. ఆహ్వానించిన శక్తులు చరిత్ర సృష్టించాయి.

ఒకప్పుడు ఏథెన్స్ "సిటీ స్టేట్"గా ఉన్నప్పుడు సంపన్న వర్గాలలో దూర దృష్టిగల కొలదిమంది— రాగల మార్పులకు ముందుగానే ఆహ్వానం పలికి తామే సారథ్యం వహించారు. అలాంటి వారిలో సోలన్ ఒకడు. ఆర్థిక పునరుజ్జీవనంకోసం సంపన్నులకు సహితం బాధాకరమైన సంస్కరణలు ప్రవేశపెట్టాడు. అయినా ఒక్కతరంలోనే అవి ఏథెన్స్‌ను విప్లవం నుంచి రక్షించ గలిగాయి. సోలన్ ఆనాడు శాంతియుత పరివర్తనకు చిహ్నంగా నిలిచాడు. కాని సంపద కేంద్రీకరణ అవధులు దాటుతున్నప్పుడు కూడా రోమన్ సెనేట్ రాజీ పడడానికి నిరాకరించిన ఫలితంగా ఇటలీ నూరేళ్ళ వర్గపోరాటాలతో, అంతర్యుద్ధాలతో తీసుకొని బలహీన పడింది. ఇవి చరిత్ర పాఠాలు. అందుకే ఇందిర హెచ్చరిక. ఇది ఇప్పుడు వీస్తున్న గాలి: చైతన్య మారుతం.

# యురేనస్ - ఆరవ ఉపగ్రహం

పని ఉన్నా లేకపోయినా ఒకటికి పదిమార్లు ఒకరి చుట్టూ తిరిగే వాళ్ళను వందిమాగధులు అంటాం; అలాగే ఒక అగ్రరాజ్యాన్ని అంటకాగే కొన్ని దేశాలను "ఉపగ్రహ" రాజ్యాలు అంటాం. అలాగే మన నెత్తిపైన వినీలాంబుధిలో విస్తరించుకున్న అనంత రోదసిలో దూరదూరంగా ఉన్న గ్రహరాజు సూర్యుడయితే అతనిచుట్టూ తిరిగే గ్రహాలు కొన్ని ఉన్నాయి. వాటిలో భూమి మాదిరే తిరిగే మరొక గ్రహం, నవగ్రహాల వరసలో సప్తమ గ్రహం—"యురేనస్" అన్నారు. ఇతణ్ణే "ఇంద్రుడు" అన్నారు. దీనికి కొన్ని ఉపగ్రహాలు ఉన్నాయి. ఇప్పటికి ఉన్నవని 200 ఏళ్ళలో శాస్త్రవేత్తలు తేల్చి చెప్పినవి అయిదు ఉపగ్రహాలు. సౌర కుటుంబంలో భూమి కంటే ఎక్కువ ద్రవ్యరాశితో దీపిస్తూ సూర్యునికి కోట్లాది మైళ్ళ దూరంలో ఉంటూ అతని చుట్టూ తిరుగుతూ ఉన్న ఈ యురేనస్‌కు ఇవి "ఉప ఇంద్రులు", గ్రహం కనిపించినంత త్వరగా ఉపగ్రహం కనిపించదు. అద్భుత కాంతితో కనిపించే నక్షత్రాలన్నీ నక్షత్రాలు గాకుండా కొన్ని గ్రహాలుగా ఉన్నట్టే ఎక్కడో గ్రహ గృహాంతరంలో మిణుకు మిణుకుమంటూ కదిలేవన్నీ ఉపగ్రహాలూ కావు. ఇది ఎంతో పరిశోధన జరిగినమీదటగాని నిర్ధారణ కాదు. అలాంటి విశిష్ట పరిశోధనను జయప్రదంగా నిర్వహించి యురేనస్‌కు ఆరవ ఉపగ్రహాన్ని కనుగొన్న ఘనత ఈ శతాబ్దంలో మన భారతీయ శాస్త్రవేత్తలకు (మార్చి 10 న) దక్కింది. 20 వ శతాబ్దంలో ఇంగ్లీష్, ఫ్రెంచి, అమెరికన్ శాస్త్రవేత్తలు ఇంతవరకూ కనుగొన్న మొత్తం పదమూడు సహజ ఉపగ్రహాలకు భారతీయ శాస్త్రవేత్తల పరిశోధన ఫలితంగా పధ్నాలుగవ ఉపగ్రహం ప్రాచుర్యంలోకి రాబోతోంది. ఈ విజయం సాధించి, శైశవదశలో ఉన్న భారత ఖగోళశాస్త్ర రోదసీ పరిశోధనా కార్యక్రమాలకు మరింత విలువ చేకూర్చిన కవలూర్ సంస్థలోని శాస్త్రవేత్తలు డాక్టర్ భట్టాచార్య, ఎం. కె. వి. బాపూ అభినందనీయులు.

యురేనస్‌నూ, దాని మొదటి రెండు ఉపగ్రహాలనూ కనుగొన్న ఫ్రెడరిక్, హెర్షెల్, ఆ దరిమిలా మరి మూడింటిని కనిపెట్టిన శాస్త్రవేత్తలు కూపర్, లాసెల్ కృషికి మన పరిశోధకుల కృషి ఏమీ తీసిపోదు. సైన్స్‌లో పరిశోధన ఫలించేవరకే ప్రతిదీ నిగూఢంగానూ, అస్పష్టంగానూ ఉంటుంది. ఆ పిమ్మట మాత్రం ప్రతిదీ రూఢంగానే ఉంటుంది. మన శాస్త్రవేత్తలు కనుగొన్న కొత్త ఉపగ్రహం (ఇంకా పేరుపెట్టలేదు) వ్యాసం 30 కిలో మీటర్లట. అయితే ఎప్పుడో మరికొన్నాళ్ళకుగాని యురేనస్ గ్రహం తన చక్రగతిలో అడ్డుకొనవలసిన ఒక నక్షత్రం ఉన్నట్టుండి ఆకస్మికంగా కాంతి విహీనమయింది. ఆ కాలంలో జరిగిన ఈ పరిణామాన్నే మనవాళ్ళు శ్రద్ధగా పరిశీలించారు. భ్రమణంలో ఉన్న గ్రహానికి సమీపంగా వచ్చిన ఒక నక్షత్రాన్ని ప్రస్తుతపు అయిదు యురేనస్ ఉపగ్రహాలలో ఒకటి అడ్డుకున్నందున లేదా "చేతబడి" చేసినందుననే ఆ నక్షత్రం కాంతిని కోల్పోయిందని మొదట కొందరు ఊహించారు! ఇలాంటి పరిణామాన్ని కొందరు విదేశీ శాస్త్రవేత్తలు కూడా కనిపెట్టారుగాని అందుకు కారణం యురేనస్‌చుట్టూ పరిభ్రమణంలో ఉన్న మరొక ఉపగ్రహమేనని నిర్ధారణకు రాలేకపోయారు. కాని మన శాస్త్రవేత్తలు తమ పరిశోధనవల్ల ఇది సరికొత్త ఉపగ్రహమని నిర్ణయించి తబిశీళ్లు లాగారు. ఎందువల్ల? యురేనస్ గ్రహగతినిబట్టి ప్రస్తుతపు అయిదు ఉపగ్రహాలలో ఏ ఒక్కటీ పరిభ్రమణంలో ఉండే ఘడియలుకావు అవి. కాబట్టి దీనిని ఆరవ ఉపగ్రహంగా నిర్ణయించారు. దీని ప్రదక్షిణ కాలంకూడా మిగతా అయిదింటికన్నా చాలా తక్కువట.

మన శాస్త్రవేత్తల పరిశోధన ఒకవిధంగా మొదట్లో యురేనస్ గ్రహం పరిభ్రమణంలో ప్రదర్శించిన అవకతవకలను గురించి ఆడమ్స్, లెవిరీర్ అనే శాస్త్రవేత్తలు జరిపిన పరిశోధనలను పోలి ఉన్నాయని చెప్పాలి. న్యూటన్ గురుత్వాకర్షణ సూత్రాల ప్రకారం యురేనస్ పరిభ్రమించడంలేదు. కాబట్టి, ఈ అస్తవ్యస్తతకు సౌరమండంలోని మరొక గ్రహం కారణమై ఉండాలని వీరు భావించారు. భారీగా ఉన్న బెర్లిన్ టెలిస్కోప్‌ను నిర్ణీత లక్ష్యానికి సంధించి చూస్తే వారి ఊహకాస్తా నిజమై కూర్చుంది. అలా కనుగొన్నదే నెప్ట్యూన్ గ్రహం. ఇప్పుడు యురేనస్ ఆరవ ఉపగ్రహానికికూడా త్వరలోనే నామకరణం చేయవచ్చు.

# *"మానసిక ఔన్నత్యం" ఎప్పుడుసాధ్యం?

ప్రపంచానికి రకరకాల భాష్యాలు; మానవుని ఉనికికి విభిన్న వ్యాఖ్యానాలు. ఈ మనిషికి, ముందు భౌతిక వాంఛలు తీరాలా ? లేక ఆధ్యాత్మికధోరణికి మొదటి ప్రాధాన్యం యివ్వాలా ? ఏది ముందు ? ఏది వెనక ? కేవలం ప్రపంచానికి భాష్యం చెప్పడంతోనే పని తీరుపోతుందా? లేక దానిని మార్చ వలసిన అవసరం వుందా ? ఉంటే చేయవలసిన పనేమిటి ?

ఈ ప్రశ్నలు కేవలం అర్థంలేని ఆలోచనలు కావు. మానవుని ఉనికిని ప్రశ్నించి, ఊగించి శాసించే సవాళ్ళు; భాష్య ప్రపంచపు శిఖరాలను అందుకో జూచిన తత్త్వవేత్తలందరూ ఎదుర్కొన్న సవాళ్లు; మానవుడు కేంద్రంగా బయలుదేరిన జిజ్ఞాస, చర్చోపచర్చలు చివరికి తత్త్వవేత్తలను పెక్కు చిక్కులలోకి నెట్టిన ఉదాహరణలు కూడా చరిత్రలో వున్నాయి. అన్యాయాన్ని ఎదిరించడానికి ఉద్యమించిన సోక్రటీస్ శత్రువుకు తలఒగ్గలేదు. సత్యానికి కొమ్ముకాసిన బ్రూనో ప్రభువర్గానికి దాసోహమనలేదు. కుత్తుకపైన రెండు దఫాలు కత్తి ఎత్తినా ప్లాటో ఉలకలేదు, పలకలేదు. చార్వాక అంతే. అనుకున్న సత్యాన్ని చాటిచెప్పారు. ఎందువల్ల? తమనాటి సమాజపు అధ్వాన్న పరిస్థితులను వేలెత్తిచూపి, మంచిని పెంచగలిగిన దిట్టలు వారు. భిన్నమతాలకు, భిన్న వ్యాఖ్యానాలకు అవకాశమిస్తున్న తాత్త్విక ధోరణులకు మన దేశం పెట్టింది పేరు. మానవుని భౌతిక అవసరాలను గుర్తించిన వివేకానందుడు, అతీత శక్తి గురించి, దేవుణ్ణిగురించీ బోధించకుండా వదలలేదు. ఆ వారసత్వం సర్వేపల్లివరకు కొనసాగుతూనే వచ్చింది. అయితే భారతీయ తత్వశాస్త్రం ఆధునిక కాలంలో కూడా ఖండాంతరాలకు వ్యాపించడానికి కారణం - ఆధునికశాస్త్ర విజ్ఞాన విజయాలను ఒప్పుకుంటూనే మతదృష్టికి సైన్స్‌ను కూడా జోడించడం. ఈ విచిత్రమైన సమ్మేళనం సాధించిన మన తత్త్వ వేత్తలలో సర్వేపల్లి ప్రసిద్ధుడు.

---

* సర్వేపల్లి అస్తమించిననాడు సంపాదకీయం.

తాత్త్విక పునాదులు పాతవే. కాని భాష్యంలో కొత్తదనం. "మోక్ష" సిద్ధాంతానికి ఆయన యిచ్చిన నిర్వచనంలో ఇది గోచరిస్తుంది. మానవాతీతమైన శక్తి ఏదీ లేదని, దేవుని ఉనికిని నిరాకరించిన "పూర్వమీమాంస"ను కాదనడానికి కూడా సర్వేపల్లి చాల ప్రయత్నించారు. భారతీయ తత్త్వ శాస్త్రంలో ఏది శాస్త్రీయమో దానిని మనం నిరాకరించాం. ఏది అశాస్త్రీయమో, దానిని పుచ్చుకున్నాం. ఏ సోషలిస్టు సిద్ధాంతంతోను సంబంధం లేని క్రీ. పూ, 600 నాటి ఉద్దాలకుడు, చార్వాకుడు భౌతిక వాదాన్ని ప్రబోధించినా, వాళ్ళు మనవాళ్ళు కాదన్నాం. ఆ తరువాత యాజ్ఞవల్క్య ప్రచారంలోకి తెచ్చిన ఆకుకు అందని, పోకకు పొందని "కర్మ, మోక్షం" సిద్ధాంతాలను వంటబట్టించుకున్నాం.

కాని సర్వేపల్లి ఆధునికుడైనందున కొంత జాగ్రత్తపడ్డారు. జీవితాన్ని "మాయ"గా చిత్రించలేదు. అదే ఆయన విశిష్టత. విజ్ఞానశాస్త్రం సాధించిన విజయాలతో ఆయన రాజీపడవలసి వచ్చింది. శంకరుని మాదిరిగా మోక్షం అంటే వేరు లేదు, జ్ఞానమే మోక్షం అన్నారు. అయితే విజ్ఞాన శాస్త్ర విజయాలకు పరిమితులు వున్నాయన్నారు. ఎక్కడ విజ్ఞానశాస్త్రం ముందుకు సాగలేదో, అక్కడినుంచే తత్త్వచింతన, ఆధ్యాత్మిక లోక సందర్శనం ప్రారంభమవుతుందని ఆయన వాదన కాని విజ్ఞానశాస్త్రం కూడా నిరంతరచింతనపైన ఆధారపడినదేనని ఆయన గుర్తించినట్టు కనపడదు. ఆమాటకొస్తే, అసలు కేవలం తోచిన బాష్యంతో సరిపెట్టుకోగల్గినదీ, వాస్తవ జగత్తు అవసరాలకు దూరమైనది తత్త్వశాస్త్రం కాదు.

స్వాతంత్ర్యానంతరం దేశ ఆర్థిక విద్యాదిరంగాల్లో కానవస్తున్న సంక్షోభం, ఆయన తత్త్వచింతనలో కూడా సుడిగాలులు రేపిందని చెప్పాలి. కనకనే భారతీయ సమాజం త్వరగా పరివర్తన చెందాలని ప్రబోధించాడు.

"ఆర్థిక దారిద్ర్యంలో వున్నంతకాలం నీకు నైతిక బలం వుండదు, లోతుగా ఆలోచించేదృష్టి వుండదు; నైతిక ఔన్నత్యం పొందలేవు. ప్రజలు ఈగల్లా మాడిపోతూంటే, నీకు మిగిలేది ఏముంది? ప్రపంచంలో ఎక్కడ విప్లవాలు చెలరేగినా, ఈ దారిద్ర్యం వల్లనేనని నాకు బోధపడింది.... ఇట్టి దారిద్ర్య పరిస్థితులలో ప్రజలకు సంతృప్తికరమైన సమాజాన్ని నిర్మించలేము. అటువంటి సమాజం అస్థిరమైపోతుంది. ప్రజలు మార్పు గావాలంటారు." సర్వేపల్లి మనమధ్య లేకపోవచ్చు. కాని ఆయన అంతరంగంలోని బాధ మనకు అర్థమవుతుంది. ఆయన ఆవేదనకు కారణాన్ని తెలుసుకుని ప్రస్తుత సమాజ పరిస్థితులను మార్చగల్గిననాడే, ఆయన ఆశయానికి సాఫల్యం.

# ఉహూరూ–ఉజామా

స్వేచ్ఛకోసం తపన, స్వాతంత్ర్యంకోసం ఆరాటం అన్నిదేశాలకు సమానమే, అన్ని జాతులకు ఒకటే. "ఇల్లు అలకగానే పండుగ" కాదు. అలాగే దేశాలకు రాజకీయ స్వాతంత్ర్యం రాగానే రామరాజ్యాలు కాజాలవు. త్యాగం అనే దీపం వలసవాదానిసత్వంలోవున్న ప్రజలకు, నాయకులకు ఎంతటి వెలుగు చూపుతుందో, విమోచన పొందిన తరవాత దేశాల పునర్నిర్మాణం లోను అంతటి కాంతులు విరజిమ్మాలి. రాజకీయ స్వేచ్ఛతోపాటు, ఆర్థిక విమోచన కూడా పొందాలి. అప్పుడే స్వేచ్ఛకు సంపూర్ణమైన అర్థం. అటు వంటి తపన అంతకుముందూ, ఇప్పుడూ వ్యక్తం చేస్తున్న దేశం–తూర్పు ఆఫ్రికాలోని టాంజానియా. దాని నాయకుడు, ప్రస్తుతం మనదేశంలో పర్య టిస్తున్న ప్రెసిడెంట్ నైరేరి.

మనకంటే దశాబ్దం మించి ఆలస్యంగా స్వాతంత్ర్యం పొందిన దేశం టాంగన్యీకా. వలస బానిసత్వంలో మ్రగ్గిన ఆఫ్రికా ఖండంలో మూడు నాల్గేసి దేశాలు కలిసి ఒక ఫెడరేషన్‌గా ఏర్పడాలన్న భావం వ్యాప్తిచేసినవాడు నైరేరి. అప్పుడే నిర్దిష్టమైన ప్రగతి సాధ్యమని విశ్వసించినవాడు. మొదట కెన్యా, ఉగాండా, టాంగన్యీకాలతో ఫెడరేషన్ సాధ్యపడకపోతే, టాంగన్యీకా, జాంజిబార్‌లను కలిపి "టాంజానియా" రిపబ్లిక్‌ను ఏర్పరిచాడు.

అరబ్ భూస్వామ్యవర్గాన్ని రద్దుచేసి సాంఘిక విప్లవంలోవున్న జాంజిబార్‌తో కలవడం ద్వారా టాంగన్యీకా భవిష్యత్తును కూడా తీర్చిదిద్దాడు. ఆఫ్రికన్ సోషలిస్టులుగా పేరెన్నికగన్న సెనిగాల్ సెంగార్‌గాని, గినీ సికెటూరెగాని, నైరేరికి ఆచరణలో తులతూగజాలరు. "ఉహూరూ" స్వాతంత్ర్య నినాద మైతే, "ఉజామా" కుటుంబ జీవితంగా, సామాజిక జీవితంగా మొత్తం గ్రామసీమలలో కమ్యూన్ జీవితానికి సంకేత నినాదమైంది. అలా మార్చినవాడు నైరేరి. ఈనాడు ఆయన అంగోలాలో అగ్రరాజ్యాల జోక్యాన్ని నిరసించు

తున్నా హిందూ మహాసముద్ర ప్రాంతంలో ఉద్రిక్తతా ధోరణిని ఖండిస్తున్నా డంటే— ఆ ఖండన మండనలకు విలువ తెచ్చిపెట్టగల దేశీయ విధానాలను టాంజానీయాలో ఆయన అనుసరిస్తున్నాడు. ఇంట్గెలిచి రచ్చగెలుస్తున్నాడు. జాతీయ పునర్నిర్మాణంలో 1967 లో నైరేరి రూపొందించిన "అరూషా" మానిఫెస్టో గొప్ప ప్రణాళిక.

ఈ మానిఫెస్టో దేశంలోని మొత్తం భూములను సమాజపరం చేసింది. దున్నేవానికి భూమి కల్పించి, దానిపై ఆస్తిహక్కును రద్దు చేసింది. బ్యాంకు లను, భీమా కంపెనీలను, గుత్తసంస్థలను, పరిశ్రమలను జాతీయం చేసింది. నిత్యజీవితావసర సరకుల ఉత్పత్తిని ప్రభుత్వమే చేపట్టింది. అంతేకాదు, దేశ నాయకత్వానికి, రాజకీయ వేత్తలకు, సివిల్ సర్వెంట్లకు, ప్రవర్తనా నిబంధనావళి రచించింది. ప్రధాన ఉత్పత్తి సాధనాలన్నింటిని ప్రభుత్వం పరంచేసిన తరవాత నైరేరి "నిజమైన సోషలిస్టు రాజ్యంలో ప్రజలందరూ పనివాళ్లే - కార్మికులే. పరస్పరం దోపిడీకి అవకాశం లేదు" అని ప్రక టించాడు. ఈనాడు మనం చెప్పుకొంటున్న "గ్రామాలకు తరలాలన్న" నినాదాన్ని నైరేరి ఆచరణసాధ్యం చేశాడు. "ఉజామా" గ్రామాలలో సామూహిక జీవన తోరణాలు కట్టాడు, స్వయంపోషక ఆర్థిక వ్యవస్థను నిర్మిస్తున్నాడు.

# కార్యవాది కామరాజ్

గాంధీ యుగంలో పుట్టి పెరిగి, అక్షరాలా గాంధీయిజాన్ని ఆచరణలో ఆఖరి శ్వాసవరకు అమలు జరపడానికి జీవితాన్ని అంకితం చేసిన బహు కొలదిమంది వృద్ధ కాంగ్రెస్ నాయకులలో ఒకరు కామరాజ్. ఎంతటి అహింసామూర్తి అయినా "అజాతశత్రువు" కాజాలనట్టే, కామరాజ్ రాజకీయ జీవితంలో కూడా ఎన్ని వొడిదుడుకు లెదుర్కొన్నా, ఆయన నిరాడంబర జీవితం అన్ని వర్గాలను ఆకర్షించింది.

జాతీయోద్యమంలో ఎంతటి కార్యదీక్షను కనబరచారో, గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరపడమేకాక, ఆ తరువాత తమిళనాడు ముఖ్యమంత్రి హోదాలో కూడా అంతటి దీక్షాదక్షతలు ప్రదర్శించారు.

నాయకత్వ హోదాకి ఇంగ్లీషు చదువులే ప్రధానమని కొందరు భావించిన దినాలలో నేలతల్లి బిడ్డగా అతి సామాన్య స్థాయి నుంచి ఎదిగివచ్చి, ప్రజా సామాన్యంతో సన్నిహిత సంబంధాలు కలిగిన నాయకుడు కామరాజ్. మూడు దశాబ్దాలపాటు తమిళనాడు రాజకీయాలనే కాక, దేశ రాజకీయాలను సహితం ప్రభావితం చేసిన ఈయన నెహ్రూ కాలంలోను, అనంతరమూ జాతీయ కాంగ్రెస్‌కి నేతృత్వం వహించి పార్టీని సంక్షోభ దశలనుంచి రక్షించటానికి కృషిచేశారు. "ఇంట గెలిచి రచ్చ గెలిచి"న వాడు కామరాజ్. ప్రత్యర్థి వర్గాలను బుజ్జగించడంకోసం మంత్రివర్గ సభ్యుల సంఖ్యను పెంచడం ఒక ఆనవాయితీగా మారిన కాంగ్రెస్‌కు గుణపాఠం చెప్పిన విశిష్టమైన వ్యక్తి. అతి తక్కువమంది సభ్యులతో తమిళనాడుకు మంత్రివర్గాన్ని ప్రసాదించడమేకాక, తొమ్మిదేండ్లపాటు (1954-1963) తిరుగులేని నాయకునిగా ప్రజలలోనె కాక పార్టీలో సహితం "తలలో నాలుకై" మెలగిన కామరాజ్ సుదీర్ఘకాలం సుస్థిర ప్రభుత్వం వెలకొల్పిన ఘనాపాఠి.

సామాన్య ప్రజలపట్ల విశ్వాసం, అభిమానం ఆయనచే చాలా మంచి పనులు చేయించాయి.

"తక్కువ మాట్లాడేవాడు ఎక్కువ పనులు చేస్తాడ"న్న మాటకి కామరాజ్ జీవితమే సాక్ష్యం. మొట్టమొదటిసారిగా స్వరాష్ట్రంలో బడిపిల్లలకు మధ్యాహ్నంపూట ఉచిత భోజన సదుపాయం, ఉచితంగా యూనిఫారం ప్రవేశ పెట్టిన ముఖ్యమంత్రి ఈయనే. తానుగా అధికారంకోసం తాపత్రయ పడినవాడుకాడు. కోటికి పడగెత్తినవాడూ కాదు. ఈ విశిష్ట లక్షణాలు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఆయనను చేర్చినపుడు కూడా ఒకే వ్యక్తికి రెండు పదవులు మంచిది కాదని భావించి పార్టీవ్యవస్థలో, నిర్మాణ పద్ధతులలో కొత్త రక్తాన్ని ఎక్కించాడు. అదే "కామరాజ్ పథకం." ముఖ్యమంత్రి పదవిని ఐచ్ఛికంగా వదిలాడు. అయితే ఈ పథకం కామరాజ్ ఆచరణకి సరిపోయినంతగా ఇతరులకు మ్రింగుడు పడక పోవడంతో పెక్కు పథకాలకి పట్టినగతే దీనికీ పట్టింది.

కామరాజ్ ఆఖరిశ్వాస విడిచేవరకు పాత కాంగ్రెస్ నాయకునిగానే వుండ వచ్చుగాని, చీలిపోయిన కాంగ్రెస్ పక్షాల మధ్య సయోధ్యకి ఆయన చేసిన కృషి అపారం. శ్రీమతి ఇందిరాగాంధి, శ్రీజగ్‌జీవన్‌రామ్‌లను, కేంద్రమంత్రి మండలిలో ప్రవేశపెట్టడంలో, ఆ దరిమిలా శాస్త్రి మరణానంతరం శ్రీమతి గాంధిని ప్రధానమంత్రిగా నిలపడంలో కామరాజ్ రాజనీతిజ్ఞత ప్రతిఒక్కరికి తెలిసిందే. అయితే కాంగ్రెస్ చీలికను నివారించడానికి తానుచేసిన ప్రయత్నాలు విఫలమైనప్పుడు కామరాజ్ అన్నమాటలు బహుశ ఇన్నాళ్ళూ ఆయనను వ్యాకులపెట్టే వుంటాయి. "నా సహాయం పొందినవారంతా నాకు

కామరాజ్ జీవితంలో ప్రజాసేవ, గాంధీ విధానాలు మినహాయించి కొందరు చెబుతున్నట్లు "సోషలిజమే ఆయన ధ్యేయం" కాకపోవచ్చు, కాని ఆయనకు "ఇజాల"తో నిమిత్తం లేదు. అంతగా చెప్పుకోవలసివస్తే ఆయన ఉదార వాదానికి, సాంప్రదాయానికి మధ్య సమన్వయ కర్తగా, అపురూపమైన సమ్మేళనకర్తగా వ్యవహరించారని చెప్పాలి. ఆయన కార్యవాది. ఇతర వాదాలు ఆయన కనవసరం.

# సమన్వయం కుదరని చరిత్ర

నిశ్చలంగావున్న నీటిలోకి రాయి విసిరితే అలలు చెలరేగుతాయి. అలాగే చరిత్రకు సంబంధించి మనం పెంచుకుంటూ, పేర్చుకుంటూ వస్తున్న కొన్ని విశ్వాసాలనుకూడా కాదన్నప్పుడు, మనసులలో కల్లోల తరంగాలు వ్యాపిస్తాయి. అంతమాత్రాన "ప్రశ్న"ను కాదనలేము. "ప్రశ్న"ను చంపి, పుట్టినదే అంధ విశ్వాసం. "మహాభారతయుద్ధం," "రామాయణ" లకట్టు కథలు, పుక్కిటి పురాణాలు తప్ప వేరేకాదని ఇప్పుడు సుప్రసిద్ధ చరిత్ర కారులు శ్రీ సర్కార్ విసిరిన "బండరాయి" కూడ మన గుండెలను కలచి వేస్తుంది. మనకి ఇంతటి సమన్వయ విరుద్ధమైన చరిత్ర వుందా, అనిపిస్తుంది. సమన్వయం కుదరని సాహిత్యం, చరిత్ర సమాజాభ్యున్నతికి అవసరమైన నైతిక విలువల ప్రతిష్ఠాపనకు ఆటంకం కావా? అని ప్రశ్నించుకొనకతప్పదు. మహా కావ్యాలుగా భారత, రామాయణాలు శ్రవణ పేయాలు కావచ్చు, అందలి శైలి, ధారాశుద్ధి ఆపాత మధురమే కావచ్చు. కాని అందలి పాత్రలు, ఘటనలు మానవాతీతమైనవి అయినప్పుడే మనసుకు చికాకు కలిగిస్తాయి. నిజానికి ఈ రెండు మహా కావ్యాలను తరతరాలుగా పఠిస్తున్న, వింటున్న పాఠక లోకమే, "రామాయణం రంకు, భారతం బొంకు" అన్న ప్రచారంకూడా చేసింది. అలాగే "తింటే గారెలే తినాలి, వింటే భారతం వినాలి" అనీ చెప్పారు! అంటే రుచికి గారె ఎలాగో వినడానికి ఇంపైనది భారతమనే గాని, ఆ భారతయుద్ధం ఎక్కడ జరిగింది, ఎప్పుడు జరిగింది, ఎవరిమధ్య జరిగిందన్న మీమాంసలోనికి సామాన్యుడు దిగలేదు. పురోహిత పండిత వర్గం దిగ నివ్వలేదు. ఎందుకని? వర్ణ వ్యవస్థకు, వర్గ వ్యవస్థకు బీజాలు నాటినవారే వీరు కనుక. "కురుక్షేత్ర యుద్ధం వొట్టి పుక్కిటి పురాణం" అని చెప్పింది ఒక్క సర్కార్ మాత్రమే కాదు, డాక్టర్ కోశాంబి కూడా చెప్పారు. చివరకు ఇటీవలనే హరప్పావద్ద జరిపిన త్రవ్వకాలలో కూడా ఆ యుద్ధానికి సంబంధించిన సాక్ష్యాధారాలు దొరకలేదు. ఎందువల్లనంటే, భారతంలో పేర్కొన్న లక్షలాది సేనా నివహాలకు వారి తిండి తిప్పలకు అవసరమైన సరకుల ఉత్పత్తి ఆ కాలంలో సాధ్యమా? అసలు ఈ యుద్ధం క్రీస్తుకు పూర్వం రెండువేలు-నాలుగువేలు-సంవత్సరాల మధ్యకాలంలో జరిగి

వుంటే, దాదాపు ఆదేకాలానికి చెందిన సింధు నాగరికతకు సంబంధించిన త్రవ్వక విశేషాలలోగాని, అందుకు సంబంధించిన పురాతత్వశాస్త్ర పరిశోధనలు, సాహిత్యంలోగాని దాఖలాలు వుండాలికదా?! లేదా, కనీసం అదేకాలంలో ఇండియా చేరిన ఆర్యుల ప్రస్తావనకు సంబంధించిన చారిత్రికాంశాలలోనయినా ఆ యుద్ధం ప్రస్తావనకు వచ్చిఉండవలసిందిగదా?! ఇంతకీ ఈ యుద్ధం రెండు చిన్న తెగలమధ్య మనుగడ విషయంలో, ఉత్పత్తి విధానంలో వస్తున్న మార్పుల ఫలితంగా జరిగిన ఘర్షణా?

నిజానికి మహాపండితుడు రాహుల్‌జీ చెప్పిందే నిజమని తోస్తోంది : భారత చరిత్రలో గణతంత్ర సమాజ వ్యవస్థలను నిర్మూలించిన రాజతంత్రాలకు, స్వార్థంకొలదీ పురోహితవర్గం విలువ ఇచ్చినందున నిజమైన గణసమాజ చరిత్రకు దాఖలాలు కరవైనాయి. పదితలల రావణుడు మన ఆర్యులకు తెలియకుండానే మన పురాణాలు ఎక్కినట్టుగా, భారతయుద్ధం కూడా సింధు నాగరికతకు తెలియకుండానే చరిత్రకు ఎక్కి వుండాలి ! !

తక్షశిల నుంచి బెంగాల్ వరకు ఇంకా దిగువ దక్షిణాది వరకు విస్తరించిన సామ్రాజ్యంకోసం ఢిల్లీ సమీపాన (కురుక్షేత్రంలో) యుద్ధం జరిగినట్టు భారతం చెబుతోంది. కాని అంత పెద్దఎత్తున యుద్ధం క్రీస్తుపూర్వం నాలుగవ శతాబ్దానికి ముందు సాధ్యమా? గ్రీకుల ట్రాయ్‌నగర యుద్ధానికి స్థలనిర్ణయం వుంది, కాలనిర్ణయం వుంది. కాని మన వాళ్ళు స్థల, కాల నిర్ణయాలు లేకుండానే భారత యుద్ధాన్ని ట్రాయ్ యుద్ధంతో పోల్చారు!! హోమర్ "ఇలియడ్"లో కల్పితగాథలు కొన్నివున్నా అనంతరం దానికి అక్కడి పండితులు పదిచేతులు వేసి పుక్కిటి పురాణాలుగా చిత్రించకుండా వున్నందునే "ఇలియడ్"లో పేర్కొన్న పెక్కు ప్రాంతాలు పురాతత్వ పరిశోధకుల త్రవ్వకాలకు అందాయి. చివరకు బైబిల్ మత గ్రంథమైనా అందులో పేర్కొన్న పెక్కు ప్రదేశాలు, అక్కడ జరిగిన ఘట్టాలు, పరిశోధకులకు అంతుచిక్కాయి. అలాగే మన భారతీయ నాగరికతతో తులతూగగల అతి ప్రాచీనమైన ఈజిప్టియన్ సుమేరియన్ నాగరికతలలో ప్రధాన ఘట్టాలకు శాసనాధారాలు చారిత్రకాధారాలు, త్రవ్వకాలు సరితూగాయి! ఎటొచ్చీ మన పండితుల చేతిచలువవల్ల ఏది కట్టుకథో, ఏది గట్టికథో తెలియక ఈరోజుకీ కాలనిర్ణయం జరగకపోతే మానె భారత రామాయణ యుద్ధగాథలకు కనీసం రంగస్థల నిర్ణయంకూడా సాధ్యపడడం లేదు.

అందువల్ల సమన్వయం లేని రచనలవల్ల శ్రీనాథుడు వ్యక్తంచేసిన వైముఖ్యంతో మనమూ పాలు పంచుకొనక తప్పదేమో! "బహుధావిప్రతిపత్తి ధీవిభవముల్, పాడయిన శాస్త్రార్థముల్."

# 'సంపూర్ణ విప్లవం' : అసంపూర్ణ నిర్వచనం

ఆనందం అనిర్వచనీయం కావచ్చు. అనుభూతి కూడా అంతే కావచ్చు. కాని ప్రజా సమస్యలకు పరిష్కార మార్గం, ఉద్యమాల గమ్యం అనిర్వచనీయంగా వుండిపోవడానికి వీలులేదు. ఇలాంటి అస్తవ్యస్త పరిస్థితి, పరిణామం శ్రీ జయప్రకాశ్ ఉద్యమంవల్ల ఏర్పడింది.

ఈ ఉద్యమంవల్ల నిర్వచనకన్నా నిర్వేదన ఎక్కువ; స్పష్టతకన్నా అస్పష్టత మిన్న; కార్యాచరణలో గమ్యంలేని త్రొక్కిసలాట జాస్తి. ఉద్యమ నాయకుల మనస్సులలో ఏర్పడిన గందరగోళం సమస్యలకు పరిష్కారాన్నే కాదు, ప్రజలనే పెడమార్గం పట్టిస్తుంది. శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రారంభించిన అనిర్వచనీయ విప్లవం, ఆయన అనుభవం దృష్ట్యా పరిశీలించినా, సాధించుతున్న ఫలితాలకన్నా, పెంచుతున్న అనుమానాలే ఎక్కువ.

నిజమే, సమస్యలతో తీసుకుంటున్న భారతదేశంలో ఒక మేరకు సంచలనం కలిగించారాయన; నిజమే- ప్రజల స్వత్వాలపైన, ప్రజాస్వామ్య సంప్రదాయాలపైన ప్రభుత్వ పక్షం జరుపుతున్న "దాడులకు" ప్రతిగా, ప్రజలతో గొంతు కలిపారు. అయితే సర్వసాధారణంగా రాజకీయాలతో, రాజకీయ పరిణామాలతో జీవితాలు పెనవేసుకున్న భారత ప్రజలకు ఆయనొక స్పష్టమైన కార్యక్రమాన్ని ఇవ్వలేక పోతున్నారు. గాంధీజీ నిరాడంబర జీవితం నాయకులకూ, ప్రజలకూ ఆచరణకు రాని కేవల ఆదర్శంగా మిగిలిపోయింది; అలాగే జె. పి. రాజకీయ సన్న్యాసం కూడా అక్కరకురాని కేవల ఆశయంగానే మిగిలిపోయే అవకాశం వుంది. కనీసం వినోబాభావే సర్వోదయం పరిమితులు తెలిసినవాడుకాబట్టి ఆమేరకు స్పష్టంగా నిలబడ్డారు. మనస్సుకు మించిన బరువును తలకెత్తుకోలేదు.

సామాజిక చెడుగుల గురించి, ప్రజల దారిద్ర్యపరిస్థితి గురించి శ్రీ జె. పి. పెక్కుసభలలో పలు విధాలుగా సబబైన విమర్శలే చేశారు. సమాజంలో

"సమూలమైన మార్పులు" రానిదే ప్రజల వాంఛలు నెరవేరవని చెప్పారు. ఆ పెనుమార్పులను ఆవిష్కరించగల చైతన్య మూర్తులు ప్రజలని కూడా ఆయన మంచి అంచనాయే యిచ్చారు. కాని, ఆ "మార్గం" ఏదో తాను సూచించబోననీ, అది ప్రజలే నిర్ణయించుకోవాలని ఒకవైపు చెబుతారు. ఆ మార్పులకు తగిన "నమూనా" తనవద్ద లేదంటారు. ఒకరోజున "విప్లవం" అంటారు. వేరొక రోజున దాని అర్థం "మార్పు" అంటారు. ఒక చోట "సంపూర్ణ విప్లవం" అంటే "శాంతియుత విప్లవమే" నంటారు. ఇంకొకచోట అసలు "శాంతియుత సంపూర్ణ విప్లవం ప్రపంచంలో ఎక్కడా జరగలేదం"టారు. రాజకీయాలు నిరసించిన నోటితోనే, రాజకీయ సమస్య లను ప్రస్తావిస్తారు. మళ్ళీ ప్రశ్న మొదటికే వచ్చింది ? ఏది విప్లవం ? ఏదికాదు ? ఏదిసత్యం ? ఏదసత్యం ? భారత "విప్లవాని"కి మార్గం ఏది? ఈ రోజుకీ ఆయన నిర్వచించరు.

ఆయన నాయకత్వంలోని గందరగోళానికి ప్రత్యేక నిదర్శనం- విశాఖలో కొందరు విద్యార్థులను ఆయన ప్రశ్నించిన పద్ధతి. సాంఘిక దురాచారాల గురించి విద్యార్థులలోని అస్పష్ట వైఖరిని ఆయన సక్రమంగానే నిరసించారు. కాని "సంపూర్ణ విప్లవం అంటే ఏమిటని" ప్రశ్నించిన విద్యార్థులకు ఆయన "మీరే చెప్పండి" అని తిరిగి ఎదురుప్రశ్న వేశారు. నిజానికి ఆయన సాచివేత రాజకీయవాదిగా కనబడుతున్నారేగాని, పూర్వపు రాజకీయవాది కారు. అందుకే ఈ అస్పష్టత. చుక్కానిలేని నావమాదిరి, దిక్కుతెలియని నావికునిలాగా "సంపూర్ణ విప్లవాని"కి ఆయన యిచ్చేది అసంపూర్ణనిర్వచనం. ఇది సత్ఫలితాలకంటే, దుష్ఫలితాలనే తెచ్చిపెడుతుంది.

అసలు ఇంత గందరగోళానికి కారణం జాతీయోద్యమ దశనుంచి, ఆ దరిమిలా శ్రీ జె. పి. లో వచ్చిన పెక్కు పరిణామాలే. సోషలిస్టుగా ప్రారంభమై, కాంగ్రెస్ సోషలిస్టుగావుండి, ఆ పిమ్మట సర్వోదయం స్వీకరించి, మధ్యలో రాజకీయాలలో తలదూర్చడానికి ప్రయత్నించి, విఫలమై, తిరిగి కొత్తరకం రాజకీయ సర్వోదయం చేపట్టారు. "భారతదేశమా ఎటు నీ ప్రయాణం?" (విథర్ ఇండియా) రాసిన నెహ్రూ మాదిరి, "భారతదేశపు యజమాను లెవరు ?" ("హు ఓన్స్ ఇండియా") రాసిన అశోక్ మెహతా మాదిరి, "సోషలిజం ఎందుకు" ? రాసిన జె. పి. కూడా, ఆ పుస్తకాలు విడిచి పెట్టారు. ఆ ప్రబోధాలు వదలుకున్నారు. ఆ నిర్దుష్టమైన నిర్వచనాలకు తిలోదకాలిచ్చారు. తలా ఒకదారి పట్టారు.

ఇప్పుడు జె. పి. ఉద్యమాన్ని అవకాశంగా చేసుకుని చుట్టూ సమీకృతు లౌతున్న వారుకూడా, గాంధీజీ ఉద్యమంచుట్టూ చేరడానికి ప్రయత్నించినట్టి

వారే. నాయకుల ఆశయబలం ఎంత గొప్పదైనా, అస్పష్టమైన కార్యాచరణ మాత్రం అవాంఛనీయ శక్తుల చేతిలో అణుబాంబుకు మించిన అస్త్రం అవుతుంది! పారిశ్రామిక వేత్తల ప్రాపుతో ప్రజల ఉద్యమాలు నడప జూడడం జూదానికి మించిన జూదం అవుతుంది. అప్పుడు "సమూలమైన సాంఘిక మార్పుల"కు మారు మరొకసారి మరింత బలంగానే, యథాస్థితికి కంచుకోటలు కాగల్గిన శక్తులు పుట్టుకువచ్చే ప్రమాదంవుంది.

శ్రీ జయప్రకాష్ ముందు తన ఆలోచనలో, మార్గంలో, ఆచరణలో ఏర్పడిన ఈ గందరగోళాన్ని తొలగించుకోవడం అవసరం. ఈ షరతు నెరవేర నంతవరకు ఆయన ఆశించిన ఫలితం దుర్లభం.

# సృష్టి ప్రతిసృష్టి

"బోగస్" జోస్యాలు, బోగస్ జీవితాలు, బోగస్ సంస్థలతో పెనవేసుకుపోయిన జీవులకి విజ్ఞానశాస్త్రం సాధిస్తున్న అమోఘ విజయాలు అంతుచిక్కవు. విశ్వామిత్రుని "ప్రతిసృష్టి"తో మాత్రమే తృప్తిపడగల వారికి సృష్టికి శాస్త్రీయమైన ప్రతిసృష్టి అర్థం కాకపోవచ్చు. మనిషి వయస్సు కన్నా మించి మూడింతలుగా మౌఢ్యం మూటగట్టుకున్నవారి మనస్సులకు, సృష్టి రహస్యాన్నే, జీవరహస్యాన్నే భేధించుతున్న ఆధునిక భౌతిక, రసాయన ప్రక్రియలలోని అద్భుతాలు అందకపోవచ్చు.

అభ్యుదయాన్ని కాంక్షించే మానవునికి మూడోకన్ను సైన్సు. అది జీవితాన్ని క్రమమార్గంలో పెడుతుంది. ఆయుర్దాయాన్ని పెంచుతుంది. శ్రమను తగ్గిస్తుంది, ఆరోగ్యాన్ని కాపాడుతుంది; అతని నైతిక, సాంస్కృతికస్థాయిని, విలువలను కూడా కాపాడి, రాపాడుతుంది.

ఇంతపని సైన్సు చేయగలదు కాబట్టే సహజ రక్తం కన్నా మిన్నగా మూత్ర పిండ వ్యాధుల్ని, పాండురోగాల్ని పారద్రోలగల కృత్రిమ రక్తాన్ని(ఫ్లూరో కార్బన్) సృష్టించింది; గుండెలు మార్చుతోంది, కృత్రిమ అవయవాలు అతుకుతోంది, అసలు ఆనువంశిక లక్షణాలనే-వారసత్వ లక్షణాలనే-మార్చగల ప్రయోగాలు సఫలమయ్యే స్థితికి చేరుకుంటున్నారు శాస్త్రవేత్తలు. ఉష్ణోగ్రతలు తారుమారు చేయగల 'క్రియోజెనిక్స్' అవతరించింది. నాడీ మండలాన్ని, మెదడు పనిపాట్లను తణిఖీచేసి, కంట్రోల్‌చేయగల సైబెర్నెటిక్స్‌లో సరికొత్త విజయాలు సాధ్యమౌతున్నాయి. కళ్ళను చూస్తేచాలు ఎదటి మనిషి ఆత్మ సాక్షాత్కరిస్తుందని కవులు అంటారు. కాని కళ్ళు చూసినంతనే శరీర ధర్మాలన్నింటిని కళ్ళకు కట్టి చూపించే "ఇరిడాలజీ" వృద్ధిలోకి వస్తోంది.

వీటన్నింటిని తలదన్నగల-పెను విప్లవం ఇప్పుడు, జన్మశాస్త్రంలోనే వచ్చి కూర్చుంది. ప్రయోగశాలలో టెస్టుట్యూబులో కృత్రిమ జీవాన్ని ఉత్పత్తి

చేశారు. జీవకణాలను సృష్టిస్తున్నారు. అవయవ నిర్మాణానికి సంబంధించిన అన్ని జాబితాలను లిఖించి భద్రపరచగల అరలూ, సంతాన జీవకణాలలోని పొరలే "జీన్స్." మనిషి వారసత్వ లక్షణాలను నిక్షిప్తంచేసి పెంచి పోషించే ఈ "జీన్స్"నే మార్చివేసే ప్రయత్నాన్ని శాస్త్రవేత్తలు చేస్తున్నారు. "జెనెటిక్ ఇంజనీరింగ్"లో వస్తున్న ఈ శీఘ్ర పురోగతి సృష్టికి ప్రతిసృష్టిని మానవునికి సుసాధ్యం చేయబోతున్నది. నిన్నగాక మొన్న వెల్లడైన సరికొత్త పరిణామం-ఈ "జీన్స్" జంటలమధ్య అనుబంధాన్ని తెగ్గొట్టి, ఇతర "జీన్స్"తో అంటుకట్టి సరికొత్త లక్షణాలుగల జీవకణాలను సృష్టిచేయడం. బ్యాటరీలో 'సెల్స్ మార్పిడి చేసినట్టే కొత్తగా, కృత్రిమంగా సృష్టి అయిన "జీవకణాన్ని" మాతృకణంతో తిరిగి కలిపివేయవచ్చునట. అంతేగాదు, శరీరంలో ఏ "జీన్స్" క్యాన్సర్ వ్యాధి కారణమైన క్రిముల్ని సృష్టిస్తున్నాయి, రాచపుండు పుట్టి మహమ్మారి కావడానికి ఏవి కారణం అవుతున్నాయి? జీన్స్‌ను చీల్చి "అంటుకట్టే" పద్ధతివల్ల ఇది తెలిపోగల రోజుకూడా దగ్గరలోనే వుందట. అలాగే "ఇన్సులిన్" అనే ప్రొటీన్ పదార్థాన్ని తయారుచేసుకోవటంలో శరీరానికి చేదోడు కాగల్గిన "జీన్స్"ను వేరుచేసి, అట్టి ప్రొటీన్స్ సహజంగా తయారుచేసుకోలేని, ధార్ఢ్యంలేని అవయవాలుకల మనుష్యులలో వాటిని ప్రత్యేకంగా అమర్చగలమని కూడా శాస్త్రవేత్తలు ఆశిస్తున్నారు.

సృష్టికి ప్రతిసృష్టి అంటే ఇదే. చంద్రలోకాధినేత కాగలిగిన మానవుడు చంద్రునిలో "ముసలమ్మ - రాట్నం" కట్టుకథ అని నిరూపించాడు. అలాగే నిర్జీవ పదార్థం నుంచి జీవ పదార్థం పుట్టినదని ఋజువుచేసిన మానవుడు, ఈ సృష్టికి తనను మించిన "మాధవుడు" వేరే లేడని, మానవుడే మాధవుడని ఋజువు చేస్తున్నాడు. ఆలోచనను అరికట్టి, చర్చను, జిజ్ఞాసను త్రుంచి బ్రతికిందే మతంకాగా వాటిని పెంచి పోషించిందే శాస్త్రము శాస్త్రవిజ్ఞానమూ. దానిని నిరంతరం కాపాడుకోవడం పైననే, మందికోసం మేధస్సును వినియోగించుకోవడం పైననే మన మనుగడ ఆధారపడివుంది.

# ఆధునిక నర్తనశాల!

వెనకటికి ఓ పెద్ద మనిషి కండ్లు పోయింతరవాత సూర్యనమస్కారాలు ప్రారంభించాడట. అలాగే శక్తి అంటూ ఉండాలేగాని వయస్సు మళ్ళిన తరవాత కూడా "కళాపోసన" నిషిద్ధం కాదని కొందరు నిర్ధయిస్తున్నారు. "కాలమను హొంతకారి కుస్తీలయందు చీల్చివైచెను మన సుధా జీవనంబు" అని ఓ కవి కుమారుడు విలపించాడు గాని ఆ వార్త ఆ బాధ తొలగిపోయే శుభఘడియలేవో కనుచూపు మేరలోనే ఉన్నట్టు ఒక మహా రాష్ట్ర పార్లమెంటు సభ్యుడు శకునం చెప్పాడు. ప్రజా ప్రతినిధులైన మన పార్లమెంటు సభ్యులకు త్వరలో ఒక నర్తనశాల తెరచి, నృత్య కళను నేర్పవలసిందిగా ఆయన సుప్రసిద్ధ నర్తకి సోనల్ మాన్‌సింగ్‌కు సూచించారట. అందుకామె సమ్మతించిందట కూడా. ఈవిడ జర్మనీలో క్లాసులు పెట్టి ఏ "ఛాంబర్ మ్యూజిక్" ఛాయలలో ఏ లయ తాళ గతులలో అక్కడి పార్లమెంటేరియన్లకు ఏ నృత్య ఫణితులు నేర్పారో మనకు తబిశీళ్ళు తెలియవు. కాని బయట వినిపించే వాద్యాలకు (డోలో డమరుకమో) మన నర్తనశాలలో సరైన చిందు పడితేనే మన ఎం. పి. లు రాణించ గలుగుతారు. ఇప్పటికి రాజకీయవేత్తలుగా మాత్రమే పాత్ర పోషణ చేస్తున్న వీరు ఇక మీదట సర్వకళాకోవిదులు కాగోరడం ఎంతటి అదృష్టమో సామాన్యులకు అర్థం కాదు.

ఎప్పటికైనా ఏకపాత్రాభినయం కంటే ద్విపాత్రాభినయం, బహుపాత్రాభినయం గొప్పది. జీవితం ఒక నాటకరంగం కాబట్టి అన్ని కళలనూ అభ్యసించి ఉండడం మంచిది. ఎన్ని విద్యలు నేర్వకపోతే ఈ జీవితం ఇంతగా ఇంద్రధనస్సులతో దీపిస్తుంది? రాజకీయవేత్తలకు నటన మరీ అవసరం. విరాట రాజు కొలువులో అర్జునుడు ఈ సత్యాన్ని నిరూపించాడు. నటన కోసమని అర్జునునిలా ప్రతీ ఎం. పి. విధిగా బృహన్నల

కానవసరం లేదు. కోరి కోరి ఆడారితనమూ అబ్బించుకోనక్కరలేదు. అయితే అవసరాన్నిబట్టి అర్జునుడు చీర కట్టడానికి జంకలేదు. రవికా వేసుకొన్నాడు. గాజులూ తొడుక్కున్నాడు, కోలాటం, గొబ్బి ఆటలూ ఆడాడు. చివరికి మట్టి పాత్రలపై నిలబడి మహత్తర నాట్యం చేశాడు- అలా నాట్యాచార్యుడయ్యాడు. కాలం కలిసివస్తే ఇప్పుడు మన పార్లమెంటు సభ్యులు నేర్చుకొనే నృత్యరీతులు ఎప్పటికైనా మరొక విరాటరాజు కొలువులోనైనా అక్కరకు రాకపోవు. "భరత కళా ప్రపూర్ణులు" కావడానికి రాజకీయ వేత్తలు కూడా అర్హులేనని మన చరిత్ర ఘోషిస్తోంది. శివుడు శివుడుగా లేడు. విలయతాండవంలో విశ్వమూర్తి అయ్యాడు. భరతముని నాట్య శాస్త్రం ప్రొఫెషనల్స్‌కు మాత్రమే ఉద్దేశించింది కాదు. వీర, రౌద్ర, భీభత్స, భయానక రసపోషణ ఏ ఒక్కరి సొత్తూ కాదు. అవతారాన్ని బట్టి అవతారికలు. విష్ణుమూర్తి నరసింహావతారంలో ఉగ్రనృత్యం చేశాడు. హిరణ్యకశపుడూ ఆ పనే చేశాడు. అయితే నృత్య రీతులలో ఒకటైన సాత్వికాన్ని అభినయించినవాడు హరిశ్చంద్రుడు! ఆసేతు శీతాచలం ఏలిన అనేక మంది ప్రభువులు రాజకీయవేత్తలైనా ఆడారు, పాడారు - నాట్యం చేశారు. మన జాయప సేనానీ కొండవీటి కొమరగిరి ప్రభువూ చేసిన పనీ ఇదే.

సంప్రదాయం బలమయినది. అందువల్ల నేర్చుకొనే నాట్యం సజావుగా ఉండేలా గాని మణిపురి, కథకళి, కూచిపూడి నృత్యాలలో దేనినైనా మన ఎం. పి. లు రక్తి కట్టించగలవారు. మన పూర్వులు పెట్టిన పుణ్యఫలమేమో గాని వీధి నాటకాలకూ, పగటి వేషాలకూ కూడా అవకాశం లేకపోలేదు. నిజానికి సర్వకళలలో ఆరి తేరిన వారు సర్వజ్ఞులైన సింగ భూపాలురే అవుతారు. వీరికి ప్రదర్శన యోగ్యత కలగాలేగాని విరగబడి చూచే ప్రియమైన నియోజక వర్గాల ప్రజలంతా ముక్త కంఠంతో-

"వారిదె భాగ్య వైభవము
వారిదె నృత్య విలాసము
వారిదె జన్మము......"

అనుకొని మనసారా తృప్తి పడతారు. కడుపారా నవ్వుకొంటారు! ఏ విధంగా చూసినా ఉపన్యాస ఊదరకంటే భంగిమలలో భావ ప్రకటన గొప్ప విజువల్ ఎడ్యుకేషన్!

# శేషప్రశ్న

దిగితేగాని నదిలోతు తెలియదు. ఈ జీవితం కూడా అంతే. ఉసురు కోల్పోయిన జీవి ప్రవాహం వాలున పడి కొట్టుకు పోతుంది. జవ జీవాలున్న ప్రాణి ఎదురీద గలుగుతుంది. కష్టాల కారడవిలో ఎదిగి వచ్చిన సుప్రసిద్ధ భారతీయ నవలా రచయిత శరత్ చంద్ర ఛటర్జీ అలాంటి ఎదురీతగాడు. గజ ఈతగాడు. ఏభై ఏళ్ళనాడు భారతీయసమాజాన్ని పట్టి పీడించిన రాజకీయ దాస్యం, దురాచార సంప్రదాయ శృంఖలాలు ఎలాంటివో వేరే చెప్పనక్కరలేదు. ప్రత్యక్ష జీవితానికి వేరే ప్రేక్షకులు ఉండరు. ఒక్క బెంగాలీ సమాజాన్నే కాదు, ఇటు తెలుగు దేశాన్ని, యావద్భారతాన్ని ఊగించి ప్రశ్నించిన సమస్యలు-బాల్య వివాహాలూ, విధవా వివాహ సమస్యా, స్త్రీల, శ్రమజీవుల కన్నీటి గాథలూ. ఈ పరిస్థితులలో సంస్కర్త కృషి ఒక ఎత్తు, కలాన్ని కత్తిగా మార్చగల రచయితల కర్తవ్యం మరొక ఎత్తు. శరత్‌బాబు తెలుగు వాడుగానే కొన్ని దశాబ్దాలపాటు ఏలుబడి సాగించి, తెలుగు సాహిత్యంపై ముద్రవేసుకొని నేడు తెలుగు గడ్డపై శత జయంతి ఉత్సవాలను కూడా జరిపించుకోగల్గుతున్నాడంటే - ఆ వైశిష్ట్యం కాలాన్ని ప్రశ్నించిన అతని కలానిదే. అతని సాహిత్యం వేల ప్రతులతో చెల్లిపోయాయన్నా, ఇంటింటి గ్రంథమాలగా అల్లుకొని పోయాయన్నా బెంగాలీ సమాజ రుగ్మతలన్నీ తెలుగు సంఘాన్ని కూడా నిలువెల్లా కొరుక్కుతిన్నందువల్లనే. సంఘాచారాలపై కత్తివాట్లు పెడుతున్న శరత్‌ను దూషించిన కులీన వర్గాలే ఒక తరం తరవాత అతనికి నీరాజనాలు పట్టవలసి వచ్చింది. సంపన్నుల లోగిళ్ళు సహితం శరత్ నవలా సాహిత్య మందిరాలుగా సాక్షాత్కరించాయి.

దారిద్ర్యం లోతులు చూసిన శరత్, నవలల ద్వారా సాంఘిక దురాచారాలకు ఎన్నో శరతల్పాలు సృష్టించి వెళ్ళాడు. కునారిల్లిపోతున్న దరిద్రులకూ, అసహాయ స్థితిలో అనాదరణవల్ల కాలుజారిన కాంతల జీవితాలకూ ప్రాతి

నిధ్యం వహించాడు. ఇతని రచనలలో మనం మాక్సిం గోర్కీ, టాల్‌స్టాయ్‌ల పటువైన కథన శక్తిని చూస్తాం. తెలుగు పాఠకులకు సుపరిచితాలైన "చరిత్రహీనులు", "దేవదాసు", "శేషప్రశ్న", "శ్రీకాంత్", "బడదీది"లో సంఘ దౌష్ట్యాలకు బలి అవుతున్న పతితల అంతర్వేదనా, రంపపు కోతా గుండెలను పిండిచేయడం చూశాం. తరచుగా అతని పాత్రలలో వ్యక్తమయ్యే వియోగబాధ జీవితంపై ఆపేక్షకొలదీ అసహాయ స్థితితో కనబరచే ఉపేక్ష మాత్రమే. ఆత్మహత్యలకు పురిగొలిపే పిరికిమందును అతడు నూరిపోయలేదు. సంఘంలో స్వేచ్ఛను ప్రేమించిన శరత్ రాజకీయాలలో నిరంకుశ ధోరణులను నిరశించాడు. ధన స్వామ్యాన్ని ఏవగించుకొన్నాడు.

శరత్ నవలలన్నీ ఒక స్థాయి, అతను "ఆడ బతుకు" పైన సిద్ధపరచిన థీసిస్ మరొకస్థాయి. స్త్రీని గౌరవించడం అతనికే తెలుసు. "పవిత్రత" అనే తేనె పూసిన సుతిమెత్తని కత్తిని ఒక్క స్త్రీపైనే ఎందుకు ప్రయోగించాలి? పురుషుని కెందుకు వర్తింపచేయరాదని ప్రశ్నించాడు. స్త్రీ-పురుష వివక్షను ప్రశ్నించి, స్త్రీకి సొంత గొంతు కల్పించేందుకే ఆయన యుగయుగాలుగా వస్తున్న దొంగ ధర్మాలన్నింటినీ ఎండగట్టాడు. కుల మతాలకూ, దుర్మార్గపు ఆచారాలకూ, పురుషుని ధాష్టీకానికి ఆదరవు "స్వార్థం" తప్ప మరొకటి కాదన్నాడు. మహిళను అబలగా మార్చిన హిందూ ధర్మ శాస్త్రాలను చారిత్రక పరిశీలనద్వారా చీల్చి చెండాడాడు. తాను శ్రోత్రియుడైనా వైదికాచారాలను తూర్పారబట్టాడు. నేటికీ మన సమాజంలో ఆర్థిక స్వాతంత్ర్యానికి దూరదూరంగా ఉంటున్న స్త్రీకి విలువ ఒక విలాస వస్తువుగా, వ్యాపార ప్రకటనలలో కొంటె చూపుల కోణంగిగా మాత్రమే. సంతానంలోనేగాక, వస్తూత్పత్తి రంగంలోనూ, సమాజ సర్వతోముఖాభివృద్ధిలోనూ సమభాగిని కాగలిగినప్పుడే శరత్ ఆశించిన ఆదర్శమహిళ మనకు దక్కుతుంది. ఆ శక్తిని తానుగా పొందగలశక్తి ఆవిడకు ఉంది. అయితే అది ఏనాటికి విశ్వరూప మెత్తగలదు అన్నది ఈనాటికి శేషప్రశ్నే!

# "మేకపిల్ల వేపుడు......"

చరిత్ర పాఠాలు చిత్రమైనవి. పఠనం ఎంత గొప్పదో మననం కూడా అంత విశిష్టమైనదీను. అందుకే విజ్ఞులు "తన చరిత్ర తను పఠించి ఫక్కున నవ్వింది ధరణి" అంటారు! స్వాతంత్ర్య సమరం ముగిసింది. స్వరాజ్యం వచ్చింది. ముగిసిన సమరానికి పరాపర బేధం లేకుండా, అఖిలభారతం కై మోడ్పులు తెలిపింది. ముందుతరాల భవిష్యత్తు ఆశాజనకం కాగలదని ఆశాభావం ప్రకటించింది. ఆగస్టు స్వరాజ్య రథాన్ని అందరూ మోశారు. అయినా మోసిన బోయీలలో కూడా తేడా పాడాలను ఒక కవి కుమారుడు ఇలా చెప్పుకుపోయాడు :

"స్వర్ణ సుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీ పాద పద్మములకు,
ఏమిలేనట్టి భిక్షుకుండేని నేడు
కంటి క్రొన్నీటి ముత్యాల కాన్క విడుచు"

అప్పటికీ, ఇప్పటికీ ఈ అంతరాల తొందర తొలగలేదు. పైపెచ్చు భవిష్యత్తు మీద విశ్వాసంతో స్వాతంత్ర్య సమారాధనలో తనకు అప్పటికి మిగిలిన "కన్నీటి కాన్కలు" సమర్పించుకొన్న కటికదరిద్రుడిని మాత్రం ఆ కన్నీరు విడువలేదు. మున్నీరుగా మారింది.

ఇది, వ్యక్తులు కోపతాపాలతో చేసే ప్రకటనకాదు, స్పర్థకాదు, ఘర్షణకాదు. మన ప్రభుత్వం అందిస్తున్న సమాచారమే; అధికారంలోవున్న మన నాయకులు చెప్పుతున్న మాటలే; మన ప్రతిపక్షాలు నిత్యమూచేస్తున్న అలజడే. ప్రధాన మంత్రి పలుమార్లు "ధనికులు మరింత ధనికులవుతున్నారు; పేదలు నిరుపేద లౌతున్నారు" అని చేసిన ప్రవచనాలే.

నిన్నకాక మొన్ననే కాంగ్రెస్ అధ్యక్షుడు బారువా అందరికి ఆమోదయోగ్యమైన ప్రకటన చేశారు. "ప్రజల ప్రయోజనాలే దేశం ప్రయోజనాలు."

అయితే...... ఆ "ప్రయోజనా" లేమిటో వివరించనందున ఆ ప్రకటన అప్రయోజనకరమై పోయింది  ఆర్థిక సంక్షోభానికి కారణాన్ని—స్మగ్లర్లలోనో, మరొకదాన్లోనో చూడమంటున్నారు. దారిద్ర్యానికి కారణం ఉత్పత్తి కొరత అంటున్నారు.  కాని.... కాని...

నలభై ఏళ్ళనాటిమాట. అది 1933. పండిట్ నెహ్రూ జాతి భవిష్యత్తును తీర్చి దిద్దగల కొన్ని సూత్రీకరణలు చేశారు. ప్రపంచ పరిణామాలను సమీక్షిస్తూ ఇండియాకి ఏది అవసరమో ఆయన "విథర్ ఇండియా" (దేశమా ఎటు నీ ప్రయాణం?) అని రాశారు. కాంగ్రెస్ యువకులలో చలనానికి, సంచలనానికి కారణమైన పుస్తకం అది. కార్యకర్తలను ఆచరణకు కొన్నాళ్ళు ప్రేరేపించిన రచన అది. ఆయన కాలంలో ఆనాటి లక్ష్యాలు నెరవేరక పోయినా, తండ్రికితగిన తనయగా శ్రీమతి ఇందిరాగాంధి మరొక్కసారి పండిట్‌జీ మాటలను మననం చేసుకోవడం మంచిది !

"స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు కొలబద్ద ఏమిటి? ఏ మేరకు ప్రజలపై భారాన్ని తొలగించ గల్గుతామో అదే కొలబద్ద. ఈ భారాలన్ని మోపింది విదేశ స్వార్థపరశక్తులు, దేశీయ స్వార్థపర శక్తులు...... విదేశ ప్రభుత్వం స్థానే దేశీయ ప్రభుత్వం ఏర్పడినందువల్ల ఈ స్వార్థపర శక్తులను అలాగే అట్టిపెడితే, అది నామమాత్రపు స్వాతంత్ర్యంకూడా కాజాలదు...

"సంపద పంపిణీ, ప్రజల కొనుగోలు శక్తి సమస్థాయిలో పరిష్కారం కావాలంటే పెట్టుబడిదారీ వ్యవస్థలోవున్న మౌలికమైన అసమానతలకు స్వస్తి చెప్పాలి. ఇంతకంటే శాస్త్రీయమైన వ్యవస్థ ఏర్పాటుద్వారా పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించుకోవాలి.

"...జాతీయోద్యమానికి ప్రాతిపదిక, దాని కోరికా కూడా, ప్రజల ఆర్థిక స్థితిని మెరుగుపరచి, ప్రజాబాహుళ్యం మూల్గులను పీల్చి వేసిన భారాలను తొలగించి ప్రజలకు దోపిడి నుంచి విముక్తి సాధించాలన్న వాంఛ నుంచి పుట్టుకొచ్చినవే. ఈ భారాలు, బాధలు ఇలాగే కొనసాగి, ఇంకా పెరిగేటట్టియితే, ఈ పోరాటం ఇకముందు కూడా కొనసాగడమే గాక, మరింత విస్తృతం కాగలదని గుర్తించేందుకు పెద్దబుర్ర అవసరం లేదు. నాయకులు, వ్యక్తులు వస్తారు, పోతారు; వారు అలసి పోవచ్చుగాక; పట్టు సడలిపోవచ్చుగాక, రాజీలు పడనూ వచ్చు; ద్రోహాలు చేయవచ్చుగాక. కాని బాధలు పడుతున్న ప్రజాబాహుళ్యం తమ పోరాటాన్ని విడవజాలరు. ఎందుకని? వాళ్ళను

కవాతు త్రొక్కించేది (డ్రిల్ - సార్జంట్) కటిక దారిద్ర్యం- ఆకలి. ప్రజల దృష్టిలో దోపిడి నుంచి విముక్తి పొందడమంటే అలంకారప్రాయమైన రాజ్యాంగపత్రం కాని లేదా రేపు చూడవలసిన సమస్యకాని కాదు. ఆ సమస్య ఇప్పుడు, ఇక్కడ తేలాలి. ప్రజలకు తక్షణం దోపిడీనుంచి విముక్తి కావాలి. మేకపిల్లవేపుడు, కమ్మటి మాంసం పులుసు బోక్తకు (తినేవాడికి) రుచిగానే వుంటుంది. కాని తన కక్కుర్తి కోసం అమాయకపు జీవుల్ని బలిపెట్టే కసాయివాడి కన్నీళ్ళు, తీపిమాటలు ఆ మేకపిల్లకు మాత్రం ససేమిరా రుచించవు"....క్రమబద్ధమైన, ప్రణాళికాబద్ధమైన వ్యవస్థలో సరకు "మిగులు" అనేది వుండదు. ఉత్పత్తి అయిన సరకు ప్రజల జీవన ప్రమాణం పెంచ డానికి తోడ్పడుతుంది. అవును మరి, తన శ్రమ ఫలితాన్ని అనుభవించే హక్కు శ్రమజీవికి వుండాలి. ఈ శ్రమ ఫలితాన్ని కాపిటలిస్టు వ్యవస్థ బలవంతంగా అతణ్నుంచి గుంజివేస్తుంది కాబట్టే, అట్టి వ్యవస్థను మనం వ్యతి రేకిస్తాం. సోషలిజంలో మాత్రమే మానవుడు తన శ్రమ ఫలితాలను పూర్తిగా అనుభవించగల్గుతాడు. 20 వ శతాబ్దం సమస్యలను 19 వ శతాబ్దం తీర్చజాలదని మనం గుర్తించాలి."

అది 1933. ఇది 1974. నాలుగు దశాబ్దాల అంతరం. అయినా కార్యాచరణకు ప్రాధాన్యంయిచ్చే కాంగ్రెస్ యువకార్యకర్తలందరికీ మళ్ళీ పండిట్ జీ రచన "విధర్ ఇండియా?"- "భారత దేశమా ఎటు నీప్రయాణం" "మాగ్నకార్టా" కావాలి.

# మడి కట్టుకోవడం మానుకొం

ప్రాణం లేని జీవి వాలునపడి కొట్టుకుపోతుంది. ప్రాణమున్న జీవి ఏటికి ఎదురీదుతుంది. మనిషి ఉనికి విషయంలో ఈ సామెత సరిపోతుందేమోకాని భాషల విషయంలో ఇది సరిపడదు. భాష నిత్యప్రవాహిని. ఎప్పటి కప్పుడు కొత్త నీరు ఎక్కితేనే నదీప్రవాహానికి అందమూ, చందమూ, ప్రయోజనమూ. అలాగే భాషలకూనూ. మాటలు నేర్వని మనిషి చరిత్రకు అందని కాలంలో రకరకాల సంకేతాలతో, మూగసంజ్ఞలతో, హావభావాలతో మనసులోని "భావా"నికి రూపకల్పన చేసుకొని ఉనికిని నిరూపించుకొన్నాడు. ఈనాడు ఒక్క శాస్త్రం కాదు, విద్యావ్యాప్తిలో పలు శాఖలు అనునిత్యమూ వేల, లక్షల సంఖ్యలో పదాలను కుమ్మరిస్తున్నాయి. గొప్ప పదసృష్టి జరుగుతోంది. లోగడ ఏ దశాబ్దానికి ఒక సారో పునర్ముద్రణ పొందే నిఘంటువులు ప్రతి మూడునాలుగేళ్ళకే పునర్ముద్రణలు పొందవలసిన పరిస్థితి వచ్చింది. ఈ పదజడులకు తట్టుకోగల విధంగా ప్రపంచ భాషలన్నీ అడుగడుగునా మార్పులకు లోను కావలసిందే. ఏ భాషా కుటుంబానికి చెందినా వెయ్యిన్నొక్క భాషలూ సంస్కరణల సందడిలో తలమునకలు కావలసిందే. ఐన్‌స్టీన్ చెప్పి నట్లు "ఎంత సైంటిస్టు అయినా ఫార్ములాస్‌లో మాట్లాడడు. ప్రధానంగా భాష సహాయంతోనే మాట్లాడాలి. ఫార్ములా స్థిరాస్తి, భాష చరాస్తి." ఆ వెసులుబాటు లోపించింది కనకనే గ్రీక్ లాటిన్‌లు అంతరించాయి. పందొమ్మిదవ శతాబ్దంనుండి ప్రాచుర్యంలోకి వచ్చిన ఫ్రెంచి కూడా అలాగే వెనకపీటకు చేరుకొంది. ఆ మాటకొస్తే అనేక దడులూ, మడులూ కట్టుకొన్నందుననే సంస్కృతం కూడా "మృతభాష"గా మారింది. ఎటు తిరిగీ గ్రాహ్యశక్తి జాస్తిగాఉన్న ఇంగ్లీషు అప్పటికీ, ఇప్పటికీ అనూహ్యమైన పదసంపదలు పెంచుకొంది. సామ్రాజ్యతృష్ణ, వర్తక వాణిజ్యాభివృద్ధికూడా ఇందుకు దోహదం చేశాయి. అయితే ఇప్పుడు ఎక్కడికక్కడ దేశభాషలు, మాతృభాషలూ వికాసం కోసం తపన పడుతున్నందున మరికొన్నేళ్ళకు ఇంగ్లీషు ప్రభావం కూడా తగ్గి, అనేక ఇతర ప్రపంచ భాషల ప్రభావానికి ఇవి లోనుగాక తప్పదు. కావలసింది దేవభాషలు కావు, దేశ భాషలు.

ఈ సందర్భంలో "ప్రయోగాత్మకమైన తెలుగు భాష" గురించి హైదరాబాదులో ముగిసిన గోష్ఠి చేసిన నిర్ణయాలు మన భాషను పటిష్టం చేయడానికి తోడ్పడగలుగుతాయి. ఛాందసులు ఎన్ని అడ్డంకులు కల్పించినా ఇప్పటికే మన తెలుగు భాష ఎన్నో పరభాషా శబ్దాలను తనలో ఇముడ్చుకోగలిగింది. కఠిన పదాలతో, మారుమూల శబ్దాలతో నిమిత్తం లేకుండానే 400-500 మాటలలోనే మన సుఖదుఃఖాలనూ, వ్యవహారాలనూ (ఎంత గొప్ప భావాలైనా) బట్వాడా చేయగల శక్తిసామర్థ్యం తెలుగుకి ఉన్నాయని ఒకప్పుడు రాపీవారు చెప్పారు. ఇది మూలభాషకు సంబంధించిన విషయమైనా, ముమ్మరించుతున్న టెక్నాలజీ, సైన్స్, మెడిసిన్, వాణిజ్య సంబంధమైన శాస్త్ర విభాగాలనుంచి పెక్కు పదాలను కూడా ఆహ్వానించుకొని ఆదరించ గలిగిన భాష తెలుగు. ఒకానొక దశలో తెలుగు ఈనాటి తెలుగుగానే ఉండకపోయినా ఆశ్చర్యపోనవసరం లేదు. పరభాషా శబ్దాలతో భాష పరిపుష్టం కాగలుగుతుందేగాని, చిన్నదై పోదు. వన్నెచిన్నెలు పొందుతుంది. ఉదాహరణకు ఆల్బేనియన్ భాషకు మౌలిక శబ్దసంపద 430 మాత్రమే. కాని నేడది 5140 పదాల పుట్ట. మిగిలినవన్నీ అన్యభాషా పదాలే. కొరియన్ భాషలోని పదసంపదలో 75 శాతం ఇతర భాషలనుంచి వచ్చిన పదాలే. ఆధునిక ఆంగ్లభాషలో 75 శాతం వరకూ ఫ్రెంచి, లాటిన్, ఇతర "రొమానిక్ భాషల" నుంచి వచ్చిన శబ్దాలే.

మనం మాత్రం తక్కువ తిన్నామా? సంస్కృతం, హిందీ, పారసీ, ఇంగ్లీషు భాషల నుంచి వందల సంఖ్యలో పదాలను దించుకొన్నాం. న్యాయస్థానాల పరిభాషను తొలగించుకొంటే, తెలుగు వృద్ధిచెందదు. "రైలు"ను ఎలా తొలగించుకోలేమో "రాకెట్"నూ అంతే టిక్కెట్టును అందుకోకుండా ఎలా ఉండలేమో 'మిసిలీ'ని అంతే. వకాలత్, పారీఖత్తు. ఫర్మానా, ఖరారునామా, మింజుమలే మనవి కాకపోయినా మనవే! అందుకే—

"నిసువు కొక్క భాష
పశువు కొక్క భాష
మానవునికి మాత్రం
సంఖ్యానంతపు పలుకుబళ్ళు"

అన్నాడు శ్రీశ్రీ. ఆ పలుకుబళ్ళను ఎన్నిభాషలనుంచి ఎంతవేగంగా సొంతం చేసుకొంటే తెలుగు భాష మరి అంతగా సొగసులు చూపిస్తుంది. "ప్రయోజనాత్మకమైన తెలుగు" అంటే అదీ.

# అనంతయాత్ర

అంగారక (కుజ) గ్రహంలో ఏవో గీతలు, పళ్లాలు, చూసి కుల్యాలు (కాల్వలు) ఉన్నాయి, వ్యవసాయం సజావుగా సాగుతుంది, గొప్ప నాగరికత వుందక్కడ అనుకున్న తొలిశాస్త్రవేత్తల కలలు, కల్లలయాయి. కుల్యాలు లేవు, కుడ్యాలులేవు, మడులులేవు, మాన్యాలులేవు - అయినా తృష్ణ చల్లార లేదు, చల్లారదు కూడా.

మానవుడు సౌర కుటుంబ రహస్యాలు బేధించడానికి పడుతున్నపాట్లు అన్నీ, ఇన్నీ కావు. తాను నివశిస్తున్న "గ్రహ (భూమి) బలం"తో సంతృప్తి చెందకుండా, నవగ్రహాలను పరామర్శించి పరిచయం చేసుకొనడానికి పరిత పిస్తున్నాడు. సూర్యునికి సమీపంలోనే కాదు, భూమికికూడా ఇరుగు పొరు గైన శుక్ర, కుజ గ్రహాలకు రోదసీ నౌకలను పంపుతున్నాడు. అయితే ఇప్పటివరకు అమెరికా, రష్యాలు జరిపిన ప్రయోగ యాత్రలు ఒక తరహావి కాగా ఇప్పుడు అమెరికన్ రోదసీ నౌక 'వైకింగ్' కుజగ్రహానికి ప్రారం భించిన యాత్ర వేరు. ఇంతవరకు అమెరికన్ "మారినార్స్", రష్యన్ "జాండ్స్" మనకు అందజేసినవి, అవి కుజగ్రహానికి రెండువేలమైళ్ళ సమీపంనుంచి దూరంగావుండి తీసిపంపిన ఫోటోలు మాత్రమే. కానీ ఈసారి "వైకింగ్" ప్రయోగ వైశిష్ట్యం గ్రహంపైన ప్రత్యేక శకటం కాలుపెట్టి మచ్చులు సేకరించి వాతావరణం పరిశీలించి, రసాయన ప్రక్రియలను పరి శోధించి సమాచారాన్ని మనకి పంపించడం, వివరంగా ఫోటోలు తీయడం.

ఈ రోజువరకు ధవళ కాంతులీనే శుక్ర గ్రహంపైన, అరుణ కాంతులీనే అంగారకునిపైన శాస్త్రవేత్తలకు కనిపించింది, బొగ్గుపులుసు వాయువుతప్ప జీవరాసి జాడలు కావు. చాలాకాలంగా కట్టుకథలకీ, వూహాపోహాలకీ కాణాచిగావున్న గ్రహాలలో అంగారకగ్రహం ఒకటి. అయితే పరిశోధనా పాటవంవల్ల వూహ నిగ్గు తేలుతుంది. కాబట్టి విజ్ఞానశాస్త్ర సహితమైన

వ్యూహాలు, ప్రతిపాదనలు మానవునిలో శాస్త్రీయ జిజ్ఞాసను పెంపొందిస్తాయి. ఆ మేరకు విజ్ఞానయాత్రలు తప్పుడు "గ్రహబలాల"కు జీవితాలను ముడి పెట్టుకుని విలువ కట్టుకునేవారి విశ్వాసాలను చెదరగొట్టక తప్పదు. చంద్ర లోకానికి సాధ్యమైనట్లే త్వరలో చిన్న, పెద్దగ్రహాలకు కూడా బృహత్ యాత్రలు మానవులతో కూడా సాధ్యం కావచ్చునేమో ! అయితే ఈ రోదసీ యాత్రలు శాంతి ప్రయోజనాల కెంత అవకాశమో, యుద్ధ వ్యూహ ప్రయోజ నాలకు కూడా అంతే అవకాశం కల్పిస్తున్నాయి.

# ఆఫ్రికన్ సోషలిజం

ఒకప్పుడు ఈజిప్షియన్ రాజు ఫరూక్ "నేను గతించి పోయిన మరుక్షణం నుంచి మహా ప్రళయమే" అన్నాడు. కాని ఆయన రాచరిక వ్యవస్థకు నిజంగా అది 'ప్రళయం' కావచ్చునేమో కాని ప్రజలకు మాత్రం అతని పతనం ప్రమాదమే అయింది. ప్రజల అభీష్టానికి విరుద్ధంగా వారి నెత్తిపై ఎక్కి కూర్చున్న ప్రతివాడు తరువాతి తరాలకు రానున్నది "ప్రళయ" మనే ప్రగల్భించాడు. నేడు ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ కూడా ఎంతగా "పీపుల్స్ కేపిటలిజం" (ప్రజల పెట్టుబడిదారీ విధానం) అని చెప్పు కుంటున్నా, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం నిత్యజీవితంలో అది కూడా 'ప్రళయం'గానే నిరూపించుకుంటోంది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాలన్నిటా గాలివాటు మారింది. అవకాశాన్నిబట్టి వ్యవస్థల రూపురేఖలు మార్చుకునేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి.

పనామానుంచి పశ్చిమాఫ్రికా వరకు ఒక సంచలనం కనిపిస్తున్నది. 19 వ శతాబ్దంనాటి రాబర్ట్ ఒవెన్ నుంచి ఈ శతాబ్దపు బోర్గ్విబా వరకు రక రకాల "సోషలిజం" ప్రతిపాదనలు వినిపిస్తున్నాయి. 'అన్ని రహదారులు సోషలిజం రాస్తాకే దారితీస్తాయి' అంటున్నారు.

ఇటీవలనే ఆఫ్రికా దేశాలకు చెందిన 30 పార్టీలు ట్యూనిస్‌లో ఆరురోజులు సమావేశమై ఆఫ్రికాలో సోషలిజం స్థాపనకు, అభివృద్ధికీ ఆదేశిక సూత్రాలు సిద్ధం చేశాయి. "ఆఫ్రికా దేశాల అవసరాలకు అనుగుణమైన సోషలిజం" నిర్మాణం ధ్యేయంగా ప్రకటించాయి.

ఆఫ్రికా ఖండానికి ప్రకటించిన ఈ "బ్లూ ప్రింట్" అక్కడ దేశాలలో సంచలనానికి కారణం కాగలుగుతుందనడంలో సందేహం లేదు. ఎందువల్ల నంటే ఏకైక పార్టీలు ఏలికలుగావున్న 26 దేశాలు ఈ సమావేశంలో పాల్గొన్నాయి. ఈ ప్రభుత్వాల పరంగా ఈ ప్రకటన వెలువడింది.

అయితే ఈ 'సోషలిజం' ఏ మేరకు శాస్త్రీయమైనదో చెప్పలేముగాని ట్యునీసియా ప్రెసిడెంట్ బోర్గ్విబా చెప్పినట్టు "ట్యూనిస్ సమావేశం నిర్ణయించిన 'సోషలిజం' పిడివాద సిద్ధాంతమూ కాదు ఒక రాజకీయ వ్యవస్థ కాబోదు." ఏతావాతా ఆయా పరిస్థితులనుబట్టి, అవకాశాలనుబట్టి ఎప్పటికప్పటి పరిణామాలనుబట్టి అనుసరించుకునే సోషలిజం ఇది.

"నిజానికి ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం స్వాతంత్ర్యం పొందిన పెక్కు ఆఫ్రికన్ దేశాలలో ఫ్యూడల్ అవశేషాలకు తెగల, వ్యవస్థల బంధాలను తెగతెంపులు చేసుకొనడానికి ఎక్కువ అవకాశాలు వచ్చాయి. కేపిటలిస్ట్ దశలో చొరబడకుండానే, సరాసరి సోషలిస్ట్ వ్యవస్థలోకి ప్రవేశించగల తాహతు వాటికుంది. కాని ఆఫ్రికా వనరులను స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకున్న సామ్రాజ్యవాద శక్తులు, దేశీయ ఫ్యూడల్ శక్తులు, ప్రజాస్వామిక రథాన్ని ముందుకు సాగనివ్వకుండా అడ్డంకులు కల్పించారు. సైనిక తిరుగుబాట్లు తెచ్చారు. సోషలిజాన్ని ధ్యేయంగా ప్రకటించుకున్న ఎన్క్రుమాను సాగనంపారు. ప్రెసిడెంటు నైరీరీపై చాలాకాలంగా కన్ను వేసి వుంచారు. ఈ రోజున ఆఫ్రికా దేశాల మధ్య పొరపొచ్చాలకు, సరిహద్దు తగాదాలకు వారే కారకులవుతున్నారు. బయాఫ్రాలో హత్యలు, ఇథియోపియా, ఎరిట్రియాల కుమ్ములాటలు, సోమాలి- కెన్యాల మధ్య అంతఃకలహాలు, ఉత్తర, దక్షిణ ఎమెన్ల మధ్య చీలికలు వారి సృష్టే. వెరసి వీటన్నిటి ఫలితం ఆఫ్రికాను శాంతికి దూరం చేయడం.

ఈ దుస్థితి నుంచి తప్పించుకొనడానికి ఆఫ్రికా సమైక్యత ఒక్కటే మార్గం. దేశాల మధ్య సమైక్యతను సాధించడంలో సమైక్య అరబ్ రిపబ్లిక్ కంటే టాంజానియా ప్రయోగం విశిష్టంగా కనబడుతోంది. ట్యూనిస్టు సమావేశం నిర్ణయాలు ఏ మేరకు అమలు జరగగలవన్నది సమావేశకర్తల దీక్షపైన, దక్షతపైన ఆధారపడి వుంది. హిందూ మహాసముద్ర ప్రాంతంలో ఇటీవల పెచ్చరిల్లుతున్న ఆయుధ పోటీవల్ల ఆ ప్రాంతంలోని ఆఫ్రికన్ దేశాల భవిష్యత్తుకూడా ఇండియాతో సాన్నిహిత్యం పెంచుకొనడంపై ఆధారపడి వుంటుంది. సమష్టి నిర్ణయాలు సత్ఫలితాల నిస్తాయి.

# "కాంచనగంగ" సాకిగా

శిశువు తనవాడు కానీయండి, దత్తుడు కానీయండి- పుట్టుక ఒక ఎత్తు, పెరుగుదల వేరొక ఎత్తు. శిశువు జననానికెంత విలువవుందో భావి జీవితంలో దానివల్లపొందే ప్రయోజనానికి అంతటి విలువా వుంది.

ఇండియన్ యూనియన్‌లో సిక్కిం సభ్య రాష్ట్రమైంది. ఇప్పటివరకు కొన్నాళ్ళు బ్రిటిష్‌వాళ్ళ క్రింద, ఇంకొన్నాళ్ళు స్వతంత్ర భారతానికి "రక్షిత ప్రాంతం"గావున్నా, ఇప్పుడు 22 వ రాష్ట్రంగా భారత యూనియన్‌లో "పునర్జన్మ" ఎత్తింది. మనకు సంబంధించినంత వరకు ఇది నూతన శిశువు మాత్రమే. భౌగోళికంగావున్న చిక్కులవల్ల కొంత, చారిత్రిక అవశేషాలవల్ల మరికొంత, సామ్రాజ్యవాదుల ఆగడాలవల్ల ఇంకొంతగాను, ఇంతవరకు పెక్కు ఆటుపోటులకు గురైన ఈ హిమాలయ ప్రాంతం భవిష్యత్తుకు ఇక నుంచి పూచీదారులం మనమే. దాని యోగక్షేమాల బాధ్యత మనదే. చైనా, ఇండియాలమధ్యవున్న అతి చిన్న ప్రాంతాలలో సిక్కిం ఒకటి కావడం, దాని వైశాల్యాన్ని బట్టిగాక, దాని జనాభానుబట్టిగాక, దాని ప్రకృతి సౌందర్యాన్ని బట్టిగాక, అంతర్జాతీయ రాజకీయాలలో పెద్ద పాచిక కాగల అవకాశాన్నిబట్టి కూడా మనకు అత్యంత ప్రాధాన్యంగల విషయం. పాత బంధాలకు కొత్త సంబంధాలకుకూడా, అక్కడి సమున్నత గిరిశిఖరం "కాంచన గంగ" వేయికళ్ళతో కాపలా వుంటుంది !

రాచరిక సంబంధాలన్ని తెగిపోవలసిందే; ఫ్యూడల్ సంబంధాలన్నీ మాసిపోవలసిందే; పాత, కొత్త రాతి యుగపు ప్రజావ్యతిరేక పాలనావ్యవస్థలు మంటగలవ వలసిందే; ప్రజల అస్థికలపై వ్యాపారంచేసే రాచనగరపు కుట్రలూ, రాణివాసపు కూహకాలూ అంతరించవలసిందే. అది సిక్కింలో కూడా జరిగినప్పుడు, అందుకు సర్వులూ సంతోషించవలసిందే. అది

ప్రజాస్వామ్య యుగంలోకి అడుగుపెట్టినప్పుడు అందరూ వేనోళ్ళ, వేచేతులా స్వాగతం పలకవలసిందే, ఆదరించవలసిందే కాని....

'ప్రజాస్వామ్యా'న్ని సిక్కిం రాష్ట్రానికి వర్తింపజేయడంలో మన పాలకులకు ముత్యాలముగ్గులకన్నా ముళ్ళపొదలే ఎదురు కాగల అవకాశాలు వున్నాయి. మన ప్రజాస్వామ్య వ్యవస్థలోని మంచిని వ్యాప్తి చేయడంతోపాటు, చెడునుకూడా వ్యాపింపజేస్తే, అప్పుడు నూతన రాష్ట్రానికి సుఖాలకన్నా, కష్టాలే ఎక్కువవుతాయి. ఇక్కడి పాలనా వ్యవస్థలోవున్న అవినీతి, సవాలక్ష అవాంఛనీయ సంప్రదాయాలు, దోపిడీపద్ధతులు, ఫిరాయింపు రాజకీయాలు, చెలాయింపు ధోరణులు అక్కడికి ప్రాకకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. తప్పితే, ఆడితప్పిన వాళ్ళమవుతాం. లేదా **అసలు** సిక్కిం పరిపాలనా వ్యవస్థయే భిన్నంగా వుంటుందా ? ఉండగలిగితే దాని ప్రభావం ఇతర భారత రాష్ట్రాలపై ఎలా వుంటుంది ? సరిహద్దులలో కీలక స్థానంలోవున్న ఈ ప్రాంతంలో ప్రవేశపెట్టే పాలనా పద్ధతులు, సంస్కరణలు ఏ మేరకు ప్రజాదరణ పొందగలవో, ఆ మేరకు సిక్కిం భద్రతకే కాదు, ఇండియా రక్షణకుకూడా అవి "ఏడుగడ"గా వుండగల్గుతాయి.

దేశరక్షణ ప్రయోజనాలదృష్ట్యా మనం తీసుకుంటున్న చర్యలన్నీ-మన ప్రతిష్ఠను ఇనుమడింప జేయాలి; మన గౌరవాన్ని కాపాడాలి. మన ఔన్నత్యాన్ని కడిగిన ముత్యంలా ప్రదర్శించాలి; మన సంస్కరణల వైశిష్ట్యాన్ని అప్రతిహతంగా చాటగలగాలి. అది కాశ్మీర్ కావచ్చు; సిక్కిం కావచ్చు, బంగ్లాదేశ్‌తో సంబంధాలే కావచ్చు-మన సహాయంతో, సహకారంతో లాభించగోరే వారెవరైనాసరే - వారితో మన బాంధవ్యాలు "పుష్పశయ్య"లు కాకపోయినా, కనీసం మన నెత్తిపైన ముళ్ళపందిళ్ళు కాకుండా చూసుకోవాలి. బంగ్లాదేశ్‌లో కొన్ని పరిణామాలు ఈ హెచ్చరికలు చేస్తున్నాయి.

# "త్రివేణీ సంగమం"

బంగారపు పళ్లెరానికి కూడా గోడ చేర్పు అవసరమేమోగాని, స్వయం ప్రతిభ కల కవికి ఆ అవసరం వుండదు. అతడు సూర్యునిలా స్వయం ప్రకాశం కలవాడు. వ్యక్తికి అలంకరణ అవసరం కావచ్చుకాని, అసలు లేని అంద చందాలను తెచ్చిపెట్టదు. అలాగే ఆంతర్యం కూడా. అతనే ఒక పద్మం. వేరే భూషణాలు అవసరం లేదు. అటువంటివాడు, రిపబ్లిక్ దినోత్సవాన "పద్మభూషణ్" అవార్డుపొందిన మన దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి. బిరుద బీరాలు అతణ్ణి ఆశ్రయించినవేగాని, ఆయన చేయిచాచి, తెచ్చిపెట్టుకున్నవి కావు.

కడచిన ఏభై ఏండ్ల తెలుగు సాహిత్య మాగాణంలో కవితారంగంలో రాజనాలు పండించిన మహాకవి కృష్ణశాస్త్రి. ఒక్క కథ, నవల మినహా- అన్ని సాహిత్య ప్రక్రియలనూ స్పృశించినవారు. సాహితీ సమితిలో భావ కవులకు, నవ్య కవులకు ఆరాధ్యుడై, పుంఖానుపుంఖంగా రచనలు సాగించినవారు. ఆధునికాంధ్రసాహిత్యంలో అనుపమానమైన ప్రతిభావంతుడేగాక, ఒక సమకాలిక రచయిత వర్ణించినట్లు ఆయన "ప్రాచీన నవీన ప్రగతివాదాల త్రివేణీ సంగమం." జాతీయోద్యమ సంప్రదాయాలు, మానవతావాదం, బ్రహ్మ సమాజ భావాలతో అనుబంధం- ఇన్నేండ్లుగా ఆయన భావాలను తీర్చిదిద్దుతూ వచ్చాయి. ప్రాచీనులలో నవ్యుడుగా, నవ్యులలో అతినవ్యుడుగా ఈ నా వరకు- ఇన్ని తరాల వారికి చెక్కు చెదరని వారధిగా నిలబడుతున్న మనీషి కృష్ణశాస్త్రి.

పెక్కు సంవత్సరాలు "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అని భీష్మించి కూర్చుని విరహ వేదనలు, వియోగ మాధుర్యాలు కవితలో చూపించిన ఈయన, చివరికి దిగివచ్చి, ప్రజల మంచి చెడుల గురించి కూడా చెప్ప

సాగారు. తెలుగు నుడికారం ఆయన సొంతం. సొంతభాషలోని మెరుపు లను, విరుపులను కవితలో చూపించారు. పదచిత్రాలకు భావ చిత్రాలకు పెట్టింది పేరు. భాషలో తియ్యదనం. "కృష్ణపక్షం", ఊహా ప్రేయసి "ఊర్వశి"ని విడిచిన తరవాత, రేడియో నాటికలలో, సినీమా పాటలలో, ఇతర పల్లెపదాల కూర్పులో కృష్ణశాస్త్రి కలం ఒక ఒరపిడి రాయిలా మారి పోయింది. ఈ ప్రక్రియ అన్నింటిలోనూ కాల్పనిక కవులైన వర్డ్స్‌వర్త్, షెల్లీల ప్రతిభను ఏకకాలంలో మనం కృష్ణశాస్త్రిలో చూస్తాం. "పుష్ప లావికల" గురించి ఎంత అందంగా చెప్పగలడో, "బూట్ పాలిష్" గురించి కూడా అంత గొప్పగానూ చెప్పగల సమర్థుడు. "మైలురాయి"లో జియ్యన్నచేత "తిళ్లలేక ఏడుత్తుంటే తీర్థాలా, తిర్నాళ్ల ఏప్రిటా" అని ప్రశ్న వేయించిన కవి. "లోకమందిరానికి పునాది, కోట్ల మంది సామాన్య జనం. సౌధభారం మోసేపునాది మనకి కనపడదు. కాని ప్రాసాద సౌందర్యం చూసి బలే అని కనుబొమ లెగరేస్తాం" అని "బూట్ పాలిష్"లో నేటి లోక నీతిని చమత్కరించినవాడు! "దివినుంచి భువి"కి దిగివచ్చిన తరవాతనే కృష్ణశాస్త్రి మానవతావాది కాగలిగాడు. సమ సమాజవాదికూడా కాగిలి గాడు. సామంతుల ఆస్థానాలు విడిచిన తరవాతనే సామాన్య సదస్సులు ఆయనను ఆరాధించ సాగాయి. సమాజం మాదిరే సాహిత్యమూ జీవ నది అని భావించిన వాడాయన. సమాజం మనది, దానితో మనం మారుతూ, దానిని మార్చాలన్న నిర్ణయానికి వచ్చినవాడు. కొత్తసమాజం సుస్థిరంగా ప్రతిష్ఠితమైన తర్వాతనే మరింత గొప్పకవులు వస్తారని చెప్పినవాడు, నమ్మినవాడు.

కృష్ణశాస్త్రికి ఇపుడు గొంతు లేకపోవచ్చు. కాని ఆ దుస్సహస్థితిని కూడా ఆయన గుండె బ్రద్దలయ్యేలా వర్ణించాడు: "శిథిల మందిరంలో అంధకారం" అని చెప్పుకున్నాడు. అయినా మూడు దశాబ్దాలనాడే తన స్థితిని ఊహిం చాడా అన్నట్లు "మూగవోయిన నా గళమ్మునను కూడ నిదురవోయిన సెల యేటి రొదలు కలవు" అని దండోరా వేసినవాడు దేవులపల్లి! సమాజ జీవి తంలో మాదిరి, సాహిత్యలోకంలో కూడా కృష్ణపక్షాలు రావచ్చు, పోవచ్చు. కాని సహృదయులైన సాహితీ పిపాసులందరూ నాటికీ నేటికీ 'కృష్ణ' పక్షమే నని మరవరాదు!!

— 1976 జనవరి 26 న దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి
"పద్మభూషన్" బహూకరించినప్పుడు.

# అధికార భాషగా తెలుగు

ఏదో నిన్ననో, మొన్ననో మనకు రాష్ట్రి మేర్పడినట్టు "అధికార భాష"గా తెలుగు స్థానం గురించి ఇప్పటికీ అప్పుడప్పుడు ప్రస్తావించుకోడం మనకు అలవాటుగా మారింది. కాని పనిగట్టుకుని ప్రభుత్వ యంత్రాంగం సర్వ శక్తులూ కూడదీసుకుని నడుంకట్టుకుని పనిచేసివుంటే, అన్ని స్థాయిలలోను తెలుగు అధికార భాషగా వాడకం చేయాలన్న 1966 నాటి నిర్ణయం ఈ సరికే అక్షరాలా అమలు జరిగి వుండేది.

వెయ్యేండ్లకు పైగా చరిత్ర కలిగి, పెక్కు పరిణామాలకు లోనయి, అన్ని భాషల సొబగులను తనలో ఇముడ్చుకుని, స్వయంప్రకాశంతో మరింతగా రాణించగల శక్తిగలది మన కమ్మని తెలుగు భాష. అట్టి భాషను, ప్రజా ప్రభుత్వం వున్నచోట ప్రజలకు దూరంగా వుంచడానికి వీలులేదు. తాలూకా స్థాయిలో ప్రారంభించిన ప్రయోగం ఇంకా అరకొరగానే అమలు జరుగుతున్నదంటే, యంత్రాంగం లోపమేనని చెప్పక తప్పదు.

ఇప్పుడు జిల్లా, రాష్ట్రిస్థాయి కార్యాలయాలన్నిటా, తెలుగుభాషను పూర్తిగా వాడుక చేయాలని శ్రీ వావిలాల అధ్యక్షతన ఉన్న అధికార భాషాసంఘం సిఫారసు చేసింది. ఇంతవరకు ప్రభుత్వం కృషిని సమీక్ రించిన దరిమిలా ఈ కమిషన్ విశిష్టమైన సూచనలు చేసింది.

నిజానికి గత ఉగాదినుంచే అన్ని జిల్లా స్థాయి కార్యాలయాలలోను, తెలుగు అధికార భాష కావలసింది. కాని మరి ఇన్ని మాసాలుగాను ఉత్తర్వులు జారీకాకపోవడానికి ఏ స్థాయిలో ఎవరు అడ్డుకుంటున్నారో తెలియదు. ఎందువల్లనంటే ప్రతి మార్పుకు, పరిణామానికి అవరోధం కలిగించే శక్తులు ప్రతిచోటా వుంటాయి. ముఖ్యంగా భాషా సంస్కృతుల విషయంలో ఇది మరింతగా సత్యం. నన్నయకు ముందుకూడా, నన్నయను మించిన కమ్మని తెలుగు వుందంటే నమ్మనివారు, ఇష్టపడనివారు వున్నారు. ఇటు వంటివారే వేమనను తెలుగువాళ్ళు తెలుసుకోకుండా చాలారోజులు అడు

నిలిచారు. మళ్ళీ ఇటువంటివాళ్ళే వ్యావహారిక భాష విశ్వవిద్యాలయాలకు ప్రాకకుండా పురచేయి అడ్డుపెట్టారు. అలాగే, ఆంగ్ల విద్యా వ్యామోహం కొలది తెలుగువచ్చికూడా "తెలుగు భాషలో ఉత్తర, ప్రత్యుత్తరాలు నడపండి" అన్న ఉత్తర్వును తెలుగులోకాక, ఇంగ్లీషులో పంపించేవారు ఇప్పటికీ వున్నారు. ఇదొక ఫ్యాషన్. ప్రజలకు పాలనా పద్ధతి ఎంత దూరంగా వుంటే, అంత మంచిది వీరి దృష్టిలో.

కాని ప్రజలకు ప్రభుత్వం సన్నిహితం కావాలన్నా, ప్రజలు ప్రభుత్వాన్ని మరింతగా అర్థం చేసుకోవాలన్నా, మాతృభాషలో సంబంధ బాంధవ్యాలు అత్యుత్తమం. అందుకు సంబంధించిన సకల శాసనాలు, రాజ్యాంగ విషయాలు, న్యాయసంబంధమైన అంశాలు-సర్వమూ, తెలుగు పల్లెసీమలలోని పాలికాపు వరకు అతని భాషలో వెల్లడి కావలసిందే. అనువాదాలను మరల "మార్జాల" పండితుల భాషలోకి దించకుండా పూర్తి వ్యావహారిక భాషలోనే వుంచాలి. తర్జుమా విషయంలోను, పారిభాషిక పదకోశాలను సిద్ధం చేయడంలోను, సిద్ధహస్తులైన వ్యావహారిక భాషావేత్తల, జర్నలిస్టుల సహకారం పొందడంవల్ల ప్రభుత్వ కృషికి ఎక్కువ మేలు జరుగుతుంది.

అన్ని స్థాయిలలోని తెలుగు భాషకి రానున్న గౌరవ ప్రపత్తులవల్ల తెలుగు బోధనాభాషగావున్న పట్టభద్రులకు ఉపాధి అవకాశాలుకూడా హెచ్చుకాగలవు. ఇప్పటివరకు ఇంగ్లీషు స్టెనోస్‌కి మాత్రమే పరిమితమైవున్న గిరాకీ, ఇకపైన తెలుగు స్టెనోస్‌కి హెచ్చుకాగలదు. కమిషన్ అంచనావేసిన పదివేల టైపురైటర్లను వెంటనే బుక్‌చేసి, సిద్ధం చేయడం అవసరం. అయితే, మనం ఇంతకాలంగా మన భాషపట్ల చూపుతున్న అశ్రద్ధ కారణంగా ఇంగ్లీషు స్టెనోల సంఖ్య పెరిగినంతగా తెలుగు స్టెనోల సంఖ్య పెరగలేదు. వీరు చాలా స్వల్పంగానే వున్నారు. శిక్షణపొంది చేతికి వచ్చేసరికి కొంతకాలం పట్టక తప్పదేమో. అయితే, శిక్షణకి అవసరమైన ఏర్పాట్లను త్వరితం చేయడం మంచిది.

దేశంలో హిందీ తరువాత హెచ్చు జనాభా మాట్లాడే రెండవ పెద్ద భాషగా ఎన్నికలోకి వచ్చింది తెలుగుభాష. అందువల్ల ఇకపైన యూనియన్ సర్వీస్ కమిషన్ పరీక్షా భాషగాకూడా తెలుగును గుర్తించాలని వావిలాల కమిషన్ చేసిన సిఫారసును రాష్ట్ర ప్రభుత్వం వెంటనే కేంద్రం దృష్టికి తెచ్చి అనుమతిని పొందడం అవసరం. పరిపాలనా వ్యవహారాలను మాతృభాషలో నిర్వహించడంపట్ల ఎంతో ఆసక్తిగల ముఖ్యమంత్రి ఆచరణకి సంబంధించిన సత్వర నిర్ణయాలు తీసుకొంటారని ఆశిస్తున్నాం.

# వాణిజ్యానికి జీవం సూయెజ్

ఎవరిమానాన వారిని నడచుకోనిస్తే, ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యానికి స్వస్తి చెబితే, రాజకీయ వ్యవహారాలే కాదు, వాటిని నడిపే వాణిజ్యంకూడా ప్రజలకు ప్రయోజనం చేకూర్చుతుంది. రేవులు, నదులు, కాల్వలు యుద్ధాలకే కాదు, శాంతికికూడా ముఖద్వారాలుగా మారుతాయి. సుమారు దశాబ్దంగా మూతబడిన సుప్రసిద్ధ అంతర్జాతీయ నౌకావాణిజ్యపుజీవనాధారమైన సూయెజ్ కెనాల్‌ను తిరిగి నిన్నటినుంచి నౌకాయానానికి ఈజిప్టు సుగమం చేసింది. సూయెజ్‌కాల్వ పొడవునా పాక్షికంగానైనా ఇజ్రాయెల్ సేనలు వైదొలగడానికి నిర్ణయించడమూ, తిరిగి వాణిజ్య నౌకల రాకపోకలకు ఈజిప్టు వీలు కల్పించడమూ ఏకకాలంలో జరిగాయి. అనుక్షణం ఆందోళనకరంగా పరిణమిస్తున్న పశ్చిమాసియా పరిస్థితులలో ఇదొక శుభపరిణామంగా భావించాలి.

అది జిబ్రాల్టర్ గానివ్వండి, మాల్టా, క్రెటీ, సైప్రస్, పోర్టు సయిద్‌లు కానివ్వండి— యుద్ధ, వాణిజ్య వ్యూహాలలో అత్యంత కీలకమైన పాత్ర వహించిన ప్రాంతాలు. రెండవ ప్రపంచ యుద్ధానికిముందు యూరప్‌కు, యుద్ధానంతరం ఆసియా దేశాలకు నౌకావాణిజ్యం అభివృద్ధికి ఎంతగానో దోహదం చేసింది సూయెజ్ కెనాల్. మహా సముద్రాలను కలిపే రెండేరెండు అంతర్జాతీయ కాల్వలు పనామా, సూయెజ్. అట్లాంటిక్, పసిఫిక్‌లను పనామాకాల్వ అనుసంధిస్తుండగా, మధ్యధరా, రెడ్‌సీలను కలుపుతున్నది సూయెజ్ కెనాల్. వీటి ద్వారా అట్లాంటిక్, హిందూ మహాసముద్రాలకు సంబంధం ఏర్పడింది. ఈ సయోధ్య వాణిజ్యాభివృద్ధికి ఎంత లాభదాయకమో, సామ్రాజ్యవాదులు లాభాపేక్షతో తెచ్చిపెట్టే యుద్ధాలవల్ల ఈజిప్టుతోసహా ఆసియా, ఆఫ్రికా దేశాలకు అంత నష్టదాయకంగా పరిణమించింది. ఏటా జరిగే వందల కోట్ల విలువగల వాణిజ్యానికి ప్రమాదం ఏర్పడింది.

పశ్చిమాసియా అశాంతికి కారణమైన అరబ్ - ఇజ్రాయెల్ యుద్ధాలవల్ల ఇప్పటికి సూయెజ్ కాల్వ మూడుసార్లు మూతపడి, మూడుదఫాలు రవాణాకు వీలు కల్గింది.

ఇక ఇండియాలాంటి వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థపై సూయెజ్‌కు ఏర్పడిన అంతరాయం ప్రభావం అంకెలలో లెక్కించదగినది కాదు. యూరప్ రాజ్యాలు పరత్ర వాణిజ్యాలకోసం ఆసియాను దోచుకునేందుకు, ఆఫ్రికా (గుడ్‌హోప్) చుట్టూ తిరిగి రావలసిన అవసరం లేకుండా దగ్గర మార్గంగా ఏర్పాటు చేసుకున్న ఈ నౌకా రవాణామార్గం, తిరిగి సామ్రాజ్యవాద శక్తుల యుద్ధ ప్రేరేపణలవల్ల ఇండియాలాంటి దేశాల వాణిజ్యాభివృద్ధి కుంటు పడింది. మనకు సరకు దిగుమతిచేసే విదేశీ వాణిజ్య నౌకలకు సూయెజ్ మూతపడినందున, అన్యమార్గాల ద్వారా రావడంవల్ల, ఇంతకాలం 50-60 శాతం అదనంగా ఛార్జీలు చెల్లించుకోవలసి వచ్చింది. ఇందువల్ల ఏటా ఇండియా కోల్పోతున్న 20 కోట్ల డాలర్లు (160 కోట్ల రూపాయలు) సూయెజ్ కాలవ పునః ప్రారంభంవల్ల ఆదా అవుతాయి.

ఇప్పుడు సూయెజ్ కాల్వ తిరిగి నౌకాయానానికి వీలు కల్పిస్తున్నందున విదేశాలలో మన వాణిజ్యాభివృద్ధికి మంచి అవకాశం లభిస్తుంది. అయితే ఈ అవకాశమైనా, పశ్చిమాసియా సమస్యలకు శాశ్వత పరిష్కారం లభించే వరకూ నమ్మశక్యంకానిది కూడా !

# తోబుట్టువుల పుబలాటం

తెలుగు కన్నడ భాషలు తోబుట్టువులు. అవి మెట్టినిల్లు వేరు కావచ్చుగాని వాటి పుట్టిల్లు మాత్రం ఒక్కటే. అమెరికా, ఇంగ్లాండ్‌లు ఉమ్మడి భాష (ఇంగ్లీషు) వల్ల విడిపోయిన దేశాలని ఒకప్పుడు బెర్నార్డ్‌షా చమత్కరించాడు. ఆంధ్ర - కర్నాట (కన్నడం) లకూ ఇది వర్తిస్తుంది. అలాగే "తల్లి సంస్కృతంబె ఎల్ల భాషలకును" అని ఎంతగా చెప్పుకొన్నా మరెంత పిచ్చిగా వాదులాడుకొన్నా ద్రవిడ భాషలకు స్వతంత్ర భాషలుగా వర్ధిల్లిన చరిత్ర ఉంది. వీటిలో మళ్ళీ తెలుగు, కన్నడ భాషల అనుబంధమే వేరు. వాటి లిపుల సారూప్యమే వేరు. మొక్కట్లూ, తలకట్లూ ఒకే తీరువి. రాజకీయ, చారిత్రక, సాంఘిక, మతపరమైన కారణాలవల్ల రెండు భాషలుగా ప్రత్యేక లిపులతో వెలుగొందుతున్నా రెండింటికీ మూలభాష మాత్రం ఒక్కటే. పశ్చిమ చాళుక్యులతో ప్రారంభమైన ఈ బాంధవ్యం విజయనగర రాజులవరకూ అనలు తొడిగి కొనలు సాగి అభ్యుదయం సాధించుతూ వచ్చింది. నన్నయ కాలంనుంచి వేంగీ చాళుక్య లిపిలో చేర్పులూ, మార్పులూ ప్రారంభమైన దరిమిలా సుమారు నూటయాభై ఏళ్ళకుగాని తెలుగు కన్నడాలు సొంతకాపురాలు పెట్టుకోలేదు. ఈ రెండు భాషల లిపులూ 13 వ శతాబ్దంనుంచీ వేరుపేర్లతో వ్యవహరించ సాగాయి. మళ్ళీ ఆరు శతాబ్దాల అనంతరం వీటిని పుట్టింటికి చేర్చుకోవాలనీ, పసుపు కుంకుమ పెట్టి పట్టుబట్టలు తొడగాలనీ మనం ప్రయత్నిస్తున్నాం. నిజానికి ఈ కృషి ఈనాటిది కాదు. గత రెండు దశాబ్దాలుగా ఉభయ ప్రాంతాలలోని భాషా శాస్త్రవేత్తలు, లిపి సంస్కరణ కర్తలూ ఈ ఆలోచనలు చేస్తున్నారు. తెలుగు, కన్నడ భాషలకు ఏకలిపిని సృష్టించేందుకు అంతర్రాష్ట్ర సంఘాన్ని ఏర్పాటు చేయనున్నట్టు మన విద్యామంత్రి శ్రీ కృష్ణారావు విశాఖలో ద్రవిడ భాషల అఖిల భారత మహాసభలో ప్రసంగిస్తూ మరొకసారి చెప్పారు.

అయితే, స్వతంత్ర రాష్ట్రాలుగా, సొంతభాషలో వర్థిల్లుతున్న ఈనాడు ఇది సాధ్యపడుతుందా ?

కట్టూ, బొట్టూ, తలకట్టూ ఒకటిగా ఒకనాడు వర్ధిల్లిన ఈ రెండు భాషలూ, వాటి లిపులూ జమిలిగా ఉభయ సాహిత్యాలనూ ఎంతగానో సుసంపన్నం చేశాయి. కన్నడంలో తెలుగు రూపాలు, తెలుగులో కన్నడ రూపాలు పడుగు పేకలా అల్లుకుపోయాయి. ఆ మాటకు వస్తే ఒకనాడు "ఉ, ఊ, ఛ, హ"లు మాత్రమే ఉభయ లిపుల మధ్య అంటూ సొంటూ లేనివిగా ఉన్నాయి గాని మిగతా వర్ణాలన్నీ ఒక్కటిగానే ఉండేవి. తెలుగు కన్నడ లిపుల మధ్య ఐచ్ఛికంగా నెలకొన్న సువర్ణ సేతువు ఇది ! మత పరమైన శషభిషలు మరచిపోయి చూస్తే ఆంధ్ర కన్నడ, శైవ వైష్ణవాలు, బౌద్ధ జైనాలు ఉభయ భాషలనూ, వాటి లిపులనూ పరిపుష్టం చేయడంలో పెద్ద పాత్ర వహించాయి. తెలుగు కవిత్రయం కన్నడ కవిత్రయం (పంప, రన్న, పొన్న) వెరసి తెలుగువాళ్ళే. వీరి కలివిడితనం "కందా"నికి అందాలు దిద్దింది; ద్విపదకు పీట వేసింది; చేతులు వేరైనా మనసులొకటై కావ్యాలకు వీరు ఒకే రకం "సీసం" ఎక్కించారు; ఒకే పద్ధతి "గీతం" సాధించారు.

ఇంతటి సాన్నిహిత్యం ఉన్న ఈ రెండు భాషల లిపులమధ్య ఇపుడు ఏకి వాక్యతను సాధించడం కష్టమా ? కాదని పరిశోధకుల, లిపిశాస్త్రవేత్తల భరోసా. చూదాం. అయితే ఒక్క విషయంలో జాగ్రత అవసరం. కొన్ని వ్యర్థరూపాలతో తీసుకొంటున్న తెలుగు లిపిని సంస్కరించుకునే ప్రయత్నంలో మనం ఉన్నాం. ముద్రణకు, టైపురైటర్లరు ఇంకా అడ్డంకులు తొలగనేలేదు. ప్రతి కంపోజిటరు "ఒక శతావధాని" అయితేగాని 700 దిమ్మలనూ, గళ్ళనూ గుర్తుపెట్టుకోవడం కష్టమై పోతోంది. వీటిని తగ్గించాలి. ఇందుకు లిపి సంస్కరణ అవసరం. అందువల్ల తెలుగు కన్నడ భాషలకు ఒకే లిపిని సృష్టించడానికి జరిగే కృషితో దీనినికూడా జోడిస్తే బహుళ ప్రయోజనాలు సమకూరవచ్చునేమో !

# మరణ శిక్షా వ్యవస్థ రద్దు కావాలి

గులాబిని అంటుకుని ముళ్ళువుంటాయని పుష్పాన్నే చిదిమి వేయలేము, చెట్టునే పెకలించుకోము. ఆ ముళ్ళు తొలగించుకొని ఆస్వాదిస్తాం, అనుభవిస్తాం, ఆనందిస్తాం. తెగులు పట్టిందికదా అని, తెలివితప్పి పంటను నాశనం చేసుకోము; దీర్ఘరోగ పీడితుడైన వ్యక్తిని ఆఖరి శ్వాసవరకు ఆశకొలదీ మందులతో, మాకులతో బ్రతికించుకోవడానికే శతథా ప్రయత్నిస్తాం. అలాగే వ్యక్తులు అపమార్గం పట్టారని భావించినప్పుడు, అందుకు కారణాలు లోతుగా పరిశీలించి, వాటిని తొలగించడం ద్వారా, సంఘాన్ని నిలువెల్లా మరమ్మతు చేసుకోవడం ద్వారా, మనిషిలో పరివర్తన తీసుకురావాలి. ఇంతకూ, "ఒకచోట ఆరిపోయేదీ, వేరొకచోట వెలిగేదీ ఈ జీవితమే." వ్యవస్థలూ, ప్రభుత్వాలు వున్నది జీవితం యివ్వడానికే కాని, చిదిమి వేయడానికి కాదు; సత్వర సంస్కరణల ద్వారా సమూలమైన మార్పులు తీసుకురావడానికేగానీ, కాలహరణం ద్వారా, ప్రాణహరణం కోసంకాదు. పరివర్తన సంఘపరం కావాలి. అప్పుడు మనిషి ప్రవర్తనలోనే మార్పురావాలి. ఏచర్య కూడదంటున్నామో, ఏ వ్యక్తిహింసావాదం తగదంటున్నామో, ఆ లక్ష్య సాధన మరణశిక్ష ద్వారా సిద్ధించజాలదు.

ఈరోజున నక్సలైట్ ఖైదీల ఉరిశిక్ష సమస్య అనేకాదు, మన దేశంలో ఈ శిక్షా పద్ధతినే రద్దుచేయాలని, జైళ్ళను సంస్కరించాలని జాతీయోద్యమం నాటినుంచి కోరుకుంటున్నదే. ఆధునిక యుగంలో పెక్కు దేశాలు ఈ శిక్షను రద్దుచేసినా మనం ముద్దుగా కాపాడుకుంటున్నాం. "స్వతంత్ర భారతంలో హంతకులతోసహా అన్ని రకాల నేరాలను రోగంగా మాత్రమే పరిగణించి, అందుకు తగిన సంస్కరణలతో రోగ నిదానానికి" ప్రయత్నిస్తామని గాంధీజీ పేర్కొన్నారు. "ఏ ఒక్కరినీ ఉరికంబ మెక్కించడానికి నామనస్సు సుతరామూ ఇష్టపడదు" అన్నారు. దీని అర్థం-నేరాలకు

లైసెన్సు యివ్వడంకాదు, హత్యలను ప్రోత్సహించడంకాదు; అన్ని రకాల హింసాకాండకు తలొగ్గి వుండాలని ఆయన వుద్దేశించడం కాదు. సామాజిక, ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచడం ద్వారా పరిశుభ్రమైన పరివర్తనా వాయువులను పీల్చుకోగల నవభారతాన్ని నిర్మించుకోవాలన్నదే ఇందులోని అంతరార్థం. ఈ మహదాశయంతోనే, దేశస్వాతంత్ర్య సమరంలో తమతో సమ ఉజ్జీలుగా పాల్గొన్న భగత్‌సింగ్ ప్రభృతులతో మార్గాలలో విభేదించినా, మాతృదేశ విముక్తి సమష్టి ఆశయంకాబట్టి- పండిట్ నెహ్రూ, సింగ్ మరణ శిక్షను నిశితంగా ఖండించాడు. సాంఘిక విషయాలలో పరమఛాందసుడై నప్పటికి మదన్ మోహన్ మాలవ్యా కూడా అదే ఆశయంతో కదలి నాటి వైస్రాయి ప్రాసాదంముందు ప్రాయోపవేశంచేసి, సింగ్‌ను రక్షించుకుందామని నినదించాడు; గాంధీ మాత్రం కదలకుండా కూర్చున్నప్పుడు నెహ్రూ తీవ్ర అస్వస్థతలో వుండికూడా లేచివెళ్ళి "ఒకవైపున మనజాతి కుసుమాలను- యువకుల్ని - ఉరికంబ మెక్కిస్తుంటే మీరింకా రాట్నం వడుకుతున్నారా, బుద్ధునిలా కూర్చున్నారా" అని మందలించారు. అలాగే, జీవిత విలువలు తెలిసినందుననే ఆయన స్వాతంత్ర్యంవచ్చిన తొలిరోజులలో బ్లాక్‌మార్కెటీర్లను సమీప దీపస్తంభాలకు వ్రేళ్ళాడగట్టి ఉరి తీస్తాను అని ప్రకటించినప్పటికీ, అమలు జరపడానికి యిష్టపడి వుండరు. మార్పులు మన చేతులలో, ఈ మానవుని చేతులలోని పనులే. సమస్యలను సృష్టించుకోగల చేతులు వాటి పరిష్కార మార్గాలు కూడా చూసుకోగల్గుతాయి, చట్టాలు మనవి, రాజ్యాంగం మనది, సవరణలూ మనవే.

మరణశిక్షా వ్యవస్థ రద్దు కావాలన్న వాంఛ స్వతంత్ర భారతంలో కూడా పలుమార్లు వ్యక్తమైంది. మన పార్లమెంటులో 1956 లగాయతూ పెక్కుసార్లు సభ్యులు బిల్లులు ప్రవేశపెట్టడమూ, అవి వీగిపోవడమూ జరిగింది. పాలకపక్షం, మెజారిటీని దుర్వినియోగపరచిన సందర్భాలలో ఇదొక ప్రత్యేక అధ్యాయంగా పేర్కొనాలి. మనస్సుకు పట్టించుకోగలవారికి హైకోర్టులు, సుప్రీంకోర్టు అనేక సందర్భాలలో మరణశిక్షల విధింపు విషయంలో ఎదుర్కొంటున్న చిక్కుల గురించి మందలించాయి కూడా. ఒకనాటి సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి పతంజలి శాస్త్రి "ఈ శిక్షలు విధించడంలో న్యాయమూర్తులు సామాజిక తత్వం వంటబట్టించుకోవాలని" వాంఛించారు. 1971 లో సిక్రి- ఎ. ఎస్. రేల బెంచ్ కూడా "పౌరుని జీవితాన్ని రక్షించడానికి" ప్రాధాన్యం యివ్వాలని అభిప్రాయపడ్డారు. ఇక ఖండాంతరాలలో చూస్తే, అమెరికన్ సుప్రీం కోర్టుకు చెందిన సుప్రసిద్ధ న్యాయమూర్తులు మెజారిటీ తీర్పులో "మరణశిక్ష అతిక్రూరము, పైశాచికమూ, రాజ్యాంగ విరుద్ధమూ" అని పేర్కొన్నారు.

1971 తీర్పులో సిక్రీ ప్రభృతులు కూడా మన పార్లమెంటు నిర్వహించ వలసిన ఒక కర్తవ్యాన్ని చూచాయగా సూచించారు. అమెరికన్ రాజ్యాంగంలో మాదిరి మనకు "మరణశిక్షను క్రూరమైనదిగా" నిర్దేశించగల సవరణ లేదుకాబట్టి తాము చేయగల్గిందిలేదు అన్నారు. అందువల్ల ఈ తప్పిదాన్ని, ఈ లోటును మన ప్రజాప్రతినిధులు తక్షణం సవరించడానికి నడుం కట్టాలి.

పెద్ద పెద్ద యుద్ధాలలోనే శాంతి ఏర్పడిన మరునాడు శత్రువర్గాన్ని క్షమించి, జాతీయ జీవనంలోకి ప్రేమపూర్వకంగా ఆహ్వానించి, పునరుజ్జీవనానికి అవకాశం కల్పిస్తున్న దేశాలు వున్నాయి. ఇది ఔదార్యంతో కూడిన చర్య. భవిష్యత్తుపై విశ్వాసంతో జరుగవలసిన పని. సాంఘిక, ఆర్థిక మార్పులకోసం జరుగుతున్న కృషిలో, ఆ పోరాటంలో జరిగే తప్పిదాల జాబితాకన్న ఆ మార్పులు కళ్ళముందు కనబడిననాడు పొందే మధురానుభూతి, మహదానందగీతి మహత్తరమైంది. ఇది పాలకుల, ప్రతిపక్షాల, ప్రతిపౌరుని గుండెలో పలకవలసిన గొంతుక. జీవితాన్ని పుష్పింపజేయగల ఆ సాహసం, ఆ విశ్వాసం, సత్తాకల ప్రతి మానవునిలో వినిపించవలసిన రాగం, తానం, పల్లవి!

# జనాభా సమస్య : వివాహ వయస్సు

గ్రీస్‌లో ఎప్పుడో సీజరూ, అగస్తసూ ఎక్కువమంది పిల్లలను కన్నవారికి నగదూ, నజరానాలూ ఇచ్చిఉండవచ్చు. అలాగే మన దేశంలోకూడా అధిక సంతానం ఒకప్పుడు ఆశీర్వాదం పొంది ఉండవచ్చు. కొన్ని సోషలిస్టు దేశాలలో రెండవ ప్రపంచ యుద్ధంవల్ల అపార జననష్టం కలిగి సంతానోత్పత్తిని ప్రోత్సహించి ఉండవచ్చు. తల్లులకు బహుమానాలు ప్రకటించి ఉండవచ్చు. ఏదిఏమైనా ఎల్లకాలమూ పాత నిబంధనలే జనాభానూ, దేశాలనూ శాసింపలేవు. కుటుంబ నియంత్రణ ఇప్పుడు చాలా దేశాలలో ఉంది. ఇండియాలోనూ అమలు జరుగుతోంది. అయితే జాతీయ స్థాయిలో దీనిని విస్తృతంగా అమలు జరపడానికి కేంద్రం ప్రత్యేక విధానాన్ని రూపొందించింది.

నూతన విధానంలో ప్రధానాంశం– అతిశయిస్తున్న జనాభాను ఆదుపు చేయడానికి వివాహ వయః పరిమితిని పెంచడం. ఆడపిల్లలకు 18, మగపిల్లలకు 21 సంవత్సరాలు పెండ్లి ఈడుగా నిర్ణయించారు. ప్రజల ఆర్థిక దుస్థితి తొలగించడానికి వివాహ వయః పరిమితినీ, కుటుంబ నియంత్రణనూ ప్రధాన సాధనాలుగా భావిస్తున్నాం. ఈ కొత్త విధానం జయప్రదం కావాలనే అందరూ వాంఛిస్తారు. కాని ఈ పద్ధతి ఫలప్రదమైన తరవాతకూడా ఆర్థిక పరిస్థితులు చక్కబడకపోతే – ఇందుకు అసలు కారణం జనాభా కాదు నేటి ఆర్థిక వ్యవస్థేనని ప్రజలు తీర్మానించుకొనే అవకాశం కూడా ఉంది.

ఏ విధానమైనా, సంస్కరణ అయినా సఫలం కావాలంటే ప్రభుత్వ చర్యలే చాలవు. సమాజంలో చైతన్యం రావాలి. ఉద్యమరూపం దాల్చినప్పుడే ఇది సాధ్యం. అక్కరకు రాని ఆచారాలనూ, సుఖంలేని సంప్రదాయాలనూ అధిగమించిన తరవాతనే బాల్య వివాహాలను చాలావరకు నిరోధించ గలిగాం. విధవా వివాహాలపైన ఆంక్షలను తొలగించుకోగలిగాం. వివాహ వయః

పరిమితినికూడా ఒక్కసారిగా పెంచలేదు. ఈ సమస్య వెనక నూటపద హారేళ్ళ చరిత్ర ఉంది. 1929 లో హరవిలాస్ శారద బాల్య వివాహాల నిషేధానికి బిల్లు ప్రవేశపెట్టేనాటికే యువతీ యువకుల వివాహ వయః పరిమితిని మూడుసార్లు సవరించారు. 1930 లో శారదా చట్టం అమలులోకి వచ్చింది. అప్పటినుంచి ఈ రోజు వరకు అమలులో నిబంధన ప్రకారం వివాహ వయః పరిమితి పిల్లకు 15, పిల్లవాడికి 18 ఏళ్ళు. ఇప్పుడు ఈ వయస్సును 18 సంవత్సరాలుగానూ, 21 సంవత్సరాలుగానూ సవరించాలని కేంద్రం సంకల్పించింది. అయితే శారదా చట్టానికి తలపెట్టిన ఈ సవరణ కొత్తదేమీ కాదు. ప్రస్తుతం అమలులో ఉన్న స్పెషల్ మేరేజెస్ యాక్టులోనే ఈ నిబంధన ఉంది. అంతేకాదు. వివాహాలు ఇకముందు విధిగా రిజస్టర్ కావాలన్న నిబంధనకూడా ప్రత్యేక వివాహ చట్టంలోఉన్నదే.

భిన్న జాతులకూ, భిన్న మతాలకూ, భిన్న సంప్రదాయాలకూ నిలయం మన దేశం. వీటికితోడు నిరక్షరాస్యత హెచ్చు. అందువల్ల కుటుంబ నియంత్రణనూ, వివాహ చట్ట నిబంధనలనూ బలవంతంగా అమలు జరపలేము. భావ పరివర్తన అవసరం. మనో వికాసానికి మందు అక్షరాస్యత. ఏ మేరకు నిరక్షరాస్యతను తొలగించగలుగుతామో ఆ మేరకు ప్రభుత్వ నిర్ణయాలను కూడా ప్రజలచే స్వచ్ఛందంగా అమలు జరిపించగల్గుతాం.

# కొత్త సృష్టికి పురిటి నొప్పులు?

ప్రశ్న అన్వేషణకు దారి చూపుతుంది. అన్వేషణ అసాధారణ ప్రక్రియలకు మానవుణ్ణి ఉద్యుక్తుణ్ణి చేస్తుంది. చంద్రమండలంపైన మానవుడు ఏడేళ్ళనాడు తొలిసారిగా కాలుమోపిన నాడు అది మానవేతిహాసంలో మహత్తర ఘటనగా నమోదైంది. ఈ యాత్రను నిర్వహించింది అమెరికన్లే అయినా అదీ మానవజాతి విజయమే; మొన్న మంగళవారంనాడు సౌర కుటుంబ రహస్యాలను ఛేదించడంలో మరొక మెట్టు ముందుకు వెళ్ళి అమెరికన్లు వైకింగ్-1 రోదసీ నౌకను అంగారక (కుజ) గ్రహాలపై జయప్రదంగా దించడమూ మానవాళి ఘనతే.

విశ్వాంతరాళంలో, సౌరకుటుంబంలో- నక్షత్రమండలాలలో ఎక్కడెక్కడ ఈ భూగ్రహాన్ని పోలిన జీవరాశి ఉందో అన్వేషించడం వైకింగ్-1 లాంటి రోదసీ నౌకల ప్రయోగాల వైశిష్ట్యం. విశ్వరహస్యాలను కనుగొనేందుకు కడచిన పదిహేనేళ్ళలో జరిగిన పరిశోధనలూ ప్రయోగాలూ ఒక విషయాన్ని స్పష్టం చేశాయి. భూమి వాతావరణమూ, దాని ఉపరితలమూ సౌర కుటుంబంలోని ఇతర గ్రహరాశికి భిన్నంగా ఉన్నాయి. గ్రహోపరితల జలమూ, ప్రాణమూ ఉన్న ఏకైక గ్రహం భూమి అని నిర్ధారణ అయింది. అయితే విజ్ఞాన శాస్త్రం ఏదో ఒక్క నిరూపణతోనే అన్వేషణ చాలించుకోదు. ఇతరచోట్ల ప్రాణం ఉన్నా లేకపోయినా నిరంతర జిజ్ఞాస, పరిశోధన దానికి ప్రాణం. అందుకే లోగడనేకాదు, ఇప్పుడూ 100 మందికి పైగా శాస్త్రవేత్తలు అంగారక గ్రహంపై జీవరాశి ఉందా లేదా అన్న మీమాంసకు దిగారు. రకరకాల సిద్ధాంతాలు రూపొందించారు. వైకింగ్ ప్రయోగాలకు ముందు సోవియట్ శాస్త్రవేత్తలు కూడా మానవ రహిత రోదసీ నౌకలను పంపారు. అక్కడ "ఆర్గాన్" వాయువును కనుగొన్నారు. అరుణ కాంతులీనే అంగారక గ్రహం రహస్యాలు సాలెగూడు లాంటివి. లోయలు, ఉపలోయలు, పలుచని వాతావరణం, ఎండిపోయి మెలికలు తిరిగిన నదులూ, మబ్బులూ అక్కడ ఉన్నాయని ఇంతకుముందు కొందరు శాస్త్రవేత్తలు భావించారు. నీటి ఆవిరి కొంచంగాను, ప్రాణ వాయువు కొద్దిగానూ ఉన్నదనీ అన్నారు. మరి కొందరు దీనిని మృత

ప్రాయమైన అగ్నిపర్వత శిఖరంలోని ఒక బిలం అన్నారు. ఇంకొందరు దానిని అటు మృతగ్రహమూ కాదు కాదు, ఇటు నివాసయోగ్యమైనదీకాదు, మధ్యస్థంగా ఉన్న గ్రహం అన్నారు. బొగ్గుపులుసు వాయువు ఎక్కువగా ఉందన్నారు, కాని గ్రహంపైన కాలుమోపడానికి ముందు గ్రహానికి దూరంగా భ్రమణంలో ఉన్న వైకింగ్ రోదసీ నౌక ఇటీవల పంపిన కొన్ని వర్ణచిత్రాలు ఈ గ్రహానికి చెందిన పాత భావాలను తోసిపుచ్చేవిగా కన్పిస్తున్నాయి. గ్రహ వాతావరణం తేమ తేమగా ఉందనీ, గ్రహం దక్షిణధృవం విశ్వసించిన దానికంటే అతి చల్లగా ఉందనీ ఈ చిత్రాలు తెలియజేశాయట.

జీవం రసాయనిక క్రియవల్ల ఏర్పడుతుంది. పరమాణువు తరవాత అణువుల కలయిక, సూక్ష్మరూపంలో కణాల నిర్మాణం, ఆ దరిమిలా జీవరూపం ఏర్పడుతాయి. భూమికీ, అంగారక గ్రహానికీ కొన్ని ప్రధాన పోలికలు ఉన్నందుననే ఈ అన్వేషణ జరుగుతోంది. నత్రజని, ఉదజని, ఆమ్లజని, బొగ్గుపులుసు వాయువు వంటివి అంతరిక్షంలోకూడా ఇబ్బడిగానే ఉన్నాయి. అయితే ఇవి అణు సముదాయాలుగా రూపొందడానికి అవసరమైన రసాయన మార్పులు (సంయోగం) పొందుతున్నాయా ? పొందితే ఏయే నిష్పత్తిలో జరుగుతున్నాయి ? అగ్నిపర్వతాల ఒత్తిడులూ, జీవశాస్త్ర పరిణామాలూ, మనం నివసించే భూమిపై వాతావరణానికి దారితీసినట్టే అంగారకునితో కూడా జరుగుతూ ఉండవచ్చునని ఒక ఊహ. అసలు సౌరకుటుంబం పరిణామక్రమంలో ఆవిర్భవించిన అంగారక గ్రహం పాతగ్రహమా ? లేక జీవరాశి ప్రాదుర్భానికి తగినపరిస్థితులను క్రమంగా సృష్టించుకొంటున్న నవయువ గ్రహమా ? సూర్యునికి సమీపంలో ఉన్న శుక్ర గ్రహం, సౌరశక్తి తాపం వల్ల , రేడియో ధార్మిక పదార్థాలు ప్రసరించే అమిత వేడిమివల్లా ఆగలేక పోయింది. ఫలితంగా అక్కడి జలంకాస్తా ఇంకిపోయింది. జీవరాశికి అవసరమైన-కార్బోనేట్స్-చెదిరిపోయి చుట్టూ విషవాయువులు దట్టంగా అల్లుకొని పోయాయి. దానితో శుక్రుడు నివాసయోగ్యంకాని గ్రహంగా మిగిలి పోయాడు.

అయితే అంగారక గ్రహం సూర్యునికి దూరంగా ఉంది. బాగా దూరంగా ఉన్న గ్రహంపైన జీవరాశి ఉండాలంటే తగుమాత్రపు శీతోష్ణస్థితి అవసరం. అయినప్పుడు అంగారక గ్రహ వాతావరణం తగినంతగా వేడెక్కడానికి చాలా వ్యవధి పడుతుంది. ఇప్పటికి తెలిసిన సమాచారం ప్రకారం ఈ గ్రహంపైన ఉన్న అనేక అగ్నిపర్వతాలూ, కొండదారులూ (కాన్యాన్స్), లోయలూ, బిలాలు లేకుండానే లావా వెదజల్లుతున్న పీఠభూములూ - జీవ చైతన్యదశను గ్రహం క్రమంగా పొందుతున్నదనడానికి నిదర్శనం. ఇది కొత్త సృష్టికి పురిటి నొప్పులు పడుతున్న గ్రహం.

# చౌ - ఎన్ - లై

చూడచక్కనివాడు, నునుపు తేలినవాడు, చిరుమోమువాడు, సమ్మోహన శక్తి కలవాడు, విరామ మెరుగనివాడు-ఇవి కావు, డెబ్బైఅయిదుకోట్ల మంది చైనా ప్రజల నాయకుడు చౌ-ఎన్-లై గురించి చెప్పుకోదగినవి. నిద్ర పోతున్న ఆ మహాశక్తి (చైనా) ని లేపకండి. అలాగే మత్తులో వుండ నివ్వండి. అది లేచిందా మహాప్రళయమే అన్నవాడు నెపోలియన్. మరి అలాంటి చైనా చక్రవర్తుల పాలనలో చీలికలు పీలకలై ఛప్పన్న రాష్ట్రాలు, వేటికవి "రాజ్యాలు"గానే చలామణి అవుతూ, ఒక కేంద్రీకృత పరిపాలన, అధికారం, క్రమశిక్షణ లేకుండా వుంది. నోరులేని మూగజీవులైన ప్రజల పైన ప్రతివాడు ఒక వార్ లార్డే; దీనికితోడు క్రమంగా జర్మన్లు, జాపనీయులు, బ్రిటిష్‌వాళ్ళు, ఫ్రెంచివాళ్ళు, చివరికి అమెరికన్లు - చాంగై షేక్, బలహీనజాతిని మరింత దుర్బలంచేసి, చేతికందిన వనరులనేగాక, భూభాగాలనే ఆక్రమించి జాతిజాతినే ఆగడాలపాలు చేస్తున్న చరిత్ర అది. ఇండియా ఒక్క బ్రిటిష్ వాడికి వలసగా వుంటే, బహుళ రాజ్యాల వలస చైనా. ఈ పాడు చరిత్రకు స్వస్తిచెప్పి, నూతన చరిత్ర సృష్టించాలి. అందుకు పురిటి నొప్పులు అనివార్యం. త్యాగాలు అపరిమితం. అయినా ఒక్కత్రాటిపై చైనా జాతిని నిలబెట్టి సభ్య ప్రపంచంలో తిరిగి దాని వైభవోజ్జ్వల చరిత్రను సృష్టించాలి. అట్టి మహావిప్లవానికి నారుపోసి, నీరు పెట్టి, పెంచి, జయప్రదంచేసి, చైనాను సోషలిస్టు రిపబ్లిక్‌గా ప్రకటించుకుని, ఈనాటికీ బ్రతికి వున్న చైనా విప్లవ నాయక తరంలోని అగ్రగణ్యులలో ఒకరు నిన్న చనిపోయిన చౌ-ఎన్-లై.

"అవసరం ప్రసవించేది ఒక వ్యక్తిని కాదు, పలువురిని" అని హాన్‌మయిన్ చైనా విప్లవ చరిత్రను వివరిస్తూ రాసింది. అట్టివారిలో ఒకడు చౌ. నలభై ఏండ్ల విప్లవ చరిత్రలో, విప్లవ వ్యూహరచనతో మావో మేధస్సుకు, పరి

పాలనా, దౌత్య వ్యవహారాలలో చౌ మేధస్సుకు మధ్య ఏర్పడిన అపురూప మైన అనుబంధం చైనా ప్రజల జీవితాలను, రిపబ్లిక్ భవిష్యత్‌ను తీర్చి దిద్దింది. ఈ విషయంలో ప్రపంచ చరిత్రలో, కొన్ని అంశాలపై అభి ప్రాయభేధాలున్నా, జీవితాంతం ఒక్క తల్లిబిడ్డలుగా శ్రామికవర్గ సహోదరు లుగా గడిపిన కమ్యూనిస్టు సిద్ధాంత జనకులైన మార్క్స్ - ఎంగెల్సులకు మాత్రమే మావో— చౌ - ఎన్- లై లు సరితూగుతారు. చైనా విప్లవ చరిత్రలో అన్ని క్లిష్ట సమయాలలోను వీరు కలివిడిగా వుండి, 75 కోట్ల మంది జీవితాలనే మార్చి వేశారు.

దౌత్య వ్యవహర్తగా, అఖండఖ్యాతి నార్జించుకున్న వాడు చౌ-ఎన్-లై, ఆసియా, ఆఫ్రికా ఖండ దేశాల చరిత్రలో చెప్పుకోదగిన బాండుంగ్ మహా సభలో ప్రముఖపాత్ర వహించాడు. మన తొలి ప్రధాని నెహ్రూతో కలిసి పంచ సూత్రాలు సృష్టించాడు. రెండు దశాబ్దాల చైనా-అమెరికా శతృత్వ సంబంధాలను ఛేదించడంలో నిక్సన్, కిసింజర్‌ల దౌత్యాన్ని మించిన వ్యూహం చౌ-ఎన్-లైది. ఏ కారణాల వల్లనైతేనేమి, ఎటుతిరిగి ఆయన దౌత్యనీతిలో విఫలమైనదల్లా భారత-చైనా సరిహద్దు వివాదం సందర్భంగానే.

చౌ-ఎన్-లై సంపన్న కుటుంబంలో పుట్టినా, విప్లవ భావాలతో కమ్యూనిస్టు ఉద్యమంవైపుకి ఆకర్షితుడయ్యాడు. మావోతో కలిసి విప్లవానికి నాయ కత్వం వహించాడు. చరిత్ర ప్రసిద్ధిగన్న "లాంగ్‌మార్చ్" రూపు రేఖలు దిద్దిన విప్లవ కళాకారులలో ఒకడయ్యాడు. వ్యూహంలో ఒకరు సిద్ధహస్తు లైతే, దానిని ఓరిమితో ఆచరణసాధ్యం చేయడం ఒకరి వంతు. ఒకరు కల్లోలం నుంచి కమలాలు సృష్టిస్తే, వేరొకరు ప్రణాళికలను అమలు పరచడం ద్వారా జీవితాలను మార్చిన వారు. ఒకరు లెనిన్ అయితే మరొకరు స్టాలిన్. ఒకరు మహారాజ్యానికి వాస్తుశిల్పి అయితే, ఇంకొకరు నిర్మాత. అంతటి దీక్ష, ఓరిమి కలవాడు కనకనే సాంస్కృతిక విప్లవంలో గడ్డు సమస్యలను కూడా కడచివచ్చి తన ఉనికిని నిలబెట్టుకున్నవాడు చౌ-ఎన్-లై.

# "రాధ, కృష్ణుల" కోర్టు

చెప్పేవాడికి వినేవాడు లోకువ; భాష్యకారునికి సిద్ధాంతం లొచ్చు; కోర్టు లకు రాజ్యాంగమూ, చట్టాలు లొసుగు. రాజ్యాంగంలో ఆస్తి హక్కుకు విశేషాధికారాలు పదిలంగా వున్నంత కాలమూ విపరీతార్థాలు, విచిత్రమైన తీర్పులూ తప్పవని ఉత్తర ప్రదేశ్‌లోని ఒక సివిల్ కోర్టు ఋజువు చేసింది.

భూముల బినామీ ట్రాన్స్‌ఫర్లు మానవులకు సంక్రమించింది, "మాధవుల"నుంచే నని తేలింది. పలుకు వంకర, నడక వంకర, నవ్వు వంకర - బినామీ వ్యవహార సూత్రాలకు ఇవి ముఖ్య లక్షణాలు! ఆస్తి తలపుకు రాగానే ప్రేమ పలు వికారాలు పోతుంది; భ్రూణ హత్యలు చేయిస్తుంది, లేదా కడుపులో వున్నవాడికి సహితం కమతాలు నిర్ణయిస్తుంది; పిల్లలు లేకపోతే, అంత వరకూ తోటి మానవులను ఈసడించుకుంటున్న వారైనా సరే నలుగురు "సన్నిహితుల్ని" చేరదీసి, వాళ్ళ వాళ్ళ పేరిట ట్రాన్స్‌ఫర్లు పెట్టిస్తుంది; చివరికి కృత్రిమంగా విడాకులు కూడా సృష్టించి, వ్యవహారం చక్కబెట్టిస్తుంది. ఈ అన్ని పరిణామాలు దాదాపు అన్ని రాష్ట్రాలలోను భూకమతాల గరిష్ఠ పరిమితి చట్టాలు వచ్చిన తరువాత ఘటిల్లినవే!

యు. పి. కోర్టు యిచ్చిన తీర్పు ఒక "స్వామీ రాధాకృష్ణ"కు చెందినది. ఆ పేరుకల "వ్యక్తి" పేరిటవున్న "రాధాకృష్ణ దేవాలయ" భూమి సీలింగ్ చట్టంలోకి రాకుండా చేయాలనేది పిటీషనర్ల వాదన. రాధ, కృష్ణుడు "ప్రేమికులు" మాత్రమే కాబట్టి వాళ్లొక "కుటుంబం" క్రిందికి రారు, అందు వల్ల చటం వర్తించదు అని వాదన! ఈ భాష్యాన్ని సదరు కోర్టు ఆమోదిం చింది. కాబట్టి కృష్ణుడు గోపికాస్వామేగాని, "భూస్వామి" కాడు!

దీన్నిబట్టి పొలం "శివుడి"కి వున్నా కూడా, గంగను వదలుకోలేనంత మాత్రాన, గరిష్ఠ పరిమితికి లొంగడు! ఎందుకని? వారిరువురు వ్యావహారిక

ప్రపంచానికే గాని, వ్యాపార ప్రపంచానికి భార్యాభర్తలు కారు కాబట్టి! పురాణ సాక్ష్యమూలేదు, పుస్తక సాక్ష్యమూ లేదు కాబట్టి. యు. పి. కోర్టువారు సదరు రాధాకృష్ణులను "ప్రేమికులు"గానే భావించి, దేవాలయ భూములను సాకేవారి ఉపాధినిమిత్తం కాపాడారు! మరొక కోర్టువారు రేపు శివలింగ క్షేత్ర భూములను కూడా అలాగే కాపాడవచ్చు. తిండికి ఉంది కాబట్టి కృష్ణుడికి-రుక్మిణికి తోడు రాధ వున్నా, శివుడికి-పార్వతికితోడు గంగవున్నా చెల్లుబాటైంది. కాని లేనివాడికి అన్ని కరవులలోకి భూమి కరవు దుర్భరం. అందుకని వాడు కృష్ణుడు అడ్డుపడినా, శివుడు వద్దన్నా ఆగడు.

కట్టె ఎంత పొడుగువున్నా ఉరవడిలోవున్న చిన్న వాగులో చిక్కి, కొట్టుకు పోక తప్పదు. సీలింగ్ చట్టాలు కచ్చితంగా, నిర్దుష్టంగా అమలు జరిగిన నాడు, వచ్చే పరిణామంకూడా అదే.

# అమూల్యమైన ప్రతిపాదన

రాష్ట్రపతి శ్రీ ఫకురుద్దీన్ ఆలీ అహ్మద్ "తరతరాల తెలుగు" వైభవాన్ని ప్రదర్శించే మ్యూజియం భవనానికి శంకుస్థాపన చేస్తూ చరిత్రను ఎలా అధ్యయనం చేయాలో సూచించారు. ఇది అమూల్యమైన ప్రతిపాదన. "చరిత్రాధ్యయనానికి, చరిత్ర చుట్టూ, చారిత్రిక ఘట్టాల దస్తరాలచుట్టూ అల్లుకుపోయిన కట్టుకథలనుంచి, పుక్కిటి పురాణాల నుంచి చరిత్రను వేరు పరచవలసిన అవసరం వుంది. అనుమతించదగిన సాక్ష్యాధార పరిమితులకి మించి ప్రాచీనతను గాని, ఆనాటి విజయాలను గాని, చరిత్రకారులు ఎంతటి దేశభక్తులైనా, పెంచి స్తుతించరాదు" అని ఆయన హితవు చెప్పారు. ఇట్టి మౌలికమైన ఆలోచన చేసేవారే మనకు అరుదు. అట్టి ప్రగతి శీలమైన చింతన దేశాధిపతినుంచి రావడం నిజంగా హర్షించదగిన విషయం.

కొన్ని దశాబ్దాల క్రితం మాట కాదుగాని, కనీసం ఒక దశాబ్దంపైగానయినా ఇట్టి మౌలికమైన ఆలోచన కొందరు భారతీయ చరిత్రకారులలో ప్రారంభమైందని చెప్పవచ్చు. అట్టివారిలో డి. డి. కోశాంబి ఒకరు. భారతదేశ చరిత్రకు ఆయన రాసిన "ఇంట్రడక్షన్" **(Introduction)** గాని, ప్రాచీన భారతదేశ సంస్కృతి నాగరికతనుగురించి రాసిన చారిత్రకాంశాలుగాని మన చరిత్ర చుట్టూ పడుగుపేకల్లా అల్లుకుపోయిన కట్టుకథలగురించి ("మిత్ అండ్ రియాలిటీ") చేసిన పరిశోధనగాని, హేతువాద దృక్పథంతో చేసిన మౌలికమైన పరిశీలనలే. ఈ హేతువాద దృష్టి సడలించడంవల్లనే, మనకు చరిత్రలో కనిపిస్తే అన్నీ అంధయుగాలు లేదా "స్వర్ణయుగాలు" అయిపోయాయి. మానవ జాతి ఆహార సేకరణ దశనుంచి ఆహారోత్పత్తి దశకు జరిపిన సుదీర్ఘ పరిణామంలో ప్రకృతిపై పట్టు సంపాదించని దశలో అల్లుకున్న అంధ విశ్వాసాలన్నింటికి ఆమోదముద్రవేసి, చలామణిలోకి తీసుకు రావడానికి సాహితీవేత్తలు, చరిత్రకారులు ప్రయత్నించారు.

భయంలో అజ్ఞాతశక్తుల ఆరాధన, భయంతో నరబలులు, జంతుబలులు సాగించాడు, ప్రాచీన మానవుడు. పరిణామ దశలను వివరించకుండా, ప్రకృతి శక్తులతో ప్రజల నిరంతర పోరాటాన్నుంచి చరిత్రను వేరుచేసి, కట్టుకథలతో చరిత్రను కలగాపులగం చేశారు. చరిత్ర సృష్టికర్తలు ప్రజలు అనికాక వారిని నడిపించే "శక్తి" ఏదో వుందన్న భావాన్ని సాగదీసి చూపడం వల్లనే, మనకు ప్రజా చరిత్రకంటే, రాజుల, రాజ వంశాల చరిత్రలు ఎక్కువయాయి. ఆయాకాలాల్లోని రాజుల పేరును తెలుసుకోవాలన్న వాంఛకంటె, అప్పటి ప్రజల నాగరికతకి పునాది అయిన ఏ దాగలినో, ఏ నాగలి చరిత్రనో తెలుసుకో గోరినప్పుడు మనకి నిజమైన చరిత్ర లభిస్తుంది. అంటే ఆయాదశలలో పుట్టి పెరిగిన వుత్పత్తి శక్తులు, ఉత్పత్తి సాధనాలు వీటి మధ్య సంబంధాలు, మానవుని మనుగడను దిద్ది తీర్చడంలో వీటి పాత్రను అధ్యయనం చేయవలసి వుంటుంది.

కాని మనకు కల్పిత గాథలతో నిండిన సాహిత్య సృష్టి ఎక్కువ. ఉన్న సాహిత్యాంశాలకు పురాతత్వ పరిశోధనలకు లంగరందకుండా వచ్చింది. పురాతత్వ పరిశోధనలకు లభించిన ఆధారాలకు సరిపోయిన సాహిత్యం కరవయింది. ఈ రెండింటి సమ్మేళనం వల్లనే, హేతుబద్ధ పరిశీలనవల్లనే మన చరిత్ర సరైన అర్థగౌరవం పొందగలుగుతుంది. చైనావారికి మాదిరిగా రోమ్, గ్రీస్‌ల మాదిరిగా ఈజిప్షియన్. బాబిలోనియన్, సుమేరియన్ జాతులకు వున్నట్లుగా, హెచ్చుగా చెప్పుకోదగిన రికార్డులు, (చారిత్రకాధారాలు) మనకు లేకపోబట్టి ఈ గందరగోళం వ్యాపించింది. నుడులుగా, నానుడులుగా ప్రజలలో నాటుకున్న సంప్రదాయాలే ఎక్కువ. ఒక్కో సందర్భంలో చివరకి రాజవంశాల, రాజుల పూర్తి వివరణకూడా చేతికి అందకుండా పోయినవి వున్నాయని కోశాంబీ అన్నారు. ముసల్మానుల కాలంవరకూ ఈ పరిస్థితే కొనసాగుతూ వచ్చింది.

ఇటీవల కాలంలో మన పురాతత్వ శాస్త్రవేత్తల కృషి ఫలితంగా, పెక్కు చోట్ల త్రవ్వకాల ఫలితంగా మన చరిత్రలో విస్మృత కాలాలకు చెందిన విశేషాంశాలు బయటపడుతున్నాయి. ఇవి ప్రతి యుగంలోను మానవుల కార్యకలాపాలను అద్దమెత్తి చూపుతున్నాయి. రాష్ట్రపతి సూచించినపద్ధతిలో ఈ పరిశోధనా కృషి, చరిత్రకారుల దృష్టి కొత్తపుంతలు త్రొక్క వలసిన అవసరం వుంది. ఇది మన తెలుగువారి చరిత్రకుకూడా వర్తిస్తుంది.

# పచ్చ పచ్చని పరిసరాలు

కేవలం సౌందర్యాన్ని ఆరాధించే వాళ్ళ సంగతి కాదు కాని, మానవ జీవితానికి వృక్ష సంతతి వల్ల ప్రయోజనాన్ని విస్మరించలేము. కొవ్వొత్తికీ, చెట్టుకూ ఈ విషయంలో చాలా పోలికలున్నాయి. ఒకటి తాను ఆత్మార్పణ చేసుకొంటూ ఇతరులకు వెలుగు ఇస్తుంది. వేరొకటి పరిసరాలను పచ్చ పచ్చగా ఉంచడమే గాక మానవునికి ప్రాణవాయువు నిచ్చి ప్రాణదానం చేస్తుంది. పరిశుభ్రమైన పరిసరాలు మానవుని మనుగడకు ప్రధానావసరం. సౌందర్యారాధనకు రెండవ స్థానం. అందుకే పోప్ ఒక సందర్భంలో "పట్టాభిషేకపు పట్టు దుస్తులలో కనిపించే ఒక పట్టమేలే రాకుమారుని కంటే ఒక చెట్టు ఘనమైనది" అన్నాడు!

ఇటీవల కేంద్ర ప్రభుత్వం చొరవపైన దాదాపు అన్ని రాష్ట్రాలూ ఆహార విహారాలకు ఆధారమైన అడవులను నరికివేసే కార్యక్రమాల కంటే వాటిని పెంచే పథకాలకూ, చెట్లను పెరికివేసే పనులకంటే వాటిని పెంచే కార్యక్రమాలకూ ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఎంతగా జనాభా పెరుగుతున్నా నిర్దిష్ట ప్రాంతంలోనైనా వృక్షాలను పెంచుకొనకపోతే ఒకటి కాదు, అనేక నష్టాలు, వరదలూ, కరవు కాటకాల సృష్టిలో ఈ విధ్వంసకాండ పాలు కూడా హెచ్చే. ఏటా తెగుళ్ళ వల్ల, ఇతరత్రా వైపరీత్యాల వల్ల వ్యవసాయ రంగానికి వాటిల్లే నష్టం రు. 5000 కోట్లు కాగా అడవులను ఛేదించు కోవడం మూలంగా వరదలకు భూమి కోసుకుపోయి, చవుడు తేలినందునసుమారు 21 కోట్ల హెక్టార్ల భూమి దెబ్బ తింటుంది. అందుకే అడవులను కాపాడుకోవడం; చెట్లను పోషించుకోవడం అవసరం.

వెనక మున్షీతో ప్రారంభమైన వనమహోత్సవాలు మధ్యలో ఆగిపోయినందున విధాన లోపం వల్లా చెట్లు నాటే కార్యక్రమాలకు అవాంతరం ఏర్పడటమేగాక, అటువంటి పథకాలు తరచుగా అవహేళనకు గురి అవుతూ వచ్చాయి. కాని.

ఈ అవహేళన ఆశయం గురించి కాదు, ఆచరణ గురించి మాత్రమే. మన రాష్ట్రంలో ఈ ఏడాది పదహారు లక్షల చెట్లు నాటాలని ప్రభుత్వం సంకల్పించి, కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేసింది.

కాలుష్య నివారణలో చెట్లకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. పట్టణ జనాభాకు వీటి వల్ల బహుళ ప్రయోజనాలుంటాయి. పరిసరాలను సుందరంగా మార్చుకోవచ్చు. అమెరికన్ నగరాలలో కాలుష్య నివారణ చర్యలలో భాగంగా ఒక విశిష్టప్రయోగం అమలులోకి వచ్చింది. చెత్తాచెదారాన్నికూడా "సంపద"గా భావించి - చివికిపోయి, కుండీలలో పడిన కాగితాలనూ, కట్టెలనూ, కార్డుబోర్డులనూ, ప్లాస్టిక్, ఆహారపదార్థాల అవశేషాలనూ, తగల బెట్టడానికి వీలైన ఇతర పదార్థాలను ఎలక్ట్రిక్ కంపెనీలకు అమ్మి విద్యుత్ కర్మాగారాలలో ఇంధనం కొరతను ఆదుకొంటున్నారు. అలాగే తగలబడకుండా ఉండే లోహాల రద్దును మాన్యుఫాక్చరర్స్ కొనుగోలు చేసి కొత్త వస్తువులను తయారు చేస్తున్నారు. అందువల్ల వినియోగదారుని చైతన్యాన్ని బట్టి ఏ వస్తువుకైనా విలువ పెరుగుతుంది. అలాగే చెట్లకూనూ. కనుక రాస్తాల పక్కనా, పార్కులలోనూ, ఏటి గట్టునా "ఏనుగుచింత" నాటినా, ఏడాకుల పాల చెట్టును మొలిపించినా, శ్వేత కాంచనాలు పెట్టినా, రక్తకాంచనాలు పెంచినా, చెట్టు చిన్నదైనా, అది పొన్నాగ అయినా అనుభవించేదీ మనమే, ఆనందించేదీ మనమే.

# "కులంగాడీ గోత్రం"

మన ఆదర్శాలు సభలకు, సదస్సులకూ పరిమితమైనంత కాలం, మన ఆచరణ "మాటలకోటల"కు మాత్రమో బందీ అయినంతకాలం ఎన్ని మార్లు వల్లె వేసుకున్నా మన బతుకు "గొంగళి" సామెతగానే వుంటుంది.

సాంఘిక సంస్కరణల గురించి విజయవాడలో ప్రారంభమైన రాష్ట్ర సదస్సులో ప్రసంగించిన పెద్దలందరూ సమాజానికి అవసరమైన విషయాలను ప్రస్తావించారు. సంక్షేమశాఖ మంత్రి అసలు సమస్యను (ఆర్థికం) ముందుకు నెట్టి, "దేశపు సాంఘిక, ఆర్థిక, ప్రజాసామ్య ప్రగతి"కి ప్రతిబంధకంగావున్న కులతత్వంపై "బహుముఖంగా యుద్ధం" ప్రకటించాలని చెప్పారు. అంతరంగం నుంచి వచ్చిన ఈ మాటలకు ఇక జరగవలసింది కార్యాచరణ. "సంఘ సంస్కరణ, ఆర్థిక సంస్కరణ" ఒకే నాణానికి రెండుముఖాలని చెప్పడం వాస్తవ పరిస్థితిని మరొకసారి గుర్తించడమే.

కాని ఇంతకాలంగా "సదస్సు"ల పని "చర్చ"గా మాత్రమే వుండిపోయింది. కాని ప్రభుత్వాల పని "చర్య" కావాలి. కులమతాలు, వర్ణభేదాల వల్ల సమాజ పురోభివృద్ధికి వాటిల్లగల నష్టాలేమిటో ఈ వేళ కాదు, జాతీయోద్యమ దినాల నుంచీ వింటున్నాం. మరల "సదస్సు"ల అవసరం ఉత్తమ ఆదర్శాలను అమలు జరిపించడంగానే వుండాలిగాని, అవి కేవలం పునశ్చరణ తరగతులుగా మారకూడదు. నిజానికి ఆచరణ-ప్రజల, ప్రభుత్వం బాధ్యత. వ్యవస్థను నిర్వహిస్తున్న ప్రభుత్వం ఇందుకు కంకణం కట్టుకుకోవాలి. ఆ నిర్వహణలో పాల్గొంటున్న మంత్రులందరూ (కుటుంబాలు సహా) ఆదర్శమూర్తులు కావాలి.

ఏవో చిలకేటుగా అంతర్వర్ణవివాహాలు జరిపితేనో, ఆర్థిక సహాయం అట్టి దంపతులకు అందించితేనో చాలదు. ఇక్కడ సమస్య వ్యష్టి ప్రధానమైనది

కాదు, సమష్టి ప్రయోజనం. అందువల్లనే వ్యక్తి ఆస్తి హక్కుపై ఆధార పడిన ఆర్థిక వ్యవస్థలో తీసుకువచ్చే మౌలికమైన మార్పులమీద ఇది ఆధార పడి వుంది. ఈ విశాల ప్రాతిపదిక మనకు లేనందుననే, అట్టి సమష్టి వ్యవస్థకు మనం యింకా వేల మైళ్ళ దూరంలో వున్నందుననే అంతర్వర్ణ వివాహాలను ప్రోత్సహించడానికి కేటాయించిన అయిదు లక్షల రూపాయిలలో నాల్గులక్షలు ఖర్చుకాకుండా మిగిలిపోయింది! ఇది సిగ్గుచేటుకాదా? మనం వాజమ్మలం కాదూ?

పాఠ్యపుస్తకాలలో నేటికీ మూఢవిశ్వాసాలు పెంపొందించే అంశాలు వుంటున్నాయి. కట్నాల సంతలో వంత పాటలకు అనువైన సరకుగా వుంది. *దరఖాస్తు ఫారాలలో కులం, మతం పేర్కొంటే తప్ప మనుగడే లేని దుస్థితి వుంది. దేశ విభజన సమయంలో ప్రత్యేక పరిస్థితులలో అవతరించిన కమ్యూనల్ అవార్డు, సమాజం కంఠానికి ఆభరణం కాదు, ఉరితాడుగా నిలిచిపోయింది; ఆర్థిక, సమస్య పరిష్కారానికి ఇదొక పెడ మార్గంగా మిగిలిపోయింది. "వర్ణాంతర వివాహాలకు, దుర్బల వర్గాల ఉత్సవాలకు" వీలుగా కొన్ని కేంద్రాలలో కమ్యూనిటీ హాల్స్ నిర్మాణం అవసర మని శ్రీ భాట్టం సూచిస్తున్నారు. కాని మరొక రకంగా ఇదికూడా యథాస్థితికి కంచుకోటగానే వుండిపోతుందని గ్రహించాలి. కులం పీడకల తొలగాలేగాని, ఆ అంతస్తులు కూలిపోవాలేగాని, పెళ్ళిళ్ళకూ, పెడబొబ్బలకూ ప్రత్యేకసదనాలు అవసరం లేదు. గుడి అయినా ఒక్కటే, బడి అయినా ఒక్కటే. ఉన్న దేవళాలనే వినియోగించుకోవచ్చు. అందువల్ల అసలు సమస్యను - ఆర్థిక చట్రాన్ని తాకకుండా మనం చేయగల్గింది నామ మాత్రమే.

* ఈ ప్రస్తావన దరఖాస్తులతో అవసరంలేదని చెప్పి, ఈ నిబంధనను తొలగించాలని 1988 లో "తెలుగుదేశం" ప్రభుత్వం మొదటిసారిగా నిర్ణయించింది.

# రైలు మార్గాలు - రాష్ట్ర జీవనం

భారతదేశపు జీవనాడి పల్లెసీమలలో ఉందన్నాడు గాంధీజీ. ఆ "నాడి"ని నిరంతరం స్పందింపజేసే మార్గాలలో ఒకటి రైలుమార్గం. గ్రామ పంటసిరి నాట్యం చేస్తేనే, పరిశ్రమలు అక్కడకు విస్తరిస్తేనే, అయిన సరకు బళ్ళకూ రైళ్ళకూ ఎత్తుకొని మారుమూలల ఉన్న ప్రజలకు సహితం వాటిని అందించగలిగితేనే, సరకులతో మార్కెట్లు కలకలలాడితేనే- సరైన జీవనం. వ్యవసాయం, పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు అభివృద్ధి చెంది ఆర్థికవ్యవస్థ మూడు పూవులూ, ఆరుకాయలుగా విలసిల్లడానికి రోడ్లూ, రైలు మార్గాలూ నలుమూలలకూ విస్తరించాలి. ఈనాడు దేశం రైల్వే పటంలో కనిపించే పెద్ద పెద్ద నగరాలూ, పట్టణాలూ మినహాయిస్తే స్వాతంత్ర్యానంతరం కొత్త ప్రాంతాలకు వేసుకొన్న కొత్త రైలు మార్గాలు చాలా తక్కువ. ప్రయాణీకుల ఛార్జీలూ, సరకుల రవాణా ఛార్జీలూ పెంచడంలో వేస్తున్న ముందడుగు కొత్త మార్గాల నిర్మాణంలో కనిపించడంలేదు. ఐదవ ప్రణాళికలోనైనా వీటి నిర్మాణానికి అవసరమైన "నిధులు కేటాయించే విషయమై" ప్రణాళికా సంఘాన్ని ఒప్పించేందుకు రైల్వేశాఖ ప్రయత్నిస్తున్నదని మంత్రి శ్రీ త్రిపాఠీ చెప్పడం సంతోషించదగిన విషయం. అయితే ఈ నిధుల "కొరత" గురించి ఇతర రాష్ట్రాల సంగతి ఏమోగాని మన రాష్ట్రం మాత్రం ఏళ్ళూపూళ్ళూగా వింటూనేఉంది; అనుభవిస్తూనూఉంది. రాష్ట్రం లోని మూడు ప్రాంతాలలోనూ- కోస్తాంధ్ర, రాయలసీమ, తెలంగాణా- బ్రిటిష్‌వాళ్ళు వేసిపోయిన రైలుమార్గాలే మార్గాలు. మధ్య మధ్యన మీటర్ గేజ్‌లను బ్రాడ్‌గేజ్‌లుగా మార్చడం' లేదా ఉన్న మార్గాన్ని మరికొంత దూరం పెంచడం అక్కడక్కడా జరిగిఉండవచ్చు. కాని, కొత్తగా నిర్మించుకొన్న మార్గమే లేదు. దశాబ్దాల ఆందోళన తరవాత ఏతావాతా ఇటీవల నిర్మాణానికి నోచుకొన్న కొత్త మార్గం బీబీనగర్-నడికూడి. "నిధుల కొరత" అనే బాలారిష్టం నుంచి ఇది కూడా బయటపడినట్టు చెప్పుకోలేము.

కొత్త రైలు మార్గాల నిర్మాణం అవసరాన్ని గుర్తింపజేసేందుకు ముఖ్యమంత్రి వెంగళరావు ఈ ఏడాది ఫిబ్రవరిలో కేంద్రంతోనూ, దక్షిణమధ్య రైల్వే అధికారులతోనూ చర్చలు జరిపారు. అప్పుడాయన, రైల్వేశాఖ గనుక రాష్ట్ర ప్రభుత్వ ప్రతిపాదనలను ఆమోదించి, అమలుజరిపే పక్షంలో అవసరమైన భూములనూ, ఇతర సౌకర్యాలనూ, ఓవర్‌బ్రిడ్జిలనూ సమకూర్చి పెట్టగలమని కూడా హామీ ఇచ్చారు. అయినా ఇప్పటికీ జరుగుతున్న పని అప్పుడప్పుడూ "సర్వే"లు జరపడమే. మన దృష్టిలో ఎంతసేపూ కనిపించేవి ప్రధాన రైలుమార్గాలే. కాని వ్యవసాయోత్పత్తులూ, పారిశ్రామికోత్పత్తుల రవాణాకూ ప్రయాణీకుల రాక పోకలకూ కల్పించవలసిన కొత్త రైలుమార్గాలు ఎన్నో ఉన్నాయి.

నేడు రాష్ట్రంలోని 21 జిల్లాకేంద్రాలలో అసలు ఎటువంటి రైలుమార్గాలూ లేనివి నల్గొండ, కరీంనగర్, సంగారెడ్డి (మెదక్). తెలంగాణా అభివృద్ధికి సూచించిన కొత్త రైలు మార్గాలను నిర్మించినట్టయితే, వీటిని రాష్ట్రంలోని అభివృద్ధి చెందిన ప్రాంతాలతో కలిపినట్టయితే ఈ వెనుకబడిన ప్రాంతం మరింతగా అభ్యుదయం సాధిస్తుంది. ఈ కొత్త మార్గాలలో ప్రధానమైంది- నాగార్జునసాగర్‌ను కలుపుకొంటూ వెళ్ళే ఒంగోలు- హైదరాబాద్ మార్గం సాగర్‌ప్రాజెక్టువల్ల లక్షలాది ఎకరాలు గుంటూరు, నల్గొండ, ఖమ్మం, కృష్ణా, నెల్లూరు, కర్నూలు జిల్లాలలో సాగులోకి వస్తాయి. రైతుల చేతికి వచ్చే లక్షలాది టన్నుల ఆహారధాన్యాలనూ వాణిజ్య పంటలనూ సునాయాసంగా మార్కెట్లకు తరలించుకోవచ్చు. ఈ ప్రాంతాలలో లభించే అపారమైన ముడి సరకు ఆధారంగా అనేక రకాల పరిశ్రమలను ఏర్పాటు చేసుకోవచ్చు. పైగా సాగర్ పెద్ద వినోదయాత్రా కేంద్రంగా వృద్ధిచెంది డబ్బులు సంపాదించి పెడుతుంది. ఈ రైలుమార్గంవల్ల మద్రాసు - హైదరాబాద్ మధ్య దూరం కనీసం 150 మైళ్ళు కలిసివస్తుంది. అలాగే భద్రాచలం-కొవ్వూరులను కలుపుకొంటూ వెళ్ళే బైలదిల్లా - విశాఖ రైలు మార్గం అవసరం. ఇది భద్రాచలం రోడ్డు, బొగ్గుగని ప్రాంతాలను విశాఖ పారిశ్రామిక వాడలతోనూ, మధ్యప్రదేశ్ గనులతోనూ అనుసంధిస్తుంది. ఇందువల్ల హైదరాబాద్- విశాఖ పారిశ్రామిక ప్రాంతాల మధ్య దూరం కూడా 45 మైళ్ళు తగ్గుతుంది. పైగా ఏజెన్సీ ప్రాంతాలు చీకటిని చీల్చుకొని వెలుగులోకి వస్తాయి.

అలాగే నిజామాబాద్- రామగుండం లైన్ ఏర్పడితే అదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో రవాణా వ్యవస్థ పటిష్ఠమవుతుంది. పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణానికి అవసరమైన హంగులను ఏర్పరచడంలో ఇది చేదోడుఅయి, మూడు జిల్లాలలోనూ అటవీ, వ్యవసాయాధారపరిశ్రమలు పెంపొందగల్గుతాయి.

రాయలసీమలో కూడా 1923 నుంచీ కొత్త లైనే పడలేదు. బ్రాడ్‌గేజ్‌గా మారిన రేణిగుంట- తిరుపతి మార్గం దేవాలయ నిధులవల్ల వెలసిందే. రాయలసీమ ప్రాంతాల నుంచి ఎగుమతి అయ్యే కాకిరాయి, పాలరాయి, ఖనిజాలు ఇతర వ్యవసాయోత్పత్తులూ వివిధ ప్రాంతాలకు రవాణా కావాలంటే కడప-నెల్లూరు, కడప-నంద్యాల, రాయదుర్గ్- ధర్మవరం, గుంతకల్-ఉరవకొండ, మడకసిర, తూముకూరు మున్నగు రైలు మార్గాలు ఏర్పరచుకొనకతప్పదు.

ఇక కోస్తాఆంధ్రలో కూడా అన్నింటికంటే తక్కువ రైలు మార్గాలున్న జిల్లాలు విశాఖ, తూర్పుగోదావరి బ్రాడ్‌గేజ్ మార్గం ద్వారా తూర్పు-పశ్చిమ కోస్తాల మధ్య రవాణా విస్తరణకు ట్రంకు రూట్లు ఏర్పాటు చేసుకోవాలి. ఇప్పటి బీబీనగర్ - నడికూడి లైన్‌తోపాటు గుంటూరు - మాచెర్ల లైన్‌ను బ్రాడ్‌గేజ్‌గా మార్చుకొంటే హైదరాబాద్- గుంటూరు మధ్య దూరం 70 మైళ్ళు తగ్గుతుంది. ఒంగోలు-నడికూడిని కలిపితే ఒంగోలు-హైదరాబాద్ మధ్య దూరం 150 మైళ్ళు కలిసి వస్తుంది. ఈ అదనపు లైన్ వేసుకోకపోతే సాగర్ ప్రాంతం నుంచి మద్రాసు-కేరళలకు సరకుల ఎగుమతులకు కూడా ఆటంకమే. పైగా బీబీనగర్-నడికూడి మార్గంవల్ల ఆశించిన గరిష్ఠ ప్రయోజనం రాష్ట్రానికి ఒనకూడదు. మచిలీపట్నం లైన్‌ను రేవు వరకూ విస్తరించుకోవాలి.

# పగడాల దీవిలో పాముకాటు...

అనటోల్ ఫ్రాన్స్ రాసిన "పెంగ్విన్ దీవులు" అనే వ్యంగ్యాత్మక రచనలో ఒక యుద్ధంలో అమెరికన్ అంకుల్ శాం పెట్టిన ఖర్చు గురించి ప్రస్తావిస్తోంది ఒక పాత్ర. "ఖర్చుమాట సరేగాని ఇంతకీ ఆ యుద్ధంలో చనిపోయిన మానవుల సంగతేమిటి?" అని ప్రశ్నించింది మరొక పాత్ర. దానికి జవాబిస్తూ , అంకుల్ శాం "ఆ ఖర్చు క్రిందనే మానవులు కూడా జమపడిపోయారు" అంటాడు.

ఆయుధ వ్యాపారికి మనిషి ఆయువుతో నిమిత్తం లేదు. ఆస్తుల పైననే కాదు, వాడు అస్థిపంజరాలతో కూడా వ్యాపారం చేస్తాడు. అంతటి "ప్రజాస్వామ్యం" అమెరికా ప్రభుత్వానిది. అటువంటి "వర్తకమే" సాగించింది, హిందూమహాసముద్రంలోని డీగోగార్సియాలో కూడా. అయితే ఈసారి వియత్నాంలో మాదిరిగా గుట్టు బైటపడకుండా, గుంభనగా "నిర్మానుష్యంగా" ఉన్న ప్రాంతాన్ని ఎంపిక చేసుకుంది. కాదు, కాదు మానవులు నివసిస్తున్న డిగోగార్సియాలో సైనిక యుద్ధ స్థావరాల నిర్మాణంకోసం ఆ పగడాల దీవిని నిర్మానుష్యం చేసింది. నోరూ వాయీలేని నివాసులపై "పాముకాటు వేసింది," "చంపినంత పనిచేసింది."

తరతరాలుగా అక్కడ జీవిస్తున్న 14 వందలమందిని చడీచప్పుడు లేకుండా మారిషస్‌లో మరొక దీవికి తరలించింది. వీరిప్పుడు కటిక దారిద్ర్యంలో జీవిస్తున్నారు. మారిషస్ స్వాతంత్ర్యం పొందకముందే బ్రిటిష్‌వాళ్ళు మారిషస్‌కు చెందిన దీవిని అమెరికాకు అప్పగించారు. ఇప్పుడు అటు అమెరికా ఇటు బ్రిటన్ మరొకవేపున మారిషస్ ఎవరూ పట్టించుకోని దారుణ పరిస్థితిలో నిర్వాసితులు ఉన్నారు. మూడు దేశాలకు తమ దుస్థితి గురించి విన్నవించుకున్నారు. ఆకలిదప్పులతో చచ్చిపోతున్నామన్నారు. అయితే వీరి ఉద్వాసన జరిగింది 1971 లో తెలిసింది సెనెటర్ కెనెడీ ద్వారా నిన్న-మొన్న.

అమెరికన్ 'కాంగ్రెస్' డిగోగార్సియా స్థావరం అభివృద్ధికి డబ్బులుకూడా కేటాయించిన తరువాత ఈ విషయాలు వెల్లడి అయినాయి.

అమెరికా, బ్రిటన్‌లు ఆడిన ఈ నాటకం, ఈ అమానుష చర్య వెనుకవాళ్ళ స్వార్థప్రయోజనాలున్నాయి. ఇండియా దక్షిణ కొనకు 8 వందలమైళ్ళ దూరంలో 27 మైళ్ళ చదరంలో హిందూమహాసముద్రంలో ఉన్న ఈ చిరు దీవి మొత్తం సముద్రప్రాంత దేశాల భవితవ్యానికి చిచ్చుపెట్టే స్థావరం కానున్నది. అగ్రరాజ్యాల ఆయుధ పోటీలో హిందూమహాసముద్రప్రాంత దేశాలు పావులు కాగల ప్రమాదం ఉంది.

ఇంతవరకు అగ్రరాజ్యాల ప్రాబల్యానికి దూరంగా ఉన్న ఏకైక ప్రాంతం, హిందూమహాసముద్రం. కానీ ఇప్పుడు అమెరికా, రష్యాల పోటీవల్ల ఉద్రిక్తతకు స్థావరం కాబోతున్నది. ప్రపంచ పెట్రోల్ నిల్వలలో సగానికి పైగా ఈ ప్రాంతం చుట్టూ ఉన్న ఉన్నాయి.

డిగోగార్సియా స్థావరాన్ని ఏర్పాటు చేసుకోవడంలో, అక్కడ ఉన్న కుటుంబాలను పూర్తిగా తొలగించడంలో రెండు ప్రయోజనాలు చూసుకుంది అమెరికా. 1. అమెరికా జోక్యాన్ని నిరసించే స్థానిక ప్రజలెవరూ ఉండరు; 2. అమెరికా పథకాలను వెల్లడించేందుకు పత్రికా విలేఖరులు అక్కడికి రారు.

నిన్నగాక మొన్ననే అమెరికన్ ప్రతినిధులసభ ఒక తీర్మానంకూడా చేసింది. "మానవ హక్కులను ఉల్లంఘించి ప్రవర్తించే దేశాలకు అమెరికా ఆర్థిక సహాయం ఇవ్వరాదు" అని ! తనకుమాలిన "నీతి"కి అమెరికా పెట్టింది పేరు అనడానికి ఈ తాజా ఉదాహరణ చాలు. ఆత్మవంచనకు. పరవంచనకు అక్కడి ప్రభుత్వం వెనుకాడదు. కాబట్టి, డిగోగార్సియా "నిర్మానుష్య" ప్రాంతం అని అమెరికన్ పార్లమెంటును సెనేటర్లను నమ్మించింది ప్రభుత్వం. సెనేటర్ కెనెడీ మాటలే వాస్తవమైతే, డిగోగార్సియా స్థావరం నిర్మాణ ఖర్చులు ఆమోదించే బిల్లుకు కావలసింది సవరణకాదు, అసలు ఆ స్థావరాన్నే వదలివేయాలి. ఈ పని జరగకపోతే కపటనాటకం ప్రభుత్వానిదే కాదు, అమెరికన్ 'కాంగ్రెసు'ది కూడా అవుతుంది.

# రచయితలు: ప్రధాని

అత్యయిక పరిస్థితి ఆచరణలో అనుకూల ఫలితాలు సమకూర్చిపెట్టిన దరిమిలా ప్రధాని ఇందిర దేశ పరిస్థితుల గురించి సహేతుకమైన సమీక్షకు సిద్ధపడుతున్నారు. ప్రజాస్వామ్య పరిరక్షణకు ఏ ప్రాతిపదికలు అవసరమో ఆమెకు ఖుణ్ణంగా తెలుసు. ఆమె పుట్టిపెరిగిన పరిస్థితులు ఆమెను మరొకలా ఆలోచించేట్టు చేయజాలవు. రాజ్యాంగ నిబంధనలనుంచి రచయితల ప్రయోజనం వరకు ఇందిర ఇటీవల చేస్తున్న ప్రస్తావనలు జాతీయ జీవనంలో మేధావుల పాత్రను నొక్కి చెబుతున్నాయి. ఢిల్లీలో కొందరు రచయితల నుద్దేశించి ఆమె చేసిన ప్రసంగం ఈ సత్యాలను చాటుతోంది. రచయితలు వినాశాత్మక రచనలు, నిరాశా నిస్పృహలకు తావు కల్పించే విద్వేష పూరిత రచనలు కాకుండా క్రియాశీలమైన, నిర్మాణాత్మక రచనలు సాగించాలని ఆమె చెప్పారు. భవిష్యత్తుపై ఆశను, విశ్వాసాన్ని ప్రోద్బలపరచే రచనలు కావాలన్నారు. ఆమాటకొస్తే రాజకీయవేత్తకంటె తాను రచయితకే హెచ్చుప్రాధాన్యం ఇస్తానని అన్నారు. అందుకే ప్రజలలో మనో ధైర్యం కల్పించడం వారి ధర్మం కావాలన్నారు.

ఇవి మంచి ప్రతిపాదనలు అనడంలో సందేహం లేదు. అయితే ప్రజలలో మనోధైర్యం కల్పించగల మొదటిబాధ్యత ప్రభుత్వానిది కావాలి. ప్రభుత్వం సాంఘిక, ఆర్థిక పరిస్థితులను మార్చడానికి ఏ మేరకు మౌలికమైన చర్యలు తీసుకొంటుందో ఆమేర ప్రజలు ఉత్తేజితులవుతారు. రచనలు ఇందుకు తోడ్పడగలవుగాని, అవే ప్రధానస్థానం ఆక్రమించలేవు. సాంఘికాభ్యున్నతి సాధనలో రచయితలు భావవిప్లవానికి నాయకత్వం వహించగలరేగాని, వ్యవస్థలను సమూలంగా మార్చగలశక్తి రాజకీయ ఆర్థిక విధానాలకు మాత్రమే ఉంటుంది. "ప్రజలపై సాహిత్యం ప్రభావం పరోక్షం" అని ప్రధాని చెప్పడం ఇందుకే. ఫ్రెంచి విప్లవంనుంచి ఆధునిక పరిణామాల వరకు కడచిన

చరిత్ర ఇందుకు సాక్ష్యం. రూసో, వోల్టేర్, డేనియల్‌డీఫో, విట్‌మన్‌లు చేసిన పని ఇదే.

జొనాథన్‌స్విఫ్ట్ "ఈకలతో పని కాదు, ఈటెలవంటి కలం పోట్లు కావాలి" అని చెప్పినా ఈ భావ విప్లవం గురించే. ఆధునికులలో క్రియాశీల విమర్శకు పేరెన్నికగన్న లాయీ జువాస్కీ "కనుల నిండిన నీరు కడగండ్ల మిన్నేరు, కాంచిన కలమేను, జీవగాథలు చెప్పు చేవగా" అని చెప్పినా ఈ భావ విప్లవం కోసమే. మన కవులు చెప్పినా ఇందుకోసమే.

అయితే కొందరి దృష్టిలో విమర్శ - వినాశాత్మక రచనే కానక్కరలేదు. కేవల సూచనాప్రాయమైనదికూడా కువిమర్శే కావచ్చు. చేసేవాడికంటే స్వీకరించేవారి దృష్టిని పట్టి, విమర్శకు విలువలు నిర్ణయమవుతున్న కాలం ఇది. "నన్నెవ్వరాపలేరు" అంటే కుదరదు. ఇందిర చెప్పినట్టు "ప్రతి రచయిత, ఏదో ప్రత్యేకమైనబాధ ప్రోద్బలం చెయ్యడం వల్లనే చేతనామూర్తి అయి గుండె గొంతుక విప్పుతాడు." అయితే అలా సామాన్య ప్రజలకు జరుగుతున్న అన్యాయాలను వారి కడగండ్లను హృదయ విదారకంగా వర్ణించే రచనలకు ఏ మేరకు ఈనాడు అవకాశం ఉంటుంది? ఈ ప్రశ్న ఒక్క రచయితలకే కాదు, జర్నలిస్టులకు సైతం ప్రశ్నగానే ఉంది. అందువల్ల జరగవలసిన పని భావ స్వాతంత్ర్యానికి గల హద్దులలోనే. అభ్యుదయకర విధానాలకు చేదోడు వాదోడుగా ఉంటూనే రచయితలు, జరుగుతున్న అన్యాయాలను కూడా బయటపెటాలి. వాటిని పరిశీలించి చక్కదిద్దడం ప్రభుత్వ బాధ్యత కావాలి.

# త్రిపుర - చండీగడ్

రాజకీయాలు ఒక విలాస యాత్రగా భావించకుంటే చెప్పలేముగాని, వాటికి నిర్దుష్ట స్వభావం వుండాలి. ఈసారి ఒక్క రోజు తేడాతో భారత జాతీయ కాంగ్రెస్ జన్మదినోత్సవము, కాంగ్రెస్ చండీగడ్ మహాసభ ఒకసారే వచ్చాయి. ఇది 75వ మహాసభ. కడచిన 74 మహాసభలూ ఏదో ఒక రూపంతో సంస్థ లోని మితవాదులకు - అతివాదులకు మధ్య విధాన స్పర్థలతో, రాజీ బేరా లతో లేదా చీలికలతో ముగుస్తూ వచ్చాయి. సంస్థను శాశనం చేసుకుని, మరింత అభ్యుదయకర మార్గంలో దానికి పుష్టి చేకూర్చడానికి ప్రస్తుత నాయకత్వం కృషి చేస్తున్నట్టు కన్పిస్తున్నది. చండీగడ్ మహాసభలో ప్రధాన చర్చనీయాంశం-భారత సమాజంలో కొన్ని మౌలికమైన సాంఘిక, ఆర్థిక మార్పులు తలపెట్టేందుకు వీలుగా రాజ్యాంగాన్ని కూలంకషంగా మార్చ డమా లేదా అన్నది. వంద సంవత్సరాల చరిత్రలో అమెరికన్ రాజ్యాంగం పదిహేడో, పదునెనిమిది సవరణలో పొందితే మనది పాతికేండ్లలోను 39 సవరణలు పొందింది. కనుక ప్రతిదఫా సవరణలకంటే, తిరిగి రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పాటుచేసి నూతన రాజ్యాంగ రచనకు ఉపక్రమించడమే మేలు అన్న వాదనకూడా బలంగానే విన్పిస్తున్నది.

అయితే, విస్పష్టమైన రెండు అర్థాలకు వీలు కల్పించని విధానం భారత దేశా నికి అవసరమన్న భావం కొంతమంది కాంగ్రెస్ నాయకులలో కూడా లేక పోలేదు. కాంగ్రెస్ సంస్థకు, దాని విధానాలకు సోషలిస్టు రూపం, స్వభావం కల్పించడానికి ఈ రోజున కాదు - ముప్పై ఆరేండ్లుగా ప్రయత్నం జరుగు తోంది. సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధికి కొలది రోజులముందు రాజ్యాంగ నిర్ణయ సభలో చర్చలు కూడా ఈ సమస్యపైనే సాగాయి. కాని జరిగిన పని - ఆ దరిమిలా మనం రాజ్యాంగంలో సోషలిజం లక్ష్యంగా చొప్పించ లేకపోయాం. మాటలు తడబడ్డాయి. ఫలితంగా చేతలు అనుకూలించలేదు.

ఇప్పటికైనా ఆ నిర్దుష్ట విధానం చండీగడ్ మహాసభ రూపొందించగలదని ప్రజలు ఆశిస్తున్నారు. ముఫ్పై ఆరేండ్ల నాడు త్రిపుర కాంగ్రెస్‌లో సంక్షోభం సృష్టించిందికూడా అస్పష్ట విధానాలే. పదిహేనుమంది సభ్యులుకల వర్కింగ్ కమిటీ నుంచి పన్నెండుమంది రాజీనామాలు యిచ్చింది కూడ ఇందువల్లనే. ఆ రాజీనామా పత్రాలలో వారు బ్రిటిష్ సామ్రాజ్య వాదంపై ధ్వజమెత్తే కార్యక్రమంతోపాటు స్వతంత్ర భారత దేశానికి అవసరమైన విధానం గురించి కూడా స్పష్టమైన కార్యక్రమం కావాలని కోరారు. అదే సోషలిజం. ముందు దేశ స్వాతంత్ర్య సాధనకు సామ్రాజ్య వాదంపై సమష్టి పోరాటం సాగించుదాం. ఆ పిమ్మట ఈ విషయం చర్చించుదామని నాయకత్వం దాటవేసింది. ఆ రోజులు పోయాయి. పాతనీరు పోయింది. క్రొత్తనీరు వచ్చింది. స్వతంత్ర భారతంలో ఆవడితీర్మానం నుంచి ఈ రోజు వరకు వచ్చింది సోషలిజం కాదు, కావాలని ఆశిస్తున్నది సోషలిజం అయింది.

ప్రధాని ఇందిర తలపెట్టిన ఆర్థిక కార్యక్రమం ప్రజలలో గొప్ప ఆశలను పురి గొల్పినమాట నిజమే. గ్రామీణ ప్రజానీకంలో ఏర్పడిన ఈ ఆశలు ఆమెకు, కాంగ్రెస్ సంస్థకు రక్షగా పనిచేస్తాయి. అయితే ఈ కార్యక్రమంలో పేర్కొన్న అంశాలు తు. చ. తప్పక అమలుజరగడంతోపాటు, ఆస్తిహక్కుకు సంబంధించిన మౌలిక మార్పులను కూడా రాజ్యాంగంలో చేర్చుకొనగల్గి నపుడు - మరిన్ని మార్పులు సమాజం రూపురేఖలను మార్చగల్గుతాయి. చండీగడ్ మహాసభ ఈపని చేయగలదా? సోషలిజం ఆచరణ సాధ్యమైన ప్రభుత్వ యంత్రం కావాలిగాని, అవకాశానికి అనుకూలమైన తారకమంత్రం కాకూడదు.

# "తి వి రి ఇ సు మం న ....."

ఒకటేమిటి, ఎన్నైనా తీయవచ్చు. మనిషి అవసరం తొందర చేస్తున్నప్పుడు అజ్ఞాతస్థావరాలు సైతం అతనికి పాదాక్రాంతం అవుతాయి. వెనకటికి "ఎల్ డొ రాడో"ని అపారమైన సంపదకు కాణాచి అన్నారు. అది దేశం పేరు కావచ్చు. నగరం పేరు కావచ్చు. కాని చరిత్రలో దానిని "సువర్ణ మహా నగరం"అన్నారు. ఇది ఏ అమెజాన్ నదీతీరాన్నో వుండవచ్చునని ఒకనాడు స్పానియార్డులు, సర్ వాల్టార్ ర్యాలి వూహించారు. అక్కడ వెలసింది బంగారమట. పట్టిందిబంగారమట. అందుకే దానికి ఆ పేరు వచ్చిందట. అసలటువంటి నగరం వుందోలేదోగాని ఐశ్వర్యానికి, సంపదకు నిలయమైన ప్రతిదాన్ని ఒక 'ఎల్ డొ రాడో'గా పేర్కొనడం చరిత్రలో ఆనవాయితీ అయింది. కాని మన దేశంలో ఇంధన సంక్షోభం వచ్చిన తర్వాత దానిని ఎదుర్కొనడానికి జరుగుతున్న ప్రయత్నాలు, సత్ఫలితాలు మనకు అపారమైన ఆనందం కలుగజేస్తున్నాయి. ఇప్పుడు ఒకచోట కాదు, దేశంలో పెక్కుచోట్ల అడవులలో వరవేసిన చెత్తా చెదారం నుంచి పుట్టరాని ముడి పెట్రోలియం ఎలా పుట్టించవచ్చునో, ఆముదంతో రాకెట్ ఇంధనం ఎలా పుట్టించ వచ్చునో..........మన రోదసీ పరిశోధనా సంస్థ అధ్యక్షుడు శ్రీ ధావన్ వెల్లడించారు. 'తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు,' ఆముదంవల్ల పెక్కు ప్రయోజనములున్నాయి. కాని తాజా పరిశోధన యీ ప్రయోజనాలన్నింటిని మించిన ప్రయోజనం. శాకతైలాలే కాదు, పారిశ్రామిక తైలాలూ సృష్టిస్తున్నారు. శాకతైలాలుగాని, "సాల్" విత్తనాలను, విప్ప పువ్వును, వేపగింజలను కూడా ఎన్ని లక్షలటన్నుల క్రూడాయిల్‌ను, వంట గ్యాస్‌ను రసాయన ప్రక్రియల ద్వారా ఉత్పత్తి చేయవచ్చునో చెప్పారు. ఈ మొత్తం పరిశోధనను శ్రీ ధావన్ 'ఎల్ డొరాడో డిస్కవరి' అన్నారు. ఇది లక్షలాదిమందికి ఉపాధి కల్పించే ఇండియన్ 'ఎల్ డొరాడో.'

ఇంధన సంక్షోభం రాకముందు నుంచీ శాస్త్ర, సాంకేతిక రంగాలలో విశిష్ట మైన పరిశోధనలు జరుగుతున్నాయి. కాని సంక్షోభం పరిశోధనా కార్య క్రమాన్ని మరింత రెట్టించింది. ఆయిల్ కొరతవల్ల ప్రత్యామ్నాయ మార్గా లను వెదక వలసివచ్చింది. అందులో భాగమే సౌరశక్తిని మానవుని నిత్యోప యోగానికి మలచుకోవాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాం. సముద్రపు చెదారంనుంచి ఆహార పదార్థాలు తయారు చేయబోతున్నాం. బావుల నుంచి మంచినీళ్ళు తోడడానికి, లిఫ్ట్ ఇరిగేషన్‌కోసం 'విండ్‌మిల్సు' (గాలియంత్రాలు) ఏర్పాటుకై విశ్వప్రయత్నాలు చేస్తున్నాం. తొలిసారిగా టెలివిజన్ వ్యవస్థను స్వంతంగా డిజైన్‌చేసి త్వరలో ఆ పరిజ్ఞానాన్ని ఇతర దేశాలకు అందించ బోతున్నాం. గ్రాఫైట్‌ను సరాసరి వజ్రవైడూర్యాలుగా మార్చబోతున్నాం, మైక్రోబయాలజీని అభివృద్ధి చేసి, నిత్యావసర వస్తువులు పాడు పడకుండా జాగ్రత్త వహించే దశకు చేరుకున్నాం. ఊకనుంచి ధాన్యంలో తేమలేకుండా చేయబోతున్నాం. రంపపు పొట్టునుంచి మాంసకృత్తులు పుష్టిగా లభించే కృత్రిమపు 'ఈస్టు' తయారు చేసుకుంటున్నాం. ఇలా యింకెన్నో. ... ఈప్రయోగాలన్నీ విజయవంతమై, పౌష్టికాహార లోపంతో తీసుకుంటున్న సామాన్య ప్రజలందరికీ కూడా చేరువకావాలి. ఇందుకు ప్రభుత్వం శాస్త్ర పరిశోధనలకు ఇతోధికంగా ధనం వ్యయం చేయాలి.

# ఆనుశాసనిక పర్వం

లోకంలో ప్రజల బాధలు, గాథలు తెలుసుకున్న తరువాతనే ప్రవక్తల బోధలు వచ్చాయి. ప్రబోధంతోనే పనులు జరగవు. ప్రకృతి మాదిరి గానే, మానవుల చేష్టలకుకూడా కార్యకారణ సంబంధం ఉంటుంది. ఈ ప్రాథమిక సత్యాన్ని మనం గుర్తించక పోవడం వల్లనే క్రీస్తు బోధలు, గౌతమ బుద్ధుని ధర్మ ప్రవచనాలు, గాంధీజీ సూక్తులు, సూత్రాలు గాలికి ఎగిరిపోతున్నాయి. ఈ మూర్తిత్రయం స్మృతిచిహ్నాలుగా మిగిలినవి నిలు వెత్తు విగ్రహాలు, గోడలపై జాలువారిన ఫొటోలు.

మహాత్ముని శిష్యకోటిలో ప్రథమ శ్రేణికి చెందిన ఆచార్య వినోబాభావే ఏడాది క్రితం ప్రారంభించిన మౌనవ్రతం ముగిసింది. దేశంలో, ప్రపంచంలో, ఎక్కడ చూచినా అశాంతి, కల్లోలం, దారిద్ర్య బాధలు, కలవారి ఆగడాలు, రాజకీయ కక్షలు, కార్పణ్యాలు - ఇవే ఆయన మనస్సును వేధించాయి. తను ప్రభుత్వాధినేతకారు గనుక, ఆచరణకు వీలైన యంత్రాంగం తన చేతిలో లేదు గనుక మౌనవ్రతం పూనారు. సర్వులూ శాసన బద్ధులైతే సమస్యలు తీరుతాయని భావే అనుశాసనం (ఆజ్ఞ). ఎమర్జె న్సీకి ముందూ, ఆ తర్వాతకూడా ఆయన ఈ ప్రబోధం చేస్తున్నారు. భూమి లేని నిరుపేదలకు జీవనోపాధి కల్పించేందుకు ప్రారంభించిన భూదానోద్య మంతో ఆయన లోగడ తృప్తి పొందలేదు. ఇప్పుడూ పొందడం లేదు. కన కనే ఆయన వచ్చే ఏడాది ఆఖరికైనా దానంగా అమరిన భూమిపంపిణీ పూర్తి కాగలదని విశ్వసిస్తున్నారు. కాగా, పౌనార్‌లో ప్రారంభమైన రజతోత్స వాలు మరొకవైపున "అర ఎకరం" భూమినే ఆర్థిక సౌష్టవంకల కొండగా ముద్ర వేస్తున్నాయి.

శాసనధిక్కారం ఏకపక్షంగా ఎన్నడూ లేదు. ఆస్తిహక్కు అమలులో వున్న ప్రతి చోట లేనివాళ్ళకు, కలవాళ్ళకు, వారిద్దరిమధ్య ప్రభుత్వాలకు

ఇదొక కొరకరాని కొయ్యగానే తయారైంది. భావే చెప్పిన ప్రాణితాత్త్వి కులు-వారే మన ఆచార్యులు, బోధించిన సూక్తులే అనుశాసనిక పర్వం. భావే విశాల హృదయుడు కాబట్టి, ఆయన దృష్టిలో అందరూ సమానులు. కాని ఈ సమతా ప్రసాదం సామాజికంగా దుర్లభం అవుతోంది. ఆర్థిక వ్యత్యా సాలు తొలగించగల యంత్రం వద్ద ప్రభుత్వం వుంది. అది కదలాలి. అంత వరకు అమలులో వుండేది 'కర్మ' సిద్ధాంతమే. భారతంలోని అనుశాసనికపర్వం చెప్పేది—"కర్మ అన్నింటికి కారణం." ఇదే నిజమైతే కర్మలు చేసేవాళ్లు ఒకరవుతున్నారు, ధర్మాలు చేసేవాళ్ళు వేరొకరవుతున్నారు. అంటే కష్టం ఒకరిది, ఇష్టం, కష్టఫలం ఇంకొకరిది. కర్త ఒకరు, భోక్త మరొకరు. సరకు ఉత్పత్తి చేస్తున్న చేతులు — ఆ సరకును తృప్తిగా అనుభవించ లేకపోతున్నాయి.

కాని ప్రాచీనాచార్యుల బోధలు—అనుశాసనం—వేరుగా వున్నాయి. అవి భిక్షుకవృత్తిని దానధర్మాలతో పోషించమన్నాయి. కులం తక్కువవాడికి విద్యలు కూడదన్నాయి. పుడితే రాజుకి, లేదా ద్విజునికి మాత్రమే పుట్టా లని చెప్పాయి. మహిళలను ఈసడించాయి. భూదానంలో కూడా ఈ వ్యత్యాసాలు చూపమన్నాయి. అగ్ర వర్ణాలవారికి శుశ్రూష చేస్తేనే సుఖం, సౌఖ్యం అని ఘోషించాయి. ఇదీ-స్థూలంగా అనుశాసనిక పర్వ చరిత్ర. మహాభారతం మహాసూక్తులు—మరొక్కసారి వినమంటున్నారు!

వినోభావే విజ్ఞులు. తపస్సు, స్వాధ్యాయన పద్ధతులు తెలిసిన మహ నీయులు. కాని ఆయన బోధించే అనుశాసనంపై ఆచార్యుల కోవకు చెంద దనే మా విశ్వాసం. ఆగ్రహానికి, సత్యాగ్రహానికి గల వ్యత్యాసాన్ని మనం కూడా తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం!

# కరాచీనుంచి కామగటమారు నగర్....

సమావేశాలు ముగిసినంతనే సంప్రదాయాలు తొలగవు. మహాసభలు పూర్తి కాగానే మహాచరిత్రలు సృష్టికావు. భారత జాతీయ కాంగ్రెస్ డెబ్భై అయిదవ మహాసభ ముగిసింది.

జాతీయోద్యమ దశలో త్యాగాలకు మారుపేరు కాంగ్రెస్ సంస్థా, కాని నాయకులూ, వెంటనడచిన ప్రజలూ. స్వాతంత్ర్య ముగిసిన దరిమిలా వెంటనే తమ జీవితాలలో నవ వసంతోదయం కాగలదని భావించి వారు త్యాగాలు చేయలేదు. విమోచన చేసిన దాస్య భారతాన్ని తిరిగి అంతటి త్యాగదీక్షతోను, ఓరిమితోను పునర్నిర్మించుకుందామని తలపోశారు. అందుకే త్యాగాలకు అడ్వాన్సు గ్యారంటీలు వారు కోరలేదు కనకనే ఉరికంబా లెక్కిన వారు పోగా, అసంఖ్యాకులు జైళ్ళకు వెళ్ళారు, లాఠీ దెబ్బలు తిన్నారు. ఆస్తులు కోల్పోయారు, అసువులు విడిచారు. అటువంటి కాంగ్రెస్ తన చరిత్రలో మరపురాని నిర్ణయాలు ఎన్నో చేసింది. స్వాతంత్ర్యానికి ముందు ఆ, తరువాత నవభారత నిర్మాణానికి అవసరమైన ప్రాతిపదికలేమిటో చెప్పింది, సామాన్యుని బ్రతుకును మరింత చట్టుబండలు చేయకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలో తెలిపింది.

అలా చేసిన నిర్ణయాలే — 1931 నాటి కరాచీ కాంగ్రెస్ తీర్మానాలు, ఆ పిమ్మట "క్విట్ ఇండియా" తీర్మానం. "స్వతంత్రభారతంలో సస్యక్షేత్రాలు, కర్మాగారాలుదున్నేవారికే, కాయకష్టంచేసే కార్మికులకే దక్కాల"ని ఈ తీర్మానం స్పష్టం చేసింది. ఈ మాటలు చెప్పి నాలుగున్నర దశాబ్దాలు అయింది. ఈ వ్యవధి మన స్వతంత్రభారతం వయస్సుకు మించిపోయింది. అయినా అనంతర కాలంలో మాటలు కోటలుదాటాయి. చేతలు వక్రించాయి. ఈ వక్రగతిని సరిదిద్దుకోవాలని ప్రధాని ఇందిర ఆశిస్తున్నారు. దానికి రూపకల్పనే కామగటమారు కాంగ్రెస్ భారతదేశ గమ్యం సోషలిజం అని చెప్పడం.

అయితే ఇప్పటికీ నిర్వచనంలో గందరగోళం లేకపోలేదు. "దారిద్ర్యం, నిరుద్యోగ సమస్యలకు ఏకైక పరిష్కారం సోషలిజం" అని త్రిపురకాంగ్రెస్‌కు పదిరోజులు ముందే స్పష్టం చేసిన నెహ్రూ సహితం స్వతంత్ర భారత దేశాన్ని సోషలిస్టు రిపబ్లిక్‌గా ప్రకటించలేక పోయారు. 1955 ఆవడి కాంగ్రెస్ "సోషలిస్టు తరహా" సమాజాన్ని ధ్యేయంగా ప్రకటించికూడా ఈ పని చేయలేకపోయింది. 1964 భువనేశ్వర్ కాంగ్రెస్ కూడా ఈ విషయంలో విఫలమైంది. పైగా, సోషలిజం నిర్వచనంలోనే తేడా వచ్చింది. ఈసారి "డెమె సోషలిజం" అన్నారు. ఏది సోషలిజమో కామగటమారు కాంగ్రెస్ కూడా నిర్వచించడం లేదు. పెట్టుబడిదారీ విధానానికి పాశ్చాత్యదేశాలలో "పీపుల్స్ కాపిటలిజం" వంటి ముద్దుపేరు లున్నా, అది కాపిటలిజమే అవుతుందిగాని మరొకటికాదు. అందువల్ల స్పష్టత అవసరం. అందరూ ఆశించేది విదేశీ సోషలిజాన్ని కాదు భారతీయ సోషలిజాన్నే. కాని సోషలిజం బ్రతికి బట్టకట్టడానికి కొన్ని మౌలికచర్యలు అవసరం. భూములు, గనులు, బ్యాంకులు, పరిశ్రమలు, తదితర ఉత్పత్తి సాధనాలన్నింటిపైన ప్రభుత్వం యాజమాన్యం వుంటేనే అది సాధ్యం.

ప్రధాని ఇందిర, ప్రజాస్వామ్యంలో ప్రజలలో అపారమైన విశ్వాసం వున్న వ్యక్తి. శాంతియుత పరివర్తనకు అనువైన పద్ధతులు ఆమెకు తెలుసు. అందుకే ఆమె జాతీయ స్థాయిలో, రాజ్యాంగ సమస్యలనుగాని, సోషలిజం గురించిగాని చర్చలు జరగాలని వాంఛిస్తున్నారు. దేశానికి బహిరంతర శక్తుల నుంచి ఎప్పటికంటే ఎక్కువ ప్రమాదాన్ని ఆమె వూహించి, హెచ్చరిస్తున్నందున, విధాన ప్రకటనలో అస్పష్టతను కూడా తొలగించి, ప్రజలను కార్యరంగంలోకి దించుకోవాలి. అప్పుడు ఆమె, ప్రజలు ఆశిస్తున్న నవభారతం అవిష్కరించుకోవడానికి ఎక్కువకాలం పట్టదు.

# రెండు ముఖాలు

బానిస మనస్తత్వానికి విమోచన ఉండదంటారు. ఇందులో స్త్రీ, పురుష విచక్షణకు తావులేదు. స్త్రీల బానిసత్వానికి చాల సందర్భాలలో స్త్రీలే కారణ మని శరత్‌బాబూ అన్నాడు, ప్రేమ్‌చందూ అన్నాడు. ఆర్థిక అసమానతలూ, దోపిడీ వ్యవస్థలూ ఆధిపత్యంలో ఉన్నంతకాలం భర్త "బూరువా"గా భార్య "శ్రమజీవి"గా (ప్రోలిటేరియట్) వ్రాలు పోషించక తప్పదని ఎంగెల్స్ అన్నాడు. వివిధ ఖండాలలో కడచిన దశాబ్దంగా వివిధ స్థాయిలలో తలెత్తుతున్న మహిళా విమోచనోద్యమాలను పరిశీలిస్తున్నవారికి ఇదంతా మళ్ళీ మాతృస్వామిక వ్యవస్థ కోసం మహిళాలోకం పడుతున్న పురిటి నొప్పులా, అనిపించకపోదు. ఈ ఉద్యమంలో కూడా రెండు ధోరణులు చోటు చేసుకొన్నాయి. ఒకరు సంప్రదాయవాదులూ, వేరొకరు అభ్యుదయవాదులూ. ప్రస్తుతం జపాన్‌లో ఒక విచిత్ర ప్రయోగం జరుగుతోంది. జాపనీస్ ప్రజా జీవితంలో సంచలనం కలిగిస్తున్న ఇద్దరు మహిళలు—హిడామీ అయోకీ; మిసావో ఎనోకీ. జాపనీస్ చిత్రసీమలో అందాలతార అయిన అయోకీ **(Aoki)** దృష్టిలో "మగవారికే అగ్ర తాంబూలం ఇవ్వాలి. వారిని గౌరవించడం ప్రకృతిధర్మం. మగవారి ఆధిక్యం ఆసియాదేశాల సంప్రదాయం, ఆచారం. అందువల్ల మహిళలు ద్వితీయ స్థానంలో రెండవతరగతి పౌరులుగా జీవించక తప్పదు." సినీమాలకూ, థియేటర్లకూ, తద్వారా తనలాంటి నటీమణులకు గ్యాలరీలు నిండిపోయి సొంత ఖజానాలుకూడా నిండాలి కాబట్టి ప్రేక్షకులకోసం అయోకీ అలా ఉండవచ్చు. ఇదొక ధోరణి.

కాని పితృస్వామిక వ్యవస్థ మూలస్వభావాన్నే తారుమారుచేస్తేతప్ప మహిళలకు విమోచన లేదనిభావించి, ఒక పెద్ద ఉద్యమాన్నే నిర్వహిస్తున్న మరొక మహిళ ఉంది. ముప్పైఏళ్ళ డాక్టర్‌కి సతీమణి అయిన ఎనోకీ **(Enoki)** తానాశిస్తున్న "నవసమాజం" కొత్తదేమీ కాదంటుంది. ఆసియా ఖండంలో

రానున్న చారిత్రక మార్పులదృష్ట్యా మహిళా విమోచన విషయంలో మౌలికమైన "భావవిప్లవం" అవసరం అంటుంది. "మాతృస్వామిక వ్యవస్థను స్థాపించడానికి మహిళలు ఆర్థిక రాజకీయాధికారాన్ని పురుషులనుంచి గుంజుకోవా''లట; పురుషుల అధికారంలో ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థను రద్దు చేయించాలట. బౌద్ధమతం స్త్రీలను వస్తువులుగా చూసింది; ఇస్లాం బహుభార్యాత్వానికి లైసెన్సు ఇచ్చింది; క్రైస్తవ మతం స్త్రీని అధమస్థాయికి నెట్టింది''- ఇదీ ఈవిడ ధోరణి. ఆమాటకొస్తే హిందూమతం కూడా స్త్రీని "దేవతామూర్తి''చేసి గౌరవించినా అది కూడా రకరకాల పేర్లతో (నాతి, పడతి, ఉవిద, చాన ఇలా చాలా చాలా...) మురిపించి ముసుగువేసి సామాజికంగా ఎదగనివ్వలేదు; సంతానోత్పత్తికి తప్ప సామాజిక వస్తూత్పత్తి కార్యక్రమాలనుంచి ఆవిడను దూరం చేసింది; 'జాతీయ దుబారా' (నేషనల్ వేస్ట్) కింద దిగజార్చింది; సంపదపై పట్టు తప్పి ఆస్తిని కోల్పోయిన స్త్రీ ఉత్పత్తిపైనా, పంపిణీ వ్యవస్థపైనా ఆధిపత్యాన్ని కోల్పోయింది. మగవాడి శాసనమే మహిళకు అనుశాసన మయింది. వైవాహిక కూడా ఎన్నో అసమ సంబంధాలూ, అక్రమాలూ చోటుచేసుకొన్నాయి. ఈ పరిస్థితులు పూర్తిగా మారిపోవాలని స్త్రీ వాంఛించడం సహజం. అవకాశం కల్పిస్తే శక్తిసామర్థ్యాలను అతి నైపుణ్యంగా ప్రదర్శించడంలో స్త్రీ వెనుకాడదని- ఇప్పటికీ వారు కొలది సంఖ్యలోనే ఉన్న ఏ రంగాన్ని చూసినా అర్థమవుతుంది. ఎనోకి ఉద్దేశంలో "సమానత్వం" అన్నమాట అసలు సమస్యలను పక్కదారులు పట్టించడానికి పురుషులు కల్పించిన అందమైన కొత్త "పదం" అని. కాని మగవాళ్ళను మరీ అంతగా ఆడిపోసుకోవడం ద్వారా గృహచ్ఛిద్రాలు సృష్టించి ఈపాటి ఆలూ-మగళ్ళ అనుబంధాన్ని కూడా చెడగొటడం మంచిదికాదేమో!

# ఇచ్చేవాడికి మెచ్చు: అడిగేవాడికి ఉచ్చు!

దారిద్ర్యం గురించి ఒక సంస్కృతకవి చేసిన వర్ణన గుండెలను పిండుతోంది; "ఆకలితో ఎండిపోయి పిల్లలు శవాల్లా ఉన్నారు. చుట్టాల చూపు తగ్గింది. చిల్లుల కుండకు లక్కపట్టు వేశాం. ఇవేవీ బాధించడంలేదుగాని —నా ఇల్లాలు చిరిగి ముక్కలైన తన రవిక కుట్టుకోడానికి సిగ్గుతో దీనమైన చిరునవ్వుతో, మాట్లాడితే కోపగించుకునే పక్కింటి ఆవిణ్ణి సూది అడగడం చాలా బాధిస్తోంది." అవును, దారిద్ర్యానికీ ముష్టి ఎత్తుకోడానికీ బాంధవ్యం ఉంది. ఒకటి, లజ్జను చంపుకొనక ముందు ఆత్మాభిమానపు అడ్డుతెరలు ఇంకా మనస్సును పట్టి బాధిస్తున్నప్పటి మానవుని అవస్థ; వేరొకటి, అభిమానం చంపుకొన్నా ఆదరణకూడా కరవైనప్పుడు మరో గతిలేక చితికిపోయిన బతుకును అతుకులతోనైనా కతుకులతోనైనా నిలబెట్టుకోడానికి పడే మానవుని దురవస్థ. జంతుకోటిలో లేని ఈ మాలిన్యం, ఈ దౌర్భాగ్యం, ఈ నైచ్యం మానవకోటిలో చోటు చేసుకోడానికి ఒక దశలో మత గురువులూ, పురోహిత వర్గాలూ కారకులైతే, ఇంకొక దశలో అసమ ఆర్థిక వ్యవస్థతో కూడిన సమాజం కారణమయింది. ధర్మప్రవృత్తిని 'దానం'గా మార్చింది లగాయతూ, దానాలను పాప పరిహారానికి లంకెవేసింది మొదలూ స్త్రీకి సమాజంలో ఎన్నిరకాల పేర్లు తగిలించారో ముష్టి జీవనానికి కూడా అన్ని పేర్లూ పెట్టారు. కొందరి విషయంలో "యాయవారాలు" గౌరవ భిక్షాటనం అయ్యాయి. మరికొందరి దృష్టిలో అదే ముష్టెత్తడంగా, అడుక్కుతినడంగా, అగౌరవ చర్యగా మారింది. ఇందులోనూ "క్లాసులు" ఏర్పాటు చేశారు! ఇచ్చేవాడికి అది వృత్తి అయింది; విధిలేక అడిగేవాడికి వ్యావృత్తి అయింది. తద్వారా ఇచ్చేవాడికి వచ్చిన మెచ్చు అడిగేవాడికి ఉచ్చుగా మారింది.

నిజానికి ఏ వృత్తి ధర్మమూ యాచకం కాదు. హుందాగా బతకడం, ఉపాధి ద్వారా ఉదరపోషణా, కుటుంబపోషణా తద్వారా సమాజ పోషణా

జరగాలి. యాచనలో ఉన్న యాతన, ఆర్థిక దోపిడీకి సంఘ దోపిడీకి గురి అయి సర్వస్వాన్నీ కోల్పోయి భిక్షాటనకు దిగినవారికే తెలుస్తుంది. జీవనోపాధి ప్రతి జీవికి సహజమైన హక్కు. ఆ హక్కును పట్టించుకోని సంఘం, ఆ హక్కుకు దూరమైన వ్యక్తిని ఆదరించాలిగాని అదిరించి శాసించలేదు. దారిద్ర్య కారణమైన దోపిడీ వ్యవస్థ మారితే భిక్షాటనం టక్కున రద్దు అవుతుంది. పట్టెడన్నంకోసం అంగలార్చే వ్యక్తి-ఎంతో క్షోభపడిగాని, కంఠస్వరాన్ని ఎంతో గాద్గదితం చేసుకొనిగాని నోరు విప్పి 'మాదాకవళం' అడగలేడు. వాళ్ళు 'ధర్మం బాబూ' అని అంగళ్ళవద్దా, రాస్తాలమీదా, రైలు ప్లాటుఫారాలమీదా, బస్సుస్టాండ్లవద్దా సహ మానవుల గమనానికి అడ్డం పడుతున్నారంటే ఈ సాంఘిక వ్యవస్థ అధర్మంగా నడుస్తోందని అర్థం కాదా ? హోటళ్ళవద్దా, వివాహ సందర్భాలలో బంతిభోజనాల చెత్తకుండీలవద్ద తిండికి ఎగబడి కొట్లాడుకొంటున్న దౌర్భాగ్యుల పరిస్థితి మన అసమ ఆర్థిక సంబంధాలను ప్రశ్నించడం కాదా ? కాలూచేయీ ఆడుతూ పనిచేయగల సత్తా ఉండీ ఉపాధికి దూరమవుతున్న వారికి తోడు వీరి సంఖ్య దేశంలో 8 లక్షలు.

సన్యాసులలో దొంగసన్యాసులు ఉన్నట్టే భిక్షుకులలోకూడా దొంగభిక్షుకులు ఉండవచ్చు. పరస్పరం దోపిడీకి తగిన సౌకర్యాలున్న వ్యవస్థలలో తరతమ భేదాలతో ఈ కపటం అన్ని వృత్తులలోనూ ఉంది. ఉపాధి కల్పనలో మానవశక్తిని సద్వినియోగం చేసుకోలేనిచోట్లా, ఆర్థిక వ్యత్యాసాలను పెంచి పోషిస్తున్న వ్యవస్థలు ఉన్నచోట్లా దారిద్ర్యానికి ఎంత అవకాశం ఉంటుందో సోమరిపోతులకు కూడా అంత స్వేచ్ఛా ఉంటుంది. భిక్షుకులను అరెస్టు చేసినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. అయితే రాష్ట్రంలో భిక్షాటన నిర్మూలనకు కొత్తగా వచ్చిన ఆర్డినెన్సు—ఇలాంటి వారికి చేతిపనులలో, వ్యవసాయం, కోళ్ళపెంపకంలో శిక్షణ ఇచ్చి, విద్యాబుద్ధులు గరిపి, సత్ప్రవర్తకులుగా మార్చాలని సంకల్పించడం ప్రశంసనీయం. అయితే ఈ ఆర్డినెన్సు దేవాలయాలనూ, మసీదులనూ, చర్చీలనూ, మతసంబంధమైన ఇతర సంస్థలనూ మినహాయించాలని చూడడం మంచిదికాదు. ఎందువల్లనంటే దారిద్ర్యాన్ని పెంచడానికీ, పెరిగిన దారిద్ర్యాన్ని అంచనా కట్టడానికీ వీటికంటే నేడు అనువైన కేంద్రాలు మరిలేవు. సుందర భారతచిత్రం పైన ఈ మచ్చను-భిక్షాటనం-తొలగించుకోవటం ఎంతో అవసరం.

# "ఎర్రమిరియం"

సముద్రం ప్రశాంతికీ, ప్రళయానికీ సంకేతం. మేఘానికి విలువ గర్జించినప్పుడు కాదు, వర్షించినప్పుడే. మానవజన్మకు సార్థక్యం ఆదర్శాలు వల్లించినప్పుడు కాదు, వాటిని ఆచరణ సాధ్యం చేసినప్పుడూ, అనుభవాలను లోకానికి పంచినప్పుడూ. శతాబ్దాలపాటు ముక్కచెక్కలుగా చెల్లాచెదరై యుద్ధ ప్రభువుల అరాచకానికీ, పెక్కు పరాయి రాజ్యాల కత్తివాట్లకూ 'కాలనీ'గా మారిన చైనా చరిత్రగతినే మార్చిన మావో సేటుంగ్ ఒక తుఫాను మేఘం. హునాన్‌రాష్ట్రి "ఎర్రమిరియం" రిపబ్లిక్‌నేత మావో అస్తమయంతో దేశ రాజకీయాలనే గాక ప్రపంచ పరిణామాలనే రకరకాలుగా ప్రభావితం చేసిన వృద్ధతరం విప్లవయోధులు ముగ్గురినీ (మావో, చౌ-ఎన్-లై, ఛూటే) ఒక్క ఏడాదిలోనే కోల్పోయినదేశం చైనా. ఇటీవలనే పెను భూకంపంలో అపార నష్టాలకు గురి అయి ఇప్పుడిప్పుడే తేరుకొంటున్న చైనా ప్రజలకు అధినేత మరణం మరొక అశనిపాతం. చైనాతో సంబంధాలు తిరిగి చిగురిస్తున్న ఈ దశలో ఇండియాకి సహితం ఈపరిణామం సంతాపకారణమే అవుతుంది.

మావో ఒక్క వ్యక్తికాదు, వివిధ శక్తుల సమన్వయం. అతనిలో గారిబాల్టీ, మజ్జానీ ఉన్నారు. యుద్ధతంత్రంలో వాషింగ్టన్, నెపోలియన్‌లను మించినవాడు మావో; మేధస్సంపదలో తన పరిధిలోనే మార్క్స్- ఎంగెల్స్‌లకు సమఉజ్జీ; వ్యూహ రచనలో లెనిన్‌కు సాటివాడు; పట్టుదలలో పరాక్రమంలో నిర్మాణ దక్షతలో స్టాలిన్‌కు తోటివాడు. నిరాడంబరతలో గాంధీ, హోచిమిన్‌లతోనే పోలిక. ఒక కవీ, తాత్త్వికుడూ, సిద్ధాంతకర్తా ఏకకాలంలో అతని ప్రతీ రాజకీయ, సాహిత్య రచనలోనూ కనిపిస్తారు. చైనీస్ విప్లవ చరిత్రలోనే గాక, ప్రపంచ యుద్ధ చరిత్రలోనే అపూర్వ సంఘటనగా ఖ్యాతికెక్కిన ఆరువేల మైళ్ళ "లాంగ్‌మార్చ్"కి అతడు కర్ణధారి. చివరికి ఆ సామ

వాద సారథి లాంగ్‌మార్చ్ (జీవితయాత్ర) కూడా ఇప్పుడు సమాప్తమైంది. మావో ధన్యజీవి.

ఫ్యూడల్ బంధాలతో శతాబ్దాలపాటు పీడనా దోపిళ్ళమధ్య కునారిల్లిపోయిన ఆసియా రైతుకు మావో ప్రతిబింబం. కనుకనే మార్క్సిజాన్ని అతను యూరోపియన్ పరిస్థితుల దృష్ట్యా అధ్యయనం చేయలేదు. వ్యావసాయక ప్రాధాన్యంగల ఆసియాదేశాల పరిస్థితులకు అనుగుణంగా ఆ సిద్ధాంతాన్ని అన్వయింప జేశాడు. చైనీస్ రైతాంగ విప్లవాన్ని దిగ్విజయం చేసి యూరోపియన్ మార్క్సిజానికి ఆసియా వ్యక్తిత్వాన్ని జోడించాడు. చైనీస్ సంప్రదాయాలలోని మంచిని సొంతం చేసుకొన్నాడు. చెడును అంతం చేశాడు. ఈ మేళవింపులో అతని మేధస్సు నుంచి వెలువడిన గొప్పరచనలు "ఆచరణ" (ప్రాక్టీస్), "వైరుధ్యం" ("కాంట్రడిక్షన్"). కన్‌ఫ్యూసియన్ భావాలను ఆడిపోసుకొన్నా ప్రజలకు అతడు నచ్చజెప్పే తీరు వేరు; కమ్యూనిస్టు భావాలను వ్యాప్తిచేసినా అతనీ ప్రచార పద్ధతులే వేరు. "ప్రజలే ప్రపంచ చరిత్ర నిర్మాతల"ని విశ్వసించిన మావో దృష్టిలో ఈ మానవుడు మంచికీ-చెడుకూ మూలవిరాట్టు. ఆచరణ ద్వారా ఈ వైరుధ్యాన్ని తొలగించి, మనిషిలోని మంచిని పెంచడానికీ, అతణ్ణి పరిపూర్ణ మానవునిగా దిద్దడానికీ "వైరుధ్యం" సూత్రాన్ని దివిటీగా వినియోగించాడు. అతడు విప్లవ సిద్ధాంతం విద్యార్థీ, మహోపాధ్యాయుడూ కూడా.

కల్లోల తరంగాలను పోలిన అతని మేధస్సు ఎప్పుడూ "తుఫాను కేంద్రాల" కోసమే వీక్షిస్తూ ఉండేది. అనుభవానికి అలంకారాలు జోడించాడు. "లాంగ్ మార్చ్"ని విప్లవ "బీజాలు నాటే యంత్రం"తో పోల్చాడు. సమస్యల విశ్వరూపాన్ని వివరించవలసి వచ్చినప్పుడు "పర్వతాల దక్షిణ సానువుల నుంచి సముద్రాల ఉత్తరదిశ" వరకూ అతని ఆలోచనలు పరుగులెత్తేవి. చివరికి తన పార్టీలోని ఆంతరంగిక పోరాటాలను కూడా "స్పందిస్తున్న జీవితానికి చిహ్నాలు"గానే భావించాడు గాని, బెదరి బేజారెత్తిపోలేదు. భవిష్యత్ పరిణామాలను నిర్ణయించవలసింది భావితరాలేగాని మనం కాదు అన్నది మావో అనుభవ వాదం.

# తెలుగు సీమకు మహోదయం

జననం, ఏదైనా కానివ్వండి, అది ముదావహం. నదులను, సముద్రాలను, ఆమాటకొస్తే అసలు జలాన్నే చూసి భయపడేవారు కూడా, వాటి గంభీరతను చూసి ఉప్పొంగిపోతారు. మహానదుల గమనాలను మళ్ళించ గలిగినవారి ఆనందానికి మేరలేదు, వుండజాలదు. అలాగే మహా వంతెనలను చేతు లారా నిర్మించినవారి సంతోషానికి అదుపు వుండదు.

ఈ రోజు పర్వదినం. నేడు తెలుగు సీమకు మహోదయం. ఇది ఒక్క గోదావరి వాసులకే కాదు, తూర్పు కోస్తా అంతటా, అటు మదిరాసునుంచి, ఇటు కలకత్తావరకు వున్న ప్రాంతీయులందరికీ పర్వదినం. సర్ ఆర్థర్ కాటన్ మహనీయుడు నాడు గోదావరికి ధవళేశ్వరంవద్ద ఆనకట్ట కట్టి అపర భగీరథుడై నిలచాడు; ఆనాడు ఎంతగా ప్రజలు ఆనందించారో నేడూ, మన ఇంజనీర్లు, అసంఖ్యాకులైన కార్మికులు ఎన్నో వ్యయప్రయాసలకోర్చి నిర్మించిన మహావారధి—గోదావరి రైలు-రోడ్డు వంతెనను చూచి, అంత గానూ ఆనంద పరవశులవుతారు. ఈ శుభ సమయంలో ఇంజనీర్లను, టెక్నీషియన్లను, మరి ఈ బృహత్ నిర్మాణం ఏ కష్టజీవులవల్ల సుసాధ్యం కాగల్గిందో ఆ కార్మికులను మనం మనసారా అభినందించాలి.

ప్రపంచంలో రెండవదిగా, ఆసియా ఖండంలోనే పెద్దదిగా, అపురూప మైనదిగా పేర్కొంటున్న ఈ రైలు-రోడ్డు వంతెన పూర్తి కావడంతో ఉభయ గోదావరుల మధ్య అనంతమైన సయోధ్య, వర్తకవాణిజ్యాల సత్వరాభివృద్ధి సుసాధ్యం కాగల్గుతుంది. కూతవేటు దూరంలోనే వున్నా, సహజమైన కలయికకు దూరాభారంగా భావిస్తున్న కొవ్వూరు, రాజమండ్రి వాసులమధ్య సాన్నిహిత్యం పెంపుదలకు ఇది పెద్ద సేతువు. భారతీయ రైలు మార్గా లలో అతి రద్దీగా వుండే ఈ మార్గంలో కొత్త వంతెన వల్ల రద్దీ తగ్గుతుంది.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందించిన అపురూపమైన అవకాశాలతో మనం ఎన్నైనా సాధించగలమని, ఈ నిర్మాణం మనకు బోధిస్తోంది. సస్పెన్షన్ బ్రిడ్జిలలో, కాంటిలివర్ బ్రిడ్జిలలో ప్రపంచ ప్రసిద్ధి కెక్కిన వెర జానో వారోస్, గోల్డెన్ గేట్ (న్యూయార్క్-సిటీ), క్వెబెక్ (కెనడా) బ్రిడ్జి లకు మించిన గోదావరి రైలు-రోడ్డు వంతెన ఆధునిక సాంకేతిక ప్రమాణా లలో తనకి తనే సాటి.

ఈ శుభ సమయంలో గోదావరి మండలం ఆశిస్తున్న మరొక అవకాశాన్ని, వెల్లడిస్తున్న ఒక నిరాశను కూడా మన ప్రభుత్వం గణనలోకి తీసుకోవాలి. సహజ సౌందర్యంతో, సహజ వనరులతో, అంతకు మించిన మానవ సంప దలో విరాజిల్లగలది అఖండ గోదావరి ప్రాంతం. దాని సమగ్రమైన అభి వృద్ధికి, మరిన్ని లక్షల ఎకరాలను సేద్యయోగ్యం చేసుకొనడానికి గోదా వరి జలాలను సద్వినియోగపరచగల రామపాదసాగరు ప్రాజెక్టు అవసరం ఎంతైనా వుంది. కాటన్ పెట్టిన గడువు పూర్తికాగా, ప్రస్తుతపు ఆనకట్టకు అతుకులు పెట్టడమేగాని, గోదావరి బరాజ్ నిర్మాణం చేపట్టడం లేదు. సంక్షో భాలు ముంచుకు వచ్చినప్పుడు తప్ప ముందు ఆలోచన చేయలేనివాళ్ళు మహా నదుల గమనాలను అవసరాలకు మళ్ళించుకోలేరు. గంగ-కావేరీల అను సంధానం గురించిన ఆలోచన మంచిదే గాని, మన ముందున్న తక్షణ సమస్యలను విస్మరించడం వరదను మించిన ముప్పు.

మానవేతిహాసంలో వెల్లివిరిసిన మహానాగరకతలన్నీ నదీజలాలు మళ్ళించు కుని, సస్యసీమలను కల్యాణశాలలుగా తీర్చిదిద్దుకున్నవే. కాని మన దేశంలో పెక్కుమంది నదీతీరవాసులే నేడు నీటి కరవుకు, తిండి కరవుకు గురి అవుతున్నారు. నదీజలాలు సముద్రాల పాలవుతున్నాయి. ఆ నీటిని రక్షించుకుని, వాటికి ముకుతాడు వేసి, ముంపు నివారించుకోలేక, పంట లకూ, ప్రాణాలకు ముప్పు వాటిల్లడం చూస్తున్నాం. నీరు వృథాపోతున్న మన నదులలో పేరెన్నికగన్నవి కృష్ణా, గోదావరులు. పెను వరదలలో "శిశువుకు దక్కని స్తన్యంలా ప్రవహించగల" గోదావరి ఒక్కటే సెకం డుకు 28 లక్షల ఘనపుటడుగుల నీటిని సముద్రానికి అర్పిస్తోంది. అటు పంటసీమలకూ దక్కడం లేదు, ఇటు ప్రజల, పరిశ్రమల అవసరాలకూ అందడం లేదు. విద్యుచ్ఛక్తి కొరత, దుర్భిక్షం గురించీ నిత్యమూ చెప్పుకో గలమేగాని, ఆ నీటిని కాపాడుకొని, కార్యం నెరవేర్చుకోవడం లేదు. ఈ విషయం కాటన్ ఏనాడో స్పష్టం చేశాడు.

"నీటిని నిల్వబెట్టుకోవడం, ఇండియాను పెంచి పోషించుకోవలసిన ప్రాథమిక అవసరాల్లో ఒకటి. దీనివల్ల పొందే ప్రతిఫలం ఏ బంగారు ఖనినుంచి

తీయగల ఆదాయం కంటే మిన్నగా వుంటుంది. అలా ఆదాకాగల ప్రతి పది లక్షల ఘనపు గజాలనీరు, నదులను రెగ్యులేట్ చేసి, వరదలను నివారిస్తుంది. ...ఈ విధంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో, అత్యంత సానుకూలమైన ప్రాంతాలకు దాని పంపిణీలో ఇండియాకు వున్నన్ని అవకాశాలు, వనరులు మరే దేశానికి లేవు."

అయినా మన ప్రభుత్వాలు చాలా విషయాలలో మాదిరే, ఈ సమస్యలను పెడచెవిని పెడుతున్నాయి. అలా చేయబట్టే రామపాదసాగరు ప్రాజెక్టు ప్రతిపాదన 1948 లోనే వచ్చినా, అయిదు ప్రణాళికలు రచించినా, మనకు కన్పించడం లేదు. ఎంతసేపూ దామోదర్, హీరాకుడ్, భాక్రా మున్నగు ఇతర ఉత్తర భారతదేశపు డాములనే కేంద్రం వరించిందికాని, రామపాద సాగరును ప్రేమించలేదు ! ఈ ప్రాజెక్టువల్ల అదనంగా విశాఖ, ఉభయ గోదావరులలో అనేక లక్షల ఎకరాలు సాగై తిండి గింజలు పుష్కలంగా దొరుకుతాయని చెప్పినా వినలేదు.

ఇలా ఎన్నో ప్రాజెక్టులు సాంకేతికానుమతి పేరిట, నిధుల కొరత పేరిట ఉత్తరాంధ్రలో పూర్తికాకుండానో, సగం పనితోనో మూలుగుతున్నాయి. ప్రజాసమస్యలను పరిష్కరించడంలో ప్రభుత్వాలకు పరిశుద్ధమైన మనస్సు, దృష్టి వుంటే అసాధ్యం అన్నది లేదు.

లెవీలు, డ్రైనేజిసెస్సులు, ఇతర పన్నుల మీద వున్నంత ఆసక్తి, వ్యవస్థను మార్చి, అవినీతిని తొలగించి, ప్రణాళికలు, ప్రాజెక్టులను అమలు జరపడంలో వుంటే-ప్రాంతాలకు ప్రాంతాల రూపురేఖలనే మార్చివేయవచ్చు. ఈ ప్రజల జీవితంలో మరొక నూతన శకాన్నే సృష్టించుకోవచ్చు.

ఆ దూరదృష్టి కలవాడు కాబట్టే నిజాయితీ పరుడైన కాటన్ ఆనాడు గంగ-కావేరీలకే కాదు, భారత, చైనా నదీ వ్యవస్థలమధ్యనే అనుసంధానం సాధించగల ప్రణాళికలు వేశాడు.

# ఈ వివాదం నష్టం

ఏపనకు లేని తగాదా లేదు. ఎటుచూచినా సరిహద్దు తగాదాలు, నదీ జలాల వివాదాలు. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు ధ్యేయం బాగుపడమనే కాని తగాదాలు పెంచుకొని తలపట్లకు దిగమని కాదు. నదీజలాలు అన్ని రాష్ట్రాలకు, ప్రజలకు వినియుక్తం కావాలిగాని, ఏ ఒకరి సొత్తో కావడానికి వీలులేదు. "తొడగిల్లి తాంబై మంది''ని తోడుతెచ్చుకొని భుజబలంతో తేల్చుకుందామనే రోజులు గతించాయి. వృధాగా సముద్రాల పాలౌతున్న నీటిని సేద్యానికి, దప్పిక తీర్చుకోడానికి, విద్యుత్ దీపాలు వెలిగించుకోడానికి వినియోగించుకునేదిపోయి, అన్నింటిని మనకు మనమే అడ్డుకుంటున్నాం.

కృష్ణా, గోదావరి జలాలనుండి పంపిణీవివాదం ఇప్పటికి రెండు దశాబ్దాలుగా కర్నాటక, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌ల మధ్య కొనసాగుతోంది. దరిలేదు, దాపులేదు. కట్టవలసిన ప్రాజెక్టులు అలా వుండిపోగా, కట్టినవాటికి నిధులు లేక, నీరు విడుదలకాక తీసుకుంటున్నాయి. నియమించిన ట్రిబ్యునల్స్ తీర్పులు తగాదాలు తీర్చేకంటే, పెంచుతున్నాయి. ఈ లోగా కొత్త తగాదాలు రాష్ట్రాలమధ్యనే కాదు, రాష్ట్రాలలో విభిన్న ప్రాంతాలమధ్యనే తలెత్తుతున్నాయి. కృష్ణజలాల వివాదంపై ట్రిబ్యునల్ తీర్పుకు వివరణలు లభించేదాకా గోదావరిజలాల వివాదం ఊసెత్తవద్దని మన ముఖ్యమంత్రి చెప్పడం సహేతుకంగానే వుంది.

కాని, రాయలసీమగురించి మంత్రిచేసిన ప్రకటన వున్న తగాదాకు కొత్తరూపం తొడుగుతోంది. కృష్ణజలాలలో నాగార్జునసాగర్ ఎక్కువ మింగేస్తోంది. కాబట్టి రాయలసీమకు నష్టం; అందువల్ల కృష్ణజలాలలో వాటాకోసం ఆందోళన అవసరమంటున్నారు. ఒకప్రక్కన కృష్ణప్రహసనం ముగియకుండానే ధవళేశ్వరంవద్ద నీటినిబట్టి, గోదావరిజలాలను పంపిణీచేయడం సరికాదని

ఆరు ఉపనదులలో దేనికి దానికి విడివిడిగా కేటాయించాలని తెలంగాణా ప్రాంతీయ కర్షకసమితి కోరుతోంది. ఈవిధంగా కృష్ణ, గోదావరి జలాలలో తగిన వాటా కావాలని కోరుతున్న మహారాష్ట్ర,కర్నాటక రాష్ట్రాలనుంచి వచ్చే తగాదాకంటే, ఈ నీటి వినియోగంపై ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల మధ్య తగాదాలు పెచ్చరిల్లే ప్రమాదం కన్పిస్తోంది.

పరీవాహ ప్రాంతం ఎఘవు సుఘవులు, ప్రాంతాల వాస్తవికమైన వ్యావసాయక, పారిశ్రామిక ప్రయోజనాలదృష్ట్యా. ప్రజల నీటి అవసరాలదృష్ట్యా, నదీజలాల పంపిణీ కేంద్రీకృతాధిపత్యం క్రింద జరగాలి. అలా జరగనందుననే తుంగ భద్రపై మూడురాష్ట్రాల సమష్టిగా తలపెట్టిన ప్రాజక్టులు నేటికి తగాదాల నుంచి తెములుకోలేదు. అలా జరుగనందుననే దేశంలో అంతర్రాష్ట్ర వివాదాలు పెరిగిపోతున్నాయి. జాతీయదృష్టి లేనందుననే మనుషులకే కాక జలాలకు కూడా ప్రాంతీయదృష్టిని అంటగడుతున్నాం! అలా జరుగుతున్నందుననే నర్మద, కావేరీల కామాటమూ పెరిగిపోయింది: ఇదంతా వెరసి, వేల కోట్ల రూపాయల వ్యవసాయోత్పత్తులు మనం నష్టపోవటానికి దారితీసింది; నష్టపోతున్నాం. ఒక్క నర్మదాజలాల వివాదం వల్లనే, ప్రభుత్వ యంత్రాంగం అసమర్థతవల్ల, గత పదేండ్లలో లక్షా 50 వేల కోట్లరూపాయల విలువ గల పంటను చేతికి, నోటికి అందకుండా చేసుకున్నాం; మరి లక్షా 52 వేల గ్రామాలలో 12 కోట్ల 50 లక్షల మందికి నీళ్ళు సప్లయికాకుండా చేశాం.

ఈ తగాదాలు మంచికి బదులు ఇన్నిరకాల చెరుపు తెస్తాయి. కేంద్రం సజావుగా నిర్వహించగల్గితే నదీజలాలను జాతీయంచేయడం అత్యవసరం. పంపిణీ నిర్ణయానికి సమర్థులైన సాంకేతిక నిపుణులతో జాతీయ పథకాన్ని రూపొందించాలి. ఇందుకు ఉదాహరణలు అమెరికా, బ్రిటన్‌లు, మనకు దగ్గరవైన ఇరాన్, చైనాలు. జలసంపదను సద్వినియోగం చేసుకోలేని వారు జనసంపదను, దేశ సంపదను కాపాడుకోలేరు.

# బకింగ్‌హామ్ కెనాల్

వస్తువు వినియోగపు విలువను తెలుసుకున్న వాడు, ఎలాగయినా ఉపయోగించుకుంటాడు. జలసంపద కూడా అటువంటిదే. నదీజలాలు పొలాలకు, పరిశ్రమలకు, త్రాగడానికి. విద్యుచ్ఛక్తికి ఎంత ఉపయోగమో సరకుల రవాణాకుకూడా అంతటి ప్రయోజనమూ. ఎంత ఆధునిక రవాణా పద్ధతులు అమలులోకి వచ్చినా, నదీజల మార్గాలను విడిచి పెట్టుకోరాదు. ఈ విషయంలో మనం ఇంతవరకు తాత్సారం వహిస్తూ వచ్చామనడంలో సందేహం లేదు.

నేడు రవాణాలో జరిగే దుబారాను అరికట్టడానికి, రవాణా లారీలవల్ల ప్రమాదాల సంఖ్యను తగ్గించడానికి, త్వరగా సరకు గమ్యస్థలం చేరడానికి తమిళనాడు గవర్నరు చేసిన సూచన ఆలోచించదగిందిగానే ఉంది. దేశంలోని నదుల ద్వారా సరకు రవాణాను ఇతోధికం చేయాలని, ఇందుకు ముందు బకింగ్‌హామ్ కాలువను తిరిగి ప్రారంభించి, రవాణాకు సానుకూలంగా ఆధునికం చేయాలని ఆయన చెప్పారు. ఇది తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌ల ఆర్థికాభివృద్ధికి దోహదం చేయగలదని సూచించారు.

నిజానికి కోస్తా వాణిజ్యం అభివృద్ధికి తోడ్పడగల ఇట్టి ప్రతిపాదనలను సర్ ఆర్థర్ కాటన్ ఏనాడో చేశాడు. అతి చౌకగా జలమార్గాలను ఎన్ని విధాలుగా వినియోగించుకోవచ్చునో నిరూపించిన సుప్రసిద్ధ ఇంజనీరు అతను. గోదావరి, కృష్ణ ఆనకట్టలకు మూల పురుషుడు కాటన్. "నిత్య ప్రవాహిని అయిన నదీ జలాలను "ద్రవరూపంలో ఉన్న బంగారం"గా భావించినవాడు కాటన్. ఏ రవాణా పద్ధతి కంటే కూడ నదీ జలమార్గాల ద్వారా సాగే రవాణా "అతి చౌక బేరం" అన్నాడు. కాబట్టి ఆయన ప్రణాళికలో గోదావరి నుంచి మద్రాసు వరకు కోస్తా కాల్వల అభివృద్ధి అవసరాన్ని

నొక్కిచెప్పి, ప్రాధాన్యమిచ్చారు. కృష్ణ, గోదావరి మార్గాలను సరకు రవాణాకు ధారాళంగా ఉపయోగించుకో వచ్చునని చెప్పాడు. "ఎంతటి ముతక సరకు నైనాసరే చౌక రేటుకు వందలాది మైళ్ళు దూరస్థలాలకి చేర్చ వచ్చు" నన్నాడు. ఇందుకుగాను పంటపొలాలకి సరకుతో పడవల రవాణాకి వీలుగా వేసవిలో కూడా నీరు లభించగల విధంగా ముందుగానే నీరు నిల్వ కట్టుకోవాలన్నాడు.

ఇందులో భాగంగానే బకింగ్‌హామ్ కాల్వ సద్వినియోగాన్ని కూడా ఆయన ఆనాడే ఊహించాడు. నూటఒక్క మైళ్ళ పొడవుగల సూయెజ్ కాల్వల రవాణా వినియోగం విలువ మనకు తెలుసు. వినియోగించుకోగలిగి బకింగ్‌హామ్ కూడ అటువంటిదే. ఇది కృష్ణ ఈ చివరికొసనుంచి కోస్తా పొడవునా మద్రాసువరకు నూటతొంభై ఆరుమైళ్ళు వ్యాపించిఉంది. ఇంకా దక్షిణానికి మరి అరవై అయిదుమైళ్ళ వరకు ఉంటుంది. కాకినాడ నుంచి బకింగ్‌హామ్ కాల్వ దక్షిణ కొసవరకు నాలుగువందల యాభై మైళ్ళు ఉంటుంది. రైల్వేల అభివృద్ధికి ముందు ప్రత్యేక రవాణా మార్గంగా వ్యవహరించిన ఈ కాల్వ గుండా ఒకప్పుడు బొగ్గు, ఉప్పు, నీలిమందు సరకులు దిగుమతి అవుతుండేవి.

ప్రస్తుతపు రవాణా వ్యవస్థలో ఒత్తిడులను తట్టుకోవడానికి కూడా ఈ కాల్వ అభివృద్ధి ప్రయోజనకరమైందే అవుతుంది. ఈ సూచనను మన రాష్ట్ర ప్రభుత్వం కూడా పరిశీలించడం మంచిది.

# "నాగావళీ నాట్యభూమి"

'ఎండమావులు' అన్నపదం బహుశః శ్రీకాకుళంజిల్లా పరిస్థితులకు వర్తించినంతగా మనదేశంలో మరే ప్రాంతానికి సరిపోదేమో! "సకల వనరులు చేతి కందినంత దూరంలో వున్నట్టే వుంటాయి, కాని అందవు." అన్నింటికంటె నీటి వనరుల విషయంలో ఇది మరీ వాస్తవం. నదుల ప్రక్కన జీవించినా, మంచినీళ్ళకు ముఖం వాచినట్టు, వర్షపాతం ఎక్కువే అయినా "దుర్భిక్షమే" ఇక్కడ కనిపిస్తుంది. ఈ జిల్లాలోపలి భాగంవరకు తూర్పు కనుమలు వ్యాపించివున్నా, కొండలపైన, అడవులలోను, మైదానాలలో పడిన వర్షపు నీరు అంతా జనాలకు, భూములకు ఎక్కువగా దక్కకుండా, "బూడిదలో పోసిన పన్నీరు" మాదిరి సముద్రంలోకి పోయి కలుస్తూవుంటుంది. శ్రీకాకుళం జిల్లాలో ప్రవహించే ప్రధాన "జీవధార"లైన వంశధార, నాగావళి, సువర్ణముఖి ప్రధానంగా ఒరిస్సాలో ప్రవహించి మిగిలిన జలాలు సముద్రం పాలవుతున్నాయి. వీటిని ఉపయోగించుకుని ప్రాజక్టులద్వారా వీలైనంత వరకు పొలాలకు నీరు మళ్ళించేందుకు ప్రభుత్వం చాలావరకు కృషి చేస్తోంది, అయితే ఇదీ "సముద్రంలో నీటిబొట్టు"గానే వుంది.

నిజంగా "నాగావళీ భూమి నాట్యభూమే." కాని నాగావళీ జలాలు పూర్తిగా వినియోగంలోకి తెచ్చుకోగలిగిననాడు మరింతగా "పంట సిరి" నాట్యం చేస్తుంది శ్రీకాకుళం జిల్లాలో. నాగావళి పుట్టుక కూడా ఒరిస్సాలోనే ప్రారంభమయినందున ఈ నదీ జలాలు జంఝావతీ (వేగావతి) వద్ద సంగమించేవరకు నాగావళి నీటిని చెరి 20 శతకోటి ఘనపుటడుగులను వినియోగించుకొనడానికి-ఆంధ్ర ఒరిస్సా ప్రభుత్వాల మధ్య ఒప్పందం కుదిరింది. నదీజలాల వివాద పరిష్కారంపట్ల ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రదర్శిస్తున్న శ్రద్ధకు, కృషికి బెంగుళూరు ఒప్పందం తరువాత ఇది రెండవ మెట్టు విజయంగా భావించవచ్చు.

పోతే జంఝావతీ లోయ ప్రాంతంలోని రాజ్యలక్ష్మీపురం వద్ద మధ్యతరకం ఇరిగేషన్ ప్రాజక్టు ఆంధ్రప్రదేశ్ నిర్మించుకొనడానికి ఒరిస్సా అంగీకరించింది. అయితే ఈ ప్రాజక్టువల్ల ఒరిస్సాలో మునిగే కొలదిభూములకు, నిర్వాసితులకు నష్టపరిహారం, పునరావాసం కల్పించే బాధ్యతను ఆంధ్రప్రదేశ్ స్వీకరించింది. ఈ ప్రాజక్టువల్ల 45 వేల ఎకరాల కొత్తగా సాగులోకి వస్తాయి. మీడియం, మైనర్ ఇరిగేషన్ పథకాలకు ప్రాధాన్యం ఇవ్వాలని నిశ్చయించుకున్న తరువాత మైనర్ ఇరిగేషన్ పనులకు సంబంధించిన వివాదాలనయినా అధికోత్పత్తి అవసరాల దృష్ట్యా సత్వరం పరిష్కరించుకోవలసిన అవసరాన్ని ఆంధ్ర-ఒరిస్సాల ఒప్పందం నొక్కి చెబుతోంది.

నాగావళిలో వచ్చి కలిసే వొట్టిగెడ్డ, జంఝావతి, సువర్ణముఖి వంటి చిన్న నదులపైన రిజర్వాయర్ నిర్మాణం త్వరగా పూర్తికావలసిన అవసరం వుంది. నాగావళి జల వనరులపైననే ప్రధానంగా పాలకొండ, పార్వతీపురం, శ్రీకాకుళం తాలూకాలలో పాడిపంటల భవిష్యత్తు ఆధారపడి వుంది. ఒక్క నాగావళి అనే కాదు; అనుకున్న సమయంలో తలపెట్టిన ప్రాజక్టుల నిర్మాణం పూర్తికానందున ఉత్పత్తి నష్టమేకాక, ఖర్చులు పెరిగి భరించుకోలేని పరిస్థితి కూడా వుంది. వంశధార ప్రాజక్టు పరిస్థితి అలాగే తయారయింది. పాతపట్నం, నరసన్నపేట, శ్రీకాకుళం తాలూకాలను సస్యశ్యామలం చేసే ఈ నదిపైన గొట్టబరాజ్, నేరడి బరాజ్, హీరమండలం రిజర్వాయర్ల నిర్మాణం ఇంకా పూర్తి కాలేదు. సువర్ణముఖిపైన మడ్డువలసవద్ద రిజర్వాయర్ కడితే, మరి 39 వేల ఎకరాలు సాగు కాగలదని భావిస్తున్నారు. ఇలాగే ఈ జిల్లాలో పూర్తి అయిన 42 మీడియం, మైనర్ ఇరిగేషన్ పథకాలు లేక ఇంకా పూర్తి కాని మరి 47 చిన్నపథకాలు కూడా వున్నాయి. "అన్నీ వుండి నోట్లో శని" తాండవించే విచిత్ర పరిస్థితినుంచి ఈ జిల్లాను బయట పడవేయడానికి రాష్ట్ర ప్రభుత్వం ఈ పథకాలను కూడా వెంటవెంటనే అమలు జరిపేందుకు శాయశక్తులా కృషి చేయవలసి వుంది.

# శుభారంభం*

కృష్ణా జలాల పంపిణీకి సంబంధించి ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పుపై రాష్ట్రాలు పరస్పరం తిరిగి "వివరణల" కోసం వేచివున్న సమయంలోనే కనీస జలావసరాల గురించి ఆంధ్రప్రదేశ్-కర్నాటకలమధ్య గోదావరిజలాల వినియోగంపై ఒప్పందం కుదరడం ఎంతో హర్షించదగిన విషయం. ఈ ఒడంబడిక స్వరూపం తాత్కాలికమైనదే కావచ్చు, బహుకొలది ప్రాంతానికి మాత్రమే ఇది వర్తించవచ్చు. కాని ఉభయ రాష్ట్రాలలోని కొన్ని వెనుకబడిన ప్రాంతాల సేద్యపు నీటి అవసరాలు మంచినీటి అవసరాలు తీర్చుకొనడానికి ఉద్దేశించిన ప్రాజక్టుల నిర్మాణం ఈ ఒప్పందంవల్ల పూర్తి అవుతుంది. అన్నింటికంటె ప్రధానవిషయం ప్రజలు ఏ రాష్ట్రానికి చెందినా, సహజవనరుల పంపిణీ విషయంలో సంకుచిత మనస్తత్వం కూడదని, ట్రిబ్యునల్స్‌వల్ల కాలహరణం మాత్రమే జరుగుతుందని ఇందుకు భిన్నంగా ఆంధ్రప్రదేశ్-కర్నాటక ముఖ్యమంత్రులు చూపిన చొరవ, సమయస్ఫూర్తి నిరూపించాయి.

నదీజలాల పంపిణీవిషయమై ఏర్పడిన అంతర్రాష్ట్ర వివాదాలను సామరస్యంగా పరిష్కరించుకునేందుకు కొలదిమాసాలనాడు కేంద్రం ప్రారంభించిన చొరవకు తొలిఫలితం నర్మదా ఒప్పందంకాగా, మలి ఫలితం (తక్కువ స్థాయిలోనే అయినా) బెంగుళూరు ఒడంబడిక అనే చెప్పాలి. దీని ప్రకారం గోదావరి ఉపనది మంజీర కర్నాటకలోని కరంజా కలిసేచోట లక్షా పందొమ్మిది వందల ఎకరాలకు సేద్యపు నీటిని అందించగల రెండు ప్రాజక్టులు కట్టుకొనడానికి ఆంధ్రప్రదేశ్ అంగీకరించింది. కాగా హైదరాబాదు-సికిందరాబాదు జంటనగరాల ప్రజల మంచినీటి అవసరాలకు సరిహద్దులోని మంజీర

---

* ఆంధ్రప్రదేశ్-కర్నాటకలమధ్య కృష్ణా జలాల పంపిణీ గురించి ఒప్పందం కుదిరినప్పుడు. దీన్ని "బెంగుళూరు సంధి" అన్నారు.

నదిపైన సింగూర్ వద్ద ప్రాజక్టును, రిజర్వాయర్‌ను నిర్మించుకొనడానికి కర్నాటక ఒప్పుకుంది. నిజానికి జంటనగరాలకు మంచినీటి సరఫరాకోసం చాలా ఏళ్ళక్రితమే దేవనూరు ప్రాజక్టును తలపెట్టడం జరిగింది.

కృష్ణా-గోదావరులు రెండూ తెలంగాణా ప్రాంత సరిహద్దులగుండా ప్రవహిస్తున్నప్పటికీ, దిండి, మూసి, పాలేరు, మునేరు, మంజీరా, మానేరు, ప్రాణహిత మున్నగు పెక్కు ఉపనదులు ఈ ప్రాంతంలో వున్నప్పటికీ, అంతర్రాష్ట్ర వివాదాలవల్ల బడుగుప్రాంతాలలో తగినంత భూమి సేద్యంకావడానికి జలవనరులు "కరవై"నాయి. ఈ జలవనరులను వినియోగించుకుని, ఎట్టి పెద్ద ప్రాజక్టులు ప్రారంభించి, పూర్తిచేయాలన్నా ట్రిబ్యునల్ అవార్డులకోసం ఏళ్ళూ, పూళ్ళూగా పడిగాపులుపడి వుండవలసి వస్తున్నది. దీని ఫలితంగానే ఒక్క గోదావరిలోయ ప్రాంతంలోనే రమారమి 40 ప్రాజక్టుల నిర్మాణం ఆగిపోవలసి వచ్చింది. ఈ వివాదాలు తొలగిపోతే కృష్ణా-గోదావరి బేసిన్‌లోని తెలంగాణా ప్రాంతంలో 'మాస్టర్ ప్లాన్' ప్రకారం 1309 మైనర్ ఇరిగేషన్ ప్రాజక్టులు చేపట్టవచ్చునని నిపుణుల అంచనా.

ప్రస్తుతపు బెంగుళూరు ఒప్పందం, గోదావరి జలాల వివాదానికి సంబంధించిన ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాలమధ్య సరసమైన ఒడంబడికలకు కూడా దారిచూపగలదనే ఆశిస్తున్నాం. ఉభయ తారక పద్ధతిలో పరిష్కారానికి అత్యంత విజ్ఞతతో చొరవ ప్రదర్శించిన ముఖ్యమంత్రిని మరొకసారి అభినందిస్తున్నాం. ఇతర రాష్ట్రాలతోకూడా ఇందుకు తగిన ప్రాతిపదికలు వేయగలరని విశ్వసిస్తున్నాం.

# ఉభయతారకం*

అనుకోనివి అనుకున్నట్టే జరిగిపోతే ఆనందం కాదు, మహదానందం. ఏళ్ళూ, పూళ్ళుగా కృష్ణా, గోదావరి జలాల పంపిణీ విషయమై ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాల మధ్య తగాదాలకు దారితీసి, ట్రిబ్యునల్స్‌కు ఎక్కిన వివాదాలు - చివరికి ట్రిబ్యునల్స్ పనిని తేలికపరుస్తూ పరిష్కారం కావడం నిజంగా సంతోషించదగిన విషయం. ఈ అన్ని రాష్ట్రాలలోనూ ఉన్నది ఒక పార్టీ ప్రభుత్వాలైనా, అన్ని రాష్ట్రాల ప్రయోజనాలనే కాక, ఎక్కడికక్కడ ప్రాంతీయ ప్రయోజనాలనే దృష్టిలో పెట్టుకొన్నందున ఇన్నేళ్ళూ వివాదాలు ఒక కొలిక్కి రాలేదు. కాగా ఇప్పుడు ముఖ్యమంత్రి చూపిన చొరవ, వెసులుబాటువల్ల ఏ ఒక్క రాష్ట్రంతోనో గాదు, నదీ జలాల వివాదాలకు సంబంధించిన మొత్తం అయిదు రాష్ట్రాల ప్రజలకు ప్రయోజనం చేకూరడానికి పునాదులు పడ్డాయి.

బెంగుళూరు ఒప్పందం, భువనేశ్వర్ ఒడంబడిక దరిమిలా ఇప్పుడు హైదరాబాద్ సంధివల్ల ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రల మధ్య గోదావరీ జలాల పంపిణీ వివాదం ముగిసినట్టే. మహరాష్ట్ర ముఖ్యమంత్రి చర్చలకు వచ్చిన రోజుననే వృథాపోతున్న గోదావరీ జలాలను ఉభయతారక పద్ధతిలో పంపిణీ చేసుకొనడానికి అవరోధాలకంటే అవకాశాలే ఎక్కువని చాటటంతో తొలి విజయం సిద్ధించింది.

ఒకనాడు దక్కన్ పీఠభూమిలో ఒకే ప్రాంతాలుగా ఉన్న తెలంగాణా, మరాట్వాడా, కర్ణాటక భాగాల మధ్య తిరిగి పొరపొచ్చాలు లేకుండా సంఘీభావం, సమైక్యత ఏర్పడి స్థిరపడడానికి తాజా ఒప్పందాలు బలమైన పునాదులు వేశాయి. గోదావరీ జలాల పంపిణీ గురించి ఆంధ్ర, మహరాష్ట్రల మధ్య కుదిరిన సంధి, సరిహద్దులలోని పెక్కు మహారాష్ట్ర ప్రాంతాలను సాగులోకి తేవడమేగాక, ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా ప్రాంతంలో జల పంపిణీ వివాదంవల్ల కునారిల్లిపోతున్న నిజాంసాగర్, పోచంపాడు ప్రాజక్టుల

---

* ఆంధ్రప్రదేశ్-మహారాష్ట్రలమధ్య గోదావరిజలాల పంపిణీగురించి హైదరాబాద్ ఒప్పందం కుదిరినప్పుడు.

క్రింద ఆయకట్టును పెంచుతుంది. అంతూ, పొంతూలేని జాప్యంతో తీసుకుంటున్న పోచంపాడు నిర్మాణాన్ని నిరాఘాటంగా పూర్తిచేసుకోవచ్చు. అంతేకాదు. వివాదంలో ఉన్న ప్రాజెక్టుల నిర్మాణానికి ఆటంకం తొలగడమే కాక, పోచంపాడు ప్రాజెక్టులకోసం రెండు రాష్ట్రాలూ అదనపు నీటిని స్వేచ్ఛగా వాడుకోవచ్చు. ఇంతకంటే మరొక ప్రధాన విషయం - ఇచ్ఛంపల్లి, పెండి, దిగువ పెన్గంగ, ప్రాణహితలవద్ద రెండురాష్ట్రాలు సంయుక్తంగా ప్రాజెక్టులు నిర్వహించుకుంటాయి.

నిజానికి నదీజలాల వివాదంవల్ల రాష్ట్రంలో అన్ని ప్రాంతాలకంటె ఎక్కువ నష్టపోయినది తెలంగాణా అని చెప్పవచ్చు. అసలే ఎక్కువగా వర్షాలపై ఆధారపడిన తెలంగాణా భూములలో చెరువుల్క్రింద సాగయ్యే భూమి 57.4 శాతంకాగా కాల్వలవల్ల సాగయ్యేది 19.7 శాతం మాత్రమే. కాగా రాష్ట్రం మొత్తంమీద కాల్వలవల్ల సాగయ్యే భూమి 42.2 శాతం ఉంది. గోదావరీ నది తెలంగాణాలో పెక్కు ఉపనదులను కలుపుకొని ప్రవహిస్తున్నా, అంతర్ రాష్ట్ర వివాదాలవల్ల ఈ ప్రాంతం ఈ జలాలను సద్వినియోగం చేసుకోలేని దుస్థితిలోఉంటూ వచ్చింది. రెండు తడుపులకు వీలైన సేద్యయోగ్యమైన గరిష్ఠభూమి నల్గొండ జిల్లాలోనే ఉంది. నిజానికి తెలంగాణాకోసం 1954 నాటికే (అప్పటి స్టేట్‌లో) 15 ఏండ్లలో రెండువందల పధ్నాలుగుకోట్ల ఖర్చుతో పూర్తిచేసుకోగల చిన్న, పెద్ద ప్రాజెక్టులతో సిద్ధమైన పథకం కూడా వివాదాలవల్లనే కాగితాలపై ఉండిపోయింది.

నాగార్జునసాగర్‌తోపాటు, పోచంపాడు ప్రాజెక్టుకూడా త్వరగా పూర్తికాగలిగితే, నల్గొండ, నిజామాబాద్ జిల్లాలతోపాటు కరీంనగర్, ఖమ్మం జిల్లాల్లో కూడా తగినంత భూమి కాల్వలద్వారా సేద్యానికి చేతికొస్తుంది. తద్వారా పోచంపాడుక్రింద మొత్తం 5.70 లక్షల ఎకరాలు సాగులోఉంటాయి. కృష్ణా, గోదావరీజలాల వివాదాలు పూర్తిగా ముగిసినాడు ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే ఇరిగేషన్ సౌకర్యాలు పొందగల భూమి 37.87 లక్షలు ఉంటుందని నిపుణుల అంచనా.

తగాదాలవల్ల ఇన్ని ప్రయోజనాలు ప్రజలకు దూరమౌతున్నాయన్న ఆవేదన మనకు ఉంటే, తాజా ఒప్పందాలకు ప్రతి ఒక్కరూ స్వాగతం చెప్పితీరాలి. ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మంజిల్లాలను ఆనుకొనిఉన్న మధ్యప్రదేశ్‌తో ఉన్న వివాదం పరిష్కారానికికూడా ముఖ్యమంత్రి చొరవ తీసుకుంటే, తన పదవీకాలంలో రాష్ట్రాలను వేధించిన ఒక ప్రధానసమస్య శాశ్వత పరిష్కారానికి అంకురార్పణ చేసిన ఘనత ఆయనకు శాశ్వతంగా దక్కుతుంది.

# పేరులో కూడా వుంది పెన్నిధి

బారసాల రోజునే బిడ్డ భావి జీవితాన్ని నిర్ణయించలేము. అంత మాత్రాన నామకరణం చేయకుండానూ వుండలేము. పేరులో ఏముంది పెన్నిధి అంటారు కొందరు. కాని నడవడిక సక్రమంగావుంటే ఆ పెన్నిధి చేతికి చిక్కుతుంది. భవిష్యత్తు ఉజ్జ్వలం అవుతుంది. దేశాభివృద్ధీ, రాష్ట్రాభివృద్ధీ కూడా అంతే.

యూరప్‌లో వర్తక, వాణిజ్యాభివృద్ధికి, పారిశ్రామిక విప్లవానికి ఆశీస్సులు పలికిన కేంద్రాలలో, సహజ వనరుల సద్వినియోగంవల్ల వృద్ధిలోకివచ్చిన మాంఛెస్టర్ (బ్రిటన్) ఒకటి. అలాగే పశ్చిమజర్మనీలోని హాంబర్గ్. వాళ్ళకి జలవినియోగమూ తెలుసు, ధనవినియోగమూ తెలుసు. దేశీయ నదుల గమనాన్ని వర్తక, వాణిజ్యాలకు అనువుగా మార్చారు. రేవులు పెట్టుకున్నారు. చుట్టుపట్ల సహజ వనరులను, ఖనిజ సంపదను ఆసరా చేసుకుని ప్రాంతాల స్వరూపాన్నే మార్చివేశారు. పరిశ్రమలు వెలశాయి. పనులు దొరికాయి. ఇటువంటి సుందర స్వప్నాన్ని మన పాల్వంచవద్ద స్పాంజ్ ఇనుము కర్మాగారానికి శంకుస్థాపనచేస్తూ ముఖ్యమంత్రి ఒక్కమాటలో వర్ణించారు: ఆదిలాబాద్‌లోని అసిఫాబాద్‌నుంచి పాల్వంచ వరకు రాస్తాలు నిర్మిస్తే అపార ఖనిజ సంపదకల గోదావరిలోయ ప్రాంతం మరొక మాంఛెస్టర్‌గా అభివృద్ధి చెందగలదు. అంతేగాదు, అటవీ ప్రాంతంలో ఉన్న, గోదావరికి కూతవేటు దూరంలోనేవున్న "ప్రకాశం వనం" (మణుగూరు)కూడా ప్రకాశవంతమైన పారిశ్రామిక కేంద్రం కాగల్గుతుంది. ఇది నిజం,

మొత్తం గోదావరి నదీ మండలం అభివృద్ధికి కాటన్ మహాశయుడు పథకాలు వేసి శతాబ్దం మించిపోయింది. ఆ దరిమిలా తెలంగాణా ప్రాంతం సమగ్రాభి

వృద్ధికి హైదరాబాద్ స్టేట్‌లో "మాస్టర్ ప్లాను" వేసికూడా పాతికేండ్లు కడచిపోయాయి. ఇటు కాకినాడ నుంచి మద్రాసు వరకు, దేశీయ జల వనరులను వర్తక వాణిజ్యాభివృద్ధికి పడవల ద్వారా తక్కువ ఖర్చుతో ఎలా ఉపయోగించు కోవచ్చునో కాటన్ లెక్కలు వేశాడు. ఆ మహాపథకంలో భాగంగా ఆయన తెలుగుదేశానికి అనేక "మాంచెస్టర్‌లను" ఊహించాడు. సకల వనరులతో శోభిల్లుతున్న తూర్పుగోదావరిజిల్లా మరొక "హాంబర్గ్" కాగలదన్న పేరు అలా వార్తల కెక్కినదేనని మరచిపోరాదు.

ఇప్పుడు మనం ఊహిస్తున్న ఆంధ్రప్రదేశ్ "మాంచెస్టర్"కు అనువైన వనరులన్నీ వున్నాయి. కృష్ణ, గోదావరులు ప్రవహిస్తున్న తెలంగాణా మండలం అటవీ సంపదకు, ఖనిజ సంపదకు కూడా కాణాచిగావుంది. మొత్తం దేశవిస్తీర్ణంలో అటవీ సంపద 19.8 శాతం వుంటే, ఒక్క తెలంగాణాలో అది 23.8 శాతం వుంది. 73 తాలూకాలలో పదితాలూకాలు ఈ సంపద హెచ్చుటిలో వున్నాయి. రసాయన పరిశ్రమలకు, సిమెంటు, లోహ పరిశ్రమలకు పనికివచ్చే మేలురకం సున్నపురాయి పుష్కలంగా దొరకుతుంది. కోట్ల టన్నుల కొలదీ సున్నపురాయితోపాటు పాలరాయి లభ్యం అవుతుంది. బెల్లంపల్లి, రామకృష్ణనగర్ గనులతోపాటు, ఆదిలాబాద్ నుంచి ఖమ్మంజిల్లా వరకు నదీమండలం పొడవునా బొగ్గు అపారంగా లభిస్తుంది. ఒక్క ఆదిలాబాద్ జిల్లాలోనే "బారకార్" బొగ్గు నిల్వలు 37 కోట్ల 50 లక్షల టన్నులని అంచనా. అలాగే కాకిరాయి, రిఫ్రాక్టరీలకు, స్టోన్‌వేర్స్‌కి, పింగాణీ పరిశ్రమకి పనికివచ్చే "ఫైర్ క్లే" అపారంగా దొరకుతుంది. గ్లాస్ పరిశ్రమకు అవసరమైన క్వార్ట్జ్, రాగి, బరైట్స్ ఖనిజాలు పుష్కలం.

ఇంత సంపదవుండీ, పట్టిన శనికి సరైన కారణం తెలుసుకోలేక పోతున్నాం. ఆర్థికం ఒక ఎత్తు. అర్థబలానికితోడు అంగబలాన్ని రంగంలోకి దించుకోవాలి. అప్పుడు తెలుగునాట, అవకాశమున్న ప్రతిచోట ఒక "మాంచెస్టర్" అవతరిస్తుంది. నాడు మాంచెస్టర్‌లో స్పిన్నింగ్ మెషీన్ కనిపెట్టిన హార్‌గ్రీవ్స్‌వంటి సాంకేతిక పరిజ్ఞానంకల పనివాళ్ళు, నీటి నుంచి విద్యుత్ పుట్టించి యంత్రాన్ని మంత్రించి నడిపిన ఆర్క్‌రైట్‌వంటి నిపుణులూ ఇక్కడ కూడా పుట్టుకొస్తారు. తెలుగుదేశం రూపురేఖలనే మార్చివేస్తారు !

# మహానదుల గమనం మళ్ళించండి

ఈ మనుషులకు మనసుంటే, కానిపని లేదని దక్షిణ - మధ్య భారతాలకు చెందిన అయిదుగురు ముఖ్యమంత్రులు నిరూపించారు. మంచుయుగాలు కడచివచ్చిన మానవునికి మహానదుల గమనాన్ని మళ్ళించి, జలమూ, కాలమూ వృధా పోకుండా మరుభూములను మాణిక్య సీమలుగా మలచుకోవడానికి మార్గం ఉందనే భరోసా కల్పించారు. గోదావరి, కృష్ణానదీ జలాల వినియోగం గురించిన వివాదాలు... రాజకీయ శక్తుల సృష్టిమాత్రమేగాని, ప్రజల సృష్టికాదని కూడా నిరూపించడం జరిగింది.

పది మందికీ ఉపకరించే గోదావరి నదీజలాల గురించి పదిహేనేండ్లుగా ఏర్పడిన వివాదం, ట్రిబ్యునల్ ముందు ఆరేండ్లుగా సాగుతున్న నానుడు బేరం ఇప్పటికి ఒక కొలిక్కి వచ్చింది. ఈ సమయంలో కేంద్ర ఇరిగేషన్ మంత్రితో పాటు, శాశ్వత ఒప్పందానికి చొరవ తీసుకున్న ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక, మధ్యప్రదేశ్, ఒరిస్సా ముఖ్యమంత్రులను మనసారా అభినందించక తప్పదు. నదీజలాల వివాదాలతో తీసుకుంటున్న దేశంలోని యితర రాష్ట్రాలకు ఈ సంధి పత్రం ఒక మార్గదర్శి. అంతేకాదు, ఈ పత్రంపై చేవ్రాలుచేసిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక ప్రభుత్వాలు మిగిలిపోయిన కృష్ణానదీ జలాల పంపిణీ సమస్యపై ఏర్పడిన వివాదం పరిష్కారానికి కూడా ఇది ముందుచూపు కల్పిస్తుంది.

ఢిల్లీ ఒప్పందానికి ట్రిబ్యునల్ ధృవీకరణ అన్నది ఇక నామ మాత్రమే. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకు ఈ ఒప్పందంవల్ల హైదరాబాద్ స్టేట్ పాలన నుంచీ ఆచరణకు రాకుండా మిగిలిపోయిన గోదావరి లోయ అభివృద్ధి కార్యక్రమాలు త్వరగా తెముల్చుకోవడానికి అవకాశం చిక్కుతుంది. నిర్మాణం మధ్యలో నిల్చిపోయిన పోచంపాడువంటి బహుళార్ధ సాధక పథకాలు, వివాదంవల్ల పథకాలలో మాత్రమే పడిగాపులు పడివున్న ఇంచంపల్లి,

లెండి, ప్రాణహిత, శబరి, తలిపేరు వంటి ఉమ్మడి ప్రాజెక్టులూ పూర్తి చేసుకోవడానికి వీలుంది. అన్నిటికీ ప్రధానం ఆర్థికం. అది ఈ ప్రాజక్టులకు కూడా వర్తిస్తుంది. పక్క పోచంపాడు అన్నిదశలూ పూర్తి అయి, మొత్తం 20 లక్షల ఎకరాలు ఆయకట్టుకిందకు తెచ్చుకోవడానికి, రు. 150 కోట్లు ధనం అవసరం. ఈ ప్రాజెక్టులన్నీ ప్రజల అనుభవంలోకివస్తే మొత్తం 55 లక్షల ఎకరాలు సాగవుతుంది. వరంగల్, హైదరాబాదులకు మంచినీరు పుష్కలంగా లభిస్తుంది.

ఇప్పుడు ఒప్పందం ప్రకారం, గోదావరిలో లభ్యం కాగల 3,000 శతకోటి ఘనపుటడుగుల నీటిలో 2,300 శతకోటి ఘనపుటడుగులు రాష్ట్రాలు పంచుకుంటాయి. మిగిలిన 700 శతకోటి ఘనపుటడుగుల నీటి వినియోగానికి మరి పదిహేనేండ్ల వరకు పథకాలు లేవు. అలాగే కృష్ణాజలాల వినియోగం విషయమై ట్రిబ్యునల్ అంచనా ప్రకారం లభించగల నీరు 2,060 శతకోటి ఘనపుటడుగులు అయితే ప్రస్తుతం ఉపయోగంలో ఉన్నది 1693.36 శతకోటి ఘనపుటడుగులు కాగా, ట్రిబ్యునల్ తేల్చకుండా ఉంచినది 366.64 శతకోటి ఘనపుటడుగుల నీరు. ఈ కురదలా నీరు కూడా వినియోగంలోకి తెచ్చుకోవాలి.

రాష్ట్రంలో వ్యవసాయ యోగ్యమైన 700 లక్షల ఎకరాల భూమిలో నేడు నీటి పారుదల సౌకర్యం ఉన్నది 80 లక్షల ఎకరాలకు మాత్రమే. మిగతా నీరు వరదపాలు, లేదా ఏటిపాలు. కృష్ణా గౌతమీ నదులు కాక, మరి 38 చిన్న నదులు మన రాష్ట్రంలో ఉత్తరంనుంచి దక్షిణాదివరకు విస్తరించుకొని ఉన్నాయి. ఒక్క బ్రహ్మపుత్ర మినహాయిస్తే దేశంలోని అన్ని నదులూ సరఫరాచేసే నీటిలో నూటికి పదకొండు వంతులు మన రాష్ట్రంలోని నదులు అందజేయగల్గుతాయి. ఇన్ని అవకాశాల మధ్య జీవిస్తున్న మనం ప్రకృతి వైపరీత్యానికి మించిన మానవ కల్పితమైన ఆటంకాలగురించి మరింతగా జాగ్రత్తపడాలి.

గోదావరి జలాలతో పాటు, కృష్ణా జలాల పంపిణీ వివాదంకూడా పరిష్కారమై, నదుల గమనాన్ని నరులకోసం పూర్తిగా మళ్ళించుకున్ననాడు...... తెలుగునాట పంటసిరి నాట్యం చేస్తుంది. తెలుగువాళ్ళ కళ్ళవెలుగు మరింతగా దీపిస్తుంది. ఆనాడు అయిదుకోట్ల ఆంధ్రులు "దిష్టిచుక్క"లు దిద్దుకోవలసి వస్తుంది!

# నీరు మెరక ఎరుగు...!

మనసునుబట్టి మార్గం, వీలునుబట్టి వాలు వుంటాయి. ఇంత వరకు మనకు "నీరు పల్లమెరుగు" అన్న సామెతతోనే చుట్టరికం వుంది. కాదు "నీరు మెరక ఎరుగు" అన్నది ఆధునిక శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం నిరూపించు తోంది. ఇంజనీరింగ్, జలశాస్త్రాలలో (హైడ్రాలజీ) వస్తున్న పెను మార్పులకు ఇండియా వంటి వర్ధమానదేశాలు ఇంకా దూరంగానే వున్నాయి. జల సంపద గురించి ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ మహాసభ చేసిన నిర్ణయాలు, సూచనలు మన దేశానికి ఎంతగానో ప్రయోజనకరమైనవి.

ఢిల్లీ మహాసభ నిర్ణయాలలో ప్రధానమైనవి : రాజకీయ ప్రయోజనాలు జల సంపదను సద్వినియోగం చేసుకొనడానికి ప్రతిబంధకాలు; దేశపు జలవనరులను జాతీయ సంపదగా పరిగణించడం; జలసంపద వినియోగంలో వరద నివారణ పథకాలను అంతర్భాగం చేయడం, ప్రాంతీయ, జాతీయ ప్రాతిపదికపై బృహత్ పథకాలు సిద్ధం చేసుకోవడం.

పాతికేండ్ల తర్వాత మన ప్రభుత్వాలు, ఇప్పుడిప్పుడే జ్ఞానోదయమై, నదీ జలాల వివాదాలను త్వరగా పరిష్కరించుకొనడానికి ఆసక్తి, చొరవ ప్రదర్శిస్తున్నాయి. నిజానికి రెండేసి, మూడేసి పంటలు తీయడానికి అపారమైన అవకాశాలున్న ఈ రోజులలో, మంచినీటి సదుపాయం పుష్కలంగా కల్పించుకోగల అవకాశం వున్న దశలో—వివాదాల వల్ల ఎంత నష్టపోయామో మనకు తెలుసు.

దేశవ్యాప్తంగా సేద్యయోగ్యమైన క్షేత్ర 15 కోట్ల 80 లక్షల హెక్టార్లు. కాని మనం సాగుచేసుకుంటున్నది 3 కోట్ల 64 లక్షల హెక్టార్లు, అంటే 23 శాతం భూమిని మాత్రమే. మిగిలిన 77 శాతం భూమి "స్వాతివానకోసం ముత్యపు చిప్ప" ఎదురుచూసినట్టు, ప్రకృతి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి

వుంది. సహజ నదీజలాల, భూగర్భజలాల సంపూర్ణ వినియోగం కోసమే కాదు, మొత్తం దేశీయ జల వనరుల మధ్య అనుసంధానం సాధించి, అఖిల భారతాన్నే మరింతగా సస్యశ్యామలం చేసుకోగల అవకాశాలున్నాయి. ఈ అనుసంధాన క్రియకు రూపకల్పన చేసినవాడు కాటన్ మహాశయుడు కాగా, దానిని పెంచి, పోషించిన కీర్తిశేషులు శ్రీనివాస అయ్యంగార్, సి. పి. రామ స్వామి అయ్యర్, సుబ్రహ్మణ్య భారతి, ఈరోజున కె. యల్. రావు.

ఈ "నేషనల్ గ్రిడ్"ని సుసాధ్యం చేసుకోవచ్చునని నిపుణులు నొక్కి చెబుతున్నారు. ఉత్తర-దక్షిణ భారతాల మధ్య, తూర్పు-పడమటి ప్రాంతాల మధ్య నదుల గమనాన్ని శాసించి, పంటపొలాలకు, ఆకలిదప్పులు తీర్చుకొనడానికి మరలించుకున్ననాడు - రాజకీయ సమైక్యతకే కాదు, ప్రజల ఆర్థిక సౌష్ఠవానికి, సౌభాగ్యానికి, స్థిరత్వం చేకూర్చుకుంది. నూటికి తొంభై వంతులు నదీజలాలు సముద్రాల పాలవుతున్న ఈనాడు, ఈ అనుసంధాన పథకాన్ని అమలులోకి తెచ్చుకోవడం అవసరం. గంగ-కావేరీ అనుసంధాన కార్యక్రమంలో ఆసేతు హిమాచలం కదిలివచ్చి, మరుభూముల లోను, మాగాణిలోను మరిన్ని రాజనాలు పండిస్తుంది.

ఇప్పటికే రావి-బియాస్‌లను కలిపారు. బియాస్-సట్లెజ్‌ల సంధానం దాదాపుగా పూర్తి కావస్తోంది. ఫలితంగా పంజాబ్, హర్యానా, రాజస్థాన్ పేరుకు విడి రాష్ట్రాలైనా పొడిగావున్న ప్రాంతాలను తడిచేసి, బహుళ ప్రయోజనాలు పొందుతున్నాయి. కాటన్ మధుర స్వప్నంలో కృష్ణ, గోదావరి, కావేరీలకు ప్రత్యేకస్థానం వుంది. అందువల్లనే ఇక నెంతమాత్రం ట్రిబ్యునల్స్ తీర్పులకోసం నదీ జల వివాదాలను పడిగాపులు పెట్టడం రాష్ట్రాలకు, కేంద్రానికి మంచిది కాదు. గోదావరి జలాల పంపిణీ పరిష్కార సూత్రాన్ని ధృవపరచి, కృష్ణ జలాల వివాదాన్ని కూడా వెంటనే పరిష్కరించడం అవసరం. ఒకచోట నీటి కోసం తగాదా, వేరొకచోట కూటి కోసం కొట్లాటలు సృష్టిస్తుంది. ఇది జాతీయ ప్రయోజనాలకు చేటు తెస్తుంది. అందుకే ఈ ఆవేదనా, మొత్తుకోలూ.

# చిన్న దీపమైనా....

చీకటిని చీల్చుకొని వెలుగులోకి రావడానికి ఎంతచిన్నదైనా దీపం వెలిగించు కోక తప్పదు. చెట్టులేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షం. విద్యుచ్ఛక్తి రానంత వరకు నూనెదీపాలే ఇళ్ళకు వెలుగు యిచ్చాయి. కళ్ళకద్దుకొని మరీ ఆనందించాం. అలాగే నారుపోసినవాడే నీరు పెట్టుకుంటాడు. అతనికి చెలక విస్తీర్ణంతో సంబంధంలేదు. తనది అనుకున్నప్పుడు తన సర్వస్వాన్ని ధార పోస్తాడు. ఇరిగేషన్ విషయంలోనూ అంతే. మన ప్రస్తుత ఆర్థికపరిస్థితులు చూస్తే, భారీ ప్రాజెక్టులకంటె మైనర్ ఇరిగేషన్ పథకాలవల్లనే త్వరత్వరగా పనులు పూర్తికాగలవని తెలుస్తుంది. గ్రామసీమలలో పంటసిరి నృత్యం చేస్తుంది. అట్టి మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులలో ఒకటి నల్గొండ జిల్లాలోని గాంధీసాగర్ ప్రాజెక్టు.

అనుకున్నవ్యవధిలో పనులు పూర్తిచేయడం మనకు ఇప్పటికీ బ్రహ్మవిద్యగానే వుంది. అందువల్ల నిర్దిష్టవ్యవధికంటే ముందుగానే-ఏడాది ముందుగానే నిర్మాణం పూర్తికాగల ప్రాజెక్టులు బహు తక్కువ. కాని అటువంటి రికార్డు నెలకొల్పిన ఘనత గాంధీసాగర్ ప్రాజెక్టుదీ, ఇందుకు శక్తివంచన లేకుండా కృషి చేసిన ఇంజనీర్లదీ. ఈ ప్రాజెక్టు పూర్తి అయి పంటపొలాలకు నీరు ఎక్కుతున్నప్పుడు నల్గొండ, ఆ చుట్టుపట్ల రైతుల ముఖాలలో ఆనందం, ఉత్సాహం చూడవలసిందేగాని, అజ్ఞాతంగావుండి చెప్పలేము. లక్షలాది ప్రజలకు నేటినుంచి జీవధార పోస్తున్న ఈ ప్రాజెక్టు నిర్మాణంలోకూడా మిగిలిన కురదలా పనులుకూడా త్వరగా పూర్తిచేసే బాధ్యత ప్రభుత్వానిది. సకాలంలో సహాయంఅందితే శ్రమదానానికి లోటువుండదని నిరూపించిన ప్రాజెక్టు ఇది.

మన రాష్ట్రంలో తరచుగా దుర్భిక్షానికి గురిఅయ్యే ప్రాంతాలను 72 తాలూకాలుగా గుర్తించింది ప్రభుత్వం. వీటిలో 23 తాలూకాలు ఒక్క తెలంగాణా

ప్రాంతంలోనే వుండగా, ఇందులో మహబూబునగర్ జిల్లా తర్వాత, దుర్భిక్షం తాండవించే తాలూకాలు నల్గొండజిల్లాలోనే ఏడు ఉన్నాయి. అభివృద్ధికి మారుపేరుగా ఎన్నికయిన బ్లాక్ ఒక్కటికూడా ఇక్కడ లేదు. ప్రధాన జలాధారాలైన కృష్ణ, మూసీ నదులకుతోడు ఆలేరు, పెదవాగు, దిండి, హాలియా, కంగల్ ఉపనదులు ఈ ప్రాంతాన్ని ఉత్సాహపరచుతున్నా, ఉపయోగానికి దూరమవుతున్నాయి. నాగార్జునసాగర్ అందదండలున్నప్పటికీ, మొత్తం వైశాల్యంలో పంటభూమి విస్తీర్ణం మొత్తం తెలంగాణాలోనే ఎక్కువగా వున్నప్పటికీ, సాగుభూమి 25 శాతం కూడా లేదు. వర్షపాతం తక్కువైనందున చెలాకా, దుబ్బభూములకు కాలువళ కామధేనువులు.

గాంధీసాగర్ ప్రాజెక్టును తన ఒడిలో పొదిగి పెంచుకుంటున్న సోలీపూర్ గ్రామం పొలిమేరలు తాకుతూ ప్రవహించే సోలీపూర్‌వాగు పోయిపోయి కృష్ణ ఉపనది కంగల్‌లో కలుస్తోంది. ఈ జిల్లాలో నూటికి 93 మంది పల్లెసీమలలో నివసిస్తున్నందున, ఈ గ్రామీణ భూములను సస్యశ్యామలం చేసేందుకు సాగుకు అనుకూలంగా నదులకు, వాగులకు, వంకలకు మరెన్ని వారధులు కట్టుకోవలసి వుంటుంది. ఆ పనిని చరిత్ర ప్రసిద్ధిగన్న నల్గొండ ప్రజలు సాధించుతారు !

# విశాఖ అవసరాలు : గోదావరి జలాలు

ఆలస్యం అమృతం అన్నారు. ఇంకా ఆలస్యమైతే అమృతం విషంగా మారుతుందన్నారు. విశాఖపట్టణానికి ఉక్కు ఫ్యాక్టరీ వచ్చిఉంటే గోదావరి జలాలు కూడా ఎక్కిఉండేవేమో. ఇప్పుడు స్టీల్‌ప్లాంటు వచ్చినా, రాక పోయినా, విశాఖలోని ఇతర పెద్దపరిశ్రమలకు, ప్రజల మంచినీటి సదుపాయాలు తీర్చడానికి, ఈ జిల్లాలోను, తూర్పు గోదావరిజిల్లాలోని మెట్ట ప్రాంతాల సేద్యానికి గోదావరి జలాల అవసరం ఎంతైనా ఉంది. ఇది ఇప్పటి పథకం కాదు. చాల సంవత్సరాలుగా ఉభయ జిల్లాల ప్రజలు ఎదురుచూస్తున్న పథకం. ఒకదశలో వంశధార నీటిని మళ్ళించాలనుకున్నారు గాని, దాని సాధ్యాసాధ్యాలు పరిశీలించిన దరిమిలా ఆ పథకాన్ని వదలుకున్నారు. గోదావరి జలాలను విశాఖకు మళ్ళించే విషయమై సర్వే పూర్తి అయికూడా సంవత్సరాలు కడచాయి. కాటన్ మహాశయుడు శతాబ్ది క్రితం ఊహించిన మరొక పథకానికి ఇలా రూపకల్పన జరిగింది. ఇప్పుడు ఈ మళ్ళింపు కార్యక్రమానికి కేంద్రం సుముఖత ప్రకటించడం శుభసూచన. దీని అర్థం - నిధులు మంజూరు చేయడానికి, సాంకేతికానుమతి ఇవ్వడానికి కూడా కేంద్రం సిద్ధంగా ఉన్నట్లు భావించవచ్చు.

ఈ సందర్భంగా రాష్ట్రప్రభుత్వం, కేంద్రం సమ్మతి పొందడంకోసం చేస్తున్న కృషిని ప్రశంసించక తప్పదు. అయితే రూ. 130 కోట్లు ఖర్చు కాగల ఈ మళ్ళింపు పథకాన్ని అమలు జరపడంలో కొన్ని సాధకబాధకాలు ఉన్నాయి. కార్యక్రమానికి పూర్తి అనుమతి రాకముందే పథకం అమలులోకి రాకముందే మాగాణి భూములుగా మారగల మెట్టభూములమీద అభివృద్ధి శిస్తు (బెటర్‌మెంట్ లెవీ) వసూళ్ళ గురించి ఆలోచిస్తున్నారు.

విశాఖపట్టణం స్థానిక జనాభా అవసరాలు రోజుకు 75 లక్షల గ్యాలన్లు. అయిదు లక్షల జనాభాకల నగరంలో తల ఒక్కంటికి ప్రస్తుతం అందు

తున్న నీరు 15 గ్యాలన్లు. ఇది జాతీయ స్థాయిలో నీటివాడకం కనీస ప్రమాణంలో సగం మాత్రమే. ఇక్కడ నీటిఎద్దడికి సహజ వనరులకొరత కొంత కారణంకాగా, పెద్ద పరిశ్రమల అవసరాలు అసలు కారణంగా కన్పిస్తోంది. అందువల్ల గోదావరి జలాల మళ్ళింపు పథకాన్ని అమలు జరపడంలో పెద్ద పరిశ్రమలు, రైల్వేలకు ప్రధాన బాధ్యత ఉంది. ఇవి రోజుకి సగటున 71 లక్షల గ్యాలన్లు వినియోగించుకుంటాయని ఒక అంచనా.

అందువల్ల పథకం అమలు జరపటానికి అయ్యేఖర్చులో రైల్వేలు, కాల్టెక్స్, కోరమాండల్, జింక్ శుద్ధి కర్మాగారం, పోర్టుట్రస్టు, భారత్ హెవీప్లేట్స్, నేవీ, మిలిటరీ శాఖలనుంచి విరాళాల రూపంలోగాని, పెద్దఎత్తున ఋణాలు సేకరించడం ద్వారాగాని హెచ్చుమొత్తాలను వసూలు చేయడం సబబుగా ఉంటుంది. అలాగే మధ్యలో గోదావరిజలాలను వినియోగించుకునే ఉభయ జిల్లాలకు చెందిన మునిసిపాలిటీలనుంచి కూడా ఋణాలు సేకరించవచ్చు.

ఇంతకూ ముందు జరగవలసిన పని, రాష్ట్రప్రభుత్వం కేంద్రంతో చర్చలు త్వరగా పూర్తిచేసి, పథకాన్ని అమలు జరపడానికి తగిన అన్నిహంగులూ సిద్ధపరచుకోవడం.

# శ్రీకాకుళం జిల్లా యశస్సుకు శ్రీకారం

ఆచరణలో వెంటనే అక్కరకు రాని నదీజలాల అనుసంధానం కంటే, కూత వేటుదూరంలోవున్న నదులను అనుసంధించి, నీటిని పుష్కలంగా వ్యావసాయక, పారిశ్రామిక, ప్రయోజనాలకు మళ్ళించుకోవడం మంచిది. కోస్తా ఆంధ్రలోని అయిదు ప్రధాన జీవనదులలో-గోదావరి. కృష్ణ, పెన్న, వంశధార, నాగావళి - చివరి రెండింటితో గోదావరిని కలిపే ప్రతిపాదనకు రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నట్టు వింటున్నాం. విశాఖపట్టణానికి గోదావరి జలాలను మళ్ళించే కార్యక్రమం పూర్తిఅయిన దరిమిలా ఈ గొప్ప అనుసంధానానికి శ్రీకారం చుడతారట. గంగ - కావేరి అనుసంధానం గురించిన ఆలోచనల మాదిరిగా ఇదికూడా కేవలం ఊహగానే మిగిలిపోకుండా ఆచరణ సాధ్యం చేసుకొంటే, రాష్ట్రాభివృద్ధిలో, వెనుకబడిన ప్రాంతాల సముద్ధరణ కృషిలో ఒక కొత్త అధ్యాయమే సృష్టి అవుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో హెచ్చు వర్షపాతంలో రెండవ స్థానం ఆక్రమిస్తున్న (1117 మిల్లీమీటర్లు) శ్రీకాకుళం జిల్లా ఇప్పటికీ వెనుకబడిన ప్రాంతంగా ఉండిపోవడానికి ప్రధాన కారణం - జిల్లాలో ప్రవహించే తొమ్మిది ప్రధాన నదులూ శివుకు దక్కని క్షీరంలా తరచుగా కళింగపట్నం వద్ద బంగాళా ఖాతంలో కలిసిపోవడమే. ఈ నదులకు ఇటీవలి కాలంలోనే రిజర్వాయర్లు, డాములు. ప్రాజెక్టులు ఏర్పడుతున్న ఫలితంగా వ్యవసాయం కొంత తేరు కొంటోంది. అదీగాకుండా కొండ ప్రాంతాలు హెచ్చుగా ఉన్నందున, వర్ష పాతం తగినంతగా ఉన్నప్పటికీ భూమి కోసుకుపోతున్న ఫలితంగా సుమారు లక్షా 75 వేల ఎకరాలు నిరుపయోగమవుతున్నాయి. నదులకు కావలసినంత నీరూ ఎక్కడం లేదు. అందువల్లనే జిల్లాలోని సాగుభూమిలో నాల్గింట ఒక వంతు భాగమే కాల్వల కింద సాగు అవుతోంది. మిగతాది, వర్షపాతం వల్ల అంతో ఇంతో నీటిని నిల్వచేసుకొంటున్న చెరువుల కింద సాగు అవు-

తోంది. ఫలితంగా నదుల ద్వారా లభించే సహజమైన సేద్యపు వనరులు తక్కువైనందున పంట రాలుబడిలోగాని, విస్తీర్ణంలోగాని ఇతర జిల్లాల కంటే శ్రీకాకుళం వెనుకబడివుంది. పైగా వర్షపాతంలో కూడా హెచ్చు భాగం వ్యవసాయపనులకు అనువైనకాలంలో పడదు. వర్షపాతంలో పెచ్చు నైరుతి రుతుపవనాలవల్ల మాత్రమే లభిస్తోంది.

తూర్పు కనుమలు జన్మస్థలంగా శ్రీకాకుళం జిల్లాకు స్పృశించే వంశధార, నాగావళి నదులను ఎంత సద్వినియోగం చేసుకొన్నా, నిర్మాణంలో ఉన్న చిన్నతరహా, మధ్యతరహా ప్రాజెక్టులనూ, రిజర్వాయర్లను పూర్తిచేసుకొన్నా సాగులోకివచ్చే పరీవాహక ప్రాంత భూములు మొత్తం- నాలుగున్నర లక్షల ఎకరాలకు మించదని ఒక అంచనా. వంశధార ప్రధానంగా పాతపట్నం, శ్రీకాకుళం తాలూకాలలోని భూములనూ, నాగావళినది ఉపనదులతో కలుపు కొని పాలకొండ, శ్రీకాకుళం తాలూకా భూములనూ మాత్రమే సాగుచేయ గలవు. పోతే బాహూదానది ఇచ్ఛాపురం తాలూకాలో కొన్ని భూములనూ సాగులోకి తేగలుతుంది. సాలూరు తాలూకాలో ప్రవహించే చంపావతి విశాఖ జిల్లాలోని విజయనగరం తాలూకాలో ప్రవేశిస్తుంది.

ఈ పరిస్థితులలో, కోస్తా ఆంధ్ర ఇతర జిల్లాలలోని సాగుభూమి సగటు విస్తీర్ణంతో పోల్చుకొంటే శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలో సేద్యపు వనరులున్న సాగుభూమి విస్తీర్ణం చాలా తక్కువ. అందువల్ల వ్యావసాయకంగానూ, పారిశ్రామికంగానూ ఈ జిల్లా అభివృద్ధి కావాలంటే నీరు అవసరం. జలాధారంలేని భూమి ఏ ప్రాంతానికీ జీవధారపోయలేదు. బ్రహ్మాండమైన అటవీ సంపద ఒకవైపు, ఖనిజవనరులు మరొకవైపు, వేరుశనగ మున్నగు ధాన్యేతర వాణిజ్య పంటలు మరొకవైపు, జూట్ (మెస్తా) ఇంకొకవైపూ సముద్ర సంపదను ఇంకొకతట్టునా పుష్కలంగా అందించగల జిల్లా పారిశ్రామికంగా కూడా వెనుకబడి ఉండడానికి కారణం - నీటి వనరుల కొరత. నమ్మకమైన జలాధారాలు తక్కువైనందుననే గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాలో కూడా ఈ జిల్లాది అథమస్థానమే. అయితే కాయకష్టానికి కొదువలేదు. అందువల్లనే ఇన్ని అననుకూల పరిస్థితులలో కూడా శ్రీకాకుళం జిల్లా ఏటా సుమారు రు. 80 కోట్ల విలువగల వ్యవసాయోత్పత్తులను అందిస్తోంది.

భవిష్యత్తులో విశాఖ నగరం అభివృద్ధిపైన కూడా ఈ జిల్లా ఆర్థిక వ్యవస్థ మరింతగా ఆధారపడివున్నందున, గోదావరితో వంశధార, నాగావళి నదులను అనుసంధించడం అన్నివిధాలా శ్రేయస్కరం. అది సాధించిననాడు శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు - చెట్టపట్టాలు కట్టుకొని సంపన్నప్రాంతాలను మించలేకపోయినా, సమఉజ్జీలైనా కాగలుగుతాయి.

# "కాటన్ నాయనమ"

"ఈనాడు కాదు, రానున్న తరాలు కాటన్ పేరును స్మరించుకొంటారు. ఆ పేరు చరిత్రలో చిరకాలం నిలచిపోతుంది. కాని నేడు పబ్లిక్ జీవితంలో అత్యున్నత పదవులను సహితం అలంకరించి ఉన్నవారి పేర్లను ముందు తరాలు ఇట్టే మరచిపోతారు'' : అది పందొమ్మిదివ శతాబ్దం మూడవ దశకం (1830- 40); తెలుగు గడ్డతోసహా మొత్తం మద్రాసు ప్రెసిడెన్సీలో చెల రేగిన కరవు కాటకాలనుంచి ప్రజలను రక్షించడానికి పెక్కు ఇరిగేషన్ వర్క్సును ఏక బిగువున ప్రారంభించి పూర్తిచేసిన మహనీయుడు సర్ఆర్థర్ కాటన్. ఆ దశలో ఆనాటి మద్రాసు గవర్నర్ ట్రివెలియన్‌బార్డ్ అన్న మాటలవి. ఈ సూక్తులు ఎంతటి అక్షర సత్యాలో ఈనాటి మన రాష్ట్ర ముఖ్యమంత్రి ధవళేశ్వరం ఆనకట్ట సమస్య గురించి ప్రస్తావిస్తూ అసెంబ్లీలో చెప్పిన మాటలు మరొకసారి ధృవ పరుస్తున్నాయి: "కాటన్ మహనీయునికి తరతరాలు ఋణపడి ఉంటాయి." అందుకే మనం పాత ఆనకట్టల స్థానంలో గోదావరిపై నిర్మించుకోనున్న బరాజ్‌కు "కాటన్ బరాజ్'' అని పేరు పెట్టా లని నిశ్చయించుకొన్నాం.

ఒకనాడు యావద్భారతావని పరిస్థితి ఒక ఎత్తుకాగా, దక్షిణ భారత దేశ పరి స్థితులు మరొక ఎత్తు. దక్షిణ భారతంలో కూడా మళ్ళీ మద్రాసు ప్రెసిడెన్సీ లోని పెక్కు ప్రాంతాల- గోదావరి, కృష్ణ, తంజావూరు- స్థితిగతులు వేరు. పక్క పక్కనే పారుతున్న నదీజాలాలు చేతికి చిక్కని దుస్థితి ఒక వైపు, కరవు బాధకు తాళలేక ప్రజలూ, గొడ్డూ గాదం మలమల మాడుతూ గ్రామా లకు గ్రామాలే వలసపోతున్న దృశ్యం మరొక వైపు. జనాభా తరిగిపోతోంది. నిర్జన ప్రాంతాల వల్ల సర్కారు వారికి రెవిన్యూ దెబ్బ తింటోంది. ఈ పరిస్థితులలో అప్పటికింకా ఈనాడంతగా ఇంజనీరింగ్ టెక్నాలజీలు వృద్ధి కాకపోయినా మన దేశంలోనే శతాబ్దాల క్రితం కట్టడాలకు సంబంధించిన ముడి పదార్థాల రహస్యాలను తవ్వితీసి సొంత బుద్ధితో, చేతికి అందిన దేశ వాళీ సామగ్రితో మహా నిర్మాణాలు తలపెట్టిన విదేశీయుడు సర్ఆర్థర్‌కాటన్.

అనేక ఆనకట్టలూ, అక్విడక్టుల నిర్మాణానికి తాను వేసిన పథకాలను మొదట్లో ఎగతాళి చేసి చివరికి బ్రిటిష్ కామన్స్ విచారణ సంఘం ముందుకు తనను ఈడ్చి రభసచేసిన తన ఇంగ్లీషు వాళ్ళనే ఎదిరించినవాడు కాటన్. ఈ ధైర్య సాహసాలే ఆయనను కావేరి ఇరిగేషన్ వర్క్సుకు ఇన్‌ఛార్జిగా నిలబెట్టాయి.

ఫలితంగా పంటలకు దక్కకుండా పరవళ్ళు తొక్కుతున్న కొలెరూన్ నదికి ముగుదాడువేసి తంజావూర్ జిల్లాలో రైతులచే రాజనాలుపండించాడు. అప్పటికి మేటవేసిన కృష్ణానదికింద ఎకరానికి రు. 8 ఫలసాయం వస్తుంటే తంజావూరు భూములలో అంతకు రెట్టింపు ఫలసాయం చూపించాడు. అక్కడి రైతుల ఆనందం క్రమంగా, గోదావరి కృష్ణా మండలాల రైరాంగానికి వ్యాపించింది. గోదావరి, కృష్ణ ఆనకట్టలు కూడా కాటన్ చేతిపనులే. ఇరిగేషన్ సౌకర్యాలు కల్పించడం వ్యయభారంతో కూడినపని అని ప్రభుత్వం అంటే "కాదు, ప్రభుత్వం దృష్టి ప్రయివేటు కంపెనీల మాదిరి లాభాల కోసం అర్రులు చాచడంగా ఉండకూడదు. రాజనీతిజ్ఞత, ప్రజా ప్రయోజనం ప్రధానం" అని చివాట్లు పెట్టినవాడు కాటన్. గోదావరి మండలం అంతటా ఒకనాడు లక్షల ఎకరాలలో చెరుకు సాగు అవుతుందని ముందుగా ఊహించినవాడు కూడా కాటనే. వాటర్ వర్క్సుకు జిల్లా కలెక్టర్లను బాధ్యులుగా ఉంచడమేగాక, ఇంజనీర్లతో సాటిగా దీటుగా నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొన్న వీనం వీరన్న వంటి సమర్థులైన ఓవర్‌సీర్ల వెన్నుతట్టి ప్రోత్సహించాడాయన. నదులను పొలాలకే గాకుండా తక్కువ ఖర్చులో జిల్లాల మధ్య, రాష్ట్రాలమధ్య సరకుల రవాణాకు కూడా వినియోగించుకోవచ్చన్నాడు. అతని అఖండ మేధస్సు దక్షిణాన పంబన్ వర్క్సునుంచి ఉత్తరాన గంగ- బ్రహ్మపుత్రల వరకూ ఆపైన చైనాలోని యాంగ్సేనదితో భారతీయ నదులను అనుసంధించే వరకూ "అఖండ గోదావరి"లా విశ్వరూపమెత్తింది. కర్నూలు కాల్వలగురించీ, తుంగభద్ర గురించీ ఎన్నో కలలు కన్నాడు. పథకాలు వేశాడు. విశాఖపట్నం బీచ్ కోసుకుపోకుండా దగ్గర ఉండి దఫదఫాలుగా నివారణ కార్యక్రమాలు నిర్వహించాడు.

అంతేగాదు. పెద్ద పెద్ద నదులు చివరికి అసలు ఏ నదులూ లేకపోయినాకూడా పంటల రక్షణకు పలురకాల పద్ధతులు ఉన్నాయని భరోసా యిచ్చినవాడు కాటన్. ఇందుకు ఉదాహరణగా ఆయన జైపూర్ రాష్ట్రాన్ని పేర్కొన్నాడు. ఒకప్పుడు గోదావరి మండలానికి కాటన్ ఎలాంటి పితామహుడో కరవు వాత పడిన జైపూర్‌కి కర్నల్ జాకోబ్ అలాంటి వాడు. 150 ఇరిగేషన్ వర్క్సును ఇతడు జయప్రదంగా నిర్వహించాడు.

నీరు విలువ తెలిసిన వాణ్ణు కాబట్టే పారుదలలోఉన్న నీరు బంగారంతో సమానమన్నాడు కాటన్. దాని ప్రయోజనం ఏమిటో గోదావరి మండలంలో అనుభవాల గురించి రాస్తూ ఇలా అన్నాడు: "ఒక ప్రాంతంలోని ప్రజలు కొంత తీరువా చెల్లించుకుని నీరు వాడుకొంటారనుకోండి; ఆ నీరు ఆధారంగా తిరిగి బియ్యం, చక్కెర, పొగాకు, కాయధాన్యాలు, ప్రత్తి మొద

లైన పంటలు పుష్కలంగా పండిస్తారనుకోండి; ఈ సరకును ఉత్పత్తి ఖర్చులకు మించి 50 రెట్లు ఎక్కువగా విక్రయించుకొంటారనుకోండి; ఇక అప్పుడు బ్రతుకు ఎలా గడపాలా, అయిదు వేళ్ళూ నోట్లోకి ఎలాపోతాయా అన్న సమస్య కాస్తా పరిష్కారం అయిపోయినట్టే.... బియ్యం కానివ్వండి; ప్రత్తి కానివ్వండి మరొక సరకు కానివ్వండి - ఎగుమతి చేయదగిన అన్ని సరకుల ధరలూ ఆహారానికి బట్టలకు అయ్యేఖర్చుతో సరిసమానమవు...... ఈనాడు ఆహారధాన్యాల ఉత్పత్తికి వినియోగించే శ్రమశక్తిని తగ్గించి, నీళ్లు పుష్కలంగా వాడుకుంటే ఉత్తరోత్తరా స్వేచ్ఛాజీవులైన ప్రజలు తమకేగాక విదేశాలకు సైతం సరకులను సరఫరా చేసేందుకు, తమ భూములకు ఏఏ పంటలు సరిపోతాయో వాటిని పండించడానికి ఎంతగానో ముందుకు వస్తారు. ఒక్కధాన్యాలు అనేమిటి? ప్రత్తి ఇతర పంటలనుకూడా వీరు ఎంత పెద్ద మొత్తంలోనైనా సరే యూరప్ దేశాలకు, చైనాకు, ఇతర దేశాలకు విక్రయించగలుగుతారు."

పంటకూ, వంటకూ, చేతికి నోటికీ జీవధారలు అందించిన కాటన్‌ను గోదావరి మండలవాసులు ఎన్నటికీ మరువలేరు. కనుకనే తమను కరవు బారి నుంచి కాపాడిన కాటన్ ధవళేశ్వరం వద్ద ఉన్నా, ఇంగ్లాండ్ వెళ్ళి చాతామ్‌లో విశ్రమిస్తున్నా, ఆ దరిమిలా కొన్నిదశాబ్దాలపాటు ఆయనను స్మరించు కొంటూనేవచ్చారు. ఇప్పటికీ పూజిస్తున్నారు. గోదావరి, కృష్ణా మండలాల ప్రజలు చాల ఏళ్ళపాటు అనేక శుభకార్యాలలో "శివాయనమః"కు తోడుగా "కాటానాయ నమః" అనికూడా స్మరించుకొనే వాళ్ళట. ఇంగ్లాండ్‌లో స్థిరపడిన తరవాతకూడా కాటన్ గోదావరి రైతులు కొందరికి ఉత్తరాలు రాస్తూ, కుటుంబాల, పంటల బాగోగులను గురించి ఆరా తీసేవాడట.

ఇప్పుడు మనం తలపెట్టిన గోదావరి బరాజ్ నాలుగు భాగాలుగా ఏక పథ కంగా నిర్మించుకోవడమే మంచిది. ఏటా రు. 200 కోట్ల ఆదాయం ఇచ్చే రకరకాల పంటలను అందజేస్తున్న గోదావరి మండలం శ్రేయస్సు మన రాష్ట్రా నికే కాదు, యావద్భారతానికే ప్రాధాన్యం.

ఈ సందర్భంలో, కాటన్ అమూల్యమైన హెచ్చరికను మన ఇంజనీర్లు, ప్రభు త్వమూ సదా గుర్తుంచుకోవాలి:

"ఎటువంటి వాటర్ వర్క్సు అయినా, వాటి మానానికి వాటిని విడిచిపెట్టి ఉండకూడదు. ప్రధానంగా డెల్టా ప్రాంతాలలోని జలాశయాలను కంటికి రెప్పలా జాగ్రత్తగా కాపాడుకోవాలి. వీటికి అయ్యే ఖర్చూ, వీటిపైన ఆధార పడిన అపారమైన సంపదా ఈ అప్రమత్తత ఎంతో అవసరమని చాటిచెపు తున్నాయి."

# శతాబ్దంలో మరొక వింత?

శాస్త్రవేత్త, తత్వవేత్త కూడా. విశ్వం ఆతనికి ఒక ప్రయోగశాల. అది శాశ్వత సత్యాలు లేవని నిరూపించగల వియోగశాలకూడా. ప్రశ్నతోనే ప్రారంభమైన జిజ్ఞాస తిరిగి ప్రశ్నతోనే అంతం చేయగల సత్తా కలవాడు శాస్త్రజ్ఞుడు. భ్రాంతి కల్పిస్తాడు, విభ్రాంతి కల్గిస్తాడు. అయితే నిరూపణ జరిగే వరకు నిద్రపోడు. వూహకు వూయల వేసిన మిధ్యావాది కాడు కాబట్టి, ఉదాహరణలతో తన పరిశోధనలకు వివరణలిచ్చి, తుదకు ఉసురు పోస్తాడు.

ఈ మహా విశ్వం రహస్యాలను విడమరచి చెప్పడానికి ఎన్ని ప్రయోగాలు జరిగాయో, ఎందరు శాస్త్రవేత్తల సిద్ధాంతాలను మరెంతమంది తిరగతోడారో చెప్పలేము. "ఇక్కడితో విశ్వం సరిహద్దులు ముగిశాయ"ని మనం ఎలా చెప్పలేమో, వీరు కొత్త వింతలు, విశేషాలు కనిపెట్టడం "ఇక ఆగిపోయినట్టే" నని కూడా చెప్పలేము. అందువల్ల విజ్ఞానశాస్త్ర ప్రపంచంలో కూడా "యుగసంధులు", నూతన శకాలు ఎప్పుడూ వుంటూనే వుంటాయి.

ఇటీవల కాలిఫోర్నియా శాస్త్రవేత్తల ప్రయోగాలు కొత్త విషయాలు బయటపెడుతున్నాయి. విశ్వంలో ప్రతి ప్రాణీ, వస్తువూ ఒకదాని నాశయించుకొని మరొకటి వుంటుంది. అంటే పరస్పరం పొత్తులేనిది, లేదా ప్రమేయం లేనిదంటూ ఏదీ వుండదన్నారు. దీనినిబట్టే ఐన్‌స్టీన్ వచ్చేవరకూ మూడు కొలతలుగా వున్న విశ్వం "నాలుగు కొలతల విశ్వం" అయింది. అంటే పొడుగు, వెడల్పు, లోతుతోపాటు కాలం కూడాచేరి "స్థల-కాలాల" సంయోగమే విశ్వం అన్నారు. అలాగే పదార్థానికి వున్న మూడు రకాల పదార్థాలు (వాయు, ద్రవ, ఘన పదార్థాలు) వున్నాయన్నారు. కాని కొన్నివేళ్ళనాడు ఇదీ మారిపోయి, పదార్థానికి నాల్గవస్థితి కూడా వుంది అదే

"ప్లాస్మా" అన్నారు. అమిత ఉష్ణోగ్రతవల్ల, వొత్తిడులవల్ల పదార్థం వాయు రూపంలో కూడా వుండకుండా మరిన్ని అణు శకలాలుగా ఛిద్రమైపోయి, భిన్నంగా వ్యవహరిస్తుంది. ఈ భిన్న స్థితినే 'ప్లాస్మా' అంటారు. ఇప్పుడు దీనికితోడు పదార్థానికి కాలిఫోర్నియా శాస్త్రవేత్తలు "అయిదవస్థితి" కూడా వుందని తాజాగా కనిపెట్టారట. దీనికి "ఎగ్సిటాన్స్" (Exitons) అని పేరు పెట్టారు. ఇవి లోహంవలె, ద్రవం మాదిరి, విద్యుద్వాహకాలుగా ప్రవర్తిస్తున్నాయట.

ఇలా విశ్వానికి కొత్త కొలతలు వస్తున్నాయి. పదార్థానికి నూతన "స్థితి" ఏర్పడుతోంది. కొత్తగా ఏర్పడడం కాదు. ఇంతవరకు గోచరంకాని దానిని కనుగొంటున్నారంటే, సబబుగా వుంటుంది. మరెన్ని "కొలతలు" ఇంకెన్ని రకాల "పదార్థస్థితి"ని శాస్త్రవేత్తలు మనకు చూపించ నున్నారో చెప్పలేము.

అలాగే మళ్ళీ కాలిఫోర్నియా శాస్త్రవేత్తలే కొందరు మరొక కొత్త విషయాన్ని బయట పెట్టారు. "అయస్కాంతానికి" రెండు ధృవాలు లేవు, ఒకే ధృవం వుందన్నారు. దానికి "మొనోపోల్" అని పేరు తగిలించారు. ఇదే రుజువైతే భౌతిక శాస్త్రంలోనే పెను విప్లవం వస్తుందంటున్నారు. ఈ శతాబ్దంలోనే ఇది మరొక విశిష్ట పరిశోధన కాగలదంటున్నారు. దీనిని బట్టి ఒక్క భౌతిక శాస్త్రంలోనేగాక, భూభౌతిక శాస్త్రంలో మాత్రం మార్పులు రావని చెప్పగలమా ? "ఉత్తర - దక్షిణ ధృవాలు" వున్నాయన్న సిద్ధాంతంపై ఆధారపడిన అయస్కాంతమేకాక, దిక్సూచీల దిక్కు ఏమి కానుంది.

భూమి పరిభ్రమణంలో (రొటేషన్) కన్పిస్తున్న అస్థు, బిస్థులు కూడా ఒక్క "ధృవం" తోటే నిర్ధారణ కాగలుగుతాయా ? ఇవన్నీ మళ్ళీ వూహాలే. "జగత్తులో ఏదీ ఏకాకి కాదు" ("నథింగ్ ఇన్ ది వరల్డ్ ఈజ్ సింగిల్"). అన్న కవి షెల్లీ మాట వొమ్ము కానుందా ? లేదా రెండు వందల ఏళ్ళు శాస్త్రవేత్తలను తికమక పెట్టి చాలించుకున్న "ఈథర్" సిద్ధాంతంలా ఈ అయస్కాంతపు "ఏకైక ధృవ" సూత్రీకరణ కూడా దూది పింజలా ఎగిరిపోతుందా ? అనంత విశ్వంలో, అనేక సమస్యలు అంతుపట్టని సమస్యలు...

## "రోమ్ ఈజ్ రెడ్"

ఒక్క యూరప్ మాత్రమేగాక, యావత్ప్రపంచమూ ఎదురుచూస్తున్న ఇటాలియన్ జనరల్ ఎన్నికల ఫలితాలు కొత్తపాఠాలు చెబుతున్నాయి. ఈ ఎన్నికలు ఇంతటి ఆసక్తిని కల్గించడానికి రెండు కారణాలున్నాయి: 1. గడచిన ముప్పై ఏళ్ళకుపైగా ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ ప్రభుత్వం పతనమయ్యే ప్రమాదం దాపురించడమూ; 2. మాస్కో, పీకింగ్ కమ్యూనిస్టుపార్టీల ప్రభావానికి దూరంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉంటూ, "శ్రామికవర్గ నియంతృత్వ" విధానాన్ని వదలుకొన్న ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ దేశానికి కొత్తతరహా మిశ్రమ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడానికి సమ్మతించడమూ. అయితే ఈ ఎన్నికల ఫలితాలు వెంటనే ఇటలీకి సుస్థిర ప్రభుత్వాన్ని ప్రసాదించగలవిగా లేవు. ఎగువసభ (సెనెట్)లో కమ్యూనిస్టులకంటే ఎక్కువసీట్లు క్రిస్టియన్ డెమోక్రాట్లు సాధించినా, ప్రధానమైన దిగువ సభలో అంతంత మాత్రపు బలాన్నే సాధించారు. ఓటింగ్‌లో కూడా 1972 ఎన్నికలనాటి స్థాయినిమించి ఎదగలేక పోయారు. అయితే ఇప్పటికీ ఇటలీ రాజకీయ పక్షాలలో ప్రథమ స్థానాన్ని క్రిస్టియన్ డెమోక్రాట్లు దక్కించుకొన్నారు. కాగా కమ్యూనిస్టులు ఈ సారి సీట్లతోపాటు, ఎక్కువశాతం ఓట్లనుకూడా సంపాదించుకొన్నారు. కాని ఎప్పటి మాదిరే కమ్యూనిస్టుపార్టీ రెండవ స్థానంలోనే ఉంది; అలాగే సోషలిస్టులు మూడవ స్థానంలో ఉన్నారు. ఈ ఎన్నికలలో మరొక కొత్త పరిణామం- కొత్తగా ఏర్పడిన రాడికల్స్, డెమోక్రాటిక్ ప్రొలిటేరియన్ పార్టీలు మొట్టమొదటిసారిగా ప్రతినిధులసభలో పదిస్థానాలు పొందగలగడం. సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగల పరిపూర్ణమైన మెజారిటీ ఎవరికీ లేదు. ఎన్నికలలో పాల్గొన్న పక్షాలన్నీ సంక్షోభంలో ఉన్న ఇటలీ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరచగలమని ప్రజలకు హామీ ఇచ్చినవే. సమస్యల

పరిష్కారంకోసం క్రిస్టియన్ డెమోక్రాట్లతో చేతులు కలపడానికి, ఐక్య సంఘటన ఏర్పరచడానికి కమ్యూనిస్టులు చేసిన ప్రయత్నాలు విఫలమైన తరవాతనే వేర్వేరుగా పోటీ చేయడం జరిగింది. దుర్బలస్థానం నుంచిగాక, క్రమక్రమంగా పెక్కు స్థానిక సంస్థలలో గణనీయమైన ప్రాబల్యం పొందుతూ వచ్చిన కమ్యూనిస్టు పార్టీ ఆధిక్యతాస్థానంనుంచే ఈ ప్రతిపాదన చేసింది. అమెరికా పెత్తనంలోకి ఇటలీ జారిపోకుండా చూసేందుకుగాను తాము అధికారంలోకివస్తే, యూరప్ ఆర్థిక వ్యవస్థనుంచీ, "నాటో" సైనిక కూటమి నుంచి కూడా ఇటలీని ఉపసంహరించబోమని చెప్పింది. ఈ మాటలను ప్రజలలో వివిధ వర్గాలు విశ్వసించబట్టే సీట్లనూ, ఓట్లనూ కమ్యూనిస్టులు పెంచుకోగలిగారు. అయితే పూర్తి అధికారాన్ని వారికి ప్రజలు అప్పగించక పోవడానికి కారణం- సంప్రదాయంగా వస్తున్న కమ్యూనిస్టు వ్యతిరేకత ఇంకా పూర్తిగా తొలగకపోవడమే !

అయినా ఇంతకుముందు స్థానిక ఎన్నికలలో కమ్యూనిస్టుల విజయాలకు పరాకాష్ఠగా రోమ్ నగర కౌన్సిల్‌ను వారు చేజిక్కించుకొన్నారు. యూరప్‌లో సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఒకనాడు ఇటలీ ప్రసిద్ధ కేంద్రమైనట్టే రోమ్ నగరం టూరిజానికీ, చలన చిత్రాలకే కాకుండా ప్రపంచ క్రైస్తవ మత ప్రచారానికి కూడా అంతటి పీఠమూనూ. అందుకే "మిలాన్ కాయకష్టానికి నిలయమైతే రోమ్ తీరుబడిగాకూర్చొని విందు లారగించే కులాసా కేంద్రం" అన్న సామెత వచ్చింది. పోప్ పీఠాధిపత్యానికి నేటినుంచీ కమ్యూనిస్టుల సవాలు ఎదురు కాబోతుంది. అందుకే నిన్న "రోమ్ నేడు ఎరుపెక్కింది. ఇటలీ వంతు రేపు" అని కమ్యూనిస్టులకూ, వారి అనుయాయులకూ, అనుకూల వర్గాలకూ సంతోషం. రానున్న కొలది సంవత్సరాలలో ఇటాలియన్ రాజకీయాలు ఎటు పరిణమించగలవో దీనినిబట్టి ఊహించుకోవచ్చు.

# మహత్తర విజయం

ఒకప్పుడు నెపోలియన్ నిద్రపోతున్న చైనాను లేపవద్దన్నాడు. కాని అది లేచికూర్చుంది. అలాగే ఇండియానుకూడా నిద్రపుచ్చి ఆ మైకంలో దానిని అట్టిపెట్టడానికి శతాబ్దాలుగా సామ్రాజ్యవాద శక్తులేకాదు, దేశంలోని మౌఢ్యం మూటకట్టుకున్న శక్తులుకూడా వేలకొలది సంవత్సరాలుగా కారణమయ్యాయి. ప్రగతిని ఎప్పటికప్పుడు నిరోధించారు. మతంపేరిట, మాయపేరిట మనో వికాసాన్ని త్రొక్కిపట్టారు. చంద్రునిలో ముసలమ్మను, రాట్నాన్ని చూపి మురిపించి, చంద్రగతిలోని శాస్త్రీయ రహస్యాలు తెలియకుండా చేశారు. యాంత్రిక విమానాలు వచ్చిన రోజున "పుష్పకవిమా"నాన్ని గుర్తు చేశారు. నక్షత్రరాశి గురించి పశ్చిమదేశాలు పరిశోధనలు సాగిస్తున్నప్పుడు "ఆకాశ గంగ" గురించి కావ్యాలు అల్లారుగాని, కార్యం నెరవేర్చలేదు. అణుశక్తి వృద్ధి అయి, అణ్వస్త్రం తయారయినరోజున "ఆగ్నేయాస్త్రాలు", "పాశుపతాస్త్రాలు" మనవాళ్ళు ఏనాడో కనుగొన్నారని చెప్పారు. పారిశ్రామిక విప్లవం, శాస్త్ర, సాంకేతిక విప్లవం మన ముంగిట ప్రవేశించినా, అక్కరకు రాని పాతబట్టలనే మనకు కప్పజూచారు.

ఇండియా ఇప్పటికైనా జ్ఞాననేత్రం తెరచింది. శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించే ఒక్కొక్క విజయం ప్రతి దేశాన్నీ ఆలోచనలో, ఆచరణలో దశాబ్దులు, శతాబ్దులు ముందుకు నెడుతుంది. మూఢనమ్మకాలకు ఉపగ్రహాలం కానప్పుడే మనం శాస్త్రీయ ఉపగ్రహాలు తయారుచేసుకోగలం! కొన్ని నెలల క్రితమే అణుపాటవశక్తిని జయప్రదంగా పరీక్షించుకున్న మన దేశం, అనతి కాలంలోనే కృత్రిమ ఉపగ్రహాన్ని విడుదలచేసి, రోదసీయుగంలోకి ప్రవేశించింది. ఇండియా, శాస్త్ర, సాంకేతిక రంగంలో మరొక ఘనవిజయాన్ని సాధించడం అందరికీ సంతోష కారణం.

ఎంతసేపటికీ మనం గ్రీక్ హిపార్కస్, టోలమీ, పోలిష్ న్యూటన్, డేనిష్ బ్రాహే, ఇటాలియన్ గెలీలియో గురించి చెప్పుకోవడమేగాని, ఇండియన్ ఆర్యభట గురించి తెలియనివ్వలేదు. మొన్న ప్రయోగించిన ఉపగ్రహానికి ఐదవ శతాబ్దంలో అత్యంత ప్రగతివాదిగా, శాస్త్రజ్ఞానం మూర్తీభవించిన గణిత శాస్త్రజ్ఞుడుగా ప్రసిద్ధిచెందిన "ఆర్యభట" పేరుపెట్టడం సముచితంగావుంది.

"కుసుమపురవాసి" అయిన ఆర్యభటను, ఖగోళశాస్త్రవిషయాలపై సాధికార సిద్ధాంతాలు సశాస్త్రీయంగా నిరూపించి గణితానికీ, ఖగోళశాస్త్రానికీ అనుబంధాన్ని రుజువుచేసిన ఆయన సూత్రాలను "సంప్రదాయం" పేరిట ఎదుర్కొన్నవాళ్ళున్నారు. వీరిలో ఆర్యభట తర్వాతివారైన వరాహమిహిరుడు, బ్రహ్మగుప్త ముఖ్యులు. ఆనాడు గ్రీస్‌తో ఇండియాకు సంబంధ బాంధవ్యాలున్నప్పటికీ, గ్రీక్ శాస్త్రజ్ఞుల సిద్ధాంత ప్రభావం ఏమేరకు వున్నదో చెప్పలేముగాని ఆర్యభట శాస్త్రవిజ్ఞానం అతని పరిశోధనలు స్వయం కృషి ఫలితం. ఇక్కడ తొలిఉపగ్రహప్రయోగం కూడా మన యువశాస్త్రవేత్తల కృషిఫలితం. వారికి మా శుభాశీస్సులు అందజేస్తున్నాం.

నిరుడు ఆరవ అణుశక్తి సంపన్నదేశంగా, నేడు రోదసీశకంలో ప్రవేశించిన పదకొండవ రాజ్యమైన ఇండియాకు, రేపు గ్రహాంతరయానాలకి తగిన సాంకేతికపరిజ్ఞానాన్ని వృద్ధిచేసుకోగల అవకాశాలు పెక్కు వున్నాయి. శాస్త్రసాంకేతిక రంగాలలో అంతర్జాతీయ సహకారం అవసరం వున్నమాట నిజమేగాని, మౌలికమైన ప్రయోగాలలో ఈనాటి పరిస్థితులలో అన్నిదేశాలకు వలెనే, ఇండియాకూడా జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. అణుశక్తి అభివృద్ధి రోదసీయానాలుకూడా సైనిక రాజకీయ ప్రాధాన్యం వహిస్తున్న ఈనాడు, అత్యంత కీలకమైన మన సాంకేతిక పరిజ్ఞానాన్నీ, ఇతర రాజ్యాల కనుసన్నలలోకి తేవడం మంచిదికాదు. శాస్త్ర సాంకేతిక రంగాలలో స్వావలంబన పరిపూర్ణంగా నెరవేరనంతవరకు, ఇందుకై ఇతరదేశాలపై ఆధారపడినంతవరకు ఎటువంటి వత్తిడులు ఎదురౌతాయో అమెరికా, కెనడాలతో మన స్నేహం నిరూపించింది. తాజాగా ప్రయోగించిన "ఆర్యభట" ఉపగ్రహం డిజైన్ పూర్తిగా మనది కావచ్చుగాని, అందులో అమర్చిన అతిముఖ్యమైన ఉపాంగాలు- సోలార్ సెల్సు, విద్యుత్‌ను నిల్వచేసే బ్యాటరీలు, టేప్‌రికార్డరు ఇత్యాదులు- రష్యావి. ప్రయోగ కేంద్రంకూడా మనది కాకపోవడం మరొక విశేషం. వీటన్నింటిని మన దేశంలోనే సమకూర్చుకోగలిగిన నాడు నిజమైన స్వావలంబనగా మనం చెప్పుకోగల్గుతాం.

ఎవరికి కోపతాపాలు పుడితే వారు మధ్యలోనే మనల్ని పుట్టిముంచే ప్రమాదం నుంచి మనం తప్పించుకోవాలంటే, దేశంలో లభించే సమస్త వనరులను మన శాస్త్రవేత్తల అందుబాటులోకి తెచ్చుకోవాలి. వారికి మంచి జీవన పరిస్థితులు కల్పించాలి. విదేశాల్లో వుండిపోయిన సమర్థులైన శాస్త్రజ్ఞులను ఇండియాకు రప్పించాలి. వారి సేవలను దేశకల్యాణంకోసం బహుధా వినియోగించుకోవాలి. బడుగుస్థితినుంచి దేశాన్ని బయటపడవేసి, అణుశాస్త్ర, సాంకేతికరంగాలలో అగ్రరాజ్యాల గుత్తాధిపత్యం అరికట్టించాలి. ఇందుకు ఆర్థికరంగంలో స్వావలంబన అన్నింటికీ మించిన గ్యారంటీ!

# తంజావూరు స. మ. గ్రం.

అది ఒకనాటి "అనంతర ప్రబంధ యుగం," కాకపోతే నాయక రాజుల శకం, ఇంకొంచెం సాగదీస్తే మహారాష్ట్ర రాజుల విజయాంగం. అవి, దక్షిణ దేశంలో రాజాశ్రయపు త్రాసులో సంగీతం, సాహిత్యం, కళలూ సమాదరణతో తులతూగిన దినాలు; సామాజిక దృష్టి లోపించినా సాహిత్య ప్రక్రియా వైవిధ్యంగల యుగం. చిత్రకవులు చిరంజీవులై చిత్రవిచిత్ర కవితారీతులే చిరసత్యాలై చెలగి మెలగిన రోజులు; వినోద విలాస వాఙ్మయమే విహార యాత్రలు సాగించిన కాలం. తంజావూరు చరిత్రలో తొలిదశ నాయక రాజులదైతే, మలిదశ మహారాష్ట్ర రాజులది. మధుర కంటే తంజావూరు మరింత గడసరిగా మారి మరిన్ని మధుర స్మృతులతో నాటికీ నేటికీ మైమరపించుతున్న మహాయుగం అది. ఇప్పటికి షుమారు మూడువందల ఏళ్ళనాటి ఈ యుగాన్ని కొందరు "క్షీణయుగం" అనవచ్చు, మరికొందరు అదే నిజమైన "శారదా ధ్వజ"మనీ, ఇంకొందరు అదే "స్వర్ణ యుగ"మనీ, వజ్రయుగమని వాదులాడుకోవచ్చు. కాని ఈ వాదాలకు మించిన మంచిపనికి కూడా ఈ యుగంలోనే శ్రీకారం చుట్టడం చూస్తాం. అదే-భావితరాలకు సహితం పరిశోధనా తపన తీర్చి, అభ్యసనాభిలాషను పెంచి పోషించుతూ, ఈనాటికీ సంస్కృత తెలుగు, కన్నడ, మళయాళ, మరాఠీ, హిందీ భాషా తత్త్వవేత్తలనూ ఇతర భాషా సాహితీ పరులనూ ఆకర్షిస్తున్న విద్యానిలయం తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం (స. మ. గ్రం.). సకల సంగీత, సాహిత్య శాఖలలోని గ్రంథాలకూ, వైద్య గ్రంథాలకూ, అపురూపమైన తాళపత్ర గ్రంథాలకూ, ప్రాచ్యభాషా రాతప్రతులకూ కొన్నివేల ప్రాచీన ఆంగ్ల, గ్రీకు, లాటిన్, ఇటాలియన్ పుస్తకాలకూ క్షీణదశ పట్టకుండా రక్షరేకలు కట్టి భద్రపరచిన విద్యానిలయం అది. సాంస్కృతిక సమైక్యానికి జీవనాడిగా వర్ధిల్లుతున్న ఈ సరస్వతీమహల్ నిర్వహణ బాధ్యతను ఇప్పుడు కేంద్రప్రభుత్వం చేపట్టబోతోంది.

ఈ మహల్ ప్రాశస్త్యానికి ఒక్క సత్యాన్ని ఉదాహరిస్తే చాలు! భాండాగారంలో ఈ అపురూప సంచయాన్ని ఎంతో జాగరూకతతో భద్రపరచి ఉండక పోతే, తంజావూరు ఏలికలు వీటిని గాలికి వదలివేసి ఉన్నట్లయితే దక్షిణదేశ చరిత్రకూ, తెలుగు సాహిత్యానికీ నాయకరాజుల, మహారాష్ట్ర నాయకుల పరిపాలనా కాలానికి సంబంధించిన అనేక ప్రధాన ఘట్టాల తబిశీళ్ళు తెలిసేవి కావు. వేదంవారి దగ్గరనుంచి ఆరుద్రవంటి ఆధునిక పరిశోధకుల ఆంధ్ర చరిత్ర పరిశోధనలవరకూ మనకు ఎన్నెన్నో త్రొరలే కానవచ్చేవి. దక్షిణాది వారందరూ ఎప్పటికీ గర్వించదగిన గ్రంథాలయాన్ని పెంచి పోషించి కాపాడడంలో తంజావూరు ఏలికలలో నాయక రాజులకంటే మహారాష్ట్ర రాజులకే పెద్దపీట. నాయకరాజులలో చివరివారైన రఘునాథుడూ, విజయరాఘవ నాయకుడూ స్వయంగా కవి ప్రభువులూ సాహిత్య పోషకులే అయినా, కవులను ఆదరించినా రాజ్యభారంవల్ల గ్రంథాలయ పోషణకు అంతశ్రద్ధ వహించినట్టు లేదు. కాకపోతే వారి యుద్ధచిహ్నాలకు ఆశ్రయంగా నెలకొల్పుకొన్న "విజయ భవనం" ఆ దరిమిలా మహారాష్ట్ర రాజులైన శహాజీ, శంభోజీల చేతులలో "సరస్వతీ మహల్"గా రూపుదిద్దుకొన్న దంటారు.

మధుర, తంజావూరుల పేరెత్తితే చాలు, తెలుగు పలుకుబళ్ళతో చవులూరించిన చేమకూర చటుక్కున గుర్తుకువస్తాడు. "నెలిచుక్కలలో నెలరేక"గా పేరుమోసిని ముద్దుపళనీ, రంగాజీ కళ్ళముందు బొమ్మకట్టి నిలుస్తారు. రక రకాల నాట్య భంగిమలతో రంగభోగం చేసిన ఒక రూపవతీ, ఒక చంపక వల్లీ, వేరొక కోమలవల్లీ స్ఫురణకు వస్తారు; పద కవితలతో గాన సుధలతో త్యాగరాజూ, నారాయణ తీర్థులూ, క్షేత్రయ్యా ఇప్పటికీ వీనులవిందుచేస్తునట్టే ఉంటుంది. ఇంతటి అఖండ వారసత్వానికి చెదలు పట్టనివ్వకుండా తమిళ గడ్డపైన నిలబడి కళ్ళన్నీ వత్తులుచేసుకొని కాపలాకాసినవాడు మహారాష్ట్రుడు శరభోజీ రాజు. శహాజీ అపరభోజుడైతే, శరభోజీ బహుభాషా కోవిదుడు. దక్షిణాదిన యక్షగానాలకు అమితంగా రాజభోగం పట్టింది ఈ తంజావూరులోనే, ఈ శరభోజీ కాలంలోనే. ఈ ఉమ్మడి వారసత్వానికి దక్షిణదేశమే కాదు, ఉత్తరభారతమూ అర్హురాలే. వాఙ్మయ పరిశోధకులకు అధ్యయన అవకాశాలు కల్పించడమే గాకుండా ఈ విశిష్ట గ్రంథాలయ పోషణకు వేయివిధాల కేంద్రం సహాయం అవసరం.

# వృక్షశాస్త్రంలో నూ విప్లవం

ఉల్లి చేసిన మేలు తల్లి చేయదంటారు. అలాగే విజ్ఞాన శాస్త్రం సద్వినియోగం కావాలిగాని, మానవాభ్యుదయానికి అది ఎన్ని మేళ్ళయినా సమకూర్చిపెట్టగలదు. ఆధునిక విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలలో సాగుతున్న పరిశోధనలో పెక్కు రకాల ''విశ్వామిత్ర సృష్టి'' జరుగుతోంది, ప్రయోగశాలల్లో కృత్రిమంగా జీవకణాలు, టెస్ట్ ట్యూబ్ బేబీలే కాదు కృత్రిమంగా మొక్కలే, వృక్షజాలమే ఉత్పత్తికాగల దశ వచ్చింది. విత్తనంతో నిమిత్తం లేకుండా చెట్టును పుట్టించే పద్ధతిని; మొక్కను మొలిపించే విధానాన్ని పూనాలోని జాతీయ పరిశోధనా సంస్థకు చెందిన మన వ్యవసాయ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఇకమీదట "విత్తుకొలదీ చెట్టు'' అన్న సామెతకు కాలదోషం పడుతుంది! దాని స్థానే "మానవుని చిత్తంకొలదీ చెట్టు'' ఒక పలుకుబడి అవుతుంది. మొత్తం వ్యవసాయ శాస్త్రంలోనే, సాంకేతిక జ్ఞాన రంగంలోనే ఈ పెను విప్లవానికి మార్గదర్శకులైన శాస్త్రవేత్తలను అభినందిస్తున్నాం.

విత్తనంతో సంబంధంలేకుండా "టిస్యూ''లతో, లేదా పరాగరేణువులు (పుప్పొడి-పోలెన్ గ్రైన్స్)నుంచి లక్షలకొలది మొక్కలను ప్రయోగశాలలో పుట్టించవచ్చునని శాస్త్రవేత్తలు రుజువు చేశారు. క్యాబేజీ మొక్కలను ఇలాగే సృష్టించారు. బయట భూమిలో నాటినపుడు పెద్దవేకాకుండా ఆరోగ్యవంతమైన క్యాబేజీలు వర్ధిల్లాయట. ఇట్టి ప్రయోగాలద్వారా ఇతర సస్యజాతులనుకూడా వృద్ధిచేయబోతున్నారు. ఈ ప్రయోగాలు మేలుజాతి మొక్కలను తయారుచేయడమేగాక, తెగుళ్ళనుకూడా తట్టుకుని నిలబడగల జాతులను కూడా సృష్టించగలవి. ఇవి ఇప్పటికే మన అనుభవంలోకి వచ్చిన రకాల కృత్రిమ వరివంగడాల మాదిరే ఉపయోగంలోకి రాబోతున్నాయి. ఈ సందర్భంగా శాస్త్రవేత్తలు చేసిన ప్రతిపాదన ప్రభుత్వం శ్రద్ధగా పరిశీ

లించదగింది. విదేశాలనుంచి ఎక్కువ ఖర్చుచేసి సంకర విత్తనాలను (హైబ్రిడ్స్) దిగుమతి చేసుకునే బదులు పుప్పొడిని, పరాగరేణువులను తక్కువ ధరకు దిగుమతి చేసుకొని లాభించవచ్చు.

ఒకప్పుడు చెట్టు, చేమకుకూడా ప్రాణం వుంటుందంటే నమ్మలేనివారు నిరూపణ అనంతరం తలవూపవలసి వచ్చింది. మానవుల మనుగడకే చెట్టు ప్రాణప్రదమైంది. అలాగే ఇప్పుడు పూరోకార్బన్‌వంటి కృత్రిమ రక్తం, గుండె, కాలేయం మార్పిడి, కృత్రిమ అవయవాలు మానవుని చేతిలో ఆట బొమ్మలుగా మారిపోతున్నాయి. క్రయోజినిక్స్‌ద్వారా ఉష్ణోగ్రతలను తారుమారు చేస్తున్నాడు మానవుడు. సైబర్‌నెటిక్స్‌ద్వారా నాడీ మండలాన్ని కంట్రోల్ చేస్తున్నాడు. ఆయుర్దాయం పొడిగిస్తున్నాడు. నీటిలోని ఆల్గే ఉపయోగించి యురేనియంతీయడానికి ప్రయోగిస్తున్నాడు. ఇసుకనుంచి తైలం తీస్తున్నాడు. చమురు లక్షణాలుగల హోహోబావంటి విత్తనంద్వారా కొత్త సౌందర్య పోషణలను సృష్టిస్తున్నాడు. చివరికి పెట్రోల్ వినియోగం ఇతర రసాయనాల వినియోగంవల్ల పరిశ్రమలనుంచి నదీ జలాలలోకి విడుదలయ్యే విషపదార్థాలనే తినివేయగల మొక్కలను కూడా మన శాస్త్రవేత్తలు ఇటీవల సృష్టించారు. ఇప్పుడు టెస్ట్ ట్యూబ్‌లోనే మొక్కలు ఉత్పత్తిచేసి పెంచే దశకు చేరుకున్నారు.

శతాబ్దాల వలస పాలనలో క్రమ్మగి బయటపడిన ఇండియావంటి వర్ధమానదేశాలు తమ సమాజాల సర్వతోముఖాభివృద్ధికి ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని అపారంగా వినియోగంలోకి తెచ్చుకోవలసిన అవసరం ఎంతైనావుంది. శాస్త్ర పరిశోధనాభివృద్ధికి నిధుల కొరత ఒక సాకు కారాదు. పరిశోధనలకు వెచ్చించే ధనంతో పోల్చితే పరిశోధనా ఫలితాలవల్ల మన సమాజం సాధించగల అభ్యుదయం కొన్ని వేల రెట్లు విలువగలది.

# ఫ్రాంకో శకాంతం

రిపబ్లికన్ స్పెయిన్ ఓటమి రెండవ ప్రపంచ యుద్ధానికి ప్రారంభ గీతం. భావి చరిత్రకారులు ఈ వాస్తవం గుర్తించకపోరు. పాశవిక నియంతృత్వానికి వ్యతిరేకంగా భీషణ సమరం జరిపింది స్పెయిన్. దురాక్రమణ శక్తులైన ఇటలీ, జర్మనీల పురోగతికి చరమాంకం పాడగల సత్తా స్పెయిన్‌కు వుంది. అటువంటి స్పెయిన్‌లో జర్మనీ, ఇటలీల సాయుధ జోక్యాన్ని గొప్ప ప్రజాస్వామ్య రాజ్యాలని చెప్పుకునే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు సహించి వుండకపోయి వున్నట్టయితే, ఫాసిస్టులు ఆస్ట్రియాను స్వాహాచేసి వుండేవాళ్ళు కారు. చెకొస్లొవాకియాపై దండెత్తి ఉండేవారు కారు. పోలెండ్‌పై దాడి వెడలేవారు కారు. ఆ మాటకొస్తే రెండవ ప్రపంచ యుద్ధమే సంభవించేది కాదు. రిపబ్లికన్ స్పెయిన్ విజయం పొంది వుంటే- మొత్తం శాంతి సంఘటన, శాంతి శక్తులు బలపడి, ప్రవర్ధమానం అయ్యేవి.

ఆ పని జరక్కుండా చేసిన వ్యక్తి ఎవరోకాదు, నిన్న చనిపోయిన నియంత, ఫాసిస్ట్ అయిన జెనరలిసిమో ఫ్రాన్సిస్కో- ఫ్రాంకో. పైన చెప్పిన మాటలు ఎవరివో కాదు, స్పానిష్ రిపబ్లిక్ ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా పనిచేసిన డెల్వాయో పలుకులు.

చరిత్రలో రెండు తెగలవారికే పేరు వుంటుంది. ఒకరు అతిచెడ్డవారు, రెండు అతి మంచివారు. మొదటి కోవకు చెందిన ముసోలినీ, హిట్లర్‌ల జాతివాడు ఫ్రాంకో. యూరప్‌లో ఎంత ప్రముఖ దేశమో, అంతటి బీదదేశం స్పెయిన్. రాచరికాన్ని అంతమొందించే దశలో జరిగిన జనరల్ ఎన్నికలలో గెలుపొందిన పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు మిలిటరీలో జరిగిన కుట్రల పర్యవసానమే స్పెయిన్‌పై ఫ్రాంకో నియంతృత్వం. 1936-39 మధ్యకాలం స్పెయిన్‌కే కాదు, మొత్తం ప్రపంచ వ్యాప్తంగానే గడ్డుకాలం. జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్టు ఆనాటి స్పానిష్ పరిణామాలు కేవలం స్పెయిన్‌కు మాత్రమే పరిమితమైనవి కావు. అది ప్రజాస్వామ్య శక్తులకు, ఫాసిజానికి మధ్య జరిగిన సంకుల సమరం. పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని నాశనం చేయడానికి కత్తి కట్టిన ఫ్రాంకోకు ఒకవైపు ముసోలినీ, హిట్లర్‌లు

కొమ్ముకాయగా, కొన్ని యూరోపియన్ రాజ్యాలు స్వార్థం కొలది "తాటస్థ్యం" వహించాయి. ఆచరణలో ఈ "తాటస్థ్యం" రిపబ్లికన్ స్పెయిన్ మెడకు ఉరిత్రాడయింది. కాగా దేశదేశాలనుంచి పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వానికి అండగా సంఘీభావ సూచకంగా సాయుధులైన వాలంటీర్ దళాలు సహాయంగా వచ్చాయి. అయినా ఫాసిస్ట్ ప్రభుత్వాలు పలువిధాల అందించిన సహాయంవల్ల సింహాసనంపైకి వచ్చిన ఫ్రాంకో, పది లక్షలమంది స్పానియర్డ్ల రక్తం త్రాగిన తరువాతనే అధినేత అయాడు. తన మనుగడ కోసం రిపబ్లికన్ ప్రభుత్వం, పాపులర్ ఫ్రంట్ సభ్యులైన కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ఇతర ప్రజాస్వామ్యవాదులు చేసిన త్యాగాలు ఫాసిస్ట్ వ్యతిరేక చరిత్రలోనే సువర్ణాక్షరాలు. ఓటమి మధ్యనే వీరోచిత పాత్రనిర్వహించిన ధీరులు, మాడ్రిడ్, జారమా, టూరెల్, ఎబ్రో వంటి పట్టణాలలో జరిగిన పోరాటాలు చరిత్ర ప్రసిద్ధాలు. 1939 మార్చిలో రాజధాని మాడ్రిడ్ పట్టణం ఫ్రాంకో ఫాసిస్ట్ నియంతృత్వానికి కవాటాలు తెరచింది.

ఆనాటి నుంచి సుమారు 40 ఏళ్ళుగా స్పెయిన్‌ను పరిపాలిస్తున్న ఫ్రాంకో స్పానిష్ సామాన్య ప్రజల స్థితిగతులను మెరుగు పరచిందిలేదు. పచ్చి మితవాద వర్గాలకు అతడు ప్రతినిధి. వాగాడంబరుడు; సొంతపార్టీ "ఫెలాంగిస్ట్"ను పెంచుకుని, ఇతర రాజకీయపార్టీలను నిషేధించాడు. అంతకంటె విచిత్ర సన్నివేశం.... తన ఉత్తరాధికారిగా ఒక రాకుమారిని (కార్లోస్) సాకుతూ ప్రజాస్వామ్య పరివర్తనను చచ్చేవరకూ అడ్డుకున్నాడు. అమెరికాకు సైనిక స్థావరాలు ఇచ్చి, ఆర్థిక సహాయం పొందాడు.

వీటన్నిటిని స్పానిష్ ప్రజలు సహించగల స్థితిలో లేరు. క్రమంగా నేడు అంతర్యుద్ధ కాలంనాటి పరిస్థితులు నెలకొన్నాయి. అన్ని వర్గాలలో ఫ్రాంకో నియంతృత్వంపట్ల తీవ్ర అసంతృప్తి ఇప్పుడు వెల్లడవుతున్నది. ఇది మరొక అగ్ని పర్వతంగా బ్రద్దలు కాకుండా చూసుకునే బాధ్యత అతని "వారసుడు" కార్లోస్‌ది.

స్పానియర్డ్లకు గర్వం జాస్తి, ప్రతిష్ఠ మెండు. రాజునీ, భూస్వామినీ, చివరకు ఫ్రాంకో వంటి నియంతను తాత్కాలికంగా ఆమోదించ వచ్చునేమోగాని, వాళ్ళ ముందు మోకరిల్లజాలరు. స్పానియర్డ్లోని ఈ వ్యక్తిత్వమే మరింత చైతన్యంతో రానున్న ఉపద్రవాలనుంచికూడా వారిని కాపాడగలుగుతుంది. పొరుగున పోర్చుగల్‌లో వర్థిల్లుతున్న రాజకీయ భూకంపన ప్రభావం, స్పెయిన్‌ను మరింత ప్రజాస్వామ్య సంప్రదాయాల వైపుగా నడిపించక తప్పదు. ఫ్రాంకో శకాంతం, తిరిగి రిపబ్లికన్ స్పెయిన్ శకారంభానికి శుభం పలకగలదని ఆశిద్దాం.

# పరిశోధనకు ప్రాధాన్యం

ప్రపంచ తెలుగు మహాసభల నిర్ణయానుసారం ఏర్పడిన అంతర్జాతీయ తెలుగు సంస్థకు ఇటీవలే రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేసినప్పటికీ, ఇంకా ఈ సంస్థ ఒక రూపు సంతరించుకోవలసి వుంది. విదేశాలకు వలస వెళ్ళి, తెలుగువారి సాంస్కృతికావసరాలను తీర్చడం, తెలుగు చరిత్ర, భాష సంస్కృతులను గురించి పరిశోధనలు జరిపి, పుస్తకాలను ప్రచురించడం ఆశయాలుగా, స్వయంపాలనాధికారాలతో నెలకొల్పిన ఈ సంస్థ లక్ష్యాలు నెరవేరడానికిగాని, దానికొక సార్థకత కలగడానికిగాని ముందుగానే గైకొనవలసిన కొన్ని జాగ్రత్తలు వున్నాయి.

సాహిత్య అకాడమీ, తెలుగు అకాడమీ లాంటి సంస్థలు ఇంతవరకు చేసిన, ఇప్పుడు చేస్తున్న పనులనే అంతర్జాతీయ సంస్థకూడా చేయకుండా, ఆ సంస్థలతో సమన్వయ పూర్వకంగా కృషి చేయవలసి వుంది. ఉదాహరణకు, తెలుగు అకాడమీ వేలకొలది సాంకేతిక పదజాలాన్ని వాడుకలోకి తీసుకురావడానికి ప్రయత్నించింది. అంతర్జాతీయ సంస్థ ఇదే పనిని పునః ప్రారంభించకుండా, కొత్త పదాలతో భాషను మరింత పుష్టివంతం చేయడానికి కృషి చేయవచ్చు. వైజ్ఞానిక, సాంకేతిక పదజాలాన్ని రూపొందించడానికి ఏర్పాటయిన కేంద్ర సంఘం 15 సంవత్సరాలుగా కృషిచేసి రూపొందించిన పదజాలం జటిలమై వాడుకలోకి రావడం కష్టమవుతున్నదనే ఒక విమర్శ వుంది. తెలుగులో ఇప్పుడు రూపొందిస్తున్న పదజాలానికి అటువంటి స్థితి రాకుండా జాగ్రత్త పడవలసి వుంది.

కేవలం మూడు లక్షలను కేటాయించి, అంతర్జాతీయ తెలుగు సంస్థ నుంచి ఘనకార్యాలను ఆశించడం నిష్ప్రయోజనం. యునెస్కోనుంచి గాని, కేంద్ర

ప్రభుత్వం నుంచిగాని తగిన సహాయం అందేటంతవరకు సంస్థ ఆర్థిక అవస రాలను రాష్ట్ర ప్రభుత్వం తీర్చడం అవసరం.

అంతర్జాతీయ సంస్థ కనుక విదేశాలలోని తెలుగువారి సాంస్కృతిక అవస రాలను తీర్చడమే ప్రధాన కర్తవ్యం అని భావించకుండా, పరిశోధనా వ్యాసం గానికి అధిక ప్రాముఖ్యం ఇవ్వాలి. పుస్తకాల సేకరణ వ్యయప్రయాస లతో కూడినపని. మాజీ మహారాజులు, సంస్థానాధీశుల నుంచి సేకరించ డమే కాక, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం, వేటపాలెం గ్రంథాలయం మొదలైన సంస్థల నుంచీ, తంజావూరు, మద్రాసు గ్రంధాలయాలనుంచీ, లండన్ లైబ్రరీవంటి విదేశీ సంస్థల నుంచీ పుస్తకాల ప్రతులను సంపాదించ డానికి ప్రయత్నించాలి. పరిశోధనకు ఉపయోగపడే పుస్తకాలు ఒకేచోట వుండడం పరిశోధకులకు సహాయకరం. మైక్రో ఫిలిం పరికరాలవంటి సాధన సంపత్తిని సమకూర్చడంలో ధనాభావం అడ్డు రాకూడదు.

పరిశోధనా వ్యాసంగానికి ఫెలోషిప్ పద్ధతిని ప్రవేశపెట్టడం మంచిదే. అయితే అందులో ఆశ్రిత పక్షపాతానికి తావు ఇవ్వక, సామర్థ్యానికి ప్రాధా న్యం ఇవ్వాలి. నిపుణుల సంఘాన్ని నియమించేటప్పుడు పరస్పర విరుద్ధ మైన భావాలను వ్యక్తంచేసే వ్యక్తులను తెచ్చి, తద్వారా తగాదాలకు, రాజ కీయాలకు ఆస్కారం ఇవ్వకూడదు. విదేశ పర్యటనాభిలాషులకుగాక, సేవ చేసే సమర్థులకు నిస్వార్థ కార్యకర్తలకు సంస్థలో స్థానం ఇవ్వాలి.

# ఏథెన్స్ - మాంట్రియల్

జ్యోతిని వెలిగించడమూ, ఆర్పడమూ సులభమే. కాని వెలిగిన ఆ దీప శిఖను జాజ్వల్యమానంగా నిలబెట్టడమే కష్టం. "ఈ భూప్రపంచంలోనే కనీవినీ ఎరుగని ప్రదర్శన" జరుగబోతుందని కొన్నేళ్ళుగా, కొన్నాళ్ళుగా మనం ఉత్సాహపడుతున్న ఆ ముహూర్తం కాస్తా రానేవచ్చింది. 21 వ ప్రపంచ క్రీడోత్సవాలు (ఒలింపిక్స్) మాంట్రియల్ (కెనడా) నగరంలో నేడు ప్రారంభం కాబోతున్నాయి. వీటికి ఏథెన్స్ పుట్టిల్లుకాగా, ఒలింపిక్ జ్యోతి ప్రతి నాలుగేళ్ళకొకసారి నగర నగరానికీ దేశదేశాలకూ, ఖండ ఖండాలకూ వ్యాపిస్తూ వివిధజాతులమధ్య, ప్రజలమధ్య స్నేహ సహకారాలను పెంచుతూ ఉంటుంది. ఇలా 1896 నుంచి 20 ఒలింపియాడ్స్ కడచిపోయి ఆ జ్యోతి నేడు మాంట్రియల్ వీధులను అలంకరిస్తోంది. యుద్ధకాలంలో మాత్రమే మూడు ఒలింపియాడ్స్ అంతరాయం వచ్చి జరగలేదు. కాని శాంతికాలంలో కూడా నేడు ఏదో ఒక కారణంపైన ఒలింపిక్స్‌కు అడ్డంకులు ఏర్పడడమే విచారకరం. తైవాన్ సమస్యపైన కొన్ని మాసాలుగా న్యూజిలాండ్ సమస్యపైన మరికొన్ని నెలలుగా అంతర్జాతీయ ఒలింపిక్ సంఘంలో సంఘర్షణలు చెలరేగి మాంట్రియల్ ఒలింపిక్స్ వాయిదా పడడమే కాదు, రద్దు కాగలవేమోనన్న అనుమానాలమధ్య చివరికి ఇవి జరుగుతున్నాయి. 1972 మ్యూనిచ్ దుర్ఘటనల అనంతరం ముందు జాగ్రత్తకోసం మాంట్రియల్‌లో జరిగిన ఏర్పాటు సుమారు 10 వేల మంది క్రీడాకారులకు 16 వేలమంది సాయుధ పోలీసులను పహరా ఉంచడం.

ఈ మహా క్రీడోత్సవాలలో పాల్గొనే ప్రపంచదేశాలమధ్య ఆర్థిక సాంస్కృతిక రంగాలలో రకరకాల అసమానతలు ఉండవచ్చుగాక. వలసలను దోచుకు తిన్న సామ్రాజ్యవాద రాజ్యాల ఆర్థికాభివృద్ధి స్థాయినిబట్టి క్రీడారంగంలో కూడా కొన్నాళ్ళు వాటిదే పైచేయి కావచ్చుగాక. కాని వర్ధమాన దేశాలు

కూడా మేలుకొంటున్నాయి. క్రీడల ఉద్దేశం యుద్ధాలు కాదు. యుద్ధ వ్యూహంలో భాగంగా కొన్నాళ్ళు క్రీడలకు ప్రోత్సాహం లభించి ఉండవచ్చు. కాని ఆటపాటల మేలి కలయిక ఆరోగ్యం శరీరదార్ఢ్యం మానసిక శక్తులను ఉత్సాహపరుస్తుంది. ఈ ప్రమాణాలను అందుకున్న జాతి రాజకీయంగానూ, సాంస్కృతికంగా కూడా ఆరోగ్యంగా ఉంటుంది. జీవితానికి క్రీడ ఒక నిత్యావసర వ్యాపకం. అందుకే ఆధునిక ఒలింపిక్స్‌కు పితామహుడైన కాబర్టీన్ "సోదరత్వపు స్వాదుతత్వపు మహోత్సవం, ప్రేమసౌహార్దాల పండుగ"గా వర్ణించాడు. ఒలింపిక్స్ ప్రధానంగా ఔత్సాహికులైన క్రీడాకారులకు ఉద్దేశించినది. కాని చాలకాలంగా కొందరి బుర్రలలో పురుగులు తొలిచినందున పేరు ప్రఖ్యాతులు పొంది, నిష్ణాతులైన కళాకారులనే ఔత్సాహికులుగా చూపించి స్వర్ణ, రజత పతకాలను కాజేయడం ఒక అనవాయితీ అయింది. ఇది అనేక కక్షలకూ, కార్పణ్యాలకూ దారితీసిన ఘటనలు ఉన్నాయి. స్టాక్‌హోం ఉత్సవాలలో జిమ్‌థోర్ప్‌ని కొన్ని రాజ్యాలు వాడుకొన్న ఉదంతమే ఇందుకు సాక్ష్యం. క్రీడోత్సవాలలో బహుమతులు గెలుచుకోవడం ఒక ప్రధానాంశమైనా, అదే లక్ష్యం కారాదు. ఒలింపిక్స్ ఉత్సవాలలో 1952 వరకు అమెరికాకు ఉన్న గుత్తాధిపత్యం క్రమేణా సోవియట్ యూనియన్‌కు దక్కింది. ఇప్పుడు క్రమంగా ఇతర వర్ధమాన దేశాలు పోటీలో బహుళసంఖ్యలో క్రీడాకారులను తరిఫీదు చేస్తున్నాయి, పంపిస్తున్నాయి.

పాతిక రకాల క్రీడలలో పాల్గొంటున్న దేశాలలో ఇండియా ఒకటి. హాకీ ఫుట్‌బాల్ క్రీడలలో ప్రథమస్థానంలో కాకపోయినా అగ్రస్థానంలోఉన్న మన దేశం ఈసారి ఈ రెండు క్రీడలకు సంబంధించిన జట్లనేగాక, ఎథ్లెటిక్స్, బాక్సింగ్, షూటింగ్, వెయిట్‌లిఫ్టింగ్ మొదలైన పదిరకాల టీములను కూడా మాంట్రియల్‌కు పంపించింది, వీరి విజయాన్ని మనం ఆకాంక్షిస్తాం.

కాగా, క్రీడలకు జాతి, కుల, మత, స్త్రీ పురుష భేదం లేదు. హిట్లర్ వర్ణవివక్షాధోరణికి క్రీడారంగంలో చెంపపెట్టు పెట్టినవాడు జర్మనీలోనే జన్మించిన నీగ్రో జెసీఓన్స్. అలాగే ఒలింపిక్స్‌కు ఎంత పితామహుడైనా కాబర్డీన్ క్రీడోత్సవాలలోమహిళల ప్రాతినిధ్యాన్ని ఎదిరించినవాడు. కాని ఒలింపియాడ్స్ చరిత్రలో అబీబికిలాక్స్, విల్మారుడోల్ఫ్, తమారాప్రెసీ, ప్రోజుమెన్చికోవా, వీరాకాస్లారస్కోవంటి మహిళా క్రీడాకారులు పరివర్తనా శకానికి ప్రతినిధులు!

# తెలుగుతల్లి - దేశభక్తి

తెలుగును అధికార భాషగా (పరిపాలనా భాషగా) అన్ని స్థాయిలలోను ప్రవేశపెట్టాలని నిర్ణయించిన దరిమిలా రాష్ట్రప్రభుత్వం పెక్కు-చర్యలు తీసుకుంటోంది. గత ఉగాదినుంచే అమలులోకి రావలసిన నిర్ణయం తాత్కాలికంగా వాయిదా పడినా, ఈరోజునుంచి-నవంబరు-1నుంచి అమలులోకి రాగలదని ఆశిస్తున్నారు. ఇందుకు తొలిచర్యగా కాబోలు-శ్రీ శంకరంబాడి సుందరాచారి రచించిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" గీతాన్ని విధిగా ఈ రోజునుంచి సభలలో, సమావేశాలలో "వందేమాతరం" తరువాత ఆలాపించవలసిందిగా ఉత్తరువు జారీ చేశారు. తెలుగు భాషాభివృద్ధిపట్ల, తెలుగువారి సమైక్యతపట్ల ప్రభుత్వం చూపుతున్న శ్రద్ధకు, తహతహకు ఇది నిదర్శనం.

జాతీయోద్యమం, భాషారాష్ట్రాల ఉద్యమం ఏకకాలంలో ఉధృతంగా సాగుతున్న రోజులలో దేశంలోని పలు ప్రాంతాలవారు ఎవరికివారు నాదీ ఒకజాతి అనీ, నాకూ ఒకభాష వుందనీ, నాదీ ఒక సంస్కృతి అనీ స్వపరిపాలన గమ్యంగా ఎలుగెత్తిచాటారు. ఆ మహోద్యమంలో స్వరాష్ట్రాభిమానం కొలదీ తామర తంపరగా పుట్టుకొచ్చినవే రాష్ట్రగానాలు. వాటి లక్ష్యం పరిమితం. అవి ఆనాటి అవసరాలు. వాటిలో ఒకటి ఈనాడు తెలుగు గీతంగా ఎంచుకున్న "తెలుగుతల్లి."

చాలాకాలం క్రితం ఈ గీతాన్ని పాఠశాలల్లో మన చిన్నారి పొన్నారి తెలుగు బాలలు ఉగ్గుపాలతో పఠించారు. ఆ పిమ్మట శంకరంబాడి పేరు ఎంతమంది పిల్లలకు తెలుసునోకాని "తెలుగుతల్లి" గేయం మాత్రం చివరి పీటమీదికి చేరుకుంది. మళ్ళీ ఇప్పుడు వెలుగులోకి వచ్చింది. ప్రకృతి వర్ణనకు సంబంధించినంతవరకు అది ఉత్తేజపూరితమైన రచన. ఈ సందర్భంగా ఇదేదో

సాటిగానూ, భిన్నాభిప్రాయంగానూ భావించకుండా ఉంటే, ఒక్కమాట చెప్ప వలసి ఉంది. రాష్ట్ర సమైక్యత, జాతి సమైక్యతలో అంతర్భాగం. తెలుగు వాళ్ళందర్నీ ఒక్క త్రాటిపై నడపించగల్గినవి, జాతీయస్థాయిలోవలెనే మనం అనుసరించే విధానాలు, అమలు జరిపే చర్యలు అయినప్పుడు ఇటు రాష్ట్ర సమైక్యతను, అటు దేశసమైక్యతతో అనుసంధించగల తెలుగుగీతాన్ని ఎన్నిక చేసి ఉంటే మరింత హుందాగా వుండేది. ఇందుకు అన్నివిధాలా సరిపో గలది, బహుళప్రయోజనాలు సాధించగలది, గురజాడ మహాకవి "దేశ భక్తి" గేయం. భాషలో, భావగాంభీర్యంలో, యువకులలో నవ్యభావాలను చొప్పించడంలో, కర్తవ్యబోధలో దానికదే సాటి. తెలుగువాడు విశాల హృద యుడు అనడానికి ఈ గేయమే సాక్ష్యం. రాష్ట్రస్థాయి, జాతీయస్థాయి ప్రయో జనాన్ని ఏక కాలంలో గొంతెత్తి చాటగల గేయం అది. ఒకకాలానికే, ఒక స్థలానికే పరిమితంకాని ప్రబోధగీతం అది. అందుకే కొందరు బంకిం చంద్రుని "వందేమాతరం"గాని, ఠాగూర్ "జన గణ మన"గాని, ఇక్బాల్ "హిందుస్తాన్ హమారా" సహితం "దేశభక్తి" గీతానికి సరిపోలవనికూడా భావించారు. ఇది ఏకత్వంలో భిన్నత్వం. అయితే కదిలేది, కదిలించేదీ ఆ గీతం. అయినా రాష్ట్రస్థాయి ప్రతిపత్తికి కూడా అది దూరం కావడం విచారకరం.

నదులు, పర్వతాలు, చెట్టు, చేమ, పాడిపంటలు - ఇవన్నీ ప్రజల భాగ్యోదయా నికి ఆటపట్టులే. శిల్పసంపద మన కళాజీవితానికి ప్రతిబింబమే కాదనలేము, కాని అవే ప్రజలు కారు. ప్రజలు చరిత్రనిర్మాతలు. అందువల్ల ప్రకృతిని మాత్రమే కీర్తించి, కొందరి వ్యక్తులను మాత్రమే గుర్తించి, కర్తవ్యాన్ని చాలించుకోగల గేయాలకన్నా, కళాత్మకమైన ప్రబోధ గేయాలు కర్తవ్యాన్ని మనలోని చెండితనాన్ని వదలించగలవి, సకలజాతులమధ్య సమైక్యతను సాధించగలవి, ఈనాడు ఎంతో అవసరం. చివరికి ప్రభుత్వ సమాచార ప్రకటనల్లో, ఇతర ప్రచురణలలో కూడా "దేశభక్తి"లోని చరణాలను ఉదహరిస్తున్న మంచి సాంప్రదాయం ఉంది. గురజాడ గురించి పండిత ప్రకాండులమధ్య జరిగే కుస్తీలు ఎలాఉన్నా, ఇలాంటి నిర్ణయాలలో ప్రభు త్వం మాత్రం సమయస్ఫూర్తిని ప్రదర్శించడం మంచిదని భావిస్తున్నాం.

అయితే ఒక ఉత్తమ గేయంగా "తెలుగుతల్లి" ఎప్పటికీ తెలుగువారి కీర్తి చంద్రికలను వెదజల్లుతోనే ఉంటుంది. దానితో ఆడుకుంటాం. పాడుకుంటాం.

# కణాదుడు - కటారియా

అపాయకరమై ప్రయోజనాలకు వినియోగ పడకుండా ఉంటే అణు, పదార్థ విజ్ఞాన శాస్త్రాన్ని మానవుడు ఉపయోగించుకోగల ఉపాయాలు కొల్లలు. మానవుడు ఈ పాంచ భౌతిక ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకుంటున్నాడు. కాదు, కొత్త ధాతువులను కనిపెట్టి కొత్త ప్రపంచాన్ని సృష్టిస్తున్నాడు. స్థూల జగత్తుకు, సూక్ష్మజగత్తుకు మధ్య అనుబంధాన్ని పెంచి, అసలు రహస్యాలు విప్పి చెబుతున్నాడు. విరుద్ధ శక్తుల మధ్య వినాశనానికి మారు ఐక్యత (యూనిటీ ఆఫ్ ఆపోజిట్స్) సాధించి, బ్రహ్మాండమైన శక్తిని పుట్టిస్తున్నాడు.

ఆనాటి కణాదుడి నుంచి ఈనాటి కటారియా వరకు అణు గర్భ రహస్యాలను ఛేదించే ప్రయత్నం ఇండియాలో కూడా సాగుతోంది. కణాదుడు చనిపోతూ కూడా "పీలవః పీలవః పీలవః"-అణువులు,అణువులు, అణువులు-అన్నాడట, పలవరించాడట. అణువుల మయమైన ఈ భౌతిక ప్రపంచానికి (చివరికి నీ చేతిలోవున్న ఈ పుస్తకం కాగితం, సిరా సహా) అణుశాస్త్రం ద్వారా అర్థం చెప్పిన మహనీయులు డాల్టన్, ఐన్‌స్టీన్, నీల్స్‌బోర్, మెండలెవ్, రాంట్‌జెన్, గమోవ్‌లు.

ఒకప్పుడు అణువు (ఆటం)ను పగల కొట్టడం సాధ్యం కాదనుకొన్నారు. ఆ సిద్ధాంతానికి కాలంచెల్లి, అణువు విభాజ్యమే నన్నారు. ఈ విచ్ఛిత్తి కార్యక్రమానికి కొందరు పరిమితులు పెడితే విశ్వం అనంతం అన్నట్టు అణు విచ్ఛేదం కూడా అనంతం అన్నారు మరికొందరు. 1964లో ఊహా జనితమైన శకలాలను ముర్రే గిల్‌మన్ అనే శాస్త్రవేత్త సిద్ధాంతీకరించాడు. అణువులో పొదిగివున్న వీటికి ఆయన అతిప్రాథమిక శకలాలు "క్వార్క్స్" అని పేరు పెట్టాడు. అంటే అణువు గర్భంలోకూడా కేంద్రాంతర శకలాలు ఉన్నాయని ఊహించాడు. అప్పటికి అది ఊహ మాత్రమే. కాని

విశాఖ సైన్స్ కాంగ్రెస్‌లో ఈ ఊహకు ఊయలవేసి, ఆచరణ సాధ్యమైన ఋజువులు ఉన్నాయని వెల్లడించిన తొలి భారతీయ యువ శాస్త్రవేత్త డాక్టర్ కటారియా.

ఇంతవరకూ వస్తున్న సిద్ధాంతం - అణువు విచ్ఛిన్నమైతే ఒకటి తేలికైన శకలంగాను, రెండుభారీశకలాలుగాను విడిపోతాయని. దీనికికాలదోషంపట్టింది. అణువు రెండు లఘు శకలాలుగాను, రెండు భారీ (బరువునుబట్టి) శకలాలుగా కూడా విచ్ఛిన్నం కాగలదని శ్రీ కటారియా నిరూపించాడు. ఈ ప్రతిపాదనతో అణుశాస్త్రంలోనే సరికొత్త పరిణామాలు రానున్నాయి. తన ప్రయోగానికి ఆయన "క్వాటర్నరీ ఫిషన్ థియరీ" అన్నాడు. ఐన్‌స్టీన్ రంగ ప్రవేశం చేసేవరకు మూడు కొలతలుగా ఉన్న విశ్వం— కాలాన్నికూడా జమకట్టుకొని నాలుగు కొలతలు అయినట్లు, పదార్థానికి మూడు రకాల స్థితులకు తోడు నాల్గవ స్థితిగా 'ప్లాజ్మా', ఐదవ స్థితిగా 'ఎగ్జిటన్స్' చేరినట్లు, ఇప్పుడు అణువు కేంద్రస్థానంలోనే కొత్త కల్లోలం ప్రారంభమైనదన్నమాట. కాని మనకు తెలియనంతవరకే కల్లోలం. తెలిసిన తరువాత కోలాహలమే. నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి అణు విచ్ఛేదక మర్మాలను కనిపెట్టి భారతీయ అణువిజ్ఞానం శాస్త్రాభివృద్ధికి దోహదం చేస్తున్న యువశాస్త్రవేత్తను అభినందిస్తున్నాం.

కొత్తకొత్త ఎలక్ట్రాన్ కవచాలను, పదార్థానికి వ్యతిరేక పదార్థాలను లేబరేటరీలలోనే సృష్టిస్తున్న ఈ రోజులలో అణువును మరింత విచ్ఛిన్నం చేయడం ద్వారా అపారమైన శక్తి పుట్టించడానికి మరిన్ని ప్రయోగాలు జరిగితీరుతాయి. అయితే ఈ శక్తి మానవశక్తిని ఇనుమడించేదిగా ఉండాలిగాని, మారణశక్తి కారాదని ఆశిస్తాం.

# యువకులు – మత్తు పదార్థాలు

"హాలికులైన నేమి" అని పోతన అంటే "ఆల్కహాలికులైననేమి" అని ఆధునిక కవి చమత్కరించాడు. నిజానికది చమత్కారం కాదు, ఒక సామాజిక సత్యం. అంతకు మించిన మత్తు పదార్థం "చరస్." ఈనాడు భారతీయ విద్యార్థిలోకంలో మత్తుపదార్థాల వాడకం గురించి చాలా కథలు వ్యాప్తిలో ఉన్నాయి. అవన్నీ నిజం కాకపోవచ్చుగాని, వ్యాధి ముదురు పాకాన పడుతున్న ఉదంతాలు కొన్నిచోట్ల కన్పిస్తున్నాయి. మద్యనిషేధాన్ని తిరిగి అమలు పరచాలని నిర్ణయించుకొన్న దశలో మద్యానికి మించిన మత్తుపదార్థాల గురించి మనం చర్చించుకోవలసి రావడం విచారకరం. కొంతమంది విద్యార్థులు ఎందుకు మత్తుపదార్థాలకు అలవాటు పడుతున్నారు? వారిని ఇందుకు ప్రోద్బలం చేస్తున్న శక్తులేవి? మొదలైన విషయాలను పరిశీలించి, ఈ జాడ్యాన్ని నిర్మూలించడానికి తీసుకోదగిన చర్యలను సూచించడానికి కేంద్రం ఒక కమిటీని నియమించింది. భావి పౌరులైన విద్యార్థి యువకులలో మత్తుపదార్థాలపట్ల ప్రబలుతున్న మక్కువ గురించి కేంద్రం పడుతున్న ఆందోళనతో ఏకీభవించని వారుండరు.

చెడు లక్షణాలు ఒక్కసారిగా అబ్బేవి కావు. పరిసరాలు, సామాజిక పరిస్థితులు, అన్యసంస్కృతుల ప్రభావం మన యువకులపైన, ప్రజలపైన ఉంటుంది. కొన్ని సినిమాలూ, చౌకబారు సాహిత్యమూ మన బిడ్డలను పాడు చేస్తున్నాయి. "హిప్పీ" సంస్కృతి వీరిని మరింత చెడగొడుతోంది. ఒక దేశచరిత్రనుగానీ, ప్రజల చరిత్రనుగానీ తెలుసుకోవడంకంటే ఒక చౌకబారు డిటెక్టివ్ వాళ్ళకి తృప్తినిస్తోంది. "చౌక" విషయానికేగాక, ధరకు కూడా వర్తిస్తోంది. అలాగే ఆల్కహాలిక్స్ కంటే, గంజాయి, చరస్, నల్లమందు, మార్ఫిన్, హెరాయిన్ అతిచౌకగా లభిస్తున్నాయి. ఏళ్ళతరబడి మద్యానికి అన్నివేళలా, అనేకచోట్ల అలవాటుపడిన పెద్దలనడవడిక అడుగుజాడలువేర్పర

చాయి. ఒక చెడు అలవాటు మరికొన్ని అలవాట్లకు తోవ చూపుతోంది. చౌకబారు మత్తుపదార్థాలతో "కిక్" పొందలేనివాళ్ళు క్రమంగా ఎల్.ఎస్.డి. వంటి ఇతర కృత్రిమ మత్తుపదార్థాలకు బానిసలౌతున్నారు. మత్తుపానీయాలతో మూడుకాళ్ళమీద ఉండే "గురుడు" ఈ మత్తు పదార్థాలతో ఆరుకాళ్ళపైన రాందవిస్తున్నాడు. ఇవి నరాల బలహీనతకూ, మానసిక రోగాలకు దారి తీసినా తమతోవ తమదే.

అన్నింటికంటే విశేషం-ఢిల్లీలోనూ, హైదరాబాద్‌లోనూ జరిపిన సర్వేలను బట్టి చూస్తే ఈ మత్తుపదార్థాలకు బానిసలైన విద్యార్థులలో హెచ్చుమంది సంపన్న కుటుంబాలవారు. డబ్బు అందుబాటులో ఉంది- జబ్బులు కొని తెచ్చుకొంటున్నారు. అదేమిటంటే వీరు "రొడ్డ కొట్టుడు పట్టణ జీవితంతో విసిగిపోతున్నాం. ఇందులోనే మాకు ఆనందం ఉంది. హాయి ఉంది, సుఖం ఉంది" అంటున్నారట. మరి పోలీసుశాఖ ఎప్పటికప్పుడు దాడులలో ఇన్ని లక్షల విలువగల సరకు పట్టుకున్నాం అంటుంది. కాని వ్యాధి నిదానించ వచ్చుగాని, నివారణ కాలేదు. కేంద్రం నియమించిన కమిటీ అయినా సరైన కారణాలను, నివారణ మార్గాలను సూచించగలదని ఆశించుదాం. యువజనుల శారీరక, మానసిక ఆరోగ్యాన్ని సంరక్షించుకోలేని దేశానికి ఆశాజనకమైన భవిష్యత్తును ఊహించగలమా ?

# "మల్టీ నేషనల్స్" చేతి చలువ!

మనం చేతి వృత్తులను హస్తకళలు అంటాం. అమెరికన్ల దృష్టిలో 'హస్త కళ' అంటే వేరు. వారి హస్తవాసి వేరు. అది కూడా ఒక కళగా వారు అభివృద్ధి చేయబట్టే—అది స్వదేశంలోనే గాక దేశ దేశాలలో పలువురి రాజకీయవేత్తల, ప్రభుత్వాల పతనాలకు, మంత్రివర్గాల కీచులాటలకు. చివ రికి హత్యలకు దారితీసింది. ఈ హస్తకళను వారు వృద్ధిచేసి, తమ రాజ కీయ పంథాలో నడిచే యూరోపియన్ దేశాలలోని సంస్థలను కూడా ఆ కళలో భాగస్వాములను చేశారు. వీటినే బహుళ దేశాల గుత్తసంస్థలు (మల్టీ నేష నల్ కార్పోరేషన్స్) అన్నారు. అమెరికాలో విమానాలు తయారుచేసే పెద్ద కంపెనీ 'లాక్‌హీడ్' దేశంలోను విదేశాలలోను రాజకీయ వేత్తలకు ఎలా డబ్బు ఎరచూపి, కొనివేసి, కల్లోలాలు సృష్టించుతున్నదో జపాన్‌లో పరి ణామం ఒక ఉదాహరణ మాత్రమే. వలస విధానం పాత దుస్తులు విప్పి, కొత్త వస్త్రాలలో ఎలా తొంగిచూడగలదో ఈ కార్పోరేషన్ల కార్యకలాపాలు నిరూపించుతున్నాయి. ఒక్క జపాన్‌లోనే గాక, ఇటలీ, హాలెండ్, తదితర చోట్ల కూడా ఇవి రాజకీయ కల్లోలాలకు కారణమవుతున్నాయి. నిజానికి గుట్టు బయటపడిన తరువాత అమెరికన్ సెక్యూరిటీస్-"ఎక్స్ఛేంజి కమిషన్ విచారణ జరుపుతున్న 30 కార్పోరేషన్లలో లాక్‌హీడ్ ఒకటి.

ఆ మాటకొస్తే ప్రపంచ బ్యాంకి తెరచాటున పనిచేస్తున్న అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు, ఐ.డి.ఏ., ఆర్థికాభివృద్ధి సంస్థలు అన్నీ అమెరికన్ బ్యాంకుల పెత్తనం క్రింద పనిచేస్తున్నవే. ఈ కార్పోరేషన్లు, ఈ సంస్థలు వర్ధమాన దేశాలలోను, కొన్ని సంపన్న దేశాలలోను చేస్తున్నపని 'సహాయం' పేరుతో ఆయా దేశాలలోని స్థానిక కరెన్సీలను క్రమంగా తమ చేతులలోకి రాబట్టు కోవడం, కరెన్సీలను తారుమారు చేయడం, తమ సరకుల విక్రయం ద్వారా

సమకూడిన స్థానిక కరెన్సీతో కొందరు రాజకీయవేత్తలను, లేదా వారి బంధువులను లోబరచుకోవడం, బొలీవియా, అర్జెంటీనా, అల్జీరియా, చిలీ లలో ప్రభుత్వ సంక్షోభాలు ఈ కార్పొరేషన్ల సృష్టి. అమెరికన్ ప్రభుత్వం ఈ రోజున ఎం.ఎ. విచారణ జరపినా, తన విధానాలను మాత్రమే ఈ కార్పొరేషన్లు పరోక్షంగా నిర్వహిస్తున్నాయని చెప్పక తప్పదు. గాబన్‌లో "మీకాంబో", మారిటానియాలలో "మిఫెర్మా", గినీలో "ఫ్రియా" అమెరికన్, ఫ్రెంచి, పశ్చిమ జర్మనీ, ఇటలీ, డచ్చి, బెల్జియన్ గుత్త సంస్థల సమష్టి రాజకీయ వాణిజ్య సంస్థలు! గల్ఫ్ ఆయిల్, "ఎక్సాన్" సంస్థలూ అంతే.

ఇండియాలో కూడా ఈ బహుళదేశాల గుత్తసంస్థలు వున్నాయి. ప్రధాని ఇందిర పదేపదే హెచ్చరిస్తున్న ప్రమాదం—వీటినుంచి వుంది. మన దేశంలో విదేశీమారక ద్రవ్యం లావాదేవీలను క్రమబద్ధం చేసే చట్టం వుంది గాని, ఈ కార్పొరేషన్లకు ఎవరెవరు ఇక్కడ ఏజెంట్లుగా, రిటైర్డ్ అధికారుల హోదాలో పనిచేస్తున్నారో తెలియదు. అందువల్ల అట్టి కంపెనీల స్థానిక ఏజెంట్లుగా వున్న వ్యక్తుల, ప్రయివేట్ కంపెనీల రిజిస్ట్రేషన్ వెంటనే జరిగే ట్టు వ తిడి చేయాలి.

# మరొక ఉజ్వల నక్షత్రం?

ప్రతిదానికి మంచీ-చెడూ, రెండు ముఖాలు ఉంటాయి. వినియోగదారుని అవకాశాన్నిబట్టి, విజ్ఞతా ప్రవృత్తిని బట్టి వాటి ప్రయోజనం నిర్ణయమవుతుంది. ఆర్థికరంగం మాదిరే శాస్త్ర విజ్ఞానంకూడా కొలదిమంది సొత్తు అయినంతకాలం, ప్రజల నిరక్షరాస్యత, అమాయకత్వం, మూఢవిశ్వాసాలు మనిషిలో అవిశ్వాసాన్ని పెంచుతాయి. భయాందోళనలు రెచ్చగొడతాయి. విజ్ఞతా సంస్కృతులనుంచి దూరంచేస్తాయి. అటువంటి పని ఇటీవల జరిగింది. తమ ఆత్మను విశ్వసించక 'పరమాత్మ'కు తాకట్టుబడిపోయిన కొందరు ఖగోళశాస్త్ర వేత్తలు (వీరు మళ్ళీ నోబెల్ బహుమతులు పుచ్చుకున్నవారే) ప్రపంచాన్ని భయపెట్టడానికి కొత్తసూత్రం విప్పారు.

ఇతర గ్రహాలలో జీవరాశి ఉన్నదీ లేనిదీ ఇదమిద్ధంగా తెలుసుకొనడానికి దశాబ్దాలుగా ప్రయత్నాలు జరుగుతున్నాయికాని ఫలితాలు ఒక కొలిక్కిరాలేదు. పైగా వచ్చినంతవరకూ జీవరాశి గురించిన భోగట్టా లేదు. కానీ వీరుమాత్రం విశ్వాంతరాళంలో ఏవో అదృశ్య వస్తువుల సందడి వినవస్తున్నదని, రేడియో సంకేతాలు వినిపిస్తున్నాయని, అందువల్ల మానవాతీత వ్యక్తులు భూమి మీదకి వచ్చి సర్వనాశనం చేయబోతున్నారని వదంతులు వ్యాప్తిచేశారు. సూర్యుడు పగిలిపోయి భూమిని మ్రింగివేస్తాడని ఈలాంటి శాస్త్రవేత్తలే చెప్పారు. నిజానికి ఇది-నక్షత్రమండలంలో పరిణామ వికాసమేగాని, వినాశం కాదు.

మొన్న బ్రిటిష్ ఖగోళశాస్త్రవేత్తలు, విశ్వాంతరాళంలో కనుగొన్న బృహత్తరమైన ఒక ఉజ్వల నక్షత్రం తాలూకు రేడియోతరంగాలు పరిశీలించారు. ఆ నక్షత్రంలో శక్తి ఉత్పాదక క్రియలను, తాపతీవ్రతను పరిశీలించారు. ఇంతవరకూ ఇంత ఉజ్వలమైన ఎక్స్-రే కిరణ ప్రసారం చూడడం ఇదే ప్రథమం అన్నారు. పెద్ద రేడియో టెలిస్కోపుల ఆధారంతో జరిపిన ఈ పరిశీలనలో ఈ నక్షత్రం సూర్యుని ధార్మిక శక్తికి వేయిరెట్లు మించినశక్తిని విడుదల

చేస్తున్నట్లు ఇంకా ఆశక్తి పెరుగుతున్నట్లు చెప్పారు. అయితే దీనివల్ల భూమండల వాసుల జీవితాల పైన ఎట్టిప్రభావంగాని, ప్రమాదంగాని ఉండబోదని, త్వరగా అది అంతర్ధానమవుతున్నదని స్పష్టం చేశారు. ఇది విజ్ఞానంపై ఆధార పడిన పరిశీలన, విశ్వాసంపై నిలబడిన పరిశోధన.

మన నక్షత్ర మండలంలో లేదా 'పాలపుంత'లో ఇటువంటి ఘటనలు జరగడం కొత్తకాదు. పరిణామశీలమైన విశ్వంలో జరిగే పెక్కు సహజమైన 'వింతల'లో ఇదొకటి. గురుత్వాకర్షణవల్ల సూర్యునిచుట్టూ ఇతరగ్రహాల మాదిరే, నక్షత్రాలు కూడా పరిభ్రమిస్తుంటాయి. వాటి ద్రవ్యరాశిలో (బరువు) జరిగే న్యూక్లియర్ ప్రక్రియలవల్ల వియోగసంయోగాలు ఏర్పడతాయి. రాలిపోయే నక్షత్రాలు వీటిలో భాగమేగాని మరొకటికాదు. గత శతాబ్దిలోనే ఇలా అధిక కాంతితో, అమితశక్తితో 'ఆరిపోయే దీపా'లలా వెలుగు విరజిమ్మి, జీవితం చాలించిన తారలు కొన్ని ఉన్నాయి. 1960 తర్వాత 'క్వాజార్స్', 'పల్సర్స్' వంటి అతి ప్రకాశవంతమైన వినీల వస్తువులు అవతరిస్తున్నాయి. కాలగమనంలో అంతరిస్తున్నాయి. బృహత్ నక్షత్రం ఒకటి పగిలిపోయి "క్రేబ్‌నెబ్యులా' ఏర్పడి ఎంతోకాలం కాలేదు. వీటన్నిటినుంచి రేడియో తరంగాలు వచ్చాయి. ఎక్స్-కిరణాలు వచ్చాయి. ఇక కవులైతే "లక్ష నక్షత్రాల మాటలు, కోటి జలపాతాల పాటలు" ఎన్నడో విన్నారు.

కానీ ఈ తరంగాలనే, ఏవో సంకేతాలుగా భావించి కలవరపడి భూమిమీద మానవుని వ్యాపకాలసందడి తగ్గించవలసిన పనిలేదు. వీటి ఫ్రీక్వెన్సీలలో విపరీతమైన తేడాలున్నాయి. ఇటువంటి సిగ్నల్స్‌ను అయిదింటిని లోగడే కనుగొన్నారు. కాగా అమితవేడితో బ్రద్దలయ్యే ఉజ్జ్వల నక్షత్రాలు వాతావరణపొరలు చీల్చుకొని భూమిమీదపడి వినాశానికి దారితీయడానికీ, విద్యుత్ ప్రవాహశక్తి వేయిరెట్లు కాదు, కొన్నికోట్ల రెట్లు అధికం కావాలి. అది సంభవంకాదని శాస్త్రవేత్తల పరిశీలనానుభవం.

ఇంత అనుభవం లేకపోయినా మానవశక్తిని విశ్వసించిన మహాకవి గురజాడ తోకచుక్క అంటేనే భీతిల్లే రోజులలో "తలతు నేనిది సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగాన్" అని స్తుతించి, మూఢమతులపైన సుత్తిపెట్టి పెటారు.

# "చెట్టు" పేరు చెప్పి కొరియాలో....

"చెట్టూ నీ పేరు చెప్పి కాయలమ్ముకొంటోళ్లు
పుట్టా నీ పేరు చెప్పి తేనెనమ్ము కొంటోళ్లు...."

అని ఒక తెలంగాణా కవి దోపిడీ పద్ధతి గురించి చెప్పిన మాటలు నేటి కొరియన్ ఘటనలకు బాగా సప్పుతాయి. యుద్ధాలు చేయాలంటే ఏదో ఒక నెపం చాలు. స్థానికంగా జరిగే ఇలాంటి ఘటనల విస్తృత రూపమే సామ్రాజ్యవాదుల దురాక్రమణ చర్యల వల్ల సంభవించే ప్రపంచ యుద్ధాలూ, స్థానిక యుద్ధాలూ. కోళ్ళ మార్కెట్ కోసం యూరప్‌లో యుద్ధాలు జరిగిన రోజులున్నాయి. వాటిని "చికెన్ వార్స్" అన్నారు. సముద్ర జలాలలో చేపల వేట కోసం బ్రిటన్-ఐస్‌లాండ్‌ల మధ్య నేటికీ నౌకా యుద్ధాలు జరుగుతున్నాయి. వీటిని "కాడ్‌వార్స్" అన్నారు. కడచిన ఆరు రోజులుగా ఈశాన్య ఆసియాలో కొరియాలో వెలసిన సరికొత్త కుంపటి - "చెట్టు యుద్ధం" దీన్ని "ట్రీవార్" అనవచ్చు. ఉత్తర-దక్షిణ కొరియాల మధ్య యుద్ధ విరమణ శ్రేణి వద్ద ఉత్తర కొరియా భాగంలో (ఈ సత్యాన్ని పెంటగాన్ అధికారులు ఒప్పేసుకొన్నారు.) వ్యూహరత్మా కీలక పాత్ర వహిస్తున్న "ఒక చెట్టును" ఐక్యరాజ్యసమితి సైనిక దళం పేరిట చెలామణీ అవుతున్న అమెరికన్ సైనికాధికారులు కొట్టివేయించిన ఫలితంగా ఉద్రిక్తత ఏర్పడింది.

రెండు కొరియాలు, రెండు జర్మనీలు, రెండు చైనాలూ ఉంటేతప్ప సామ్రాజ్యవాదులకు కాలం గడవదు, ప్రయోజనం సమకూడదు. ఇండో-చైనాలో కాళ్ళూ చేతులూ కాల్చుకున్న తరవాత కూడా అమెరికన్‌సామ్రాజ్యవాదుల బుద్ధి మారలేదు, రెండు కొరియాల సృష్టి సామ్రాజ్యవాదుల రాజ్యకాంక్ష ఫలితం. ఏకీకృతంగా కొరియా ఏకీకరణ కోసం ఉభయ ప్రాంతాలూ తహ తహ వెలిబుచ్చినా, "దేవుడు వరమిచ్చినా పూజారి" అడ్డుకొన్నట్టు అమెరికా, దాని అనుబంధ రాజ్యాలూ సమితిలోనూ పడనివ్వడంలేదు, వెలుపలా పడనివ్వడం లేదు. పైగా గత బుధవారంనాడు యుద్ధ విరమణ శ్రేణిని దాటి, ఉత్తరకొరియా వైపు సైనిక సమీకరణ యత్నాలను పరిశీ

లించడానికి అడ్డుగా ఉందన్న మిషపై కీలకమైన ఒక చెట్టును కొట్టివేయ డానికి ప్రయత్నించినపుడు కొరియన్ గార్డ్సు అడ్డు కొన్నారు. ముదిరి పోయిన ఘర్షణలో ఇద్దరు అమెరికన్ ఆఫీసర్లు చనిపోయారు. కవ్వింపు దారు మొగసాలకెక్కి పసిఫిక్‌లో ఉన్న సప్తమ యుద్ధ నౌకా దళాన్ని "మిడ్ వే" మున్నగు యుద్ధ విమాన వాహక నౌకలను కొరియా జలాలలోకి తరలించింది. ఇది ఆ ప్రాంతంలో మరింత ఉద్రిక్తతకు దారి తీస్తోంది.

ప్రపంచ యుద్ధానికి కాకపోయినా స్థానిక యుద్ధాలను రెచ్చగొట్టడానికి పెట్టిన టైం బాంబులలో ఒకటి దేశాల విభజన సూత్రం. యూరప్‌లో తాత్కాలి కంగా ఉభయ జర్మనీల ఏకీకరణకు ఆటంకం ఏర్పడినా, అది పూర్తి శాంతికి నిదర్శనం కాదు. అలాగే ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో అంతర్జాతీయ సైనిక దళం కొరియాలో సరిహద్దులనూ, ఆకాశతలాన్నీ కాపుకాస్తున్నా అదీ పరిపూర్ణ శాంతి కాదు. 1945 నుంచీ 1954 వరకూ దశాబ్దం పాటు జరిగిన భీషణ కొరియన్ సంగ్రామం రెండవ ప్రపంచ యుద్ధానికి కొనసా గింపు మాత్రమే. జాపనీస్ సామ్రాజ్యవాదం కింద కొన్నాళ్ళు, అమెరికన్ వలస పెత్తనం కింద మరి కొన్నాళ్లు నలిగి అపారమైన ప్రాణ నష్టాన్నీ, ఆస్తి నష్టాన్నీ భరించిన కొరియాకు నేడు శాంతి అవసరం. కొరియా ఏకీకరణ సూత్రం ఈనాటిది కాదు. అమెరికా ప్రభావంలోకి కొరియాలో ఒక భాగం రాకముందు కొరియా ఏకీకరణ అవసరాన్ని నొక్కిచెప్పిన కైరో, పోట్స్‌డాం ఒప్పందాలపై సంతకం చేసిన పార్టీ అమెరికా. రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ ఓటమితో రష్యా అండదండలతో కొరియాలో ఒక భాగాన్ని ప్రజలు విముక్తి చేసుకొన్నారు. అమెరికా-రష్యాల ప్రభావం కింద ఉన్న దక్షిణ-ఉత్తర కొరియాలను విభజిస్తున్న రేఖ 38 వ అక్షాంశ రేఖ. ఈ రేఖ చెదిరితే గొల్లుమంటుంది అమెరికా. దక్షిణ కొరియా అమెరికాతో రక్షణ సంధి కుదుర్చుకున్న మరుక్షణం నుంచీ కన్ను ఉత్తర కొరియాపైనే గాక, చైనా పైన కూడా పడింది. అందుకే అమెరికా 1950లో అటు కొరియన్ యుద్ధాన్నీ, ఇటు తైవాన్ యుద్ధాన్నీ ఏక కాలంలో తలపెట్టింది. లోగడ రష్యా చేతులలో జాపనీస్ సైన్యం మట్టి కరచినట్టే కొరియాకు రక్షణగా వచ్చిన చైనీస్ చేతులలో 50 వేల మంది అమెరికన్ సైనికులూ, సింగ్మనరీసేనలూ నిహతులయ్యారు. ఈ గుణపాఠాన్ని అమెరికా ఇప్పటికీ నేర్చుకోకపోతే, వియత్నాం అనుభవాన్ని వంట పట్టించు కొనకపోతే-ఆసియా ప్రజల సమైక్యతనూ, ప్రతిఘటననూ ఎప్పటి కంటే మిన్నగా అది రుచి చూడవలసి వస్తుంది. కొరియా ఏకీకరణను వాంఛి స్తున్న ఇండియా ఈ కవ్వింపులను ఖండించకుండా ఉండజాలదు.

# నేత్రదానం

మన విచిత్ర సంప్రదాయాలలో ఒకప్పుడు సంఘానికి సమ్మతమైనవి – భక్తకన్నప్ప తన కళ్ళు తోడుకొని పరమ శివునికి అర్పించడం, చిరుతొండ నంబి సొంత బిడ్డ కళ్ళు పీకి బిడ్డను చంపి వీరమహేశ్వరాధకుడు కావడం. నిజానికివి మతావేశంలో "మాధవుణ్ణి" తృప్తి పరచడం కోసం చేసిన చర్యలు. కన్నప్పగాని, చిరుతొండనంబిగానీ చేసిన ఈ "అమూల్యమైన" దానం మాధవునికే గాని తోటి మానవునికి మాత్రం కాదు. కాని ఈనాడు అనేక రోగాలవల్లా, రొష్టుల వల్లా, పౌష్టికాహార లోపం వల్లా కళ్ళు పోయి అంధులైన తోటి మానవులకు నేత్రదానం ఎంతో అవసరం. ఈ అవసరాన్ని తీర్చడానికి ఏ మతావేశమూ అక్కరలేదు. కేవలం మానవతావేశం, ఆలోచన ఉంటేచాలు. అది కూడా వ్యక్తి మరణానంతరం తన కళ్ళను దానం చేయడానికి స్వచ్ఛందంగా సమ్మతిస్తూ నేత్ర సేకరణ కేంద్రాలవద్ద ముందుగా నమోదు చేసుకొంటే చాలు. ఈ అవసరాన్ని హైదరాబాద్‌లోని సరోజినిదేవి నేత్ర చికిత్సా కేంద్రం "నేత్రనిధి" (అయ్ బ్యాంక్) ఇన్‌ఛార్జి, సుప్రసిద్ధ వైద్యుడు డాక్టర్ పి. రంగారెడ్డి ఒక సందర్భంలో పదే పదే వివరించారు.

డాక్టర్ రంగారెడ్డి "నేత్రదానం" కోసం చేస్తున్న విజ్ఞప్తి వెనక ఎంతో హృదయావేదన ఉందని మనం అర్థం చేసుకోవాలి. ప్రపంచంలోని కుష్ఠ రోగులసంఖ్యలో మూడవవంతు మనదేశంలో ఉన్నట్టే ప్రపంచంలోని కోటి 50 లక్షలమంది అంధులలో 50 లక్షలమంది ఇండియాలోనే ఉన్నారు. వీరిలో మన రాష్ట్రం వాటా 15 లక్షలు మంది అని అంచనా. అంధత్వ వ్యాప్తికి మన వైద్యులు పేర్కొంటున్న ప్రధాన కారణాలలో కొన్ని – అంటు వ్యాధులు, "ఎ" విటమిన్ లోపించడం, పారిశ్రామిక ప్రమాదాలు. వీటివల్ల కొయ్యకండలు పెరగడం, కంటిలో నల్లపొర (కార్నియా) తెల్లబడి పువ్వు

వేయడం. వీటన్నింటికి మించి సకాలంలో రోగులు చికిత్స పొందక పోవడానికీ, నేత్రదానాల సంఖ్య పెరగకపోవడానికి మరొక ప్రతిబంధకం - అంధవిశ్వాసాలు. కళ్ళు ఉన్న కబోదులుగా మానవులు వ్యవహరించినందుననే మూఢ విశ్వాసాల వల్లనే అమ్మవార్లనూ, జాతర్లనూ విశ్వసించి వైద్యానికి దూరంగా ఉన్నందున మశూచి, కలరా వంటి వ్యాధులను రూపుమాపుకోవడానికి మనకు ఏళ్ళూ పూళ్ళూ పట్టాయి. అలాగే మంత్ర తంత్రాల వల్ల అంధత్వం పోతుందనుకొనే వాళ్ళు మనలో చాల మంది ఉన్నారు. వ్యక్తి మరణానంతరం అతని కళ్ళను ("చారెడేసి కళ్ళైనా శవం వల్ల ఏం లాభం"?) బ్రతికి ఉండి వెలుగు కోసం అంగలారుస్తున్న అంధులైన అనేక మంది యువతీ యువకులకు దానం చేయడానికి మనలో అనేక మంది సంశయిస్తారు. ఏవో ఆచారాలను గుర్తు చేస్తారు. కాని మరణానంతర నేత్ర దానానికి ఎవరూ సంకోచించ వలసిన అవసరం లేదు.

దేశంలో 1964లో మొట్ట మొదటిసారిగా "నేత్రనిధి"ని ఏర్పాటు చేసిన ఘనత ఈ ఆస్పత్రిదే. 1968 నుంచి రాష్ట్రంలో నేత్రనిధి సేకరణ సంఘం ఏర్పడి పనిచేస్తోంది. చనిపోయిన వారి కళ్ళను వారి బంధుకోటి అనుమతిపైన సేకరించేందుకు చట్టం కూడా ఉంది. పాశ్చాత్య దేశాలలో "అయ్ బ్యాంకుల" ఏర్పాటుకు, విధిగా నేత్ర సేకరణకూ చట్టాలు ఉన్నాయి. ఇది మానవతా దృష్టితో ఆలోచనతో స్వచ్ఛందంగా జరగవలసిన పని. ఈ నేత్రదానాలలో మన రాష్ట్రంలో ముందుకువస్తున్న వారిలో గుజరాతీయుల సంఖ్య ఎక్కువ కావడం విశేషం. ప్రపంచ వ్యాపితంగా చూస్తే నేత్ర దానంలో శ్రీలంకది అగ్రస్థానం. ఇంతవరకూ శ్రీలంక 55 దేశాలకు రెండు వేల కళ్ళను దానం చేసింది. అంధుల జీవితాలలో పునర్నవాన్ని ఆశించే వారందరూ మరణానంతర నేత్రదానానికి ముందుకు వచ్చి చరితార్థులు కావాలి. రక్తదానం కోసం ఏర్పడినట్టే నేత్ర సేకరణ కేంద్రాలు కూడా ప్రతి చోటా ఏర్పడడం అవసరం.

# చదువుల మాలోకం

చదవేస్తే ఉన్నమతి పోకూడదు. లేనిమతి రావాలి. కాని మన బిడ్డలకు ఉన్నమతి పోతోందని కొందరు బాధపడుతున్నారు. అసలు మన విద్యకూ విద్యావ్యవస్థకు చుట్టు చూపు ఉందా? నిర్వాహకుల శ్రద్ధను ప్రశ్నించవలసిన సమయం వచ్చింది. ఇటీవల మనరాష్ట్రంలో ఏడవ, పదవ, ఇంటర్మీడియట్ తరగతుల పరీక్షాఫలితాలు వివిధ స్థాయిలలో విద్యావ్యవస్థ నిర్వహణ ఎంత లోపభూయిష్టంగా ఉందో నిరూపిస్తున్నాయి. అధికారులలో, విద్యార్థులలో, టీచర్లలో, తల్లిదండ్రులలో ఈ ఫలితాలు పెంచుతున్నది ఆశను కాదు నైరాశ్యాన్ని. ఈ పరీక్షాఫలితాల దరిమిలా వివిధచోట్ల జరిపిన సర్వే ఈ నిజాన్ని పలువిధాల వెల్లడిస్తోంది. ఏతావాతా ఈ ఫలితాలు-ఇందుకు కారణం "మీరంటే మీరు" అని అధికారులు, టీచర్లు, విద్యార్థులు, తల్లిదండ్రులు పరస్పరం ఆరోపించుకొనేటట్టు చేస్తున్నాయి. చివరికి కొందరు "కంప్యూటర్ల"ను కూడా అభిశంసిస్తున్నారు. అయితే ఎవరి ఆరోపణలు ఎలా ఉన్నా ఇకపైన జరగవలసిన సంస్కరణ గురించి క్షుణ్ణంగా పరిశీలించుకొని, విద్యా ప్రమాణాలను కాపాడుకునేందుకు కట్టుదిట్టాలు చేసుకోవలసి ఉంటుంది. మన సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో పేరుకొన్న అసమానతలుకూడా విద్యావ్యవస్థ అధ్వాన్న స్థితికి దోహదం చేస్తున్నాయని ఒప్పుకొనక తప్పదు.

పరీక్షాఫలితాల దారుణస్థితికి మంత్రిచెప్పిన కారణాలలో ప్రధానమైనవి నాలుగు: (1) కాపీలు కొట్టనివ్వకపోవటం; (2) మోడరేషన్ పద్ధతిని రద్దుచేయడం; (3) గైడ్లమీద ఆధారపడడం; (4) బోధనా ప్రమాణాలు సన్నగిల్లిపోవడం. వీటికి తోడుగా మా సర్వేలో తేలిన అంశాలు మరి నాల్గింటినికూడా చేర్చితే సమస్య సమగ్రపరిశీలనకు వీలు చిక్కుతుంది: (1) 7, 10 తరగతులు మినహా సెకండరీ విద్యాదశలో పబ్లిక్ పరీక్షలు లేకపోవడం; (2) ఉపాధ్యాయులు బోధించేదేమిటో విద్యార్థులకు అర్థం కాకపోవడం; "చదువు చారెడు బలపాలు

దోసెడు'' అన్నట్టు, గంపెడు సిలబస్‌ను రుద్దడం; (3) చీటికి మాటికి విద్యావిధానాలు మారడం; (4) టీచర్-స్టూడెంట్స్ నిష్పత్తి టీచర్‌కు తలకుమించిన బరువై శ్రద్ధ తగ్గడం; విద్యార్థులు తరగతులకు సరిగా రాకపోవడం.

మరొక విచిత్ర పరిస్థితికూడా తోడైంది. ఏడవతరగతి ఫలితాలవల్ల స్కూళ్ళలో ఎనిమిదవ తరగతి చదివే వాళ్ళ సంఖ్య తరిగిపోయే ప్రమాదం వుంది. పదవ తరగతి ఫలితాలవల్ల రాష్ట్రంలో ఉన్న మూడు వందల అరవై జూనియర్ కళాశాలల్లోని ఇంటర్మీడియెట్ సీట్లలో సగానికి సగంకూడా భర్తీకావు.

బాల పొంగు పాల పొంగు అన్నారు. ఆ పొంగు వృధా కాకుండా ఇంద్రధనస్సులా రంగులు విరజిమ్మాలంటే వాటిని మళ్ళించుకొనేదారులు పరిశుభ్రంగా ఉండాలి. తల్లిదండ్రులు అనుక్షణమూ జాగ్రత్త వహించాలి. విద్యకు సంబంధించిన అన్నివర్గాల ప్రతినిధులతో ప్రతి ప్రధాన సంస్కరణను క్షుణ్ణంగా పరిశీలించిన తరవాతనే అమలుజరపాలి. ప్రతి పాఠశాల మాతృమూర్తి ప్రేమతో పెరగాలి. ఆ వాత్సల్యంలో బిడ్డలు ఎదిగి రావాలి. అప్పుడు ప్రతి విద్యాలయమూ ప్రతి విద్యార్థి ఒక "తాడికొండ"గా, వేరొక "సర్వేల్"గా మరొక "కొడిగిన హల్లి"గా అవతరించరా ?

# విషావరణంలో విశాఖ!

ఆధునిక విజ్ఞానశాస్త్రం మానవునికి అందజేస్తున్న అవకాశాలు ఎన్నో, ఎన్నెన్నో! మానవుడు మంచుయుగాలు కడచాడు; హిమానీనదాల ఒత్తిళ్ళను తట్టుకున్నాడు. ప్రకృతి శక్తులను పాదాక్రాంతం చేసుకుంటున్నాడు. వాతావరణాన్నే తారుమారు చేసుకుంటున్నాడు.

ఈ మనిషే చలివణికించే ఉత్తరార్ధ గోళాన్ని లొంగతీసు కుంటున్నాడు. ఉత్తర ధృవాన్ని వ్యవసాయానికి సానుకూలం చేసుకోబోతున్నాడు. ఎడారులను పంటభూములుగా మార్చివేస్తున్నాడు. అట్లాంటిక్ జలాలను ఆర్కిటిక్ సముద్రం గుండా తరలించి, ఆర్కిటిక్ బేసిన్‌ని ముంచుతున్న మంచు ముసురును నిరోధించడానికి రకరకాల టెక్నిక్స్ ప్రయోగిస్తున్నాడు. ఇలా ఉత్తర ధృవానికి, ఉష్ణమండలాలకు మధ్య సేతువు నిర్మించుకుని వాతావరణ మార్పిడికే సన్నద్ధు డౌతున్నాడు. విమానాల ద్వారా వివిధ రసాయనాలతో మేఘ మండలాలు సృష్టించి పొలాలకు కృత్రిమ వర్షాలు అందిస్తున్నాడు. సాగర గర్భాన్ని శోధించి, మణుల్ని, మరకత మాణిక్యాల్ని పెకిలించి పైకి తీస్తున్నాడు. కాని సముద్రం పొత్తిటిలోనేవున్న విశాఖ పౌరులకు మాత్రం వాతావరణం సుఖప్రదంగా లేదు. ప్రజలు కాలుష్యంతో బాధపడు తున్నారు.

బుధవారం, తెలతెలవారుతూంది, ఉన్నట్టుండి విషతుల్యమైన పొగమంచు విశాఖ వినీలాకాశాన్ని దట్టంగా, కాఫీకప్పుపైన మూతలాగా కప్పివేసింది. పిల్లా జెల్లా, ముసిలి ముతక-విశాఖ పౌరులందరూ 5-7 గంటల మధ్య ఉక్కిరి బిక్కిరి అయ్యారు. గాలిలేదు. ఉన్నగాలి విషపూరితం. చుట్టూ కొండలు, మధ్యలో దిగువగా జనావాస ప్రాంతాలు. పగటిపూట నీటి ఆవిరి గాలిలో కలుస్తుంది. రాత్రిళ్ళు ఉష్ణోగ్రత తగ్గడంవల్ల గాలిలోని అదనపు

నీటి ఆవిరి వెలికివస్తుంది. ఇది దట్టమైన పొగమంచుకు కారణం. కాగా నగరంలోని కొన్ని పరిశ్రమలు విసర్జించే విషవాయువులు (సల్ఫ్యూరిక్ యాసిడ్), బయట గాలి లేనందున పొగమంచు పొరలలో కలసిపోయి మనుషుల గొంతుకలు నులిమినంత పనిచేశాయి. ఇంపెల్లిపాదికి దగ్గులు, కళ్ళు మంటలు, పెదాలు తడారి పోవడం!

ఈ కాలుష్య నివారణకు అధికారులు వెంటనే తగుజాగ్రత్తలు తీసుకోవాలి. విద్యత్ కేంద్రం ఆంధ్రయూనివర్శిటీ. అందులో కొత్తగా ఏర్పడిన వాతావరణ పరిశోధనాశాఖతోపాటు, కెమిస్ట్రీ, బయోకెమిస్ట్రీ, కెమికల్ ఇంజనీరింగ్, పబ్లిక్ హెల్త్ శాఖలుకూడా వున్నాయి. వీటికి సామాజిక బాధ్యతలు వున్నాయి. ఆ స్పృహ ఈ శాఖలకు అవసరం, వీటి మధ్య నేడు సమన్వయం లోపించిందని చెప్పాలి. కాలుష్య నివారణ కోసం తీసుకోదగు జాగ్రత్తల గురించి, ప్రజలకు, పరిశ్రమలకు, అధికారులకు ఎప్పటికప్పుడు సూచనలిస్తూ హెచ్చరించ వలసిన అవసరం వుంది. ఈ సమన్వయ కృషి అత్యవసరం.

అసలు ప్రజారోగ్య శాఖ అంటూ ఒకటి నగరంలో ఉందా? ఉంటే అధికారులు ఏ మేరకు నిరోధక చర్యలు తీసుకుంటున్నారు? వాటి ఫలితం ఏమిటి? ప్రజలకు సమాధాన పత్రం అవసరం.

# చలన చిత్రాలు

ఇది ప్రచారయుగం ప్రబోధయుగం. "కన్యాశుల్కం"లో మధురవాణి, పరిస్థితుల ప్రభావం వల్ల వేశ్యావృత్తిని చేపట్టినా సందర్భవశాత్తూ ఒక చోట "చెడనివారిని చెడగొట్టవద్దని చెప్పింది మా అమ్మ" అంటుంది. వృత్తి ధర్మంలో కూడా కొండంత నీతి చెప్పిపోయింది. భావ విప్లవ సాధనాలలో సినీమా ఒకటి. మూకీల శకందాటి 'టాకీ'ల శకంలో ప్రవేశించి, అత్యాధునిక సాంకేతిక పద్ధతులను చేజిక్కించుకొన్న చలన చిత్రాలు సమాజంలో బ్రహ్మాండమైన ప్రచార సాధనాలుగా అవతరించాయి. సాహిత్యం మాదిరే సినీమా ఇరువైపులా పదును గల కత్తి. మంచికి చెడుకి ఇందులో స్థానం ఉంది. క్షుద్ర ప్రవృత్తులను ఎంతగా రెచ్చగొట్టగలదో కొండలను పిండి చేయగల గుండెనూ, ఆ దండినీ అందజేసి మహోన్నత శిఖరాలకు అంతగానూ మానవులను ఉద్రేక పరచగలదు. ప్రజల - ప్రేక్షకుల జీవన, సాంస్కృతిక విలువలనూ వారి చైతన్యస్థాయినీ పెంచడం, తద్వారా సామాజిక పరివర్తనకు చేదోడుకావడం కేవలం ప్రబోధాలమీదనే ఆధారపడి లేదు. ప్రజల అవసరాలకూ, వారికి చేరగల ఉత్తమ ప్రబోధానికీ మధ్య ఒక విషమచక్రం నేడు అడ్డు వస్తోంది. అదే వాణిజ్య ప్రయోజనం. నూరు దోషాలలోని ఒక సుగుణంలా, నేటి సామాజిక పరిస్థితులలో కూడా కొన్ని మంచి చిత్రాలు రావచ్చు. అయితే ఈ "కొన్ని" అసంఖ్యాకమైనప్పుడు ప్రేక్షకుల మనోభావాలనూ, సమాజ పరిస్థితినీ తీర్చిదిద్దే అవకాశాలే వేరుగా ఉంటాయి. అందువల్ల పెట్టుబడి ప్రయోజనానికీ, వెండితెర ప్రయోజనాన్ని పూర్తిగా పొందగోరే ప్రజలకూ మధ్యఉన్న ఇనుప తెరను మనం తొలగించుకోగలగాలి. తులసివనంలోఉన్న గంజాయి మొక్కను తొలగించుకోవడం సులభం. కాని గంజాయి వనంలోని తులసి మొక్కను కాపాడుకోవడమే కష్టం. కొన్ని మంచి చిత్రాల ఫలితం కూడా అంతే. బహుశా

ఇందువల్లనే అయివుండాలి, గవర్నర్ రాష్ట్ర ఫిల్మ్ అవార్డుల ప్రధానోత్సవ సభలో మాట్లాడుతూ ఇలాచెప్పారు: "వాంఛనీయమైన సాంఘిక మార్పులకు ప్రోద్బలంచేసే ప్రయోజనకరమైన వాస్తవిక చిత్రాలనే నిర్మించాలి."

నిజానికి "న్యూవేవ్" అనీ, "ప్యారలల్" అనీ- ఏ పేర్లు పెట్టుకున్నా సినీ ప్రపంచం ప్రగతి వృద్ధతరానికి చెందిన ఏ ఒక్క బిమల్‌రాయ్, సత్యజిత్ రాయ్‌లతోనో, బి. ఎన్. రెడ్డితోనో నిలచిపోరాదు; అలాగే యువతరంలో ఆ సంచలనం ఏ ఒక్క మృణాల్‌సేన్‌తోనో, శ్యామ్ బెనిగల్‌తోనో ముగిసి పోరాదు. గవర్నర్ ఆశిస్తున్నట్లు "యువతరం మనస్సులలో సామాజిక బాధ్యత గురించి నూరిపోయడానికీ, కుటుంబాలు చూడగలిగేటట్టు చిత్రాలు తీయడానికీ" మన నిర్మాతలకూ, దర్శక- నిర్మాతలకూ ఇంకా చాలా వ్యవధి పట్టేటట్టు కనిపిస్తోంది! అలాంటి ఉత్తమ చిత్రాల అవసరం గురించి తాను సభ్యుడుగావున్న ఖోస్లాకమిటీ చేసిన సిఫారసులనే కొందరు బుట్టదాఖలు చేశారని గవర్నర్ వెల్లడించడమే ఇందుకు తార్కాణం. డాక్యుమెంటరీల కోసం, పిల్లల చిత్రాలకోసం ప్రభుత్వం వనరులు కల్పించినా, వినియోగించు కొనక పోవడానికి ప్రధాన కారణం- తిరిగి ఈ వాణిజ్య ప్రయోజనమే.

చలనచిత్రం శక్తివంతమైన ప్రచార సాధనం అనుకొన్నప్పుడు ప్రభుత్వం విధిగా తన సూచనలనూ సిఫారసులనూ సినీ ప్రపంచం పాటించేటట్టు చేయాలి. సమాజం వనరులు ఆధారంగా పెరుగుతున్న ఈ పరిశ్రమను తిరిగి సంఘానికి బాధ్యత వహించేటట్టు నిర్దేశించాలి, శాసించాలి. స్టూడియోలు, చిత్రాల నిర్మాణానికి ప్రభుత్వం రుణాలూ, సబ్సిడీలూ కల్పిస్తోంది. చిత్రాల ద్వారా ప్రభుత్వం ఆశిస్తున్న ఆదర్శాలు ప్రేక్షకుల అనుభవంలోకి బట్వాడా కావాలి. అలా ఆశించే హక్కు ప్రభుత్వానికి ఉంది; ఆ మేరకు సామాజిక స్పృహతో చిత్రాలు నిర్మించే బాధ్యత నిర్మాతల పైనవుంది. చలనం, సంచలనం- చలనచిత్ర ధర్మం!

# మేఘమాలికల మధ్య మైత్రీబంధం

విశ్వ రహస్యాలు మరిన్ని వెల్లడౌతున్నకొలదీ మరుగుజ్జులమై పోవాలి మనం! మానవుల మనస్సులో దౌర్బల్యం అంతరించి మహస్సు నింపుకోవాలి. చిన్నబుద్ధి తొలగి, పెద్దబుద్ధి మెలగాలి, భూఖండవాసులకు తాము నివసిస్తున్న ఈ ధరాతలం ఒక బ్రహ్మాండ మండలం. కాగా విశ్వలోక యాత్రలోవున్న వారికిది నీలికాంతిలో దోబూచులాడుతున్న అతి సుందర వినీల నక్షత్రమే! ఎన్నెన్ని గ్రహాలు చుట్టివచ్చినా, తమ సహజీవనం, తోటి మానవులతోనే, భూలోకవాసులతోనే అన్న సత్యాన్ని "అపోలో-" "సోయుజ్"ల తొలి అనుసంధానం నిరూపించింది. విశ్వకళ్యాణంకోసం జరుగుతున్న మహా ప్రయత్నంలో అంతమంది మానవులమూ ఒకటేనన్న భావసమైక్యతను ఈ విశిష్ట ప్రయోగం సాధించింది. ఇక మేఘమాలికల మధ్య రోదసీ వీరుల మైత్రీబంధం, విభిన్న సాంఘిక, రాజకీయ వ్యవస్థల మధ్య సహజీవనాన్ని దృఢపరచి, ధృవపరచవలసివుంది.

శాస్త్రవిజ్ఞానం శరవేగాన వ్యాప్తమౌతున్నకొలదీ దూరాలుదగ్గరపడుతున్నాయి; తీరాలు సమీపిస్తున్నాయి, ఖండాలు కలుసుకుంటున్నాయి. 1957 రష్యన్ స్పుత్నిక్, 1958 అమెరికన్ ఎక్స్‌ప్లోరర్‌తో ప్రారంభమైన విశ్వరహస్య విచ్ఛేదం మానవుణ్ణి చంద్రలోకాధినేతను చేయడంతో ఒక మహత్తర విజయాన్ని సాధించింది. కాగా రాజకీయ రంగంలో శత్రుకూటాలుగా, అణ్వస్త్ర శక్తులుగా మారిన రెండు అగ్రరాజ్యాల మధ్య రోదసీ పరిశోధనలకోసం ప్రారంభమైన, తొలిమెట్టుగా, జయప్రదంగా సాగిన ఈ సమష్టి పథకం మరొక నూతనాధ్యాయం.

ఈ విశిష్ట ప్రయోగానికి ముందు, ఈ మధ్య కాలంలో అమెరికా, రష్యాలు మానవులతోను, మానవులు లేకుండాను పెక్కు ఉపగ్రహాలు వదిలాయి.

చంద్రలోక యాత్రలు జరిపాయి, గ్రహాంతరయానాలకు ప్రయోగాలు నిర్వహించాయి. సౌరకుటుంబ రహస్యాలు పెక్కింటిని దివినుంచి భువికి తెచ్చి, కోట్లాది ప్రజల మనస్సులను మూఢనమ్మకాల తెరల పొరల నుంచి విముక్తం చేసి, జ్ఞాననేత్రాలు ప్రసాదించాయి. శుక్ర, కుజ తదితర గ్రహాలలో, జీవరాశికోసం శాస్త్రజ్ఞులు అపారమైన కృషి సాగిస్తున్నారు. ఈ విశ్వం అంతమా, అనంతమా అన్న జిజ్ఞాసకొలదీ ఈ మహత్తర కృషి కొనసాగుతోంది. ఇది విస్తరణవాదం కాదు, విశ్వ విస్తరణవాద నిరూపణకై జరుగుతున్న శాస్త్ర విజ్ఞాన సాగర మథనం.

కేప్‌కానవరాల్, బైకనూర్ కేంద్రాల నుంచి ప్రారంభమైన ఈ సమష్టి పరిశోధనలు భవిష్యత్తులో రోదసీ కేంద్రాల ఏర్పాటుకు, గ్రహాంతర యాత్రలకు జరగనున్న ఉమ్మడి కార్యక్రమాలకు ప్రాతిపదికలు వేశాయి. అయితే ఈ విశ్వరహస్యాలు, అణ్వస్త్ర శక్తిలా ఏ ఒక్కరిసొత్తూ కాకూడదు. అగ్ర రాజ్యాల మధ్య "అనుసంధాన" క్రియలు రోదసికే పరిమితం కాజాలవు. ఈ భూగోళంపై అసమానతల 'మాలోకా'న్ని, కోటానుకోట్ల ప్రజల దారిద్ర్యాన్ని, నిరక్షరాస్యతను రూపుమాపడానికి, ప్రజల ఆరోగ్యాన్ని మెరుగు పరచడానికి కూడా ఇవి అవసరం. ఈ కృషిలో ప్రపంచ రాజ్యాలన్నీ చేతులు కలపాలి.

ఇప్పటికే రకరకాల కాలుష్యం పేరుకుపోయిన ఈ భూఖండం సమస్యలను దాటవేయడం-కడుపు నిండినవాడికీ, కడుపు మండినవాడికీ మధ్యగల అంతరాన్నే ఋజువు చేస్తుంది. కాలే కడుపులకు నింగిలోని చుక్కలను తొంగి చూచి ఆనందించమని చెప్పలేము. చందమామనుచూపి గుండె చిచ్చును చల్లార్పలేము. ఒక్కమాటలో-తక్షణం అక్కరకురాని గ్రహాంతర జీవ రాశి బాగోగుల గురించిన పరిశోధనలతో, ఇక్కడ మన మధ్య జీవకోటి శతకోటి ఈతి బాధలను మరచిపొమ్మని చెప్పి, మురిపించలేము.

ఏమరుపాటు లేకుండా ఈ జాగ్రత్తలు తీసుకున్ననాడు, మానవమండలాన్నే మహా జగత్తుగా మార్చుకోగలుతాం. ఆనాడు "సమభావం, సౌహార్ద్రం, సౌభ్రాతం" రోదసీలో కాదు, సాక్షాత్తూ మన మధ్యనే వెల్లివిరిసి, ప్రజలకు శుభం పూస్తుంది. మైత్రీబంధం, మేఘమాలికల మధ్యనే కాదు, అక్షరాల అనంత ప్రజావాహిని మధ్యనే సాధ్యమవుతుంది.

# రంగస్థల నటులు

'**వం**ట వంట మేమే వండుకోవాలి. ఒక్కొక్కప్పుడు మాకు విస్తరి కూడా దొరకదు'— వేళ్ళమీద లెక్కించదగిన ఏ కొలది నాటక సమాజాలనో తప్పిస్తే హెచ్చు సమాజాల, రంగస్థల నటుల దైన్యస్థితి కూడా నేడు ఇలాగే ఉంది! రాష్ట్రరాజధానీ నగరంలో కొలది రోజుల నాడు సభ తీర్చిన నటులు తాము నేడెదుర్కొంటున్న దురవస్థనూ, నిరాదరణనూ వేనోళ్ళ చాటి చెప్పారు. సంస్కృతీ జీవనానికి అద్దం పడుతున్న కవులనూ, కళాకారులనూ గౌరవించడం, వారి జీవన పరిస్థితులను మెరుగు పరచడం ప్రజల కర్తవ్యం, ప్రభుత్వ ధర్మం. కవులలో మాదిరే, కళా రంగానికి అపారమైన సేవలు చేసిన వ్యక్తుల కుటుంబాలు ఎన్నో తెలుగునాట అతి దైన్యస్థితిలో ఉన్నాయి. వృద్ధాప్యం ఫించన్లూ, గృహవసతీ, సంక్షేమం కొరవడి పెక్కు ఇబ్బందుల పాలవుతున్నవారు ఉన్నారు. రంగస్థల నటుల దుస్థితి గురించి సభలో ప్రసంగించిన వక్తలు హృదయావేదనతో ప్రస్తావించారు.

బ్రిటిష్ వాడి లాంక్‌షైర్ మిల్లుల ధాటివల్ల మన వస్త్ర పరిశ్రమకూ గ్రామ సీమలలోని చేతి వృత్తులకు ఎలా చేటు వచ్చిందో సినీ పరిశ్రమ ధాటివల్ల నాటక రంగానికి కూడా అంతే చేటు వచ్చింది. సమన్వయంలేని పెరుగుదలవల్ల ఒకదానికొకటి పోటీగా తయారై "విత్తనం కొద్దీ పెత్తనం" అన్నట్టుగా చివరికి సహజమైన నాటక కళకే ముప్పు వచ్చింది. ఫలితంగా నాటక కళపై తరచుగా ఆధారపడుతూ వచ్చిన వేలాది మంది కళాకారుల పరిస్థితి దుర్భరంగా తయారయింది. పరిస్థితులలో వచ్చిన మార్పు ప్రభుత్వ ఆదరణలో కూడా మార్పు తెచ్చింది. నిజానికి నాటక రంగం అభివృద్ధి వల్ల వికసించేది ఆ ఒక్క కళా రూపమే కాదు; దానిని అంటిపెట్టుకొని వర్ధిల్లగల ఎన్నో జానపద కళారూపాలకుకూడా ప్రాణం పోయవచ్చు. కొన్ని ఇతర రాష్ట్రాలలోకంటే తెలుగునాట సినీ పరిశ్రమతోపాటు నాటక కళ

దీటుగా వృద్ధిలోకి రాకపోవడానికి మరొక కారణం- ఇతరచోట్ల మాదిరిగా ఈ కళకు సినీ కళాకారులు తగిన ప్రోత్సాహం ఇవ్వకపోవడం. కేరళ, తమిళనాడులలో సినీ కళాకారులు (ఎంత పెద్ద వారైనా సరే) ఈ రోజుకి రంగస్థల నటులుగా తరచుగా ప్రదర్శనలు ఇస్తూనే ఉంటారు. ఇది మన తెలుగు దేశంలో పెద్ద కొరత. వెండితెర వెలుగులకు రంగస్థల కళాకారులను కానుకలుగా అర్పించి దాని పురోభివృద్ధికి దోహదంచేసిన నాటకరంగమే ఈ దుస్థితికి రావడం విచారకరమే కాదు, గర్హనీయం కూడా.

ఔత్సాహికులైన కళాకారులు మనకు ఎంతమందిఉన్నా ఆర్థిక వనరులకొరత నాటక రంగాన్ని కుంగదీస్తున్న మరొక అంశం. ఈ కొరతవల్లనే మనకు తగినన్ని థియేటర్లు లేవు. ప్రాచీన కళలను సహితం ఆధునిక ప్రయోజనాలకు వినియోగించుకొని మెప్పించగల కళాకారులు మనకు ఉన్నారు. నేడు పరివర్తనా దశలో ఉన్న సమాజానికి అవసరమైన ఇతివృత్తాలతో వెలువడుతున్న నాటకాలూ ఉన్నాయి. సాంఘిక పరివర్తనకోసం పౌరులలో కానవస్తున్న తహతహకు, నవ చైతన్యానికి అద్దం పట్టగల నాటకాలు అవసరం అవుతాయి. ఇది యక్షగాన వీధి నాటకాల యుగం కాదు, సాంఘిక సమస్యలకు ప్రతిరూపంగా రంగస్థలం అవతరించవలసిన దశ. సినీ పరిశ్రమ ఎంతగా పెరిగినా, ప్రదర్శన యోగ్యత, సామర్థ్యం పెట్టుబడిగా ప్రేక్షక లోకంపైన నాటకాల ప్రభావం ఉండి తీరుతుంది. ప్రభుత్వం ఇందుకు ధన సహాయం చేయడమేగాక, ఈ కళ అభివృద్ధికోసం సాంస్కృతిక వ్యవహారాలకు ప్రత్యేకంగా ఒక మంత్రిత్వశాఖనే ఏర్పరచడం అవసరం. అలాగే రంగస్థల నిర్మాణంలోనూ, నాటక ప్రదర్శన టెక్నిక్స్‌లో కూడా పెను మార్పులు వస్తున్నాయి. రోడ్డును రంగస్థలంగా చేసుకొని ఎట్టి ఆర్భాటాలూ లేకుండా సాధ్యమైనంత తక్కువ ఖర్చులో ప్రేక్షకులకు మనోవికాసం ఆహ్లాదం కల్గించగల ప్రయోగాత్మక నాటకాన్ని ఆంధ్ర యూనివర్శిటీ థియేటర్ ఆర్ట్స్ విభాగం జయప్రదంగా ప్రదర్శించింది. ఈ అనుభవాలను నటులేగాక, ప్రభుత్వం కూడా శ్రద్ధగా పరిశీలించి నాటక కళకు ఇతోధిక సేవలు అందజేయాలి.

# అణుగర్భంలో కొత్త శకలం

జ్ఞాన తృష్ణకు అవధులు లేవు. అణువు ఎన్నెన్ని శకలాలుగా రూపొందు తోందో శాస్త్ర విజ్ఞానం కూడా అన్ని శాఖోపశాఖలై, కొత్త విషయాలు కనిపెట్టిమానవుని జ్ఞాననేత్రాన్ని అంతగా పెంచుతోంది. పదార్థ విజ్ఞానశాస్త్రం వృద్ధిఅయి, భూమిపైనా, విశ్వంలోనూ సహజధాతువులను కనిపెట్టడంతోనే తృప్తిపడలేదు. అపారమైన అణుభారంకల పెక్కు కృత్రిమ ధాతువులను పరిశోధనాలయాలలో కూడా సృష్టించి వాటి సంఖ్యను 105 కి పెంచింది. ఒకనాడు, జ్ఞానం కలగక ముందు భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశం— "భూతాల" క్రింది జమకట్టిన మానవుడు తరవాత వీటిని "ధాతువులు"గా పేర్కొన్నాడు. వాటినిస్వశక్తితో అవసరాలకోసం పెంచుకున్నాడు. అందుకే ఈ వాంఛను ఒక భావ కవి చక్కగా వర్ణించాడు: "ప్రతి పదార్థమ్ములోని రూపమ్ము వరకు, అసలు తత్వమ్ము కొరకు ప్రయాణమౌ మనస్సునకు అడుకంచెలన్నవియె లేవు !"

నాలుగు రోజులనాడు కొలంబియా యూనివర్శిటీ శాస్త్రవేత్తలు ఆ పనే చేశారు. పదార్థంలో సరికొత్త ప్రాథమిక శకలాన్ని వీరు కనిపెట్టారు. దీనికి "ఎప్సిలాన్" (Epsilon) అని పేరుపెట్టారు. ఇప్పటివరకు అణుశకలాలను, అణ్వంతక శకలాలను (పార్టికిల్స్) కనుగొనడంలో శాస్త్రవేత్తలు రకరకాల పరిశోధనలు చేశారు. మూడు రకాల శకలాలు—ధన విద్యుత్ కారకమైన ప్రోటాన్, రుణ విద్యుత్ కారకమైన ఎలెక్ట్రాన్, విద్యుత్ రహితమైనన్యూట్రాన్ వుంటాయని నిన్నటిదాకా విశ్వసిస్తున్నాం. ఈ ప్రధాన శకలాలుకాక, అనేక దశాబ్దాల శాస్త్ర పరిశోధనలవల్ల మీజాన్స్, పయోన్స్, న్యూట్రినో (Meson Pion, Neutrino) వంటి ఇతర శకలాలుకూడా వెల్లడయ్యాయి. కాని ఇటీవల భారత యువశాస్త్రవేత్త విశాఖ సైన్స్ కాంగ్రెస్‌లో మొట్ట మొదటిసారిగా "క్వాటర్నరీఫిషన్ థీరీ" అని కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపా

దించాడు. దీని ప్రకారం ఇంతవరకూ ఊహించినట్టు అణువు ఒక తేలికైన శకలంగా, రెండు భారీ శకలాలుగానే వుండకుండా రెండు చిన్న శకలాలుగాను, రెండు భారీ శకలాలుగానూ విచ్ఛిత్తి పొందుతుందని చెప్పాడు. అలా ఏర్పడే మరొక శకలమేదో ఆయన పేరు పెట్టలేదు. కాని కొలంబియా శాస్త్రవేత్తలు ఇంతవరకు కనుగొన్న శకలాలన్నింటికంటె కొత్త ప్రాథమిక శకలం "ఎప్సిలాన్" చాల బరువైనదని తేల్చారు. అణువుకేంద్రంలో (న్యూక్లియస్) వుండే ప్రోటాన్ల అణుభారంకంటే దీని అణుభారం ఆరురెట్లు ఎక్కువట. దీని జీవితం—ఒక సెకండులో లక్ష సహస్రకోట్ల వంతు కంటే కూడా తక్కువట. "బెరిలియం" అనే ధాతువులోని అణువులను ప్రోటాన్లతో తాకించడం ద్వారా ఈ ఎప్సిలాన్ శకలాన్ని వేరుచేయగలిగారు.

అణుకేంద్రాల విచ్ఛిత్తివల్ల, సంయోగంవల్లకూడా అపారమైన శక్తి పుట్టుకొస్తుంది. మారణాస్త్రాల ఉత్పత్తికి వినియోగించే యురేనియం, ప్లుటోనియం కృత్రిమ ధాతువులను సృష్టించింది ఈ ప్రక్రియల వల్లనే. మరి అన్ని అణుశకలాలకంటే ద్రవ్యరాశిలో పెద్దదీ, అపారమైన అణుభారమూ కల సరికొత్త ఎప్సిలాన్ సృష్టి మరెంతటి శక్తిమంతమైన మారణాస్త్రాల ఉత్పత్తికి దారితీయగలదో చూడాలి. అయితే అశాంతిని సృష్టించే అణువుతో శాంతినీ సాధించవచ్చు; కల్లోలం పుట్టించే అణు శకలంతో మానవ కళ్యాణమూ చూపించవచ్చు!

# సమాజం - సాహిత్యం

మానవ జీవితంలో నిరంతరం స్పందించేది సమాజం అని నమ్మలేనివాళ్ళు సాహిత్యానికి సంఘ ప్రయోజనం వుంటుందని విస్వసించలేరు. అలాగే సంఘ భవితవ్యాన్ని ఆర్థిక విధానాలు, పరిస్థితులు ప్రభావితంచేస్తూ వుంటా యని కూడా వీరు నమ్మరు. అందువల్లనే సంఘ చైతన్యంకల ఏ కొలది మందో తప్ప శతాబ్దాలపాటు ప్రజా జీవనంతో నిమిత్తం లేనివాళ్ళ రచనలే సాహిత్య, కళా రంగాలను ఏలుతూ వచ్చాయి. అంధ విశ్వాసాలను పెంచి, పోషించాయి. ఏలినవారి చిత్తాలకు వీలైన రచనలు వెలసాయి. ఏనాడు ప్రజాజీవితం ఆర్థికంగా కల్లోలానికి గురైనదో ఆనాడు సంఘ జీవనం సంకుల సమరంగా మారింది.

ఇందుకు భావవిప్లవం తోడైంది, భాషా విప్లవం బాటలు వేసింది. సంఘంలో రానున్న ప్రతి కదలికకు ముందు రచనలు, రచనా ప్రక్రియలలో మార్పులు వచ్చాయి. రాకతప్పదు.

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల మహాసభ కొన్నిముఖ్యమైన తీర్మానాలు చేసింది. సాహిత్య ప్రక్రియలలో మార్పులుతెచ్చి, సామాన్యులకు సాహి త్యాన్ని సన్నిహితం చేయడం; వాడుక భాషకు సామాజిక స్పృహకల భావాలకుతప్ప ఇతర భాషా, భావ ధోరణులకు స్థానం లేకుండా చేయడం; అన్ని విద్యాలయాలలో వాడుక భాషను ప్రవేశపెట్టడం— ఈ తీర్మానాలలో ప్రధానమైనవి.

కృతక భాషా సంప్రదాయాలు మన విద్యాలయాలలో, విశ్వవిద్యాలయాలలో నేటికి విద్యార్థులనుపట్టి పీడిస్తూనే వున్నాయి. ఎం. ఆర్. అప్పారావుకమిటీ వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయ స్థాయిలో ఆమోదించినా కూడా అమలు లోకి రాలేదు. "వ్యావహారికం"అన్న దానిని తాత్వికంచేసి, ద్వంద్వార్థానికి

చోటు కల్పించి నందుననే ఈ పని జరిగివుంటుంది. 'శిష్టం' పేరిట గిడుగు రామమూర్తి, గురజాడల కృషికి అడ్డు తగిలిన వశిష్ఠులింకా విశ్వవిద్యాలయాలను పీడిస్తూనే వున్నారు. బూజుపట్టిన పద్ధతులు పీడిస్తున్నది సంఘాన్నీ ఆర్థిక వ్యవస్థనే కాదు, సాహిత్యాన్ని కూడా. ఫ్రెంచి వాళ్ళు "బెల్స్ లెటర్స్" (Belles Letters) అన్నారంటే అందమైన మాటలని అర్థమేగాని, అర్థానికి దూరం కాగలవీ, అర్థంకానివీ అనికాదు. విద్యార్థుల, పాఠకుల మనోభావాలను ఉత్తేజపరచి, ప్రయోజనం కల్పించి, వారిలో సృజనశక్తిని పెంచే శబ్దాలు, రసాలు, మాటల సమాహారమే అందచందా లంటే. కాని ఇప్పటికీ, ప్రభుత్వ గ్రంథాలలో కూడా కృతక సంప్రదాయాలు వున్నందుననే, విశ్వవిద్యాలయాల మొండితనం వల్లనే తెలుగు పరీక్షలలో తరచు విద్యార్థులు ప్యాసు మార్కులు తెచ్చుకోవడం గగనం అవుతోంది. కృతక భాష, దుష్టసంప్రదాయాల వైఫల్యానికి ఇది ప్రత్యక్ష నిదర్శనం. పాత మాటలు, బూజు భావాలు తొలగిపోవాలి. సామాజిక స్పృహను కల్పించగల వాడుక భాషను పూర్తిగా విద్యాలయాలు ఆమోదించాలి. తెలుగును అన్ని స్థాయిలలో అధికార భాషగా ప్రవేశ పెట్టుకోవాలి.

# చరిత్రాత్మకం

కాలం కాటువేస్తున్నా నికరమైన నిర్ణయాలు చేయనందుననే, మిత్తి నెత్తి మీదకు వస్తున్నా శుష్కప్రియాలతో కాలహరణం చేసినందుననే, చివరికి జీవచ్ఛవంగా తయారైనందుననే నానారాజ్యసమితి (లీగ్ ఆఫ్ నేషన్స్) నామరూపాలు లేకుండా పోయింది. ఉడ్రోవిల్సన్ ఉన్నతాశయాలు సహితం దాని పతనాన్ని నివారించలేక పోయాయి. కాగా మూడు దశాబ్దాల క్రితం ఏర్పడిన ఐక్యరాజ్య సమితి ఇన్నేళ్లుగా చేసిన నిర్ణయాలన్నింటికంటే నిర్దుష్టమైన నిర్ణయం—శ్వేతజాతి పాలకుల జాత్యహంకారపు దుర్మార్గాలకు అనునిత్యం బలి అవుతున్న దక్షిణాఫ్రికా ప్రజలకు ఏకైక మార్గం సాయుధ పోరాటమని గుర్తించడం. సమితి చరిత్రలో ఇది ఒక మలుపు. "దురాక్రమణ"ను నిర్వచించలేని సంస్థ సాయుధ పోరాటానికి మద్దతు నివ్వడం విశేషం. ఈ గుర్తింపు ప్రపంచసంస్థనుంచి రాకముందే ఆఫ్రికన్లు స్వాతంత్ర్య సమరం ప్రారంభించి కొనసాగిస్తున్నారు. ఇప్పటికి పదిహేనేళ్ళుగా వెర్వోర్డ్, వోర్‌స్టర్ ప్రభుత్వాలను సమితి జనరల్ అసెంబ్లీ, సమితి రాజకీయ సంఘాలు పదేపదే హెచ్చరించినా ఫలితం లేకపోయింది. రెండున్నర కోట్ల జనాభాలో పదిహేడు శాతం కూడా లేని తెల్లవాళ్ళకు ప్రాతినిధ్యం వహిస్తున్న వోర్‌స్టర్ ప్రభుత్వం ౮౩ శాతం ఆఫ్రికన్లను నిరాయుధులను చేసింది; సొంత గడ్డపైనే కాందిశీకులుగా మార్చింది. సొంత భూములనుంచి వారిని తరిమివేసింది; తెల్లవాళ్ళకు కేవలం ఊడిగం చేసిపెట్టే వెట్టిచాకిరీలోకి దించింది; అన్ని రకాల స్వేచ్ఛలను హరించి వేసింది. చివరికి నల్లవాడైన ఆఫ్రికావాసి తనకో ఇల్లంటూ లేక, తానూ ఒక పౌరుడనేనని చెప్పుకోడానికి కూడా వీలులేకుండా ఏవో "పాస్‌బుక్"లు చూపించి బతకవలసివస్తోంది.

ఈ పరిస్థితులను అంతమొందించడానికి సమితి లోగడ ఎన్నో నిర్ణయాలు చేసింది; ఆంక్షలు విధించింది; అయినా అమెరికా, ఫ్రాన్స్, బ్రిటన్‌వంటి

పశ్చిమ రాజ్యాల సైనిక, ఆర్థిక సహాయంతో నెట్టుకు వస్తున్నది వోర్‌స్టర్ మైనారిటీ శ్వేత ప్రభుత్వం ఒక వైపున పాత పోర్చుగీస్ వలసలైన ఇరుగు పొరుగు మొజాంబిక్, అంగోలాలు దీర్ఘ కాలపోరాటం అనంతరం స్వాతంత్ర్యం సాధించుకొన్నాయి; రొడీషియాలో కూడా త్వరలోనే ఇయాన్ స్మిత్ శ్వేత పాలనకు ప్రజలు చరమాంకం పాడి జింబాబ్వే రిపబ్లిక్‌ను ఏర్పరచుకో బోతున్నారు. మరొక వైపున దక్షిణాఫ్రికా వలసగా ఉన్న నైరుతి ఆఫ్రికా ప్రజలుకూడా "నమీబియా" రిపబ్లిక్‌ను ప్రకటించుకొనేందుకు తీవ్రపోరాటం సాగిస్తున్నారు. ఈ తాకిడికి తట్టుకోలేని వోర్‌స్టర్ దక్షిణాఫ్రికాలో షార్పెవిల్లీ, సొవెటో ఆఫ్రికన్ శిబిరాలలో పెద్దఎత్తున ఊచకోతకు తలపడ్డాడు. మరొక వైపున నమీబియాకు స్వాతంత్ర్యం ప్రకటిస్తానని అంగీకరిస్తూనే ఇంకొక వైపునుంచి దక్షిణాఫ్రికాపై శ్వేత పరిపాలనను చట్టబద్ధంచేసి, సుస్థిరం చేసుకోడానికి దేశాన్నే ఆఫ్రికన్ తెగలనే ముక్కలు ముక్కలుగా విభజింప జూస్తున్నాడు. తొలి రోజులనాటి "మాలపల్లి చట్టాన్ని" బూజు దులిపి తిరగదోడాడు. తొమ్మిది కొండజాతి ప్రాంతాలలో ఆఫ్రికన్లకు "స్వతంత్ర రాష్ట్రాలు" ఏర్పాటు చేయబోతున్నాడు. సొంత భూములు లేక శ్వేత ప్రాంతాలలో నివసిస్తున్న కోటిమంది ఆఫ్రికన్లకు వారెవరో పరాయి వారైనట్టు "పౌరసత్వం" కల్పిస్తాడట. అంటే సముద్రాలు దాటి వ్యాపారం పేరిట వచ్చి దోపిడీకిదిగిన తెల్లవాళ్ళు ఆఫ్రికా వాసులవుతారు. ఆఫ్రికన్లు విదేశీయు లవుతారు! ఈ దుర్బుద్ధితో తాజాగా తలపెట్టిన నిర్ణయమే 33 లక్షలమంది "జోవా" ఆఫ్రికన్ తెగలు నివసించే "ట్రాన్స్‌కై" ప్రాంతాన్ని వేర్పాటు చేయడం. ఇలా ఆఫ్రికన్లు ఒక్క జాతిగా మెలగకుండా వేరుచేసేందుకు ఏర్పాటుచేసే తొమ్మిది ప్రత్యేక "మాలపల్లెల"లో ఆఫ్రికన్లకు దక్కే భూమి మొత్తం విస్తీర్ణంలో 13 శాతం కూడా ఉండదు!

ఈ దుర్మార్గాన్ని ప్రతిఘటించడం ఆఫ్రికన్ల విధి అందుకు సమితి తీర్మానం నైతిక ప్రోత్సాహం. భారతీయుల అండదండలున్నాయి. జాంబియా ప్రెసిడెంట్ కౌండా జోస్యం ఫలించే రోజు ఎంతో దూరాన లేదు: "ఇకపైన తెల్లవాళ్ళ భూములనూ, పరిశ్రమలను కోల్పోక తప్పదు. ఇది విప్లవం. విప్లవతారుణ్యైన తెల్లవాడికి మాత్రమే ఇక మీదట ఆఫ్రికాలో పుట్టగతు లుండవు."

# పేరు ధర్మదాత....

"పేరు ధర్మరాజు పెనువేప విత్తయా" అన్నారు. అసలు పేర్లు చెలామణీ కానిచోట్ల మారుపేర్లు అవసరమవుతాయి. "ఆపరేషన్ జింజర్" అనీ "ఆపరేషన్ ప్రిక్స్" అనీ ఇలా యుద్ధకాలంలో శత్రుకూటాల మధ్య దాడులలో ప్రత్యర్థివర్గాలు కార్యకలాపాలు సాగిస్తూండేవి. క్రమంగా ఇలాంటి పరిణామం ఆర్థిక వ్యవస్థలలో కూడా చోటు చేసుకొంది. సోషలిజం ఒక విశ్వవ్యాపిత రాజకీయ విధానంగా, ఆర్థిక వ్యవస్థగా తన విజయాలను చాటుకొంటున్న దశలో వర్ధమాన దేశాలు అటువైపు మొగ్గకుండా ఉండాలంటే కాపిటలిజానికి కూడా మారుపేరు అవసరమైంది. యూరపులో ఈ మధ్య దీనిని "పీపుల్స్ కాపిటలిజం" అన్నారు. రోగిచేత మందు మింగించాలి. ఆ బిళ్ళకు పంచదార కోటింగ్ పడాలి. వాణిజ్యవేత్తల గిల్డులూ, కార్టెల్స్ పోయాయి. స్వభావంలో మార్పులేదు. ఇప్పుడు అమెరికా, బ్రిటన్, పశ్చిమ జర్మనీ, జపాన్ వంటి సంపన్న దేశాలలోని ప్రయివేట్ పెట్టుబడులన్నీ కలిసి "మల్టీ నేషనల్స్"గా అవతరించాయి. వర్ధమాన దేశాల వనరులను వెలికి తీసి దేశాల ఆర్థిక వ్యవస్థలను తమ సాంకేతిక నైపుణ్యంతో, పెట్టుబడులతో ఉద్ధరిస్తామని బయలుదేరినవే ఈ బహుళ జాతీయ గుత్తసంస్థలు. దీనికి మనం ఒక్కముక్కలో "ఆపరేషన్ దోపిడీ" అని నామకరణం చేసుకోవచ్చు. ఈ గుత్తసంస్థల కార్యకలాపాలవల్ల అనుభవాలు దేశానికొక రీతిగా ఉన్నాయి. అందువల్లనే ప్రధాని ఢిల్లీ సదస్సులో ధనిక-నిర్ధనిక దేశాల మధ్య అసమ ఆర్థిక సంబంధాల గురించి ప్రస్తావిస్తూ "ఈ మల్టీ నేషనల్స్ కార్యకలాపాలు వర్ధమాన దేశాలను రకరకాల ఆర్థిక, సాంఘిక, రాజకీయ వత్తిళ్ళకు లోనుచేస్తున్నాయ"ని విమర్శించారు.

శతాబ్దాలపాటు సామ్రాజ్యశక్తుల దోపిడీవల్ల నలిగిపోయిన ఇండియావంటి వర్ధమాన దేశాలను ఇప్పటికీ తమకు ముడిసరుకులు ఎగుమతిచేసిపెట్టే దేశాలు

గానే ఉంచడం ఈ గుత్తసంస్థల లక్ష్యం; సాంకేతిక పరిజ్ఞానం పేరిట ప్రయివేట్ పెట్టుబడులను యథేచ్ఛగా దించడం, వాటికి విషమ షరతులను పెట్టడం వీటి నీతి. చౌకగా లభించే శ్రమశక్తి ఆధారంగా ప్రజల నిత్యావసర సరకులనుగాక, ఎగుమతుల పేరుతో ఏ విలాస వస్తువుల ఉత్పత్తికో లేదా తమ దేశాలకు అవసరమైన వస్తువుల ఉత్పత్తికో మన పరిశ్రమలను వినియోగించుకోవడం ద్వారా రాయల్టీలు, ఇతరత్రా లాభాలూ తీయడం వీటి ధర్మం. అసలు ఏ సహాయాన్నీ ఎక్కడనుంచీ పొందకుండా ఏ దేశమూ ఉండదు. కాని ఈ పరాధారస్థితికి పరిమితులు లేకపోతే ఆర్థికంగానూ, నైతికంగానూ వర్ధమాన దేశాలు దెబ్బతినిపోతాయి. అందువల్లనే ప్రధాని చెప్పినట్టు "వర్ధమాన దేశాలలో ఆర్థికాభివృద్ధి క్రమం చిక్కులతో కూడి ఉంది. ఈ అభివృద్ధిలో ప్రధాన పాత్రను ఈ దేశాలే నిర్వహించుకోవాలి." ఎందువల్ల? వేగం పేరిట అసలు దేశ ప్రయోజనాలనే పణం పెట్టలేము. అవసరమైన టెక్నాలజీ దిగుమతిని కీలక రంగాలకు మాత్రమే తగిన మోతాదులలో పరిమితం చేసుకోవాలి. బూట్లకోసం, బిస్కట్లకోసం, పల్లెకారుల వలలూ, టెన్నిస్ పరికరాలూ, రెడీమేడ్ దుస్తులు వగైరా సరకుల ఉత్పత్తికి కూడా పుట్టరాని మారక ద్రవ్యాన్ని వెచ్చించి టెక్నాలజీని దిగుమతి చేసుకోరాదు. దేశీయ వనరుల పరిధిలోనే, దేశీయ సైన్స్, టెక్నాలజీల ప్రగతిలోనే మన ఆర్థిక సమస్యలకు సరైన పరిష్కారం చూసుకోవాలి. "మల్టీ నేషనల్స్" ఒక్కసారి ప్రవేశిస్తే ఉత్పత్తులనేకాదు, సరకులపంపిణీ వ్యవస్థను కూడా తమ ప్రయోజనాలకు అనుగుణంగా కంట్రోల్ చేస్తుంటాయి. ఆ దరిమిలా క్రమంగా రాజకీయాలలోకూడా చొరబడుతూంటాయి. లాభం లేనిదే వ్యాపారి వరదన పోడట. లాభాలతోపాటు అనూహ్యమైన రాజకీయ ప్రయోజనం లేనిదే ఈ మల్టీ నేషనల్స్ ఏ దేశంలోనూ ప్రవేశించవు. ఇందిర హెచ్చరిక ప్రభుత్వంతోసహా అందరికీ మెదడుకు మేత.

# ఇది అధర్మం

మన దేశం ఇప్పుడు ఎవరితోనయినా యుద్ధం చేస్తోందా? లేక మన దేశం పైన తాజాగా ఏ ఇరుగుపొరుగయినా యుద్ధం ప్రకటించిందా? ఎన్నికల సంరంభంలో ఉన్న దేశ ప్రజలకు ఆ విషయం తెలియకపోవచ్చుగాని ప్రధాని ఇందిరాగాంధీ చండీఘర్ ఉపన్యాసం చదివినవారికీ, విన్నవారికీ మొత్తంమీద అలాంటి "ప్రమాదం" ఏదో దాపురించిందనే అనిపిస్తుంది. దేశభక్తి, దేశ రక్షణా స్వార్థ ప్రయోజనాలకు అతీతమయిన బాధ్యతలనీ, జాతి అమూల్య రత్నాలనీ గుర్తించనంత కాలం ఆఖరికి ఎన్నికల ప్రచారాలలో సహితం సాధనాలుగా వినియోగపడుతూనే ఉంటాయి. దేశ రక్షణ బాధ్యత ఒకరి గుత్త సొమ్ము కాదు. అది ప్రజలందరిదీ. రాజకీయ పక్షాలన్నింటిదీ. ఈ సమస్య ఏక పక్ష సమస్య ఎంత మాత్రం కాదని చైనా, పాకిస్తాన్‌లతో ఇండియా ఎదుర్కొన్న యుద్ధాలలో స్పష్టమయింది. ఆనాడు ఎన్నికలు లేవు. అయినా దేశ రక్షణ సమష్టి బాధ్యతగా అన్ని పక్షాలు భావించాయి. ఒక్క త్రాటిపైన నిలిచాయి. ప్రజలు అనేక త్యాగాలుచేసి సమైక్యంగా నిలిచి ప్రభుత్వం వెన్నుకాచారు. కానీ ఈ రోజున యుద్ధాలు లేవు. ఎన్నికలు వచ్చాయి. అయినా ఇందిర ఎన్నికల ప్రచార సభలలో పదే పదే "విదేశీ దాడి ప్రమాదం" గురించి చెబుతున్నారు. మనకు పటిష్టమయిన కేంద్ర ప్రభుత్వం అవసరం గురించి నొక్కి చెప్పడానికి యుద్ధాలు లేని ప్రశాంత వాతవరణంలో వాటి ప్రస్తావన తేవడం సమంజసమా? "ఇరుగు పొరుగున సుస్థిర పరిస్థితులు ఉండగా మనదేశంలో అస్థిరత్వాన్ని మీరు ఆమోదించగలరా?" అని ఇందిర ప్రశ్నిస్తున్నారు. ఇది పాకిస్తాన్ ఎన్నికలలో భుట్టో విజయం సందర్భంగా చేసిన ప్రస్తావన. కానీ దేశంలో సుస్థిరత దేశీయ సమస్యలకు చూపే పరిష్కారంపై ఆధారపడి ఉంటుంది గాని ఇరుగు పొరుగువారి రాజకీయంపైన ఆధారపడదు.

ఇండో-పాక్ యుద్ధకాలంలో "అవసరమయితే ఇండియాతో వెయ్యేళ్ళ యుద్ధం చేస్తాం" అన్న భుట్టో మాటలను కూడా ఆమె ఈ సందర్భంగా ఉదహరించారు. కానీ యుద్ధ సమయాల్లో మాదిరే ఎన్నికల సమయాల్లో కూడా ప్రతిపక్షాల మధ్య విసుర్లూ, ఎదురు సవాళ్ళూ సర్వసాధారణం. హిట్లర్, ముస్సోలినీ అంతటి వాళ్ళే రాబోయే తరాలను శాసించలేక తమ కాలంలోనే తమ చరిత్రను మాపివేసుకున్నారు. అలాగే భుట్టో చేసిన "వెయ్యేళ్ళయుద్ధ" బెదిరింపులు వెయ్యిరోజులు కూడా నిలవలేదు. యుద్ధం చాలించుకోవలసి వచ్చింది. ఆ దరిమిలా ఇందిరా-భుట్టోల సిమ్లా సంధి చరిత్రాత్మకం అయింది. ఉభయత్రా సయోధ్య కుదిరింది. ఖైదీలు విడుదలయ్యారు. దౌత్య సంబధాలు ఏర్పడ్డాయి. వాణిజ్యం సజావుగా సాగుతోంది. రైళ్ళ రాకపోకలూ, విమాన యానాలూ స్వేచ్ఛగా సాగుతున్నాయి. అలాగే ఇండియా-చైనాల మధ్య యుద్ధం జరిగిన రోజుల్లో పండిట్ నెహ్రూ ఈ రెండు దేశాల మధ్య వివాద పరిష్కారానికి "శతాబ్దాలు పట్టవచ్చు" నన్నారు. కాని 15 ఏళ్ళు తిరగకముందే మళ్ళీ దౌత్యసంబంధాలు నెలకొన్నాయి. సాంస్కృతిక ప్రతినిధి వర్గాలు యాత్రలు సాగిస్తున్నాయి. శ్రీలంక, నేపాల్, బర్మాలతో కూడా మన సంబంధాలు బాగా ఉన్నాయి.

ఈ సంబధాలు ఇలా వర్ధిల్లాలన్నదే ప్రజల వాంఛ, అన్ని పక్షాల కోరికా. పాతగాయాలు మాసిపట్టిన తరవాతనే ఈ సంబంధాలను పునరుద్ధరించుకున్నాం. కానీ ఈ సమయంలో మన ఎన్నికల కోసమని "వెయ్యేళ్ళ యుద్ధ బెదిరింపుల" గురించి ప్రజలను హెచ్చరించడం మెరుగవుతున్న సంబంధాలకు హానికరం. ఒక వైపున ఎన్నికలలో గెలుపొందిన భుట్టోను అభినందిస్తూ సందేశం పంపిన ఇందిర మరొకవైపున ఇలా హెచ్చరించటం శత్రుపక్షానికి మాత్రం చులకన కాదా? ఉన్మాదులకు అది ఆహ్వాన పత్రం కాదా? అధికారంలో ఏపక్షం ఉన్నా దేశ రక్షణ సమష్టి ధర్మం. అయితే ఈ ధర్మాన్ని ఎన్నికల చదరంగంలో పావుగా వినియోగించబూనడమే అధర్మం.

# సంస్కరణ - నిర్బంధం

మద్య నిషేధం నిర్బంధం వల్ల సాధ్యపడుతుందా? లేదని తేలిన తరువాతనే దానిని ఒక శాసనంగా అమలు జరపడం మానుకున్నాం. కుటుంబ నియంత్రణ కూడా అంతే. అవసరాలనుబట్టి ప్రవేశపెట్టుకునేవి సంస్కరణలు. నిర్బంధం, ప్రత్తిడీ సంస్కరణ స్వభావానికే విరుద్ధం. జనాభా హెచ్చు తగ్గుల అవసరాన్ని నిర్ణయించగలవి దేశ ప్రయోజనాలు. అందువల్ల జనాభా వృద్ధి క్షయాలకు సంబంధించిన విషయాలలో విద్యావ్యాప్తికి ప్రాధాన్యం ఇవ్వాలి. అంతేగాదు, జీవన ప్రమాణాల మెరుగు తరుగులనుబట్టి కూడా పరిమిత కుటుంబాల సూత్రాన్ని ప్రజలు ఐచ్ఛికంగా ఆమోదించేదీ లేనిదీ ఆధారపడి ఉంటుంది. ఆరోగ్యం మహాభాగ్యమేగాని-ఆ మహత్తర ఆదర్శం తమకు ఆచరణ సాధ్యం అయ్యేవరకూ సంతానమే మహాభాగ్యంగా పేద వర్గాలు భావించుకోవడం సహజం. జీవన ప్రమాణాల భరోసా లభించేవరకూ పుట్టిన పిల్లలు చేతికి దక్కగలరన్న ఆశ అడియాస కానంతవరకూ వారు రెక్కకు మారురెక్క కోసమే తహతహ లాడుతుంటారు. అందువల్ల ఇది కుటుంబ నియంత్రణ సమస్యే కాదు, ఆర్థిక సమస్య కూడా. రెండూ విస్మరించరానివే. ఈ రెంటికీ ముడిపడివున్న సమస్య - అక్షరాస్యత.

కుటుంబ నియంత్రణ ఈసారి ఎన్నికలలో ప్రభుత్వ పక్షానికీ, ప్రతిపక్షాలకూ మధ్య వాద ప్రతివాదాలకు సమస్యగా పరిణమించడానికి కారణం -కొందరు పరిమిత కుటుంబాలకు ప్రతికూలం అయినందువల్లా మరికొందరు అనుకూలం అయినందువల్లా కాదు. ఇది ప్రజల మనోగత భావాలకూ, ఉద్రేకాలకూ సంబంధించిన వ్యవహారం కాబట్టి, దానిని అమలుజరిపే పద్ధతులు ప్రజానుమతిని పొందగలవిగా ఉండాలన్నదే అసలు సమస్య. తరాలనుబట్టి అవసరాలు మారతాయి. రోమన్ సామ్రాజ్యంలో జనాభావృద్ధికోసం మాతృమూర్తులకు సీజర్ చక్రవర్తి భారీఎత్తున పారితోషికాలు ప్రకటించాడు. అది ఆనాటి అవ

సరం కావచ్చు. అగస్తనూ అలాగే చేశాడు. మొదటి ప్రపంచయుద్ధం తరువాత ఇంగ్లాండ్‌లో వివాహ సంస్కరణలతో పాటు కుటుంబ నియంత్రణ పథకాలు కూడా ప్రవేశపెట్టినప్పుడు ప్రభుత్వాలు చాలా గుంజాటనలో పడ్డాయి. ఆనాడు ఇంగ్లాండ్ ఎన్నికలలో కూడా ఇదొక సమస్యగా తలెత్తింది. నియంత్రణ పద్ధతులను ఒక సాకుగా చేసుకొని పురుషులు అసలు తమ మాతృత్వానికే చేటు తెచ్చిపెట్టారని మహిళలు శరపరంపరగా విమర్శలు కురిపించారు. ప్రధాన మంత్రులను "కుటుంబ విచ్ఛిన్నకు"లన్నారు, నీతి దూరులన్నారు, ఇంకేమేమో అన్నారు. సంస్కరణకు ఆహ్వానం చెప్పిన బెర్నార్డ్‌షా కూడా నిర్బంధ పద్ధతులను మాత్రం ఏవగించుకున్నాడు. చివరికి, కుటుంబ నియంత్రణను ఇంగ్లాండ్‌లో ప్రబోధించిన మేరీ స్టోప్స్, అమెరికన్ సంస్కర్త మార్గరెట్ శాంగర్ కూడా ఈ పథకం ఆచరణలో వేసిన వెర్రితలలు చూచి నొచ్చుకోవలసి వచ్చింది.

ఇక్కడ మన దేశంలో కూడా నియంత్రణ అవసరాన్ని ఎవరూ కాదనరు. అయితే విద్యావ్యాప్తికీ, నిర్బంధానికీ ఉన్న వ్యత్యాసాన్ని కూడా గమనించాలి. శాస్త్రీయ పద్ధతులలో జరిగే ప్రచారానికి శాశ్వత విలువ ఉంటుంది. నిరక్షరాస్యులు ఎక్కువగా ఉన్న మన దేశంలాంటి దేశాలలో దీని అవసరం మరీ హెచ్చుగా ఉంటుంది. ఈ అంశానికి మన ప్రభుత్వం తక్కువ ప్రాధాన్యం ఇచ్చినందువల్లనే పెక్కుచోట్ల వాసెక్టమీ,ట్యూబెక్టమీల 'కోటా'లు మించాలన్న తహతహలో నిర్బంధపద్ధతులు కూడా అమలులోకి వచ్చాయన్న ఫిర్యాదులు హెచ్చుగానే వినవచ్చాయి. అన్నింటికంటే ఎబ్బెట్టుగా కనిపించిన విషయం - కొన్ని చోట్ల పెళ్ళిళ్ళు కాని వాళ్ళను, పిల్లలులేని వాళ్ళను కూడా నిర్బంధించడం; అంతే కాదు, మొన్న రక్షణ మంత్రి శ్రీ బన్సీలాల్ ప్రకటించినా ప్రకటించకపోయినా కొన్ని రాష్ట్రాలు నియంత్రణ పాటించకపోతే ఉద్యోగుల వేతనాలు కోతపెడతామని ప్రకటించాయి; మరికొన్ని రాష్ట్రాలు ఇద్దరు,ముగ్గురు పిల్లలకు మించితే ఉద్యోగులకు ప్రమోషన్లు ఉండవని హెచ్చరించాయి; ఇంకొన్ని రాష్ట్రాలు ఒక్కొక్క టీచరు పదేసిమందికి బాధ్యత వహించి ఆపరేషన్‌కు పంపించితే తాను కోరుకున్న చోటుకు బదిలీ చేస్తామని ఆశ పెట్టాయి; కొన్ని చోట్ల ఈ పనిచేసినవారికి ఇళ్ళ స్థలాలకు పట్టాలిస్తామన్నారు. పైగా నిర్బంధం కూడదని ప్రధాని ఇందిర అనేకసార్లు చెప్పిన తరవాత కూడా ఈ పనులు జరిగాయంటే - దీనిని అదుపు తప్పిన వ్యవహారంగానే ప్రజలు భావిస్తారు. అయితే దీనిని పాక్షిక ప్రయోజనం కోసం ఎన్నికల సమస్యగా చిత్రించడంకన్నా విధాన సమస్యగా చర్చించుకోవడం మంచిది.

# మూఢ విశ్వాసాలూ : సైన్సూ

ఇరవయ్యో శతాబ్దం ఆఖరిపాదంలో జీవిస్తున్న మనకు 18-19 వ శతాబ్దాల నాటి మాటలు చెబితే వింతగా ఉండవచ్చు. కాని సమాజసంపదను వినియోగించుకొని సమాజానికే వెన్నుపోటు పొడిచే శాస్త్రవేత్తలు కూడా కొందరు ఉంటారు. ప్రకృతిని మానవునికి దాసోహంచేసి, మానవావసరాలను తీర్చవలసిన శాస్త్రవేత్త మానవుణ్ణి మూఢవిశ్వాసాల వైపునకు నడిపించటం అసాధారణ నేరం అవుతుంది. "అంతటి శాస్త్రవేత్తే దేవుడిని నమ్ముతుంటే నీవెంత"- అని మౌఢ్యంలో ఉన్న సామాన్యులు ప్రశ్నించి, తార్కికశక్తికీ హేతువాదదృష్టికి మరింత దూరమైపోతారు. అందువల్లనే నిరక్షరాస్యుని విశ్వాసం కంటే విద్యాధనులైనవారి మూఢవిశ్వాసం చాలా ప్రమాదకరమైనది. 19వ శతాబ్దపు ఫ్రెంచి ఖగోళశాస్త్రవేత్త లాప్లేను ఒకసారి నెపోలియన్ ప్రశ్నించాడు: "భూమండలం జననరహస్యం గురించి చాలా చెప్పావు కాని, ఎక్కడా దేవుణ్ణి గురించి నీవు ప్రస్తావించలే దేమిటి?" అని. అందుకు జవాబుగా లాప్లే "నాకా ఊహగానీ, అవసరంగాని కలగలేదు" అన్నాడు.

పారిశ్రామికవిప్లవానికి రెండువందల ఏళ్ళూ, సాంకేతిక విప్లవానికి మరి అర్థశతాబ్దంపాటు పాశ్చాత్య ప్రపంచంకంటె వెనుకబడిన ఇండియా పురోభివృద్ధికి ముందు కావలసింది, బడులేగాని, గుడులూ గోపురాలూకావు; సమాజ స్పృహ ఉన్న శాస్త్రవేత్తలేగాని మూఢమతులూ కారు, మత ప్రచారకులూ కారు. అజ్ఞానంలో, నిరక్షరాస్యతలో కొట్టుమిట్టాడుతున్న మన గ్రామసీమలకు శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని వ్యాప్తిచేయాలని ఇందిరాగాంధి బోధించినా, క్షతగాత్రమైఉన్న భారతీయ సమాజం ఆధునిక సాంకేతిక, శాస్త్ర ఫలితాలను అందుకోవాలంటే "తరతరాలుగా జీర్ణించి ఉన్న మూఢవిశ్వాసాలకు" వ్యతిరేకంగా బలమైన ఉద్యమం నడపాలని ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు హక్సర్ చెప్పినా ఉద్దేశం ఇదే. "సామాన్య మానవుని అవసరాలకోసం

సైన్స్" అన్న అంశంపై హైదరాబాద్‌లో ప్రారంభమైన నాలుగురోజుల సదస్సు లక్ష్యం కూడా ఇదే.

కనికట్టువిద్యతో రూపాయలు రాల్చి మనల్ని ఆశ్చర్యపరచే గారడీవాడు నిజానికి మనవరకూ రాకుండానే కడుపులో నీళ్ళు కదలకుండా కోటికి పడగ లెత్తి తన జీవితాన్నే సుఖమయం చేసుకోవచ్చు! కాని అది బతుకు కాదు. కూటికోసం కోటివిద్యలలో అదీ ఒకటి. అలాగే బూడిదనుంచీ, బూసి నుంచీ బంగారం సృష్టించగల దొంగ బాబాలూ సన్యాసులు దేశంలోని దారిద్ర్యాన్ని రూపుమాపగలిగితే ప్రజల మనసుల్లో శాశ్వతస్థానం పొందగలుగుతారు. కాని ఇదీ దొంగ వ్యాపారమే!

కాని మనుషులను కార్యరంగంలోకి దించి, కర్తవ్యాన్ని ప్రబోధించి జీవిత సమస్యలకు హేతుయుక్తంగా పరిష్కారంచూపేది సైన్స్. క్రీడలకూ, సైన్స్‌కూ దగ్గర సంబంధం ఉంది. ఆత్మవిశ్వాసంతో నవనాడులూ కూడ దీసుకొనగల క్రీడాకారుడు నరాల దార్ఢ్యంతో, సెకండ్ల వ్యవధిలో గొప్ప రికార్డులు సృష్టించుకొంటాడు. శాస్త్ర విజ్ఞానం ఫలితం కూడా అంతే. అందుకే యువకులలో సైన్స్, టెక్నాలజీలు సాధించిన మహాద్భుత విజయాలగురించి ఎక్కువ ప్రచారం జరగాలి. ఆ పరిజ్ఞానాన్ని వారికి అబ్బించాలి. భౌతికవాదులైన చార్వాకులను హింసించిన తరువాతనే మనదేశంలో భావవాదం జెండా ఎగిరింది. తార్కికశక్తి నశించినప్పుడే శాస్త్రవేత్తకూడా మూఢమతి అవుతాడు. ప్రాచీన గ్రీసులో అణుశాస్త్రం ప్రబోధించిన హేతువాది డెమోక్రిటస్‌ని అవతలకునెట్టి, ఆకుకు అందని పోకకు పొందని సిద్ధాంతాలు రచించిన అరిస్టాటిల్‌ని మతోద్ధారకులు తలకెత్తుకొన్నది కూడా స్వార్థం కోసమే! అలాగే ఎక్కడైనాను.

"ఎందుకు? ఎలా?" అన్న ప్రశ్నలతో సానతీరవలసిన యువకుల మనస్సులకు నేడు ఎక్కించవలసింది హేతువాదరక్తం, శాస్త్రీయదృష్టి. పదార్థభూయిష్టమైన ఈ ప్రపంచానికి ప్రయోగాలతో చక్కని వ్యాఖ్యానమిచ్చి, అఖండ విజయాలు సాధించి, సమాజాన్ని ముందుకు నడిపించగల శక్తియుక్తులు యువకులకే ఉంటాయి. ఖగోళశాస్త్రంలో పెనువిప్లవాన్ని న్యూటన్ సృష్టించింది 27 ఏళ్ళ వయస్సులోనే. మాక్స్‌వెల్ 29వ ఏట, ఐన్‌స్టీన్ 26వ ఏట, లోబచవస్కీ 33వ ఏటా తమ సిద్ధాంతాలతో వెలుగులు విరజిమ్మారు. హేతువాదదృష్టిని ఈ వయస్సులో కల్పించినప్పుడు దేశానికి ఇద్దరుముగ్గురు కాదు, ప్రతి ప్రాంతానికి పెక్కుమంది జగదీశ్ చంద్రబోసులూ, బాబాలూ, నర్లేకర్‌లూ, ఖురానాలూ పుట్టుకొస్తారు, శూన్యంనుంచి ఏదీ పుట్టదు!

# కవిసమ్రాట్

అర్ధ శతాబ్దంపాటు తెలుగు సాహిత్యాన్ని వివిధ ప్రక్రియల ద్వారా సుసంపన్నం చేసి కవి నిజంగానే నిరంకుశుడనిపించుకున్న సంప్రదాయ వీరుడు ఏకవీరుడు-విశ్వనాథ సత్యనారాయణ కన్నుమూశారు. అపారమైన మేధస్సు, అననతంగాని ఆంధ్రాభిమానం. నిరంతర కవితాఝురి, ఊసర క్షేత్రంగాని ఉపజ్ఞ-విశ్వనాథ సొత్తు. నన్నయ, ధూర్జటి, శ్రీనాథుడు అభిమాన కవులేగాని, వారిలో ప్రతి ఒక్కరినీ తలదన్ని మరీ తలఎత్తుకోగల ప్రతిభా వ్యుత్పత్తులు మూర్తీభవించిన కవి విశ్వనాథ. భావ కవితల నుంచి వీరగాథల వరకూ, కథానికల నుంచి ఇతిహాసాల వరకూ, ఏకాంకికల నుంచి పరిపూర్ణ నాటకాలవరకూ-ఒకటేమిటి అతను చేపట్టిన ప్రతీ సాహిత్య ప్రక్రియా అతని పేరిట కొంగు బంగారంగానే చెలామణీ అయింది. చెళ్ళపిళ్ళకు శిష్యుడైనా తిరుపతి కవుల తరవాత సంప్రదాయ రీతులలో "స్వయంభువు"గా కీర్తిచంద్రికలు వెదజల్లుకొన్న పండితుడూ, కవీ విశ్వనాథ. తలచుకొంటే వారానికి మూడువందల పేజీల నవల రాయగలిగిన ఈయన, కావ్యాలలో, ఖండికలలో సాధించిన శబ్దసృష్టి అపారం. నుడికారాలకు పెట్టింది పేరు. ఏకకాలంలో అతని కలంలో మనం ఎన్నెన్నో పల్లెపదాలు చూస్తాం, జానపదుల కళాసృష్టిని చూస్తాం. అణువులో అందెవేసిన చెయ్యి.

సహజంగానే భావుకుడైన విశ్వనాథ 1930 ల తరవాతకంటే ముప్పైలకు ముందే రచనా సంవిధానంలో పాఠకులకు సన్నిహితులని చెప్పాలి. వయస్సు ముదరని రోజులలో భాషనూ, భావాన్నీ ఆయన ప్రజలకు సన్నిహితం చేసి అమూల్యమైన సాహిత్య సృష్టి చేశారు. చందాలు వసూలు చేసుకొని పుస్తకాలు అచ్చు వేయించుకొని ఇంటింటా తిరిగి అమ్ముకొని జీవించిన రోజులవి. ఆ ఊపులో వెలసిన అపురూప కవితాఖండికలు- "కిన్నెరసాని," "కోకిలమ్మ పాట" కథా సంవిధానంలో శిల్పంలో "ఏకవీర"ను పాఠకులు కళ్ళ

కద్దుకున్నారు. కాల్పనిక రచన "అనార్కలి"ని ఆదరించారు, కమ్మని తెలుగులో ఇమ్ముగా తెలుగు తమ్ములను అలరించిన కమనీయ కావ్యం "కిన్నెరసాని." శివమెత్తిన ఆంధ్రాభిమానంతో "ఆంధ్ర ప్రశస్తి"ని రచించి తెలుగువారందరికీ శివమెత్తించి శిరఃకంపనం చేయించారు. అది ఒడలు పులకరించే రచన. ప్రాచీన ప్రయోగాలలో ఎంత గడుసరో ఆంధ్రత్వంలో అంతటి మహాగర్వి. వర్తమానంలో జీవించుతున్నా పురాణగాధలతో పులకరించే విశ్వనాథ కలాన్నిచూసి పాడుపడినవేంగీ, ముఖలింగక్షేత్రాలు ప్రాచీన శోభలతో తిరిగి నాట్యమాడిన రోజులున్నాయి. అయితే...

ముప్పైఏలనుంచి నేటివరకూ ఆయని కలం కరడుగట్టిన సంప్రదాయాలను అధిగమించలేకపోయింది. అయినా కవిగా శిల్పాచార్యుడుగా ఆయన "వేయిపడగలు" ఒక మహత్తర నవల. కాని అది కాల ప్రవాహ ధాటికి సహజంగా కునారిల్లిపోతున్న ఫ్యూడల్ వ్యవస్థ వేయి తలలతో ఇంకా బుసలు కొట్టచూస్తున్న పరిస్థితికి ప్రతిబింబం. సనాతన ధర్మాలను రక్షించడం కోసం కంకణం కట్టుకున్న "ధర్మారావు" ఎవరోకారు, మన విశ్వనాథ. ఆ పిమ్మట ఆ వరసలో ఇటీవల వెలసిన రచనలలో "పురాణ వైర గ్రంథ మాల" సంపుటాలుకూడా అటువంటివే. ఆయన విశ్వాసాలు ఆయనివి. కాదనలేము. కాని ఆయన అపారమైన మేధస్సు మరొక మలుపు తిరిగి ఉంటే అభ్యుదయగామి అయి ఉంటే అప్పుడది ఎప్పటికీ తరగని, మరవని ఆంధ్రప్రశస్తిగా ఉండి ఉండేది.

# మేలిరకం 'మానవ వంగడం'!

పిదప కాలానికి విపరీత బుద్ధులు పుడతాయంటారు ! జ్ఞాననేత్రాలు ఇస్తుంది సైన్సు. వినాశానికి కాకుండా మానవాభ్యున్నతి కోసం సైన్సూ, టెక్నాలజీ వినియోగపడితే అంతకంటే కావలసింది ఏముంటుంది ? అణుశాస్త్రం విప్లవాలు తెస్తోంది. కృత్రిమ ధాతువుల నెన్నింటినో సృష్టిస్తున్నారు. పదార్థానికి యాంటీమేటర్ (వ్యతిరేక పదార్థం) సృష్టిస్తున్నారు. పరిశోధనాలయాలలో కృత్రిమ పిండాన్ని ఉత్పత్తి చేస్తున్నారు. ఇన్ని పరిణామాలను తెచ్చిపెడుతున్న ఈ మానవుడు ఇప్పుడు తనను తానే పునర్నిర్మించుకోబోతున్నాడు. అదే జెనెటిక్ ఇంజనీరింగ్‌లో రాబోతున్న మహా విప్లవం. ఒక్కొక్క శాస్త్ర ప్రయోగమూ ఒక్కొక్క మూఢ విశ్వాసాన్ని బదాబదలు చేస్తుంది. మనిషి జీవకణాలలో ఇమిడి ఉండి, వంశ పారంపర్యంగా జీవివారసత్వ లక్షణాలను నిర్ణయించే "జీన్స్"ను తారుమారు చేయబోతున్నారు. సృష్టికి ప్రతిసృష్టి.

మనిషి వంశ పారంపర్య లక్షణాలలో పెద్ద మార్పులు తీసుకువచ్చే ఈ శాస్త్రం పేరు "యూజినిక్స్" (Eugenics). రోగాలూ, రొష్టులూలేని కుటుంబాల వృద్ధికి ఈ కొత్త శాస్త్రం తోడ్పడుతుంది. తెగుళ్ళను తట్టుకొని నిలబడగల మేలి రకం వంగడాల మాదిరిగా ఒకరి "జీన్స్"ను వేరొకరి శరీరంలోకి ఎక్కించి వంశానుగతమైన అవలక్షణాలను మార్చివేయడం దీనిలక్ష్యం. డాక్టర్ ఖురానా జీన్స్‌ను విడగొట్టి, "జినిటిక్ కోడ్" రహస్యాన్ని విప్పి చెప్పినప్పుడు కొంత కల్లోలం చెలరేగింది. కృత్రిమ గర్భోత్పత్తి పద్ధతులను వ్యతిరేకించేవారు ఈ సరికొత్త ప్రయోగానికికూడా విస్మయపడక తప్పదు. 'జీన్స్'ను వేరుచేసే ప్రక్రియా ప్రయోగాలు జరుగుతున్నాయి.

మానవులలో వంశ పారంపర్యంగా వస్తున్న అవలక్షణాలు అరవై రకాలని ఇప్పటివరకు అంచనా. ఈ సంఖ్య కొద్ది సంవత్సరాలలో రెట్టింపు కాగల

దని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. మధుమేహం, మానసిక వ్యాధులనుంచి మానవాళిని విముక్తి చేయడానికి ఉద్దేశించిన "యూజినిక్స్" వైద్యశాస్త్రంలో కూడా గొప్ప మార్పులకు దోహదం చేయగలదు.

భవంతి నిర్మాణానికి తయారుచేసిన ఒకానొక నమూనా సరిగా లేకపోతే, నచ్చిన పద్ధతులలో మరొక డిజైన్ వేయించుకొంటాం. అలాగే జీవితాన్నే, శరీర ధర్మాలనే కావలసిన రీతిలో మలచగలదు "యూజినిక్స్". జీన్స మార్పిడివల్ల అనేక వ్యాధులు నయం చేయవచ్చు. అయితే ఈ విప్లవాత్మకమైన మార్పులు మరికొందరు ముసోలనీల, హిట్లర్ల జన్మకు మాత్రం దోహదం కాకుండా ఉండాలని కోరుకొందాం!

# కొల్లూరు - కోహినూరు

బ్రిటిష్ పాలకుల "విభజించి - పాలించే" రాజనీతి చౌర్యకళకు కూడా వ్యాపించినందువల్ల భారత ఉపఖండంలో అశాంతి ప్రజ్వలనకు వారు పెట్టిపోయిన మందు పాతర్లలో కోహినూర్ వజ్రంకూడా ఒకటని, ఇప్పుడు వెల్లడైంది. వెయ్యేళ్ళ చరిత్రగల ఈ అపురూప వజ్రం ఉపఖండాన్ని చీల్చడంలో ఇంతటి ప్రముఖ పాత్ర వహిస్తుందని కోట్లాదిమంది అమాయకులకు తెలియక పోవచ్చు. కాని పాకిస్తాన్ ప్రధాని భుట్టో ప్రకటన నిద్రాణమై ఉన్న అజ్ఞాత సత్యాల నెన్నింటినో బయట పెడుతోంది. ఆఖరిసారిగా ఈ "కాంతి శిఖరం" లేదా కోహినూర్ "ధవళగిరి" బ్రిటిష్ రాణి కిరీటాన్ని అలంకరించేందుకు కదలిపోయింది పంజాబ్ నుంచి కాబట్టి, ఆ పంజాబ్ భాగం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది కాబట్టి, ఈ అమూల్య వజ్రం తిరిగి తమకే దక్కాలని భుట్టో కొత్తగా బ్రిటన్‌కు విజ్ఞప్తి చేశాడు.

హిందూ చక్రవర్తులనుంచి ముస్లిం రాజులకూ ముస్లిం రాజుల నుంచి మొగలాయీ చక్రవర్తులకూ ఆ పిమ్మట పర్షియన్ రాజులకూ కత్తివాటుకొద్దీ ఎత్తువారి చేతిబిడ్డగా సంక్రమిస్తూ వచ్చిన ఈ వజ్రం అసలు తెలుగువాడిదే. ఇది ఆంధ్రాభిమానంతో చెప్పే ముచ్చటకాదు; దురభిమానాలకుపోకుండా చెప్పవలసిన అసలు అచ్చుటే. కృష్ణా తీరాన కొల్లూరు, పరిటాల, గండికోట (కడప) గనులు ఒకప్పుడు - శతాబ్దాల క్రితం అమూల్య శిలలకూ, వజ్రాలకూ నిధులు. ఈ మహాడు గనులలో పనిచేసిన అరవై వేలమంది శ్రామికులు చెమటోడ్చి తిండికీ తిప్పలకూ ఇబ్బందులు పడినా తవ్వితీసిన అపురూప నిక్షేపాలలో ఒకటి ఈ కోహినూర్ వజ్రం. "ఒకొక్కడూ మహాహంతకుడ"న్నట్టు భారతదేశాన్ని కొల్లగొట్టిన నాదర్షా ఢిల్లీ సుల్తానుల తలలుమార్చి, తలలు తరిగి దీనికి 'కో-హి-నూర్" (కాంతి శిఖరం) అని పేరు పెట్టుకోవచ్చు. కాని ఇది ఒకనాటి తెలుగు గడ్డ వెలుగు. నిజానికి ఈ వజ్రంపై ఎవరికైనా అధికారం ఉంటే దాని పుట్టిల్లు అయిన తెలుగు దేశానికి ఉండాలి

లేదా ఆఖరిసారిగా దాని మెట్టినిల్లయిన శిక్కు పాలకుల కేంద్రం అవిభక్త పంజాబ్‌కు ఉండాలి. అంతేగాని "బోడితలకూ మోకాలుకూ ముడివేసే" పద్ధతులు చెల్లనేరవు. లాహోర్ సంధివల్ల రంజిత్‌సింగ్ వారసుడు దిలీప్ సింగ్ అనివార్య పరిస్థితులలో బ్రిటిష్‌వాడికి ధఖలు పరచిన వజ్రం భారత దేశ విభజనకు పూర్వపు పంజాబ్‌నుంచి మాత్రమే. ఈనాడు లాహోర్ పాకిస్తాన్‌లో ఉన్నంత మాత్రాన కోహినూర్ ఇస్లామాబాద్‌కు చెందజాలదు.

భుట్టో వాదన కొత్తదికూడా కాదు. దేశ విభజనాంతరం భారత పార్లమెంటులో ఈ వజ్రం గురించీ, ఇంగ్లాండ్‌కు బ్రిటిష్‌వాళ్ళు దొరతనంతోనూ దొంగతనంతోనూ తరలించుకుపోయిన అనేక కళా ఖండాలూ, చారిత్రక వస్తు సంచయాన్నీ ఇండియాకు తెప్పించుకొనే విషయం గురించీ నెలల తరబడి చర్చలు జరిగాయి. ఆ మాటకు వస్తే "ఈ అమూల్య వజ్రం తిరిగి మనచేతికి చిక్కేవరకూ దేశ స్వాతంత్ర్యానికి పరిపూర్ణత సిద్ధించద"ని ప్రకటించిన తొలి భారతీయుడు సుప్రసిద్ధ శాస్త్రవేత్త సి.వి. రామన్. సమస్యను సమితివరకూ తీసుకుపోవాలని నాడు పార్లమెంటులో గర్జించినవాడు హరీంద్ర నాథ్ ఛటోపాధ్యాయ. కాని బ్రిటిష్‌రాణి పట్టాభిషేక మహోత్సవం సందర్భంగా రగడ మంచిది కాదని కిమ్మనకుండా సరిపెట్టుకొన్నది భారతప్రభుత్వం. పర్యవసానం- ఇంగ్లాండులో పత్రికలన్నీ కోహినూర్ ప్రతిపత్తి గురించి కొత్త వాదనలు సృష్టించడం, ఈనాడు భుట్టో చేస్తున్న వాదనకు ప్రాతిపదికలన్నీ ఆ పత్రికలు ఆనాడే సమకూర్చి పెట్టాయి. "కొత్తసీసాలో పాతసారా" ఇది. కోహినూర్‌కి పట్టిన దుర్గతి అది.

రాజుల చేతులు మారిన ఈ వజ్రం వారి కిరీటాలను ఎగరగొట్టింది. రాజ వంశాలు కొట్లాడుకొన్నాయి. రాణివాసాలలో ముసలం బయలుదేరింది. కుటుంబాలకు, కుటుంబాలే హతమైనాయి. చివరకి బ్రిటిష్ వాడి రాజనీతికి రాజవజ్రమై ఇప్పటికీ ఉపఖండం శాంతికి ఉపద్రవంగానే ఉంది. నేడు బ్రిటిష్ మ్యూజియం అంతా సామంత రాజ్యాల వలసలను కొల్లగొట్టి తెచ్చిన కళాఖండాలతో, అపూర్వ వస్తు సంచయంతో నిండి ఉంది. శతాబ్దాలపాటు ప్రజల ప్రాణాలతో చెలగాటమాడి వేలకోట్లు తరలించుకు పోయినవారికి మణులూ, మాణిక్యాలు లెక్క కాదు. మ్యూజియంలోని గ్రీస్ దేశపు అపురూప పాలరాతి శిల్పం "ఎల్జిన్‌మార్బుల్," పర్షియన్ తివాసీలూ, చైనీస్ చిత్రువులూ, సుందరమైన హిబ్రూ లిఖిత పత్రాలూ, జాపానీస్ దారుశిల్పాలూ, పొలొనేసియన్ల సుందర ప్రతిమలూ, ఈజిప్టియన్ 'మమ్మీ'లూ ఇంగ్లాండ్‌వి కావు. అలాగే భారతీయుడైన తెలుగువాడి కొల్లూరు కోహినూర్ ఇంగ్లాండ్‌దీకాదు, పాకిస్తాన్‌దీ కాదు.

# రాజ్యాంగ సంస్కరణలు

**మన** రాజ్యాంగ చట్టం ఎన్నిసార్లు మారింది, మారవలసి వుంటుంది అన్నది ప్రధాన సమస్యకాదు. చేసుకునే రాజ్యాంగ సవరణలు రాజకీయ స్వాతంత్ర్యాన్ని పదిలపరచగల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సామాన్య ప్రజలకు ఏ మేరకు సంక్రమింప చేయగలవు, అన్నది అసలు సమస్య. 1950 జనవరి 26 న భారత రాజ్యాంగం అమలులోకి రావడానికి ముందు రాజ్యాంగ నిర్ణయ సభలో సాగిన శషభిషలన్నీ ఈ ప్రాథమిక సత్యాన్ని దృష్టిలో పెట్టుకునే జరిగాయి. స్వతంత్ర భారతదేశానికి, మారుతున్న పరిస్థితులకు అనుగుణమైన రాజ్యాంగం అవసరమా లేక, పాశ్చాత్య దేశాలలో కొన్నింటి మాదిరి మార్పులులేని రాజ్యాంగం కావాలా అన్నది ఆనాడుకూడా మీమాంసగానే వుంది. రాజ్యాంగంలో మార్పుల అవసరం, వెసులుబాటు దేనికి అన్న ప్రశ్నకు 1947 రాజ్యాంగ నిర్ణయ సభలోనే పండిట్ నెహ్రూ స్పష్టం చేశారు: "ఈ రాజ్యాంగం మనకు పునాదిగా వుంటుంది. అయితే రాజ్యాంగ చట్టానికి శాశ్వతత్వం వుండకూడదు ... దానిని వెసులుబాటు లేకుండా రాళ్ళకట్టగా మార్చి, ఇదే శాశ్వతం అని చెబితే మీరు దేశపురోభివృద్ధిని జవ జీవాలతో తొణికిసలాడ వలసిన ప్రజల అభివృద్ధినే ఆటంకపరచడం అవుతుంది...అందువల్ల మారుతున్న పరిస్థితులకు తగినట్టుగా రాజ్యాంగం మారవలసి వుంటుంది."

ఈ ఉద్దేశంతోనే కడచిన 26 సంవత్సరాలలోను మన రాజ్యాంగానికి 41 సవరణలు ఆమోదించాం. తిరిగి ఇటీవల కాలంలో ప్రధాని ఇందిర, కాంగ్రెస్ అధ్యక్షుడు బారువా, న్యాయశాఖ మంత్రి గోఖలే పలు సందర్భాలలో సాంఘిక ఆర్థిక సంస్కరణలకోసం మరిన్ని మార్పులు అవసరమని చెబుతూవచ్చారు. నేడు దేశ ప్రత్యేక పరిస్థితులలో అధ్యక్ష పాలనా పద్ధతికి (ప్రెసిడెన్షియల్ సిస్టమ్) గల అవకాశాల గురించి కూడా కొందరు ఆలోచించకపోలేదు. తరు

వాత ఆ వార్తలు చెలామణి నుంచి ఉపసంహరించుకున్నాయి. మరి కొన్నాళ్ళు ఇదికాదు, అసలు ఇప్పటి పార్లమెంటు స్థానే "రాజ్యాంగ నిర్ణయ సభ"ను ఏర్పాటుచేసి, దేశావసరాల దృష్ట్యా చర్చలు జరిపి సరికొత్త రాజ్యాంగాన్నే రచించుకుందామని కొందరు సూచించుతూ వచ్చారు. వీటన్నింటి ఫలితం—రాజ్యాంగం మూల స్వభావంలోనే ఏవో మార్పులు రాబోతున్నవి అన్న అభిప్రాయం జనంలో కలిగింది. కాని మరల కొలది రోజులుగా ప్రధాని, కాంగ్రెస్ అధ్యక్షుడు చేస్తున్న ప్రకటనల ప్రకారం, రాజ్యాంగనిర్ణయ సభ జరగవలసిన అవసరం లేదు; రాజ్యాంగాన్ని మౌలికంగా మార్చవలసిన అవసరమూ లేదు.

కాని కొలది నెలల క్రితమే ప్రధాని ప్రసంగించిన ప్రజాస్వామ్య న్యాయవాదుల సదస్సు సంస్కరణ అంటే ప్రయివేట్ ఆస్తి హక్కు రక్షణకాజును పూర్తిగా మార్చడమేనని, సాంఘికార్థిక పురోగతికి, సోషలిస్టు సమాజ నిర్మాణానికి ఆస్తి హక్కు విరుద్ధమని ఒక తీర్మానం ఆమోదించింది. ఇప్పటికి వచ్చిన సవరణలలో 24, 26, 29, 34 వ సవరణలు - ఈ అంశాన్ని తప్పించి, మిగతా అభ్యుదయ కార్యక్రమాల అమలుకు మాత్రమే ప్రభుత్వానికి సదవకాశం కల్పిస్తున్నాయి. అందువల్ల ఆస్తి హక్కుకు సంబంధించిన స్పష్టమైన అవగాహన పైననే రానున్న కాలంలో దేశాభివృద్ధి స్థాయి ఆధారపడి వుంటుంది. రాజ్యాంగం మన చేతిలో ఒక సాధన మాత్రమే. పార్లమెంటు, ప్రభుత్వమూ, దీనిని సద్వినియోగం చేసుకోవాలి.

# జనతా పార్టీ

రాజ్యాంగ రచనలో మాదిరే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వృద్ధి క్షయాలలో కూడా కొన్ని యూరోపియన్ దేశాలమధ్య పొడసూపుతున్న సామ్యాలు మన దేశానికి అలుముకొంటున్నాయి. బహుళ పక్షాల వ్యవస్థ మనకు నప్పదు కాబట్టి రెండేరెండు రాజకీయ పక్షాలు- అధికార పక్షం, ప్రతిపక్షం— ఉండాలని కొందరు పెద్దలు చాలా ఏటవ్వగా చెబుతున్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంస్కరణాభిలాషి కాబట్టి దౌర్జన్య విధానాలలో విశ్వాసం ఉన్న పక్షాలకు ఇందులో తావులేదు. అమెరికా, బ్రిటన్‌లలో ఆచరణలో ఉన్నది ద్విపక్ష వ్యవస్థ; రిపబ్లికన్‌ల స్థానంలో డెమోక్రాట్లు, వీరు పోతే వారూ, కన్సర్వేటివ్ పార్టీ స్థానంలో లేబర్ పార్టీ, ఇదిపోతే అదీ. ఇలా ఎన్నికలలో చేతులు మారుతుంటాయి. వ్యవస్థలు అలాగే ఉంటాయి. అలాంటి ద్విపక్ష వ్యవస్థ మనకు కూడా అవసరమని కృపలానీ చెబుతున్నారు. అధికారపక్షం దారితప్పి వ్యవహరించకుండా అనధికార పక్షం- ప్రతిపక్షం- అదుపు ఆజ్ఞలలో ఉంచడానికి అవసరమని హెరాల్డ్ గోస్నెల్ ప్రవచించి పోయాడు. చర్చికీ-చాపెల్‌కూ జరిగిన ఘర్షణలో కాథలిక్కులు 'టోరీ'లు గానూ, కాథలిక్కులలో ప్రత్యర్థివర్గం 'విగ్గు'లు గానూ అవతరించారు. పారిశ్రామిక విప్లవం తరవాత, వీరే కన్సర్వేటివ్ పార్టీగానూ, లేబర్‌పార్టీ గానూ తలెత్తారు. రెండింటికీ దూరంగా మధ్యమపక్షంగా పుట్టిన లిబరల్ పార్టీ నానాట క్షీణదశకు చేరుకొంటోంది. అధికారంలోఉన్న పార్టీతో ధర్మ యుద్ధం సాగించడానికి బ్రిటన్‌లో ప్రతిపక్ష పార్టీకి "హిజ్ మెజెస్టీస్" అనో "హర్ మెజెస్టీస్" ప్రతిపక్షం అనో పేరుపెట్టి, దాని నాయకునికి జీతంకూడా నిర్ణయిస్తారు. కాని తెలుసుకోవలసిన అసలు విషయం- ఆ ప్రతిపక్షానికి నిర్దిష్టమైన ప్రవర్తనా నిబంధనావళి ఉంది. రాజ్యాంగ పరిమితులలో సమాజ పరివర్తనకు కృషి చేయవలసిన బాధ్యతలను అది ఆమోదించి

నడుచుకొంటుంది. కాని వీధులకు ఎక్కుదు, విచ్ఛిన్నకర కార్యకలాపాలకు ఒగడు. తిరిగి ఎన్నికలు వచ్చేవరకూ వేచి ఉంటుంది.

ఇప్పుడు మన దేశంలో మార్చిలో ఎన్నికలు జరుగబోతున్న సమయంలో పాత కాంగ్రెస్, జనసంఘ్, భారతీయ లోక్‌దళ్, సోషలిస్టు పార్టీలు కలిసి ఒకే చిహ్నంపైన పోటీచేసి, ఏకైక ప్రతిపక్షంగా అవతరించడానికి "జనతా పార్టీ"గా ఏర్పడ్డాయి. ఎమర్జన్సీకిముందు ప్రధాని ఇందిరకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా తలపెట్టిన ఉద్యమాన్ని "సంఘర్ష సమితి" పేరట నిర్వహించిన పక్షాలు కూడా ఇవే. ఇంకా ఆ సమితి అలానే ఉంది. అధికార కాంగ్రెస్‌కు బలమైన ప్రతిపక్షం అవసరమే. అయితే క్రొన్నేళ్ళుగా ముఖ్యంగా 1969 లో కాంగ్రెస్‌లో చీలిక అనంతరం, ఈ నాలుగు పక్షాలూ ప్రతిపక్షంగా ఏర్పడడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవుతూ వచ్చాయి. కాగా 1971 ఎన్నికలలో చేసినపని కేవలం ఇవి ఎన్నికలపార్టీగా మాత్రమే అవతరించడం. జాతీయ స్థాయిలో గణనీయమైన ప్రతిపక్షం ఏర్పడడానికి కావలసిన హంగులు ఇంకా ఈకొత్త పార్టీకి ఏర్పడలేదు. ఎన్నికల తరవాత "పార్టీ"గా ఏర్పడేందుకు ప్రయత్నిస్తున్నామని మాత్రమే ఇప్పుడు చెబుతున్నాయి. ఇప్పటి వరకూ అవి ఏర్పడక పోవడానికి కారణం— నిర్బంధ విధానం అని వారు చెప్పవచ్చు. కాని అసలు కారణం, ఈ "జనతా పార్టీ"లో ఏ ఒక్క దానికీ మరొకదాని సిద్ధాంతంతో పోలిక లేదు. సోషలిజాన్ని విశ్వసించే సోషలిస్టుపార్టీకి జనసంఘ్‌తో పొత్తు ఎలా కుదురుతుందో అనూహ్యం.

ఇక జనతాపార్టీ లక్ష్యం- "పార్లమెంటరీ డెమోక్రసీపై ఆధారపడిన సోషలిస్టు వ్యవస్థ." కాని కమ్యూనిస్టుల నుంచి కాంగ్రెస్‌వాదుల వరకూ ఈ సిద్ధాంతాన్ని విశ్వసిస్తున్న దశలో 'ఏది సోషలిజం' అని ఓటర్లు ప్రశ్నించుకోడానికి తప్ప కొత్తదనం లేదు, నూతన ధోరణి లేదు. కొత్తపార్టీ చెప్పే గాంధీ సిద్ధాంతాలూ కాంగ్రెస్ విశ్వసిస్తున్నవే. ప్రజలు అందరికీ కావలసిన వారు కాబట్టి "జనత" కొత్తపార్టీకి నామధేయం కావడం సంతోషించదగ్గ విషయం.

# జనతా పార్టీ ఎన్నికల ప్రణాళిక

భారత ప్రజలు ఎప్పటికప్పుడు ఆశాభంగం పొందుతున్నది. రాజకీయ పక్షాల వాగ్దానాలవల్లకాదు అవి చేసినబాసలేవీ అధికారం స్వీకరించిన దరిమిలా ఆచరణలోకి రానందువల్లనే. రాజకీయ స్వాతంత్ర్యం ఆర్థిక స్వాతంత్ర్యం వల్లగాని పరిపూర్ణంకాదు పెట్టుబడిదారీ విధానమా, సోషలిజమా– ఈ రెండింటిలో ఏదో ఒక మార్గాన్ని నిశ్చితంగా అనుసరించకుండా మనదేశంలో కలగాపులగపు ఆర్థిక వ్యవస్థను పెంచి పోషిస్తోంది. దీని ఫలితాలు ఒక ముఖంగా లేవు. ఇవి అన్ని రంగాలలో ప్రజల నిరాశకు కారణమయింది. అసమానతలనూ, అసంతృప్తినీ పెంచింది. ఈ నిరాశ పలురూపాలలో వ్యక్తమవుతోంది. అధికార పక్షం వాగ్దానాలలోనూ, ప్రతిపక్షాల ప్రతిజ్ఞలూ విలువ కోల్పోతున్నాయి. అయితే సమస్యల చౌరాస్తాలో వున్న సామాన్య ప్రజలకు ఎప్పటికప్పుడు మన ఎన్నికలు కొత్త ఆశలు కల్పిస్తున్నాయి. వీటి సరికొత్త రూపకల్పనే జనతాపార్టీ ఎన్నికల ప్రణాళిక ఎమర్జన్సీ రద్దూ, అక్రమ చట్టాల ఉపసంహరణా, పౌర హక్కుల పునరుద్ధరణా– వీటికి సంబంధించిన జనతా పార్టీ విమర్శలతోగాని, డిమాండ్లతోగాని ఎవరికీ పేచీ వుండదు.

అంతేకాదు, జనతాపార్టీ ప్రణాళికాకర్త లెవరన్నది కూడా ప్రధానం కాదు. చేస్తున్న వాగ్దానాల స్వభావం ఏమిటన్నదే అసలు ప్రశ్న. దీని రాజకీయానికి దూరదృష్టి ఉంది. బ్రిటన్‌లో మాదిరో యే అమెరికాలో మాదిరో ''ద్విపక్షవ్యవస్థ''ను సుసాధ్యం చేసుకోవడం జనతాపార్టీ నాయకుల ఉద్దేశ్యం. ఎమర్జన్సీరద్దు ఒక్కటే ప్రధానంకాదు. ఆ దరిమిలా కార్యక్రమం పరిశీలన కూడా అవసరం. యుద్ధ కాలంలో సైతం ఎమర్జన్సీని ప్రవేశపెట్టనంత మాత్రాన కన్సర్వేటివ్ చర్చిల్ బ్రిటన్‌లోని సామాన్య మధ్యతరగతి, ప్రజలకూ, వారి ప్రయోజనాలకూ హితుడని చెప్పలేము; లేదా ఏ రామ్‌సేమాక్డొనాల్డు లేబర్ పార్టీ ప్రధాని అయినంత మాత్రాన ఇండియా స్వాతంత్ర్య ప్రయోజనాలను గానీ బ్రిటిష్ కార్మిక వర్గ అవసరాలను గాని ఆదుకొన్న మహనీయుడనీ చెప్పలేము. ఇక్కడ అధికారంలో ఉంది కాంగ్రెసు. రాజ్యాంగంనుంచి "ఆస్తి హక్కు"ను తొలగించడానికి అది ఎలాగూ సాహసించలేదు. కానీ జనతాపార్టీ ప్రాథమిక హక్కులనుంచి ఆస్తి హక్కును తొల

గించడానికి సుముఖత ప్రకటించింది. 'ఎంత గొప్ప విషయం'. కాంగ్రెసునూ, కొన్ని వామపక్షాలను సైతం వెనక్కినెట్టి జనతాపార్టీ "ముందడుగు" వేసింది. నిజానికి 'హూ ఓన్స్ ఇండియా' ("ఈ దేశం ఎవరిది?") అన్న పుస్తకం రాసిన అశోక్ మెహతా ఆస్తిహక్కు తొలగిపోవాలని చెబితే పోనీ పాత సోషలిస్టుగానైనా విశ్వసించగలం. కానీ ఎక్కడి మొరార్జీ దేశాయ్? ఆస్తి హక్కును రద్దు చేయడానికి ఆయన అంగీకరించడమేమిటి? 'కల కాకపోతే వైష్ణవమాయ కావచ్చు'. ఆర్థిక స్థితిగతుల తొక్కిసలాటలో నిత్య జీవితానుభవాలవల్ల రకరకాల అసంతృప్తితో ఉన్న ఓటర్లను ఊరడింపు చరణంగానయినా ఉత్సాహ పరుస్తున్న నినాదాల్లో ఒకటి "సోషలిజం". కాని అసలు కథ వేరు.

ఇంతగా ఆస్తి హక్కు పట్ల వైముఖ్యం ప్రదర్శిస్తున్న జనతాపార్టీ ప్రణాళిక తమది "గాంధేయ సోషలిజం" అని పేరు పెట్టుకొంది. నిజానికి గాంధీజీ తనది గ్రామ స్వరాజ్యం అన్నారు. కానీ సోషలిజం అని ఎక్కడా చెప్పలేదు. కాంగ్రెసుతో పోటీ కోసం ఆస్తి హక్కు తొలగాలని జనతాపార్టీ చెబుతోంది. కాని ఈ పార్టీ ఉద్దేశ్యం మాత్రం అది కానేకాదు. అందుకే ఆ "హక్కు"ను ప్రాథమిక హక్కుగా కాకుండా చట్టబద్ధమయిన [స్టాట్యుటరీ హక్కు]గా పరిగణించాలనీ, తద్వారా తిరిగి ఆస్తి రక్షణ పేరిట కోర్టులను సాధనాలుగా వినియోగించుకోవాలని కూడా చెబుతోంది. అందుకే మొరార్జీ ప్రభృతులు ఇందుకు అంగీకరించారు. అంటే ప్రాథమిక హక్కులనుంచి తొలగిపోతే "ఆస్తి హక్కు"ను కోర్టుల ద్వారా చట్ట సమ్మతం చేసుకోడానికి ఏలాంటి అభ్యంతరమూ ఉండదన్నమాట. అంటే మళ్ళీ మనకు గోలక్‌నాథ్ కేసులూ, కేశవానంద భారతి కేసుల కామాటం మరొక రూపంలో తప్పదన్నమాట. ఉన్నమాట చెబితే ఓటరు హర్షిస్తారు. తెలివి ఎవరి సొమ్ము. లేనిభ్రమలు కల్పించడంవల్ల ఫలితమేమిటో ఈ నాటి దేశ పరిస్థితులే అనుభవ సత్యాలు.

చివరికి జనతాపార్టీ వ్యవసాయాభివృద్ధి పేరిట భారీ పరిశ్రమాభివృద్ధినే [illegible] రేకిస్తోంది. నిరుద్యోగ సమస్యకు పరిష్కారం దేశాన్ని [illegible] కుటీర పరిశ్రమల స్థానానికి మాంధాతల కాలాని నెట్టడం కాదు. [illegible]జానికి తగినంత పరిశ్రమాభివృద్ధి జరగనందుననే వ్యవసాయంపై వత్తిడి పెరుగుతోంది. తద్వారా ఉపాధికోసం పల్లెల నుంచి పట్టణాలకు వలసలు సాగుతున్నాయి. ఈ రెండు రంగాల అసమస్థితికి కూడా కారణం- మన ఆర్థిక వ్యవస్థకు చుక్కాని లేదు; గమ్యం అసలే లేదు. ఇక ప్రజల హక్కుల రక్షణ అంటారూ, అధికారంలో ఎవరు ఉన్నా ఆ హక్కులకు పూచీదారులు మళ్ళీ ఆ ప్రజలే గానీ మరొకరు కాజాలరు. అప్రమత్తతకు దగ్గర బంధువు ఎవరయినా ఉంటే - అది అనుభవం తప్ప మరొకటి కాజాలదు.

# శుభాకాంక్షలు

"స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందడం, శ్రమఫలితాన్ని అనుభవించడం, నిత్యజీవితావసరాలను తీర్చుకోడం, తద్వారా తమ అభివృద్ధికి పరిపూర్ణ మయిన అవకాశాలను కల్పించుకోడం - ఇవన్నీ ఇతర దేశాల ప్రజల మాదిరే భారత ప్రజల హక్కులు. ఈ హక్కులు అవిభాజ్యమయి నవని మేము భావిస్తున్నాం. అంతేగాదు, ఈ హక్కులను ఏ ప్రభుత్వం హరించివేసినా, లేదా అణచివేసినా అలాంటి ప్రభుత్వాన్ని గద్దెదించేహక్కు, లేదా రద్దుచేసే హక్కు ప్రజలకు ఉంటుంది" ఇది నలభై ఎనిమిదేళ్ళనాడు (1929) జాతీయ కాంగ్రెస్ లాహోర్ మహాసభలో ఆమోదించిన తీర్మానం. దీనికే చరిత్రాత్మకమయిన "లాహోర్ ప్రతిజ్ఞ" అని కూడా పేరు. ఈ హక్కును భారత ప్రజలు సద్వినియోగం చేసుకోడం ఇది రెండవదఫా. మొదటిసారి - స్వాతంత్ర్య సమరంద్వారా పరాయిపాలనకు స్వస్తిచెప్పడం, రెండవసారి - స్వాతంత్ర్యానంతరం తొలిసారిగా కాంగ్రెస్ స్థానంలో ప్రతి పక్షం అధికారంలోకి రావడం.

పాత నీరు పోయింది కొత్త నీరు ఎక్కింది. భారత రాజకీయ చరిత్రలో కాంగ్రెస్ శకానికి గ్రహణం పట్టింది పరదాస్య బంధాలను తెంచివేసేం దుకు నూరేళ్ళ జీవితంలో ఉద్యమాలు నిర్మించి, ఉత్సాహం కలిగించి స్వాతంత్ర్య సమరానికి తిరుగులేని నాయకత్వం వహించిన జాతీయ కాంగ్రెస్ చీలికలతో చివికిపోయి ప్రతిపక్ష స్థానాన్ని అలంకరించవలసి వచ్చింది. స్వాతంత్ర్యానంతరం ముప్పయ్యేళ్ళ కాంగ్రెస్ ఆధిపత్యానికి ఆరవ లోక్‌సభ ఎన్నికలతో పెద్ద గండి పడింది. 1977 మార్చి 24 వ తేదీ నూతన శకా రంభం. ఈ "జనతా" శకావతరణకు మంత్రసానితనం వహించిన ఘనత కూడా ఒక విధంగా కాంగ్రెస్‌దే. ప్రజా వ్యతిరేకమయిన దాని చర్యలే

తొలిసారిగా కాంగ్రెసేతర పక్షాన్ని - జనతాపార్టీ - కేంద్రంలో అధికారంలో నిలబెట్టాయి. సుఖాలు అనుభవించడానికి ప్రతి ఒక్కరూ ముందుకు వస్తారు. కాని కష్టాలలో అందరూ కలవడమే అరుదు. ఇరవై మాసాల ఎమర్జన్సీ పరిపాలన నిర్బంధకాండ కొన్ని ప్రతిపక్షాల సమైక్యానికీ, ఐక్యమైన ప్రతిపక్షాన్ని ప్రజలు ఆశీర్వదించడానికీ దోహదం చేసింది. శ్రీ మురార్జీ దేశాయ్ నూతన ప్రధాన మంత్రిగా జనతా పార్టీ అధికారంలోకి వచ్చిన సందర్భంగా మా శుభాకాంక్షలు అందజేస్తున్నాం.

ఈ ఆశీస్సులకూ, ఆశీర్వాదాలకూ విలువా, గౌరవం ప్రభుత్వాలకూ ప్రజలకూ మధ్య ఏర్పడి వృద్ధిచెందే సాన్నిహిత్యాన్నిబట్టీ, పరస్పర సంబంధాలను బట్టీ నిర్ణయమవుతూ ఉంటుంది. ఈ రోజున గెలిపించిన ప్రజలే లేదా ఈ రోజున ఓడించిన ప్రజలే రేపు రాజకీయపక్షాల ద్వారా బలాలనుకూడా తారుమారు చేయగలవారు. నిత్యజీవితంలో తిండీ, బట్టా, వసతీ, ఉపాధి సమస్యలతో సతమత మవుతున్న సామాన్య భారతీయుని దృష్టిలో "ప్రభుత్వా"నికి అర్థం వేరు ఇంతవరకూ అతని జీవిత నిఘంటువు చెప్పే అర్థం - ఎన్నికలలో మాత్రమే రాయితీలు కనపడతాయనీ, ఆ తరువాత అవి కూడా ఉండవనీ ఈ తప్పు నిర్వచనాన్ని తొలగించుకోడానికి అతను ముప్పయ్యేళ్ళుగా నిరీక్షిస్తున్నాడు. కొత్త అర్థంకోసం పడిగాపులు పడుతున్నాడు. ఈ అనుభవమే అతనికి కూసువిద్యగా పరిణమించి ఉండకపోతే - ఇతర నియోజక వర్గాలు వేటికన్నా అమితవేగంగా ప్రగతి సాధించేటట్టు జాగ్రత్తలు పడినప్పటికీ రాయబరెలీ ప్రజలు ఇందిరనుగానీ, భివానీ వోటర్లు బన్సీలాల్‌ను గానీ తిరస్కరించి ఉండేవారుకారు. ఆర్థిక ప్రగతికి అర్థం ధనికులు మరింత ధనికులు కావడం కానేకాదు.

పాలకులకూ ప్రజలకూ ఇలాంటివి ఎన్నో గుణపాఠాలు. ప్రజల అసంతృప్తికి అసలు కారణాలు గమనించాలి. ఆర్థిక అసమానతలకు తోడు అహింసాయుతమయిన ఆందోళనకు కూడా అవకాశంలేని దశలో ప్రజలు చరిత్రాత్మకమయిన తీర్పు చెప్పారు. ప్రజలలో కాంగ్రెస్‌పై వ్యక్తమయిన ఈ అసహనాన్ని సద్వినియోగం చేసుకున్న నిన్నటి ప్రతిపక్షం నేడు పాలనా బాధ్యతలు చేపట్టింది. ఎన్నికల ప్రచారంలో జనతాపార్టీ ప్రజలకు రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమస్యలపై పెక్కు వాగ్దానాలుచేసింది. ఎమర్జన్సీ దానిని అంటిపెట్టుకుని పెరిగిన నిర్బంధ చట్టాలకు స్వస్తిచెప్పడం, పౌర హక్కులను పునరుద్ధరించడం దీని లక్ష్యం. ఇందుకు ప్రజాస్వామ్యవాదు లందరూ హర్షిస్తారు. ప్రజలు ఆనందిస్తారు. "జనతా" కృషికీ, మాటనిలకడకూ జోహారులర్పిస్తారు. అయితే అన్ని ప్రభుత్వాల మాదిరే "జనతా"

ప్రభుత్వానికి కూడా అగ్నిపరీక్ష ప్రారంభం అయ్యేది- ఆర్థిక, సాంఘిక సమస్యలను పరిష్కరిం చడంలోనే. కాంగ్రెస్‌పాలనలో ముప్పయ్యేళ్ళపాటు సహనంతో ఉన్న ప్రజలు జనతా కార్యక్రమం అమలులోకి రావడానికి మరి పదేళ్ళ వ్యవధి కల్పించడానికి సంకోచించరు. నూతన ప్రధాని మురార్జీ చెప్పి నట్టు "ప్రజలు ఎన్నో ఆశలతో" జనతా పార్టీని అధికారంలోకి పంపించారు. పార్టీ ప్రణాళికలో రూపొందించిన కనీస కార్యక్రమాన్ని పూర్తిగా, సాకులూ షరతులూ లేకుండా అమలు జరపడంద్వారా "జనతా" ప్రభుత్వం ప్రజల ఆశలకు రెక్కలు తొడగడమేకాదు, నిరంతరం ఆశీర్వాదాలు పొందగలు గుతుంది.

# శేషప్ప అయ్యర్ - కాళీముఖర్జీ!!

ఒక్కొక్కప్పుడు మానవుని దృష్టి మహా వక్రంగా మారుతూంటుంది. ఒక పట్టున శిశువులా వ్యవహరిస్తాడు, మరొక తట్టున పశువులా ప్రవర్తిస్తాడు, ఇంకొక్కప్పుడు మేధాశక్తితో నింగిదారులలో ప్రయాణిస్తాడు. ఇలాంటి వక్రగతులు "పామరుల"కే కాదు, పండితులకు కూడా తప్పవేమో అని పిస్తుంది. లోకంలో ఉన్న చెడునంతా ఇతరులకు అంటగట్టి మంచి అంతా తాము మూటగట్టుకోవాలనుకోవడం అల్పదృష్టి. ముఖ్యంగా వస్తువుకీ, కావ్య గుణాలకీ తప్ప స్థల కాలాలకు అందని మహాకవుల విషయంలో ఇది మరీ సత్యం. "నేడు బెంగాల్ ఊహించిన దానిని రేపు అఖిల భారతం ఆచరిస్తుంద" అనేవాళ్ళు మనవాళ్లు. బహుశా ఈ ఆశతోనే అయిఉంటుంది - కలకత్తాలో జరిగిన కాళిదాస జయంతి సభలలో ఒక పండితుడు, కాళిదాసు బెంగాలీ అని దండోరా వేశాడు. నిరాధారమైన ఊహలకు నిచ్చెనవేస్తే ఎలాంటి నిర్ణయాలకు రావచ్చునో చెప్పడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

నిజానికి ప్రాచీన కవులు అనేకమంది ఊరూపేరులు, కవి కాలాలు తెలియకుండానే కావ్య ప్రపంచానికి, వ్యావహారిక ప్రపంచానికీ వాళ్ళ మహాకావ్యాల ద్వారా పరిచితులై వేనోళ్ళ కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించుకొన్నారు. అలాంటి వాళ్ళలో కాళిదాసుకూడా ఒకడు. అయినా వర్తమాన కాలంలో కూడా ఫలానా కవి రాసిన కావ్యం లేదా నాటకం అతడు రాయలేదని మరొకరు రాశారని కొట్లాడుకొంటున్న దశలో కాళిదాసును గురించిన మీమాంసకు ఆశ్చర్య పోనక్కరలేదు. కొలది సంవత్సరాలనాడు తెలుగుదేశంలో "కన్యాశుల్కం" నాటకాన్ని అర్ధశతాబ్దం నాటి గురజాడ రాయనే లేదని చెప్పడానికి విఫలయత్నం జరిగింది. అది రచనకు సంబంధించింది అనుకొంటే కాళిదాసుది జన్మరహస్యం. ఒకప్పుడు షేక్స్పియర్ ఇంగ్లీషువాడుకాడు, తమిళనాడులోని తిరుతురై పండిత బ్రాహ్మణుడు, ఇతని అసలు పేరు "శేషప్ప అయ్యర్" అని ఒక మద్రాసు పండితుడు తవ్వి తేల్చాడు. అయితే తమిళ

శేషప్పయ్యర్‌ను ఆ తరవాత ఒక పంజాబీ పండితుడు తరిమి తరిమి ఇతడు 'అయ్యర్' కాదు, 'షేక్ పీర్' అన్నాడు! కాని చిత్రమైన విషయమేమిటంటే, ఇంగ్లాండ్‌లో పుట్టిన షేక్స్‌పియర్ - బైరన్‌ల పుట్టు పూర్వోత్తర రభస అక్కడ సమసి పోయినా, మనకి మాత్రం ఆ పాడు సాంప్రదాయం ఇక్కడ నశించిపోలేదు.

అంతేగాదు. "కిరాతార్జునీయం" కర్త భారవిని ఉత్తర, దక్షిణ భారతాలు తమ వాడంటే తమవాడని కొట్లాడు కొంటున్న సమయంలో, కాదు అతడు అసలు సిసలు ఆంధ్రుడన్నవాళ్ళు కూడా లేకపోలేదు. మాఘకవి 'శిశుపాల వధ'నూ, కాళిదాసుని మేఘ సందేశాన్నీ వ్యాఖ్యానించడానికి తన కాలాన్నంతా వెచ్చించిన మల్లినాధ సూరికి కూడా తట్టని జన్మరహస్యాలు మనవాళ్ళకి తట్టడమే గొప్ప. నిజానికి ప్రాచీనులు చూచింది కవుల కావ్యగుణాలనూ, అందులోని వస్తువును మాత్రమే. అందుకే అతడు "ఆధారంలేని రచన చేయను అనవసరమైనదేదీ చెప్పను" అని అంటాడు. ఒక మబ్బు తునకకు మూడు కోట్ల అలంకారాలు చేయగల సమర్థుడైన కాళిదాసు నాలుగుచెరగులా ఉన్న ప్రకృతి సౌందర్యాన్ని ముత్యాల పేటగా వర్ణించగలవాడు- "ఉపమా కాళిదాసస్య." మేఘసందేశంలోనూ, కిరాతార్జునీయంలోనూ ఇంద్రకీలాద్రిగురించి వర్ణించారు కాబట్టి కాళిదాసు భారవులు బెజవాడ వాళ్ళంటే ఎలా ఉంటుంది? మేఘసందేశంలో 'గంభీరానది' గురించి చెప్పాడు కాబట్టీ, మేఘ సందేశం రాశాడు కాబట్టీ విశాఖవద్ద గంభీరం గెడ్డ రిజర్వాయర్‌వద్ద కొన్నాళ్ళూ, మేఘాద్రి గెడ్డవద్ద కొన్నాళ్ళూ గుడిసె వేసుకొని కావ్యం అల్లాడంటే చెల్లుతుందా? చిత్తరంజన్‌దాస్ బెంగాల్‌వాడైనంతమాత్రానకాళిదాసుకూడా బెంగాలీవాడే కావాలా? లేక కాళీముఖర్జీ కాళిదాసుగామారాడా? ఆమేఘదూతలోనే ఒక చోట "తన్వీశ్యామా శిఖరిదశనా" అన్నాడని చెప్పి, అందమైన ఆడవాళ్ళు నీలమేఘచ్ఛాయలో ఉంటారని భావించి, కాళిదాసుని ఒక ఆదివాసిగానో, ఒక కోయవాడుగానో చెపితే సరిపోతుందా? స్థల కాలావధులు దాటిన వస్తువు వల్లనే కవి కలం సార్వజనీన మవుతుంది. అదే కాళిదాసాదుల విషయంలో చెరపరాని సత్యం. అందువల్లనే అభిజ్ఞాన శాకుంతలం చదివిన జర్మన్ కవి గెటే గంతులువేశాడు గాని, కాళిదాసు జర్మనీవాడైనందువల్ల కాదు. అల్లాగే రష్యన్ రచయిత తుర్జనీవ్ భార్య పారిస్ వెడితే ఆమె అందచందాలను చూసి ఆవిడను "శాకుంతలం" అని వారు వర్ణించినది కాళిదాసు ఫ్రెంచివాడో, పారిస్ పౌరుడో అయినందువల్లకాదు. కాబట్టి కాళిదాసు కవిత్వం ఎంతైనా ఫరవాలేదుగాని, మన పైత్యం కొంతైనా ప్రమాదకరమైనదే అవుతుంది!

# అవి(నీతి)కథలు

అధికార పక్షం, ప్రతిపక్షం రాజకీయ సుందోపసుందులు, ఆరోపణలూ ప్రత్యారోపణలూ ఒక పెద్ద ఆనవాయితీ. కులమతాలకూ, ఆశ్రిత పక్షపాతాన్నీ స్వార్థ ప్రయోజనాలకోసం ఆశ్రయించుకొన్న రాజకీయ పక్షాలు ఆర్థిక వ్యవస్థలలోని తీవ్ర వ్యత్యాసాలను మరింతగా రెట్టిస్తూంటాయి. ఆర్థిక అసమానతలు అవినీతిని పెంచుతాయి. అవినీతి అధికారానికి దగ్గర బంధువు. అవినీతికి ఆశ్రయం రకరకాల రాయితీలు. మనం ఎంచుకునే వ్యవస్థ స్వరూపాన్నిబట్టిగాక దాని స్వభావాన్నిబట్టి ఈ చెడుగులకు పరిష్కారం సాధ్యపడుతుంది. అవినీతిలో యూరోపియన్ దేశాలకూ అమెరికాకూ ఒక తేడా ఉందట: ఒకటి సామాజిక వర్గ సంబంధాలనుబట్టి నిర్ధారణ అవుతుందట; మరొక దానికి "అవినీతే జీవనాధారమ"ట. అలా అని అమెరికన్ సామాజిక శాస్త్రవేత్తలు నిర్వచించారు. ప్రపంచ వ్యాపితంగా పార్లమెంటరీ వ్యవస్థలకు పుట్టిల్లుగా మనం చెప్పుకొనే ఇంగ్లాండ్‌లో చాలాకాలంగా అమలులోఉన్న ఒక పద్ధతి- పార్లమెంటులోనే ఒక 'గల్లాపెట్టెదారు' (పే మాస్టర్) ఏర్పడడం. ఇతనినే 'విప్' అంటారు. పార్లమెంటు సభ్యులు ఇతనిద్వారానే నోట్లు బేరం పెట్టుకుంటారు. ఇదొకరకం అవినీతి. పరిపాలనా నిర్వహణలోని అవినీతిని అదుపుచేయడంలో హామిల్టన్‌కూ జఫర్‌సన్‌కూ మధ్య జరిగిన కుస్తీలకు అమెరికన్ పార్లమెంటరీ చరిత్రలో ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. "ఒక క్రమపద్ధతిలో శాసన వేదికను-లెజిస్లేచర్-అవినీతిపాలు చేయడం ద్వారానే రాజకీయ యంత్రాన్ని పటిష్టం చేయగలం" అని నమ్మినవాడు హామిల్టన్. ఫ్రాన్స్ మరొక కొత్త 'ప్రయోగాని'కి విత్తులు నాటింది. ఫ్రెంచి పార్లమెంటు సభ్యులలో హెచ్చుమందిని "స్టాక్ మార్కెట్‌లో వాటాల క్రయ విక్రయాల మాదిరిగానే కొనవచ్చు అమ్మనూవచ్చు"నట. ఇదొకరకం అవినీతి.

వీటి అన్నింటి ప్రభావం మన పార్లమెంటరీ వ్యవస్థలో కూడా తరచుగా తొంగిచూస్తోంది. లేకపోతే అధికార పక్షంనుంచీ ప్రతిపక్షాలనుంచీ అటువారు ఇటూ, ఇటువారు అటూ తరచుగా ప్లేట్లు ఫిరాయించడానికి మరొక కారణం కనిపించడం లేదు. మనదేశంలో అవినీతి ఒక భారీ పరిశ్రమ కావడాన్ని పన్నెండేళ్ళనాడే సంతానం కమిటీ నిరసించింది. "ప్రభుత్వం పైన ప్రజల విశ్వాసం సడలకుండా కాపాడుకోవాలంటే ప్రజాజీవితంలో అత్యున్నత స్థానాలలో ఉన్నవారిపై వచ్చిన ఫిర్యాదులను విధిగా విచారించి తీరాలి" అని కమిటీ సిఫారసు చేసింది. కాని మనకు తరచుగా కమిటీలూ వాటి సిఫారసులూ మ్యూజియంలో భద్రపరచదగిన కళాఖండాలుగా ఉండిపోతున్నాయి. గుల్జారిలాల్ నందా హోం మంత్రిగా ఉన్నప్పుడు ఒక ప్రయత్నం చేశారు; ప్రతిరోజూ అవినీతి గురించిన ఫిర్యాదులు దాఖలు చేసుకొనేవారికి తన బసవద్దనే ఒక కౌంటర్ ఏర్పాటు చేసారు. అయినా అనుకున్న ప్రయోజనం నెరవేరక ఆయన ఆ ప్రయత్నమే మానుకున్నారు. బహుశా ఇలాంటి ప్రయోగాలు పరిశీలించిన పిమ్మటనే సుప్రసిద్ధ ఆర్థికవేత్త గునార్ మిర్డాల్ "పెచ్చరేగిపోతున్న అవినీతి దక్షిణాసియా ప్రభుత్వాల స్థిరత్వాన్నీ అస్థిత్వాన్నీ సవాలు చేస్తోంది" అని రాసాడు.

అధికారంలో ఏపక్షంఉన్నా ఆర్థిక వ్యవస్థలకు మూలమయిన దోపిడీవిధానాలు మారనంతవరకూ రకరకాల అవినీతి అలవాటుగా, నిత్యకృత్యంగా ఉండిపోతుంది. ప్రతిపక్షాలు ఏదో ఎన్నికల సందర్భంగా అవకాశం చూసుకుని గోరంతలు కొండంతలు చేస్తున్నాయి. అయితే ఇటీవల కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలూ శిస్తులూ, పించన్లూ, ఉద్యోగుల కరవుబత్తాలు, వైద్యబత్తాలూ, ఇళ్ళ అద్దె అలవెన్సులూ, కొత్త పథకాల విషయంలో కల్పించిన రకరకాల రాయితీలు లోగడ ఎన్నికలలో కూడా ఉన్నవే. కాకపోతే సామాన్య ఓటర్లు కోరుకునేదల్లా- ఈ రాయితీలు సాధారణ పరిస్థితులలో కూడా తమకు అయాచితంగా సమకూడితే ఎంత బాగుండును అని మాత్రమే !

# అర్లీన్స్ రాణి-అలహాబాద్ నాయన

ఒకరి జయం మరొకరికి అపజయం. ఒకరి చేదు మరొకరికి తీపి. రాజకీయాలలోనూ అంతే. "వాటర్లూ" యుద్ధం వారికి కీర్తి సంపాదిస్తే ఫ్రెంచి వారికి అపకీర్తి తెచ్చిపెట్టింది. భారతదేశ చరిత్రను మలవడంలో మూడు యుద్ధాలకు అపారమైన ప్రాధాన్యం ఉందన్నాడు కె.ఎం. ఫణిక్కర్. కళ్ళికోట, పానిపట్, ప్లాసీ. అలాగే దేశ స్వాతంత్ర్యానంతరం భారత రాజకీయాలలో విచిత్రమైన, విశిష్టమైన పరిణామాలకు దారి తీస్తున్న ఆరవ లోక్ సభ ఎన్నికల సమరానికి, రాయ్‌బరేల్లి నియోజక వర్గంనుంచి వచ్చిన ఎన్నికల ఫలితానికి అంతటి ప్రాధాన్యం వుందని చెప్పాలి. ఈసారి ఎన్నికల ఫలితాలు దేశ ప్రగతిని ఎటువైపుగా తీర్చిదిద్దగలవో ఇప్పుడే చెప్పలేము గాని, ఈ ఫలితాలు ఉత్తర, దక్షిణ భారతాలను బరిగీసి మరీ విభజించాయి. గంగకు అద్దరీ ఇద్దరీ అన్నట్టుగా వింధ్య పర్వతశ్రేణులకు ఉత్తర దక్షిణ పార్శ్వాలలో కాంగ్రెస్-జనతాపార్టీ శ్రేణులను తీవ్రంగా మోహరించాయి. పూర్తి ఫలితాలు ఇంకా అందవలసే ఉన్నప్పటికీ రాజకీయ బలాబలాలు స్పష్టమైనాయి. ఉత్తర భారతం "జనతా" కొమ్ముకాసింది. దక్షిణ భారతం, ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుకు యథాశక్తి కంచుకోటగా అవతరించింది. ఈ రాజకీయ విభజనకు ఈసారి దోహదం చేసిన ప్రధాన కారణాలలో ప్రధానమైనవి ఎమర్జెన్సీ, దాని ఆధారంగా ఇందిర ప్రభుత్వం రూపొందించిన చట్టాలు, ఆ చట్టాలు ఆధారంగా అమలులోకి వచ్చిన రకరకాల చర్యలూ. ఉత్తరాది ఫలితాలన్నింటినీ పూర్తిగా ఎమర్జెన్సీపై తీర్పుగా ఎలా భావించలేమో దక్షిణాది ఫలితాలను ఎమర్జెన్సీకి అనుకూలంగానూ భావించలేము. ఎమర్జెన్సీ ఉన్నా వూడినా నిర్బంధ విధానం ద్వారా పరిపాలనను కాపాడుకోలేమన్నదే స్థూలంగా ఈ ఎన్నికల ఫలితాలు నిరూపించాయి. కాబట్టే ఎమర్జెన్సీ ఇప్పటికైనా రద్దు కావలసి వచ్చింది. మొండి పట్టుదలల వల్ల ఎంత నష్టమో ఇందిర, సంజయ్‌ల ఓటమి నిరూపించింది.

ఇరవై మాసాల ఎమర్జెన్సీ పుట్టుకకు పూర్వ రంగం అలహాబాద్ హైకోర్టు తీర్పు అయినందున, దేశ అవసరాలకు గాకుండా వ్యక్తిగత ప్రయోజనాల దృష్ట్యా రాజ్యాంగ సవరణలు జరిగాయి. లేదా సాంఘిక న్యాయాన్ని, ఆర్థిక న్యాయాన్ని సాధించడంకోసం ఆ సవరణలను ఉద్దేశించి ఉంటే ఇందుకు కోర్టు తీర్పు ఆటంకం కానక్కరలేదు. ప్రజా ప్రాతినిధ్యం చట్టాన్ని ఉన్నత పదవులలో ఉన్న వారిపై ఎలాంటి అభియోగాలు (వాస్తవ మైనవి అయినా సరే) మాపడానికి వీలు లేకుండా శాశ్వత జిరాయితీ హక్కుగా సవరించవలసిన అవసరమూ లేదు. ఎందుకు అరెస్టు చేశారని అడిగే హక్కు పౌరునికి లేకుండా పోయింది; తీర్పు చెప్పే హక్కు న్యాయ స్థానం కోల్పోయింది; పత్రిక స్వేచ్ఛ నామ మాత్రం అయింది; నిజానికి ఈ స్వేచ్ఛే ఉన్నట్టయితే అనేక రాష్ట్రాలలో ఎమర్జెన్సీలో వివిధ స్థాయిలలో జరిగిన కొన్ని అక్రమాలను పత్రికలు ప్రభుత్వం దృష్టికి తెచ్చి ఉండేవి. సకాలంలో వాటిని ప్రభుత్వం పరిష్కరించగలిగేది. ఎమర్జెన్సీ అధికారాలు కొందరి అధికారుల చేతులలో "కోతి చేతిలో కొబ్బరికాయ" చందంగా పరిణమించాయి.

ఇందిర నాయకత్వంలో కాంగ్రెస్ సంస్థ ఎంత త్వరగా ఎదిగిందో అంత త్వరగా బీటలు వారడానికి కారణం, ఆమెకు సలహాలు ఇవ్వగల పార్టీపెద్దలు ప్రజలు పరిపాలనా ప్రయోనాలకన్నా ఆమె పలుకుబడిని స్వార్థం కొలదీ అపమార్గం పట్టించడమే. గతంలో సంస్థ అఖండ విజయాలకు కారకు రాలైన ఇందిర పదవిలో ఉండగానే ప్రజల చేతులలో ఓటమి పొందడం తీవ్రమైన అభిశంసన. ఇందిరే చెప్పుకొన్నట్టు తానొక జోన్ ఆఫ్ ఆర్క్ కాగల ధైర్యం ఆమెకు ఉంది. అయితే ఆ స్థానానికి తగిన విధాన స్పష్టత లోపించింది. అంతేగాదు, స్వీడిష్ రాణి క్రిష్టియానా మాదిరిగా "యోధాగ్రణి" కాగల సాహసి కూడ ఇందిర. "నానుంచి ఎప్పుడూ అనూహ్యమైన పరిణామాలను స్వీకరించడానికి ఈ ప్రపంచం సిద్ధంగా ఉండాల"ని శాసించగల శక్తియుక్తులున్న నాయకురాలు కూడా. క్వీన్ ఆనె, వాల్‌పోల్ హయాంలో ఇంగ్లాండు సామాజిక పరివర్తనకోసం పడిన పురిటి నొప్పులన్నిటినీ ఇందిర పాలనలో ఇండియా పడుతూ వచ్చింది. "ఇందిరే ఇండియా, ఇండియాయే ఇందిర" అని బారువా అన్నారుగాని, "ఇందిరే కాంగ్రెసు, కాంగ్రెసే ఇందిర" అంటే మరింత సబబుగా ఉంటుంది. నిజానికి ఇందిర లేని కాంగ్రెసు నిర్జీవమైనదిగానే కొందరు కాంగ్రెసు వాదులు భావిస్తారన్నా అత్యుక్తి కాబోదు.

# అత్యాచారాలు : విచారణ సంఘం

జిజియాబాయ్ శివాజీని సృష్టించింది. ఇందిర సంజయ్‌ని ప్రసాదించింది. కాని పెంపకంలోనూ, పాలనానిర్వహణలోనూ, నడతలోనూ, ఇరువురు మాతృమూర్తుల మధ్య వ్యత్యాసాన్ని లాభనష్టాలనూ ఇటీవల ఎన్నికల ఫలితాలు నిరూపించాయి. గాంధేయ సంప్రదాయాలలో పెరిగిన కాంగ్రెస్ చేయకూడని పనులకు ఆమె అధికారం ఆనవాలయింది. అల్లాబాద్ కోర్టు తీర్పే పాలకుల, అధికారుల ఆగడాలకూ, అత్యాచారాలకూ ప్రోత్సాహం అయితే అది సభ్యతా సంస్కృతులను ప్రేమించగల దేశానికి మిగల్చ గలిగింది అంధచరిత్ర మాత్రమేనని రుజువయింది. కాని అప్రమత్తంగా ఉన్న దేశమూ, ప్రజలూ పాలకుల ఆచారాలనూ, అక్రమాలనూ సకాలంలోనే తక్కువ త్యాగాలతో అదుపు చేయగలరని చరిత్ర బోధిస్తోంది. ఈ అప్రమత్తతవల్లనే మొదటి ఛార్లెస్ రాజు అక్రమ పాలనకు ఇంగ్లాండ్ ప్రజలు స్వస్తి చెప్పించగలిగారు; పార్లమెంటు ముందు విచారణకు అతణ్ణి బద్ధుణ్ణి చేయగలిగారు. వ్యక్తిగత జీవితంలో సరసుడూ, మంచివాడే అయినప్పటికీ పాలనా బాధ్యతలలో క్షమించరాని తప్పులుచేసి వళ్ళుమరచి వ్యవహరించినందుననే పదునాల్గవ లూయీ కేవలం "రహస్యపత్రాల" ద్వారానే దేశాన్ని పాలించి అధికారుల ద్వారా అనేక అత్యాచారాలకు పౌరోహిత్యం వహించినందున అతణ్ణి ఫ్రెంచి ప్రజలు వదలలేదు; దారుణ నిర్బంధకాండకు ప్రజలనూ, పత్రికలనూ గురిచేసిన రౌలట్ చట్టాన్ని బ్రిటిష్ పాలనలో భారతీయులు ఎందుకు ఈసడించుకున్నారో, ఎందుకు ఎదురుతిరగవలసివచ్చిందో తెలుసు. రౌలట్ చట్టాన్ని మించిన చట్టాలు ఇరవై మాసాల ఎమర్జన్సీలో ప్రజలను ఎంత భీతావహ స్థితికి గురిచేశాయో, ఎన్ని అనర్థాలకూ, అక్రమాలకూ దారితీసాయో వర్తమాన చరిత్రే సాక్ష్యం. వివిధ రాష్ట్రాలలో జరిగిన అక్రమాలగురించీ, అన్యాయాల గురించీ వస్తున్న ఫిర్యాదులను విచారించి "నేరస్తులను శిక్షించేం"దుకు మురార్జీ ప్రభుత్వం విచారణ సంఘం నియమించాలని నిర్ణయించింది.

కక్ష సాధింపు వైఖరి ఎవరికీ మంచిదికాదు. అసలు అటువంటి మనస్తత్వం వల్లనే ఎమర్జన్సీలో అకృత్యాలు జరిగాయని మనకు తెలుసు. అయితే యా

దారుణ అనుభవాల నుంచి దేశానికి ఏదో ఒక దశలో గుణపాఠం మాత్రం అవసరం. ఇప్పటికే అనేక ఇతర కుంభకోణాల గురించిన ఫిర్యాదులతో లోక్‌సభ అట్టుడికిపోతోంది. కాగా సుమారు లక్షన్నర మంది నిర్బంధానికి, ఒక్క 'మీసా' కిందనే 35 వేల మంది అరెస్టుకూ, జైళ్ళలో కొన్ని డజన్ల మంది మరణానికి దారితీసిన చర్యల గురించి ఈ విచారణ జరగబోతోంది. అసలు ఏ సాక్ష్యాధారాలపైన, ఏ స్పష్టమైన ఆరోపణలపైన, ఏ ప్రమాదం వచ్చిందని నిర్బంధ విధానం ఇందిర ప్రభుత్వం అమలు జరిపిందో కాంగ్రెస్ నాయకత్వం సంతృప్తికరమయిన సమాధానం ఇవ్వలేదు. "అత్యాచారాలు జరిగినమాటవాస్తవమే"నని ఎన్నికల సమయంలో అంగీకరించిన కాంగ్రెస్ అభ్యర్థులు కొందరు విచారణ సంఘం నియామకానికి ప్రభుత్వం నిర్ణయించగానే "ఇది కక్ష సాధింపు చర్య" అని విమర్శిస్తున్నారు. అయితే ఏ నిరూపణా, ఏ ఆధారమూ లేకుండా మురార్జీ ప్రభుత్వం విచారణ సంఘాన్ని నియమించడానికి సాహసించి ఉండదనే మా విశ్వాసం. ఎందువల్లనంటే బరోడా డైనమైట్ కేసులో ఏమాత్రం చేవ ఉన్నా దానిని 'జనతా' ప్రభుత్వం ఉపసంహరించడానికి వీలు ఉండేదే కాదు.

ఇందిర ప్రభుత్వం ప్రవేశపెట్టిన నిష్కారణమయిన నిర్బంధ విధానానికి డైనమైట్ కేసు ఒక ఉదాహరణ కాగా, పౌర జీవితానికి భద్రత లోపించిన దనడానికి, అత్యాచారాల గురించి వస్తున్న సవాలక్ష ఫిర్యాదులకూ ఫెర్నాండెజ్, స్నేహలతారెడ్డి కుటుంబగాథలే ప్రబల సాక్ష్యాలు. ప్రత్యక్ష జీవితానికి వేరే ప్రేక్షకులంటూ ఉండరు. అలాగే విషాద గాథలకు సాక్షులూనూ. అధికారాన్ని ఇదేమిటని ప్రశ్నించరాదు. కోర్టులను కదపరాదు. ఈ దుర్మార్గపు ఆచారం అమలులోకి వచ్చినప్పుడు గోడలకు చెవులు మెలసాయి. పీడించగలవారికి కొమ్ములు మరిన్ని మొలిచాయి. న్యాయానికి వకాల్తా లభ్యం కానప్పుడు గాంధేయ సంప్రదాయాలతోపాటు ఒక చిత్తరంజన్ దాసునూ, ఒక మోతీలాల్‌నూ, ఒక జయకర్‌నూ కనీసం ఒక ప్రకాశాన్ని ఊహించుకోడమే అసాధ్యమయింది.

మురార్జీ ప్రభుత్వం ప్రారంభించనున్న న్యాయ విచారణ చాల హుందాగా జరగాలి. నిష్పాక్షికంగా ఉండాలి. ఒక తప్పును సవరించడానికి జరిగే ప్రయత్నం మరొక అన్యాయానికి చోటివ్వకూడదు. ఆ తీర్పు ఈ తరానికేకాదు, భావితరాలకు సహితం కడిగిన ముత్యంలా ఉండాలి. పాలకులకూ, పాలితులకూ నడతలో నాణ్యంలో అది మేలుబంతి కావాలి. క్రమబద్ధమయిన పాలనకూ, న్యాయానికి అది చెరపరాని, చెరగరాని అభయ ముద్రకావాలి. విచారణాంశాలను న్యాయమూర్తికి నివేదించడంలో కడు జాగరూకత అవసరం.

# ప్రజలనుంచి ప్రజలవద్దకు....

ఇంగ్లీషువాళ్ళు "మాగ్నకార్టా"నూ లేదా బిల్ ఆఫ్ రైట్స్‌నూ ఎందుకు ప్రేమిస్తారు? నిరంకుశ రాచరికంనుంచి తమను తాము కాపాడుకొనగల హక్కులు ఇచ్చినందుకూ, స్వేచ్ఛను ప్రసాదించినందుకూ.

ఫ్రెంచివాళ్ళు పౌరహక్కుల పత్రమైన "డిక్లరేషన్"ను ఎందుకు గౌరవిస్తారు? అధికార ధాష్టీకాలనుంచి తమ కనీసపు ప్రాథమిక హక్కులను చట్టం పరిరక్షిస్తున్నందుకు.

అమెరికన్లు "స్వాతంత్ర్య ప్రకటన"ను ఎందుకు అభిమానిస్తారు? పరాయి పాలకులనుంచీ, దేశీయ నిరంకుశులనుంచీ తమను తాము కాపాడుకోవడం ఎలాగో పాఠాలు నేర్పి గుణపాఠాలద్వారా త్యాగబుద్ధిని, ధైర్యస్థైర్యాలనూ అలవర్చినందుకు.

ఇరవై మాసాల క్రితంవరకూ భారతీయుల రాజ్యాంగచట్టంపట్ల స్వాతంత్ర్యం పట్ల ఎందుకు అంతగా అనురాగం వ్యక్తంచేస్తూ వచ్చినట్లు? రాజ్యాంగ నిర్ణయసభ ఆమోదముద్రతో వెలసిన భారత రాజ్యాంగం తమకు కొన్ని కనీసపు ప్రాథమిక హక్కులను కల్పించి మానవులుగా మసలుకోనున్నందుకూ, అలాంటి అవకాశాలు కల్పించినందుకూ.

కాని 20 మాసాల ఎమర్జన్సీలో దేశప్రజల అనుభవంలో మార్పు వచ్చింది. అభిమానంలో మార్పు వచ్చింది. 42వ రాజ్యాంగ సవరణ చట్టంపేరిట "హక్కులు" బలపడకపోగా ఉన్న హక్కులకే-ఎందుకు అరెస్టు చేస్తున్నావు, కోర్టులో ఎందుకు ప్రశ్నించరాదు, ప్రజల అభిప్రాయాలు పత్రికలలో ఎందుకు వ్యక్తంకారాదు ఇత్యాది ప్రశ్నలకే -ఎసరువచ్చింది. ఆరవ లోక్‌సభ ఎన్నికల ఫలితాలవల్ల అధికారంలోకివచ్చిన "జనతా" ప్రభుత్వం

ఈ భీతావహ స్థితిని పూర్తిగా రద్దుచేయాలనుకున్నది. దీనికి ప్రతిరూపమే సోమవారంనాడు పార్లమెంటు ఉభయ సభలలో రాష్ట్రపతి ప్రసంగం.

అలహాబాద్ కోర్టు తీర్పు ఫలితంగా వచ్చిన ఎమర్జన్సీ, దానితోపాటు 42 వ రాజ్యాంగ సవరణ చట్టం 1971 ఎన్నికలలో "ప్రజలతీర్పు"కు ప్రతిబింబం అని ఇందిర ప్రభుత్వం చెప్పింది. ఆరవ లోక్‌సభ ఎన్నికలలో రాజ్యాధికారానికి వచ్చిన మురార్జీ ప్రభుత్వంకూడా అదే ప్రజల తీర్పును శిరసావహించి 42 వ సవరణసహా అన్ని నిర్బంధ చట్టాలనూ రద్దుచేయబోతోంది. "ప్రజలకు ఏమీ తెలియ"దని భావించడం తప్పనీ, "ఇరవై మాసాలలో ప్రజలపై పెక్కు అత్యాచారాలు" జరిగాయనీ, పెక్కుబాధలకు గురి అయినారని రాష్ట్రపతి ప్రకటించడంకూడా ఇదే మొదటిసారి. ప్రజలు ఎన్నుకున్న నూతన ప్రభుత్వం తిరిగి ప్రజలవద్దకు వెళ్ళడానికి ఈ కనీసపుచర్యలు అవసరం. 1951 లో రాజ్యాంగానికి తొలి సవరణచేసిన దరిమిలా ఎమర్జన్సీలో పాస్సైన 42 వ సవరణ చట్టం అంత వివాదాస్పదమయిన చట్టం పాతికేళ్ళలో మరిలేదు. సంఘాల నిర్మాణం, సమావేశంస్వేచ్ఛ, భావ ప్రకటన స్వేచ్ఛకూ సంకెళ్ళుపడిన విచిత్ర పరిస్థితులలో రాజ్యాంగంలోని తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చిన 188 చట్టాలపైన కోర్టులు భాష్యంచెప్పే అధికారం కోల్పోయాయి. పౌరుడు కోర్టును కదపగల హక్కు అవకాశం పోగొట్టుకున్నాడు. ఇందులో 150 చట్టాలు రాష్ట్రాలవీ, 38 కేంద్రానివీ, 42 వ సవరణకు ప్రధాన ప్రతిపక్షాలూ, న్యాయవాదులూ ప్రతిఘటించినా పార్లమెంటు ప్రత్యేక సమావేశంలో ఇందిర ప్రభుత్వం "మెజారిటీ"తో తాతాచార్యుల ముద్రవేసింది. సవరణ చట్టానికి వచ్చిన 659 వ సవరణలలో ఒక్క ఎనిమిదింటిని మినహా మిగతా అన్నింటినీ నోటిమాటతో తోసిపుచ్చారు. కొన్ని రాష్ట్రాల పి. సి. సి. లూ లెజిస్లేచర్లూ వ్యవధి కావాలన్నా వినలేదు. అంతా అరణ్యరోదనగా మారింది. ఇక ప్రధానివంటి అత్యున్నత స్థానాలలో ఉన్న వ్యక్తులకు "అవినీతి ఆరోపణల"నుంచి రక్షణ కల్పించే 41 వ సవరణ అంతకుముందే పాస్సై కూర్చుంది. ఇప్పుడు దీనినికూడా మురార్జీ ప్రభుత్వం తిరగతోడబోతోంది. ఇదంతా- పాతికేళ్ళ తర్వాత చెదిరిపోయిన ప్రజాస్వామిక హక్కుల పునరుద్ధరణకోసం ప్రజలు పడుతున్న వేదనలో సరికొత్త అధ్యాయం.

# సభాపతులు : సంప్రదాయాలు

క్రీడారంగంలో అంపైర్, న్యాయస్థానంలో జడ్జి, శాసన వేదికపైన స్పీకర్ ఈ ముగ్గురూ ఒక కోవకు చెందినవారు. "నిష్పాక్షికం" వీరి తీర్పరితనానికి ఒక మంత్రదండం కాకపోతే ఒక కొలబద్ద. ఇంగ్లాండ్‌లో కామన్స్ సభాపతి గానీ ఇండియాలో లోక్‌సభ సభాపతిగానీ మహావక్తలయినందున వారిని "స్పీకర్" అనలేదు. సభాసంప్రదాయాలను సభ్యుల రాగద్వేషాలకు అతీతం గానూ, సజావుగానూ నడిపిస్తూ దేశాధిపతికి సభవారి తరఫున సమస్యలను నివే దించగల హక్కుదారుడుగా అతణ్ణి "స్పీకర్" అన్నారు. సభ్యుల మనస్సులను నొప్పించకుండా ఒప్పించగలవాడే, సభా మర్యాదలను తు.చ. తప్పకపాటించ గలవాడే ఆ పదవికి అర్హుడు. ఇంగ్లాండ్‌లో 'మే' పార్లమెంటరీ చరిత్రరాసినా, ఫ్రెడరిక్ వైట్ ఇండియాలో మొట్టమొదటి సెంట్రల్ అసెంబ్లీ సంప్రదాయాలు రూపొందించినా ఈ హద్దులలోనే. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విలువలమెరుగు తరుగుల విషయంలో సభ్యులతోపాటు సభాపతుల ప్రవర్తన కూడా ఎంతో బాధ్యతా యుతమయినదీ, బరువైనదీ. ఒక పార్టీ ప్రతినిధిగా సభకు ఎన్ని కయిన వ్యక్తి సభాపతిగా ఎన్నిక అయిన తరవాత ఆ హోదాలో అతను పాక్షిక రాజకీయాలకు దూరంగాక తప్పదు. ఈసారి ఆరవ లోక్‌సభకు పాలకపక్ష మయిన జనతాపార్టీ, ప్రతిపక్షమయిన కాంగ్రెస్ ఏకగ్రీవంగా స్పీకర్‌గా ఎన్ను కున్న వ్యక్తి శ్రీ సంజీవరెడ్డి. ఈ పదవి ఈయనకు కొత్తకాదు. గతంలో రెండేళ్ళు స్పీకర్‌గా సమర్థవంతంగా బాధ్యతలు నిర్వహించిన సంజీవరెడ్డి మంత్రిగానూ, ముఖ్యమంత్రిగానూ కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ విశేషాను భవం కలవారు. ఆయన నిత్యజీవితంలో ఉద్రేకి కావచ్చు కాని నిండు పేరోలగంలో నిండుకుండగా వ్యవహరిస్తాడు; బయట ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడయినా ఆయన వెరపు ప్రదర్శించవచ్చు. కాని తన నిర్దిష్ట స్థానంలో మాత్రం నిర్భయం అతని సొత్తు. ఎంత చతురుడో అంతలౌక్యుడు.

నేర్పు కూర్పులతోపాటు ఓర్పు స్పీకర్‌కు ఒక ప్రధాన లక్షణం. అవధాన విద్య తెలియక పోయినా ఆ స్థానంలో అతని అవధులు అతనికి తెలిసి ఉండాలి. సభ్యుల క్రమశిక్షణ విషయంలో అతని విధి క్లాసులో మోనేటర్ పని. ప్రకటనలూ, పాయింట్ ఆఫ్ ఆర్డర్లూ, హడావుడి తీర్మానాలూ, సావధాన తీర్మానాలూ, సభ్యుల నోటీసులూ, ప్రశ్నోత్తరాలూ, "జీరో అవర్"- ఇవన్నీ స్పీకర్ ప్రజ్ఞా పాటవానికి పరీక్షా సమయాలు. ఆయన ఛాంబర్ ఒక సంహా మందిరం.

ఈ అవధాన క్రియలో అటు కామన్స్ చరిత్రలో స్పీకర్లుగా రాణింపునకు వచ్చి రికార్డు సృష్టించుకున్నవారు పీటర్ మాన్ ఫోర్డ్, తామస్‌మోర్, కాంప్‌బెల్, క్లిఫ్టన్, బ్రౌన్, మోరిసన్ వీరందరూ అటు ప్రభుత్వ వాదినలకూ, ఇటు ప్రతిపక్షం సవాళ్ళకూ మధ్య సమన్వయ కర్తలుగా ఆ హోదాలో సఫలమయినవాళ్ళే. ఇటు మన దేశంలో స్వాతంత్ర్యానంతరం కడచిన అయిదు లోక్‌సభలకు స్పీకర్లుగా పనిచేసిన వారిలో ధిల్లాన్ ఒక్కరే కొంత ఇబ్బందిని ఎదుర్కొనవలసి వచ్చింది. మిగతావారందరూ మవలంకర్ నుంచి అనంతశయనం అయ్యంగార్, హుకుంసింగ్, సంజీవ రెడ్డి సభా కార్యక్రమాలను సీరియస్‌గానే కాదు, రసవత్తరంగా కూడా నడిపించారు. స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ పాలనలో సెంట్రల్ అసెంబ్లీకి స్పీకర్లుగా పనిచేసిన ఘనత ముగ్గురు భారతీయులకు దక్కింది. వారు: లార్డ్ ఇర్విన్ కాలంలో విఠల్‌భాయ్‌పటేల్, లార్డ్ విలింగ్టన్ కాలంలో అబ్దుర్ రహీమ్, వేవెల్ హయాంలో మవలంకర్. ఒక వైపున బ్రిటిష్ ప్రతినిధులకు తమ రూలింగ్స్ ద్వారా వీరు సింహ స్వప్నాలు కాగా మరొకవైపున జాతీయ కాంగ్రెస్ ప్రతినిధులకు ఉత్తరోత్తరా పార్లమెంటరీ సాంప్రదాయాలలో తొలి పాఠాలు నేర్పిన ఆచార్యులయ్యారు. అసెంబ్లీలకు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి సభాపతి ఆధ్వర్యంలో వ్యవహరించగల సెక్రటేరియట్ ఏర్పడడానికి కారకుడు విఠల్. అతని రూలింగ్‌కు తిరుగు ఉండేదికాదు. తన పద్దులు చర్చకు వచ్చినప్పుడు సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయిన సర్వ సేనాపతి బరడ్‌ఉడ్ సహితం తిరిగి సభకు వచ్చి క్షమాపణ చెప్పుకునే వరకూ వదలలేదు విఠల్. న్యాయస్థానం తీర్పు అవసరమైన బిల్లులను ప్రవేశ పెట్టనిచ్చేవాడుకాదు రహీమ్. ఆనాటి సెంట్రల్ అసెంబ్లీకి, స్వతంత్ర భారతదేశంలో తొలి పార్లమెంటుకు మధ్య "సువర్ణ సేతువు"గా పేరులోకి వచ్చిన మవలంకర్ కూడా అలాగే వ్యవహరించారు. వీరు సభాపతులు. అవి సంప్రదాయాలు.

# ఉద్యమాలే ఊపిరిగా....

ప్రజా ఉద్యమాలే ఊపిరిగా నేటికి జీవించియున్న కొలదిమంది జాతీయ నాయకులలో స్వాతంత్ర్య సమర యోధులలో ఒకరు జయప్రకాష్ నారాయణ్. న్యాయవాద వృత్తిలో "ఒరిజినల్ సైడ్" అని ఉంటుంది. అలాగే జయ ప్రకాష్ ఒరిజినల్‌గా సోషలిస్టు. క్రమంగా గాంధేయ వాదిగా స్థిరపడిన వ్యక్తి. జాతీయోద్యమంలో సమరశీల రాజకీయాలతో జీవితాన్ని ప్రారంభించి, ఉద్యమ అనుభవాల ద్వారా "అధికారంకోసం వెంపరలాడే" రాజకీయాలను విడనాడి కేవలం సేవా ధర్మంతో గాంధేయ సూత్రాల వైపు ఆకర్షితుడైన వ్యక్తి జయప్రకాష్. మార్క్సిజంలోని ఆర్థిక సూత్రాలనూ గాంధీయిజంలోని నైతిక సూత్రాలను కలగలిపి-ఆ రెండింటి ఆధారంగా నవ భారత నిర్మాణంకోసం సుమారు అయిదు దశాబ్దాలుగా కలలు కంటున్న నాయకుడు. వ్యక్తిగత జీవితంలో నిరాడంబరత, పబ్లిక్ జీవితంలో నిష్కళంక ప్రవర్తన మూర్తీభవించిన జయప్రకాశ్ పాక్షిక విప్లవాన్నైనా పరిపూర్ణ విప్లవాన్నైనా జయప్రదం చేయగల సామర్థ్యం కలవాడు. రాజకీయాలకు అతడు అతీతుడు కావచ్చుగాని ప్రజా సమస్యల విషయంలో అతడు ప్రజా పక్షపాతి. అందువల్లనే జాతీయోద్యమ కాలంలో అతడు సుందర్‌బాన్‌లో గెరిల్లా ఉద్యమాన్ని నిర్మించినా, రెండేళ్ళనాడు బీహార్‌లో అవినీతికి, ప్రజా వ్యతిరేక పరిపాలనకూ నిరసనగా మహోధృతంగా యువకులతో ఉద్యమాన్ని నిర్వహించినా, నేడు జనతాపార్టీ స్థాపనకూ దాని విజయానికి దోహదం కాగల దేశవ్యాప్త ఎన్నికల సమరానికి రూపురేఖలు దిద్దినా-కేవలం ప్రజా సమస్యల పరిష్కారం కోసమేగానీ తన స్వార్థంకోసం కాదు. గాంధీ, నెహ్రూతోసహా ఎందరెందరో జాతీయనాయకులతో తనకుగల సాన్నిహిత్యాన్ని వినియోగించుకుని ఉంటే జయప్రకాశ్ ఏనాడో అందలం ఎక్కి ఉండేవాడు. ఆ ఆశ అతనికి ఆనాడూ లేదు, ఈనాడూ లేదు. త్యాగాలకు అడ్వాన్సు గ్యారంటీలుకోరే స్వార్థమూర్తి అంతకంటే కాదు, జె. పి.

అందువల్లనే అతడు బ్రిటిష్ సామ్రాజ్య వాదుల పాలనలోనే కాదు, స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్'' పాలనలో కూడా-ఈ వృద్ధాప్యంలో సహితం రకరకాల ఆంక్షలకూ ప్రభుత్వ ఆగడాలకూ గురికావలసి వచ్చింది. జైళ్ళలో అనేకసార్లు మగ్గవలసి వచ్చింది.

అన్యాయాలకు ఎదురుతిరిగే మనస్సు ఆంక్షలను సహించదు. ఈ ప్రాథమిక పాఠం అతను స్వాతంత్ర్య సమరంలోనే నేర్చుకొన్నాడు. తిలక్, అనిబిసెంట్‌ల అనుభవాలు గుణపాఠాలయ్యాయి; గాంధీజీ సాహచర్యం సహనాన్ని నూరిపోసింది. అనిబిసెంట్ హోమ్‌రూల్ (స్వపరిపాలన) ఉద్యమం సాగిస్తున్నప్పుడు అప్పటి మద్రాసు గవర్నర్ లార్డ్ పెంట్లాండ్ "ఉద్యమాన్ని ఆవిడ విరమించుకోకపోతే రాజకీయేతర కార్యకలాపాలతో సహా ఆవిడ కార్యక్రమాలన్నింటినీ ఆటకట్టించవలసిందని'' బెదిరించాడు. దానికి సమాధానంగా ఆమె "అది వాళ్ళతరం కాదు. ఇండియాలో వ్యక్తి స్వేచ్ఛనూ, ఆస్తినీ ఒకే మోతాదులో ఒక్క కలంపోటుతో పాలకులు జప్తు చేస్తున్నార''ని చమత్కరించింది. ఆ ఆత్మాభిమానమే స్వాతంత్ర్య సమర జ్వాలలను దావానలంగా మార్చి ప్రజలను ఉత్తేజపరచాయి. మళ్ళీ స్వాతంత్ర్యానంతరం అలాంటి ప్రభుత్వ ఉత్తర్వులకు శ్రీ జయప్రకాశ్ కూడా అదే మోతాదులో సమాధానం చెబుతూ వచ్చారు.

జయప్రకాశ్ ఆనాడూ ఈనాడూ ఏ జైళ్ళలో గడిపినా ప్రజలలో అతనికిగల అపారమైన విశ్వాసం, వారి శక్తియుక్తుల్లో నమ్మకం ఏనాడూ సడలలేదు. చాలకాలంగా రాజకీయాలకు పూర్తిగా దూరంగావుంటూ కేవలం సర్వోదయ వాదిగా గడిపిన జయప్రకాశ్ తిరిగి ఉద్యమ సారథిగా ఈవయస్సులో ముందుకు రావడానికి ప్రజలతో అతనికి ఉన్న సాన్నిహిత్యమే కారణం. క్విట్ ఇండియా ఉద్యమంలో సమరశీల సోషలిస్టుశక్తిగావున్న జయప్రకాశ్‌లోని ఈ ప్రత్యేకతను గమనించిన తరవాతనే గాంధీజీ, దేశంలో అహింసాయుతమయిన పరివర్తనకు తగిన వాతావరణాన్ని సృష్టించడంలో తనకు చేదోడు వాదోడు కావలసిందిగా కోరాడు. ఇంగ్లీష్, ఫ్రెంచి, రష్యన్ విప్లవానుభవాల సారాన్ని ఇతను కొత్త పద్ధతులలో అనువదించాలని ప్రయత్నించాడు. ఇందుకు అతను ఆధారపడుతూ వచ్చింది గాంధేయ సూత్రాలపైన పాత పద్ధతులలో అధికార వ్యవస్థను తీర్చి దిద్దరాదని, కొలదిమంది చేతులలో అధికారం కేంద్రీకృతం కారాదని, అంతిమంగా ప్రజల సార్వభౌమాధికారాన్ని, సర్వసత్తాకతను మాత్రమే విశ్వసించాలని నిర్ణయించుకున్నాడు. ప్రజల హక్కులూ, ప్రజాస్వామ్య సంప్రదాయాలూ అప్పుడే బతికి బట్ట కట్టగలవని తీర్మానించుకున్నారు. ఇందుకు ఏకైక రక్షణ- ప్రజలను తమ భావికి

తామే నిర్ణయాధికారులు కాగలిగేటట్టు నిరంతరం చైతన్యవంతులను చేయాలనుకున్నాడు. చైతన్యపు ప్రమిదలలో వత్తులు పెట్టి నూనె పోసే కార్యక్రమాన్ని ఆయన రెండేళ్ళనాడు బీహార్‌లో ప్రారంభించాడు. అవినీతికి నిలయంగా ఉన్న ప్రభుత్వాలు ఎక్కడవుంటే అక్కడకు ఉద్యమాన్ని వ్యాప్తి చేశాడు. ఇందుకు వినోబా అడ్డుతగిలినా ఆగలేదు. అవసరమని భావించినప్పుడు భావే సేవక్ సమాజ్‌తో కూడా తెగతెంపులు చేసుకున్నాడు. సంఘర్ష సమితులు పెట్టాడు. ఛాత్ర సంఘర్ష సమితి యువకులకు వేదిక కాగా జన సంఘర్ష సమితి వయోజను లందరికీ కార్యాచరణ వేదికగా మారింది. ఇది కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వాధికారాన్ని ప్రశ్నించినట్టే అయింది. జయప్రకాశ్‌తో ఇందిరకు అంతవరకూలేని ఘర్షణకు బీహార్ ఉద్యమం నాందిపలికింది. కేవలం సర్వోదయవాదిగా ఉన్నంతకాలం జె పి ని అంతవరకూ అహింసావాదిగా పరిగణించినవారే బీహార్ ఉద్యమం క్రమంగా ఢిల్లీకి వ్యాపించడంతో అతన్ని "హింసావాది" అన్నారు. మరికొందరు ఆయన ఉద్యమాన్ని "సాంస్కృతిక విప్లవం" అన్నారు. మహాజర్లతో 1974 లో ఢిల్లీలో పార్లమెంటు వద్దకు జయప్రకాశ్ సారథ్యం వహించిన బ్రహ్మాండమైన యాత్రను అటు ప్రధానిగాని, ఇటు రాష్ట్రపతిగానీ పట్టించుకోలేదు. కాని ప్రభుత్వశక్తి ప్రజా సమస్యల పరిష్కారం విషయంలో పక్కదారులు పడుతున్నప్పుడు శాంతియుతమైన పద్ధతులలో తమ నిరసన తెల్పడం ప్రజల కనీసపు హక్కు అని స్పష్టం చేశాడు. ఈ ప్రజాశక్తి ప్రభుత్వ శక్తికి అనునిత్యమూ అంకుశంగా ఉంటే తప్ప ప్రజాస్వామ్యం బతకదని చెప్పాడు.

అతను కోరే ప్రశాంతత వేరు: "అవును మన సమాజంలో శాంతిలేకపోలేదు. కాని అది సజీవమయిన శాంతి కాదు. పరిణామాలపట్ల ప్రజలు తరచుగా తమకు పట్టనట్లు కూర్చుంటున్నారు. కాని పరిణామాలు ముంచుకు వచ్చినప్పుడు గగ్గోలు పెడుతున్నారు. ఈ పరిస్థితులు కొనసాగితే అవి మనలను ఎక్కడికి తీసుకుపోతాయి? ఈ ముభావ పరిస్థితికి ముందుగా బలిఅయ్యేది ప్రజాస్వామ్యమే. ఏ విలువలకూ రక్షణ ఉండదు; ప్రతి విలువా కుప్పకూలిపోతుంది" అంటాడు.

నిష్కళంక సమరయోధుడూ, ప్రజాస్వామ్యవాదీ, సాత్విక విప్లవవాదీ అయిన జయప్రకాష్ వ్యక్తిత్వాన్ని, దేశానికి ఆయన ఇంతవరకూ అందజేసిన సేవలను కేవలం కడచిన రెండేళ్ళ అనుభవం దృష్ట్యానే అంచనా వేయలేం. అలాగే ఆయన దేశభక్తిని, నేటి జనతాపార్టీ వ్యవస్థాపనకే పరిమితమూ చేయలేము.

జయప్రకాష్‌ను జైలులో కొన్నాళ్ళు బంధించినంత మాత్రాన, అనేక జాతీయ సమస్యలపై ఆయన సలహా సహకారాలనూ, దౌత్య సేవలనూ అందుకున్న కాంగ్రెస్ ప్రభుత్వం ఆ సేవలను మరవ వచ్చునేమో గాని, దేశం విస్మరించ లేదు. కాశ్మీర్ సమస్యపై పెక్కుసార్లు నెహ్రూ తరఫున ఇందిర ప్రభుత్వం తరఫునా షేక్ అబ్దుల్లాతో రాజీ బేరాలు సాగించిన వాడు జె.పి. ఇండియా పాకిస్తాన్‌ల మధ్య ఈ సమస్యను సామరస్యంగా పరిష్కరించడానికీ, దేశంలో ఈ సమస్యపై మితిమీరిన జాతీయ దురహంకార ధోరణులను అదుపుచేయ డానికీ ఆయన ఎంతో కృషిచేశాడు. నాగాలాండ్ సమస్య పరిష్కారం సందర్భంగా అజ్ఞాత నాగాలకూ కేంద్ర ప్రభుత్వానికి సంధానకర్తగా పనిచే శాడు. అంతకంటే గొప్ప సేవ, అతనికి ప్రాణహాని కలిగించగల ప్రమాదం ఉన్న సన్నివేశం చంబల్ లోయలో జరిగింది. దశాబ్దాలుగా ప్రభుత్వాన్ని వేధిస్తున్న చంబల్ లోయ బందిపోటు దొంగలకు బోధలుచేసి ప్రభుత్వానికి లొంగిపోయేటట్టూ, లొంగిన తరువాత వారి సాధారణ జీవనానికి ప్రభుత్వం హామీ పడేటట్లుచేసిన మహనీయుడు జయప్రకాష్. సైనిక శక్తివల్ల కానిపనిని నైతికశక్తివల్ల సాధించిన ఘనత గాంధీజీ తర్వాత మనదేశంలో ఒక్క జయ ప్రకాష్‌కు మాత్రమే దక్కింది. అతని జీవితంలో ఈ ఘట్టం అరేబియన్ నైట్స్ కథలకు మించిన వాస్తవగాథ.

అంతేగాదు, సాధారణ జీవితంలో ఎక్కడ ఏమూల పౌరజల ప్రాథమికహక్కు లకు ప్రమాదం వాటిల్లినా రెక్కలు కట్టుకుని వాలినవ్యక్తి జె. పి. విచారణ జరప కుండా శిక్షలు విధించడాన్నీ, పౌరులను అక్రమంగా బంధించడాన్ని ఏవగించు కునే మన స్తత్వంగల జె.పి. ని కొందరు "అభివృద్ధినిరోధకుడనీ" సి. ఐ. ఎ. ఏజంటుగానూ చిత్రించబూడం హాస్యాస్పదం. అతని ఉద్దేశంలో "ప్రభు త్వాలు అనేవి తాత్కాలికాలు, తెరపై బొమ్మలు. కాని ప్రజలు మాత్రం చిరంజీవులు." అధికారంకోసం రాజకీయాలంటే అతనికి ఏవగింపు. ప్రధాన మయిన సామాజిక, ఆర్థిక మార్పులు ప్రభుత్వమూ దాని యంత్రాంగమూ లేకుండా సాధ్యపడవని మనం విశ్వసిస్తాం. కాని అతని దృష్టిలో నైతిక, ధార్మికవిలువలద్వారానే ఈ మార్పు సాధ్యం. బహుశా ఈ అవగాహనవల్లనే అతను రాజకీయ పక్షాలకు దూరంగా ఉండిఉంటాడు. అయితే రాజకీయా లకుమాత్రం దూరంగా లేడు. కనకనే అతనికి ఒక నమ్మకం ఉంది. నాయ కులు నావికులలాంటివారు. చుక్కానిని గమ్యం తెలియనివారికి అప్పగించ కూడదు. జాతి జీవితంలో ఎదురయ్యే క్లిష్ట సమయాలలో సాహసించి ప్రజా భిప్రాయాన్ని మలవాలిగాని, భీతిల్లిపోయి తప్పుతోవతొక్కరాదు. అలా భీతిల్లడం నాయకత్వ బలహీనత అంటాడు.

నిస్వార్థజీవిగా ఇంతటి నైతికబలం, మనోదార్ఢ్యం ఉన్నవ్యక్తి కాబట్టే జయ ప్రకాష్ నూరేళ్ళ చరిత్రగల కాంగ్రెసును పల్టీకొట్టించి, ఆరవ లోక్‌సభ ఎన్నికలలో కేంద్రంలో మూడు దశాబ్దాల కాంగ్రెసు పాలనకు దేవిడీ మన్నా చెప్పించడంలో ఘనతరపాత్ర వహించగలిగాడు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే ఏమిటో అతని మాటలలోనే విందాం :

"స్వాతంత్ర్యం అన్నది అన్ని వర్గాల ప్రజలకు సంబంధించిన నిర్దిష్టమయిన శక్తి. ప్రజాబాహుళ్యం మాత్రం స్వాతంత్ర్యం అంటే అర్థం అసెంబ్లీలూ, రాజ్యాంగాలు అని భావించజాలదు. వారికి స్వాతంత్ర్యమంటే నిత్యజీవితంలో నిర్దిష్ట ప్రయోజనాలు సమకూర్చి పెట్టేదని అర్థం. భూస్వామ్య విధానం వల్ల కునారిల్లిపోయిన పేదరైతుకు స్వాతంత్ర్యమంటే అర్థం భూస్వామ్య వ్యవస్థ నుంచి తాను విముక్తి పొందడమనే అంతేగాని భూస్వామ్యవ్యవస్థ రద్దు కావడమూ, స్వాతంత్ర్యమూ పరస్పరం సంబంధం లేనివని కాదు. ప్రజల ప్రాథమిక అవసరాలను స్వాతంత్ర్యం అన్న పదం సక్రమంగా నిర్వ చించినప్పుడే వారికి అది నిజమయిన స్వాతంత్ర్యం కాగల్గుతుంది. ప్రజా బాహుళ్యం దృష్టిలో సోషలిజం అన్నది దారిద్ర్యం, దోపిడీ తొలగిపోయి నప్పుడే అనుభవంలోకి వచ్చే వాస్తవం. ప్రజలకు సంబంధించినంత వరకూ తాము అనునిత్యం ఏ దోపిడీ వల్ల ఏ నిర్బంధంవల్ల బాధపడుతున్నారో దానిని ఎదిరించాలన్న కోరిక వారిలో ఉంటుంది. వారి దృష్టిలో నిత్య జీవన పోరా టమూ స్వాతంత్ర్య సమరమూ ఒకటిగానే ఉంటాయి. ఒక పరిణామం మరొక పరిణామానికి దారి తీస్తుంది''

# కుల రాజకీయాల కర్మ

ఈ దేశంలో కులం అనునిత్యం ఎదురయ్యే ఒక హిమాలయ పర్వతం. ఈ కుల పర్వతాన్ని కూలగొట్టడం ఉత్తి కబుర్లవల్లా దుర్బలమయిన చర్యల వల్లా సాధ్యపడదు. కులమన్నా అడుగంటాలి, మనమన్నా అడుగంటా లని ఆరు దశాబ్దాల నాడు ఆక్రోశించిన దేశభక్తుడూ సుప్రసిద్ధ దక్షిణ భారత సంస్కర్త సుబ్రహ్మణ్య అయ్యర్. రాజకీయ జీవితంపైన కుల వ్యవస్థ విచ్ఛిన్నకర స్వభావాన్ని దాన్ని ప్రభావాన్నీ శతాబ్దం క్రితమే కనిపెట్టి వందల కులాలు వేల ఉప కులాలుగా చీలి చితుకుతున్న జాతి దేశభక్తి భావా లకు దూరదూరంగానే ఉండిపోతుందని హెచ్చరించినవాడు రాజా రామ్మో హన్‌రాయ్. సంస్కర్తల బోధలు గాలికి ఎగిరిపోయాయి. స్వాతంత్ర్య సమరం మన కులవ్యవస్థల పునాదులను కదలించలేకపోయింది. తీరా ఇప్పుడు ముప్పై ఏళ్ళ రాజకీయ స్వాతంత్ర్యం తరవాత కూడా కుల సమ స్యను ఏదో రూపంలో ప్రస్తావించుకోడమే మనలో పెద్దబలహీనత. దేశంలో కుల మతాలు ఆధారంగా రాజకీయాలు నడిపిస్తున్న పార్టీలు కొన్ని ఉన్నాయనీ కుల మతాలను రాజకీయాలకు పునాదిగా మార్చడం తగదని ఈ జబ్బుకు ఎప్పుడూ దూరంగానే ఉంటున్న పార్టీలు కాంగ్రెస్ ఒక్కటేననీ ప్రధాని ఇందిర వారణాసి సభలో చెప్పారు. ఆమె ఆదర్శంతో ఎవరూ పేచీ పడనక్కరలేదు. కాని భారత రాజకీయ, ఎన్నికల రంగాలలో కుల మతాలన్నవి కాంగ్రెస్ సహా అనేక రాజకీయపక్షాలకు సరసమయిన సరకు లుగా వినియోగపడుతున్నాయంటే ఎవరూ నొచ్చుకోనక్కరలేదు. ఈ జాడ్యం ఒక్క ఎన్నికల రంగానికే పరిమితమయిలేదు. ఉపాధి వనరులకూ పదవులకూ విద్యాది రంగాలకూ వ్యాపించిందన్న సత్యాన్ని ఎవరూ కాదన లేరు.

విధవా వివాహాలు జరిపించడంలో బాల్య వివాహాలను సతీ సహగమనాన్ని మాన్పించడంలో జయప్రదం కాగలిగిన సంస్కర్తలు కులంజబ్బును వదిలించ లేకపోవడానికి కారణం - ఆర్థిక వ్యవస్థ వారి సంస్కరణ పరిధికిమించిన శక్తి కావడమే. వృత్తి స్వభావాన్ని పని విభజనకే పరిమితం చేయకుండా వృత్తికి "కులం" ముద్రవేయడంతో అంతస్తులు ఏర్పడ్డాయి. కొన్ని కులాలు "అస్పృశ్యులు" కావడానికీ మరికొన్ని "గౌరవ" శాఖలుగా మారడానికీ ఇవే కారణం. ఫలితంగా కులానికి కూడా దోపిడీ స్వభావం అబ్బింది. ఆర్థిక దోపిడీ భావదాస్యానికీ రాజకీయ దాస్యానికి దగ్గర మార్గం ఏర్పర చింది. ఈ సాలెగూటిని ఛేదించడానికి స్వాతంత్ర్యోద్యమ కాలంలో కొంత ప్రయత్నం జరిగింది. కాని స్వాతంత్ర్యానంతరం ఆ ప్రయత్నం మరింత అతుకులబొంతగా మారింది. కాకపోతే మరి పూనా సంధి ఫలితాన్ని ఎలా వ్యాఖ్యానిద్దాం? ద్విసభ్య నియోజకవర్గాలను ప్రసాదించిన కమ్యూనల్ అవార్డ్‌ను ఇప్పటికీ ఎందుకు అనుసరిస్తున్నాం? కుల ప్రాతిపదికపై రిజర్వేషన్ల వ్యవస్థవల్ల కులవ్యవస్థను నిరోధించగలిగామా? మరింతగా పెంచగలిగామా? దీనిని చట్టబద్ధం చేయడంవల్ల అస్పృశ్యతా ధోరణీ అంతరాలూ పెరగవా? తద్వారా అవి దేశ రాజకీయాలపైనా, రాజకీయ పక్షాలపైనా ప్రభావం నెరపవా?

అందుకే ఏభై ఏళ్ళనాడే మోతీలాల్‌నెహ్రూ కమిటీ ప్రత్యేక నియోజకవర్గాల పద్ధతివల్ల కుల వ్యవస్థ అలాగే ఉంటుందని, అనర్థాలు ఉంటాయనీ హెచ్చరించింది. నిజమయిన ఆర్థిక స్వాతంత్ర్యానికి మైనారిటీ మెజారిటీలతో నిమిత్తం ఉండదు. మోతీలాల్ కమిటీ సిఫారసుల తరవాత ఇరవై ఏళ్ళకు స్వాతంత్ర్యం వచ్చింది. ఈ స్వాతంత్ర్యానికి వయస్సు 30 ఏళ్ళు. ఆరవ లోక్‌సభకు ఎన్నికలు జరుగుతున్నది 1977 లో. అయినా రాజకీయ వ్యవస్థను కుల వ్యవస్థ శాసిస్తూనే ఉంది. విధానపట్టంలో మార్పులు రానంతవరకూ మనం ఎంత వద్దు అనుకున్నా రాజకీయాలు కుల గోత్రాలను ఆశ్రయించుకునే ఉంటాయి.

# మురార్జీ మంత్రివర్గం

ఆరవ లోక్‌సభ ఎన్నికల ఫలితాలు దేశ రాజకీయాలలో ఎంతటి సంచలనం కలిగించాయో, కేంద్రంలో మురార్జీ మంత్రివర్గ నిర్మాణ వ్యవహారాలుకూడా కొలది రోజులపాటు అంతగానూ ప్రజలను విస్మయ పరిచాయి. ఆత్మ సంయమనానికీ, హుందాతనానికీ, పరిపాలనా దక్షతకూ పేరు పొందిన మురార్జీ ప్రధానమంత్రి హోదాలో తొలి క్లిష్ట దశను అధిగమించి క్యాబినెట్‌ను ప్రకటించారు. పాలక పక్షమయిన జనతా-ప్రజాస్వామ్య కాంగ్రెసుల మధ్య పదవుల పెంపరలాటలో తలెత్తిన విభేదాలు ప్రస్తుతానికి సమసిపోయి సంకీర్ణ మంత్రివర్గం పాలనా బాధ్యతలను స్వీకరించింది. ప్రజలు తమను ఎన్నుకున్నది పదవులపై కీచులాటలకోసం కాదని అనుక్షణం గుర్తు చేసు కున్నప్పుడు ఇకమీదట మురార్జీ మంత్రివర్గానికి అవరోధాలు ఉండబోవు. పదవీ స్వీకారానికి ముందు గాంధీ సమాధివద్ద చేసిన ప్రతిజ్ఞలకూ, నవభారత నిర్మాణంలో ఏ పదవీ లేకుండా నిస్వార్థంగా వ్యవహరిస్తున్న అభినవగాంధీ జయప్రకాశ్‌కు వీరుచేసిన వాగ్దానాలకూ తగినట్టుగా నూతన ప్రభుత్వం నడుచు కుంటుందనే ఆశిస్తున్నాం. దేశచరిత్రలో కేంద్రంలో ఐక్యసంఘటన ప్రభు త్వం ఏర్పడడం ఇదే మొదటిసారి అయినందున నిర్మాణంలో కొన్ని ఒడి దుడుకులు సహజమే అయినప్పటికీ మంత్రివర్గంలో మురార్జీ వివిధ ప్రాంతా లకు కల్పించిన ప్రాతినిధ్యం ఉన్నంతలో సమనిష్పత్తిలోనే ఉందని చెప్పాలి. ఆంధ్రప్రదేశ్, కర్ణాటకలకు ఈ విషయంలో కొంతలోటు జరిగినా లోక్‌సభ స్పీకర్ పదవి శ్రీ సంజీవరెడ్డికి లభించడం రాష్ట్రానికి కొంత ఊరట కల్గిస్తుంది. పోతే పరిపాలనలో రకరకాల అనుభవంకల విభిన్న పక్షాల ప్రతినిధులకు మంత్రివర్గంలో స్థానం కల్పించడంలో కూడా మురార్జీ సామర్థ్యం ప్రదర్శించారు. జనసంఘ్ నుంచి సోషలిస్టుపార్టీవరకూ ఈ మంత్రివర్గ ప్రాతినిధ్యం విస్తరించినందున ఒక విధంగా ఇది సెక్యులర్ క్యాబినెట్‌గానే భావించుకోవచ్చు.

క్యాబినెట్ వ్యవస్థలు ఉన్న పార్లమెంటరీ డెమోక్రసీలలో సర్వసాధారణంగా మెజారిటీ పక్షమయిన ఒకే ఒక పార్టీ క్యాబినెట్‌ను ఏర్పరుస్తుంది. కాని మురార్జీ మంత్రివర్గం సంకీర్ణ ప్రభుత్వం అయినందున సుస్థిరత విషయంలో నిర్వహణ బాధ్యతలలో మురార్జీ నాయకత్వం అప్రమత్తంగా ఉండవలసి వస్తుంది. క్యాబినెట్ వ్యవస్థలో సమష్టి బాధ్యతకు ప్రాధాన్యం ఉన్నందున ఐక్యసంఘటన పక్షాల రాజకీయ ప్రత్యేకతలు మంత్రివర్గంలో ప్రతిబింబించడం సాధ్యంకాదు. దేశీయ, విదేశాంగ విధానాలలో ఇకమీదట సమష్టి విధానాలకు ఉమ్మడి కార్యాచరణకే ప్రాధాన్యం. మంత్రివర్గ నౌకకు చుక్కాని మురార్జీ. మిగతా నావికులు మార్గమధ్యంలో బోటు బద్దలు కాకుండా గమ్యం చేరడానికి చేదోడు, వాదోడు కావలసినవారు. సమస్యల ప్రత్యేక అధ్యయనం నూతన మంత్రులకర్తవ్యం. కేవలం అధికారులపై ఆధారపడకుండా సమస్యలను స్వయంగా పరిశీలించడంలో నెహ్రూ క్యాబినెట్‌కు ప్రత్యేకత ఉండేది. అంతకుముందు చరిత్రచూస్తే, స్వాతంత్ర్యానికి ముందు కౌన్సిళ్ళలో ప్రవేశం సందర్భంగా కాంగ్రెస్ ప్రతినిధులు కూడా ఈ విషయంలో విశిష్ట సంప్రదాయాలు నెలకొల్పారు. వీరిలో జయకర్, కేల్కార్ అలాంటివారే. పార్లమెంటరీ రికార్డుల ("బ్లూబుక్స్") అధ్యయనంలో ఆరితేరి చరిత్ర సృష్టించిన రంగస్వామి అయ్యంగార్, సత్యమూర్తి అలాంటివారే. ఆర్థిక విషయాల పరిశీలనలో ఉట్టగా షణ్ముగంచెట్టి పేరుమోసారు. హుందాతనానికి కిద్వాయ్, షెర్వాని, చతురమైనవిమర్శలకూ సమాధానాలకూ తులసి గోస్వామి, చమన్‌రోల్ పెట్టింది పేరు.

ప్రభుత్వ సుస్థిరతకు ఆధారం విధానాలూ, సక్రమంగా వాటిని అమలుపరచడమూ. సంకీర్ణ మంత్రివర్గాల చరిత్ర మురార్జీకి తెలియనిది కాదు. బ్రిటన్‌లో ఆస్క్విత్ తరవాత అధికారంలోకి వచ్చిన లాయిడ్ జార్జి, 1931 నాటి ఆర్థిక సంక్షోభ దశలో ప్రధాని అయిన మాక్డొనాల్డ్ సంకీర్ణ మంత్రివర్గాలను జయప్రదంగా నిర్వహించినవారే. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో లేబర్, లిబరల్ ప్రతినిధులతో ఐక్య సంఘటన మంత్రి వర్గాన్ని జయప్రదంగా నిర్వహించినవాడు చర్చిల్. అలాగే సంక్షోభ కాలంలో మన దేశంలో తొలి ఐక్య సంఘటన మంత్రివర్గానికి నేడు నాయకత్వం వహిస్తున్న మురార్జీ కూడా నిష్కళంక మయిన పరిపాలనకు నిండుదనం చేకూర్చగలరనే ఆశిస్తున్నాం.

# కంచె మేసిన చేను....

తన చరిత్ర తను పఠిస్తున్న దేశానికి ఎన్ని పోలికలు మరెన్ని సారికలు! చరిత్ర పునరావృత మయినప్పుడు తల రాతలు తారుమారవుతాయి. సరి హద్దులు చెరిగిపోతాయి, సంగతులూ, సందర్భాలూ స్వానుభవాలుగా కళ్ళ ముందే సాక్షాత్కరిస్తాయి. యుగాలు మారిపోయి మధ్య యుగాలు మరొక్కసారి నాట్యం చేస్తాయి. మధ్య యుగాలలో చెడుకి పేరుమోసిన ఫ్లారెన్స్ అధినేత లొరెంజో. ఊరు పొమ్మంటున్నా కాడు రమ్మంటున్నా అతనికి అధికార దాహం తీరలేదు. తాను మరణశయ్యపై ఉన్నప్పుడు సుప్రసిద్ధ సంస్కర్త, దేశభక్తుడూ అయిన మతగురువు మార్కో సావన రోలాను పిలిపించుకున్నాడు. అయిష్టంగానే అయినా సావనరోలా వచ్చాడు. మూడు షరతుల పైన లొరెంజోకు ముక్తిమార్గం ప్రసాదిస్తానన్నాడు. సరే నన్నాడు లొరెంజో. మొదటి షరతు: "చేసిన పనులకు పశ్చాత్తాపం ప్రకటించాలి." ఒప్పుకున్నాడు లొరెంజో. రెండవ షరతు: "ఈ ప్రాపంచిక సుఖాలన్నింటికీ నీవు దూరంగా ఉండాలి." దీనికి సమ్మతిం చాడు లొరెంజో. ఇక మూడవ షరతు: "ఫ్లారెన్స్ పౌరులకు ప్రాథమిక హక్కులనూ, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పునరుద్ధరించాలి." ఈ ఆఖరి షరతుకు లొరెంజో ముఖం తిప్పుకున్నాడు. సమాధానం చెప్ప నిరాకరిం చాడు. సావనరోలా నిరసన సూచకంగా వెళ్ళిపోయాడు.

ఈ గాథ అంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ఆరవ లోక్‌సభ ఎన్నిక లలో ఘోర పరాజయం పొందిన ఇందిర కూడా చివరి క్షణాలవరకూ ఆంత రంగిక ఎమర్జన్సీని ఎత్తివేయడానికి నిరాకరిస్తూనే వచ్చారు. ఇప్పుడు అంతకు మించిన వింతలూ విశేషాలూ వెల్లడి అవుతున్నాయి. అల్హాబాద్ కోర్టు తీర్పు తరవాత 1975 జూన్ 25న దేశంలో కాంగ్రెస్ ప్రభుత్వం ప్రకటించిన ఎమర్జన్సీకి ముందుగా మంత్రి మండలి ఆమోదం పొందకుండానే రాష్ట్రపతి ఆమోదముద్రను ఇందిర సంపాదించినట్టూ తరవాత 26వ తేదీన

మంత్రిమండలి సమ్మతించినట్టూ హోంమంత్రి శ్రీ చరణ్‌సింగ్ లోక్‌సభలో వెల్లడించారు. జారుడు బండ మీద కూర్చోడమే ప్రమాదం. కొంతవరకు జారిన తరవాత ఇక దానికి హద్దులు ఉండవు. రాజ్యాంగ నిబంధనల ఉల్లంఘన ప్రధాని హోదాలో ఇందిరతోనే ప్రారంభమయినప్పుడు, ఆదరిమిలా ఎమర్జన్సీలో గొలుసుకట్టుగా వచ్చిన పరిణామాలన్నీ రాజ్యాంగ విరుద్ధంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. కంచె చేను మేసింది. ఆ తరవాతనే ఊరూ నాడూ నిద్ర మేల్కొంది.

శ్రీ చరణ్‌సింగ్ వెల్లడించిన సమస్య ఎమర్జన్సీ ప్రకటన రోజునే ఆలోచించ గల వారందరిలోనూ చర్చనీయాంశం అయింది. కాని ప్రజల పని, పత్రి కల పనీ మూగ చెవిటివారి ముచ్చటగా మారిన ఆ రోజులలో ప్రతిదీ 'ఇదీ ధర్మమే' నేమో అనిపించింది. కాని ఎమర్జన్సీ, దాని ఆధారంగా రాజ్యాం గానికి క్రమంగా తీసుకువచ్చిన సవరణలూ, మీసా చట్టం, సెన్సార్ నిబం ధనలూ, పార్లమెంటు చర్చల ప్రచురణ పైన ఆంక్షలూ - వీటి అన్నింటి ఉద్దేశం ఎమర్జన్సీద్వారా సంక్రమించిన అధికారాలు ఆధారంగా ఎదురులేని పరిపాలనను కొనసాగించుకోడమేనని అర్థం అయింది.

శ్రీ చరణ్‌సింగ్ ప్రకటనవల్ల రెండు అంశాలు స్పష్టమయినాయి! మంత్రి మండలి సలహాలను పొందడానికి కూడా ఇందిర నిరాకరించడం; రాష్ట్రపతి పదవి ఉన్నతిని కోల్పోవడం. ఇందిర క్యాబినెట్‌లో సీనియర్ సభ్యుడుగా ఉంటూ రాజీనామా చేసిన జగ్జీవన్‌రామ్ ఎమర్జన్సీ ప్రకటన గురించి ఇందిర "మంత్రిమండలికి తెలియజేశారు" అని ప్రకటన చేసినప్పుడు కూడా పౌరు లకు ఈ అనుమానం వచ్చింది. ఇందిర తీసుకొన్న ఒక రాజ్యాంగ విరుద్ధ చర్య మరికొన్ని నిబంధనల ఉల్లంఘనకు దారితీసింది. వాటి ఫలితంగానే రాష్ట్రపతి "సంతృప్తితో నిమిత్తం లేకుండా"నే ముందు ముందు రాష్ట్రపతి ఎమర్జన్సీ ప్రకటించవచ్చునని రాజ్యాంగానికి 38 వ సవరణ వచ్చింది; ప్రధానిపై ఎవరూ సివిల్, క్రిమినల్ కేసులు పెట్టకుండా రక్షణ కల్పిస్తూ 41 వ సవరణ చట్టం వచ్చింది; ప్రధాని హోదాలో ఉన్నవారి ఎన్నికకు సంబంధించిన వివాదాలు వినడానికి కోర్టులకు హక్కు లేకుండాచేస్తూ 39 వ సవరణ చట్టం వచ్చింది అన్ని అక్రమ చట్టాలనూ పొదుగుతూ ఆఖరికి 42 వ సవరణ చట్టం వచ్చింది; చివరికి రాజ్యాంగంలోని 74 వ ఆర్టికల్‌ను కూడా సవరించి ప్రధాని చేతిలో బొమ్మగా రాష్ట్రపతి ఉండేటట్టు ప్రయ త్నించారు. మన ప్రజాస్వామ్య వ్యవస్థకూ, ఉన్నత పదవులకూ ఇవి మచ్చలు. వీటిని నూతన ప్రభుత్వం వెంటనే చెరిపివేయాలి.

# పత్రికా స్వేచ్ఛ

"ధర్మం ఏమిటో నాకు తెలుసు, దానిమీద నాకు మనస్సు పోదు; అధర్మం ఏమిటో తెలుసు, కాని దానిమించి నాకు మనస్సు మళ్ళదు." ఈ మాటలు చెప్పిన దుర్యోధనుడు ఒకప్పుడు చీఫ్ సెన్సార్ ఆఫీసర్ అవునో కాదో మనకు తెలియదుగాని స్వార్థ చింతకూ వక్రబుద్ధికీ ఈ మాటలు నిదర్శనం. ఇరవై మాసాలపాటు రాజ్యమేలిన ఎమర్జన్సీతోపాటు పత్రికలపై సెన్సార్ నిబంధనలు కూడా ఇప్పుడు రద్దు అయినాయి. వాస్తవాలను వక్రీకరించ కూడదు, కాని వ్యాఖ్యాన స్వేచ్ఛను అడ్డుకోరాదన్న, పాశ్చాత్య లిబరల్ సంప్రదాయాలలో పెరుగుతూ వచ్చిన భారతీయ పత్రికా ప్రపంచం రెండవ ప్రపంచ యుద్ధకాలంలో విధించిన సెన్సార్‌షిప్ మినహాయిస్తే మళ్ళీ అంతటి విలయతాండవానికి గురికావడం స్వతంత్ర భారతంలో ఇదే మొదటిసారి. ఈ కాలంలో రాజకీయ వ్యంగ్య చిత్రకారుల కుంచెలూ, వ్యాఖ్యాతల కలాలూ చేవ చచ్చాయి. పాలకులేకాదు, పాఠకులూ హాస్య దూరులయ్యారు. "శంకర్స్ వీక్లీ" సహితం ఇక చేసేదిలేక చాలించుకుంది. విమర్శను సహించలేని, హాస్యాన్ని భరించలేని, కృత్రిమ జీవనానికి అయిష్టంగానైనా అలవాటు పడ్డాం. ఏ సెన్సారూ లేకుండా ఏ సమాజమూ ఉండదు. కాని దేశ ప్రయోజనాలు వేరు, వ్యక్తిప్రయోజనాలు వేరు. అల్హాబాద్ కోర్టుతీర్పు ఎమర్జన్సీ ప్రకటనకు ఎంత కారణమో పత్రికా స్వేచ్ఛపైన కత్తివేటుకు కూడా అంతే కారణమైంది. మంచిచెడుల విచక్షణ నశించింది. దేశభక్తి సంఘ ప్రయోజన స్పృహ తనకుతప్ప మరెవరికీ ఉండదని భావించినప్పుడే "రాజు చేసిందెల్లా ధర్మం, రాజు చెప్పిందెల్లా శాస్త్రం" నిరంకుశంగా అమలులోకి వస్తుంది. "స్వాతంత్ర్యం నా జన్మహక్కు" అని లోకమాన్యుడు చాటింది భావస్వేచ్ఛకూ "కేసరి" పత్రికా స్వేచ్ఛకూ పరిమితులు తెలియకకాదు; అవినీతినీ అధికార దుర్వినియోగాన్నీ రాజకీయంగానూ, సంఘపరంగానూ బహిర్గతంచేసి ఎండ గట్టడమే తన "ఇండిపెండెంట్" లక్ష్యమని మోతీలాల్ నెహ్రూ ప్రకటించింది బాధ్యతలు తెలియకకాదు; "వీళ్ళు ఆస్తులనేకాదు, భావస్వేచ్ఛను కూడా జప్తు చేస్తున్నార"ని తన "నేషన్" ద్వారా బ్రిటిష్ వాళ్ళపై అనిబిసెంట్ దండోరా వేసింది. సమాజంపట్ల బాధ్యతలను విస్మరించి

నందువల్ల కాదు; భావప్రకటనా స్వాతంత్ర్యం హరించుకు పోయినదని లాహోర్ కాంగ్రెస్ ఆనాడు పాలకులను అభిశంసించినది. ఉత్తరోత్తరా ఆ స్వేచ్ఛను తానుకూడా హరించడానికి కాదు. పాలకుల ఆంక్షలు ఉన్నా గాంధీజీ "యంగ్ ఇండియా"లో సమస్యలను నిష్కర్షగా చర్చించేడు ఆయన బాధ్యతారహితుడయిన దువల్ల కానేకాదు. ప్రజలనూ, ప్రభుత్వాన్నీ చైతన్య మార్గానికి మళ్ళించడమే వీరి ఉద్దేశ్యం.

కాని "క్రమశిక్షణ" పేరిట గడచిన ఇరవై మాసాలుగా అమలులోఉన్న సెన్సార్ నిబంధనలు ప్రభుత్వానికి వాదోడుగా పత్రికలను ఎంతగా మలప కున్నా, ఆచరణలో విరుద్ధ ఫలితాలు కొనితెచ్చాయని అనుభవం రుజువు చేసింది. పిడుగుకీ, బియ్యానికీ ఒకే మంత్రం కావడంతో అక్రమాలను బహిర్గతంచేసి, అమాయకులకు జరుగుతున్న అన్యాయాలను సకాలంలో ప్రభుత్వ దృష్టికి తేగల సాహసాన్ని ఈ నిబంధనలు చంపివేశాయి. తద్వారా ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య విశ్వాస వారధిగా వర్ధిల్లవలసిన పత్రికలు కేవలం "భటాగ్రజులు"గా మారడంవల్ల ప్రభుత్వ లోపాలను ప్రస్తావించే అవకాశం పత్రికలకు లేకుండా పోయింది; తెలుసుకోవాలన్న తహతహ సరిచేసుకోవాలన్న ఆతురత ప్రభుత్వానికి నశించింది. ఫలితం ఏమిటో ఎన్నికల ఫలితాలు నిరూపించాయి. ప్రెస్ కౌన్సిల్ రద్దయింది; రూపొందించామని చెప్పిన పాత్రికేయుల ప్రవర్తనా నిబంధనావళి ఏకపక్షం అయింది. ఫిరోజ్‌గాంధి చట్టం రద్దు అయింది. ప్రజలను అప్రమత్తంగా ఉంచవలసిన సందర్భాలలో కూడా, చివరకు వరదల సందర్భంగా కూడా సెన్సార్ "శంఖులో పోసిందే" వార్త కావలసి వచ్చింది. కొన్నిచోట్ల తహశీల్దార్లు సంపాదకులుగానూ, సంపాదకులు తహశీల్దార్లుగానూ తారుమారు అయ్యారు. సమాచారమంత్రి చీఫ్ సెన్సార్ ఆఫీసర్ లూయీ చక్రవర్తులయ్యారు. ఈ పరిస్థితులలో ఒక దుర్గాదాసునూ, ఒక సాహనీనీ, ఒక శివరావునూ, కనీసం ఒక చలపతిరావు నయినా ఊహించుకోడమే కష్టమయిపోయింది.

బ్రిటిష్‌వాడు తెచ్చిన దారుణమైన "ప్రెస్‌యాక్టు"ను ప్రతిఘటిస్తూఒకప్పుడు హేమాహేమీలైన హార్నిమాన్, చింతామణి సచ్చిదానంద సిన్హాలు లార్డ్ చెమ్స్‌ఫర్డ్‌కు నిశితమయిన వినతి పత్రమయినా సమర్పించ గలిగారు. కాని మన కాలంలో అదికూడా చేయలేకపోయాం. మానవ హక్కులూ, భావస్వేచ్ఛా గురించి మన సరిహద్దులుదాటి నినదించగలవాళ్ళం సరిహద్దుల లోపల మరిన్ని అరలు పేర్చుకున్నాం. ఈ హద్దులు చెరపగలనని ప్రకటించిన జనతాపార్టీ అధికారంలోకి వచ్చినందున- పాత అనుభవాలను దృష్టిలో పెట్టుకుని లౌక్యంగా వ్యవహరించగలదని ఆశిద్దాం.

# మనువు అయినా మురార్జీ అయినా...

మానవకోటిలో సగభాగంగా ఉన్న మహిళల మార్దవాన్ని కోమలతనూ మెచ్చుకుంటూనే ఇతరత్రా వారి శక్తియుక్తులను ఈసడించుకునే వ్యక్తి మనువు అయినా మురార్జీ అయినా సహించలేము. ప్రధానిగా మురార్జీదేశాయ్ అమెరికన్ పత్రిక "టైమ్"కు ఇచ్చిన ఇంటర్వ్యూ దేశంలోనూ, విదేశాలలోనూ మహిళాలోకంలో కొంతకల్లోలానికి కారణమయింది. ఇండియాలో ఇందిర పరిపాలనతో ఆయన విసిగి వేసారిపోవచ్చుగాని, తన అసహనాన్ని ఒక 'సెక్స్'కే పరిమితం చేయడం విజ్ఞతగా భావించ లేము. మురార్జీ ప్రకటనలో రెండుఅంశాలు ప్రధానమైనవి: (1) "మొత్తం మీద చూస్తే మహిళలు పురుషులకంటె కోమల హృదయులు. కాని స్త్రీ రాక్షసిగా మారితే ఆవిడను ఇక పురుషుడు అధిగమించలేడు." (2) "చరిత్రానుభవం తరవాత శ్రీలంక, ఇండియా, ఇజ్రాయెల్ ముగ్గురు మహిళా ప్రధానుల కింద పొందిన" అనుభవాల తరవాత తన అభిప్రాయాలు మారాయట. ఈ రెండు నిర్ణయాలూ తప్పిదాలే. ఎందువల్లనంటే ఈ సగం మనిషినే మనవాళ్ళు "అర్థనారీశ్వరి" అన్నారు. దానినే ఇంగ్లీషువాడు "బెటర్ హాఫ్" అన్నాడు. రాక్షసత్వాన్ని "సాడిజం" అన్నారు. మురార్జీ మహిళలపట్ల వ్యక్తంచేసిన అసహనానికి 'సెక్స్' భేదం ఎలా లేదో "రాక్షసత్వా"నికి కూడా 'సెక్స్' భేదం లేదు. ఆ వ్యత్యాసమే ఉంటే క్రైజన్లూ, ముసోలినీలూ హిట్లర్‌లూ పురుషులలో ఉండడానికి వీల్లేదు! పరిపాలనా దక్షతలో ఈజిప్షియన్ రాణి క్లియోపాత్ర ఎంతో, ఇండియాలో ఝాన్సీలక్ష్మీబాయ్‌కూడా అంత సమర్థురాలూ. నిజానికి గొప్పగొప్ప పురుషులు సగం మానవాంశలోనూ మిగతా సగం రాక్షసాంశంలోనూ ఉన్న సమయంలోనే క్లియోపాత్రా, రోమన్ మహారాజ్ఞి థియోడరాలు అవతరించారనీ, లక్ష్మీబాయి ఉద్భవించిందని మరవరాదు. రోమ్‌ను ఈజిప్టులో అంతర్భాగంచేసే వరకూ క్లియోపాత్రా నిద్రపోక పోవడానికి ఆమె కర్కశత్వం ఎంత కారణమో సీజర్, ఆంటోనీల పచ్చి మోసాలూ పాశవిక చర్యలూ కూడా అంతే కారణం. రాజ్యకాంక్షకు 'సెక్స్' భేదం లేదు !

స్థూలంగా మహిళా లోకంపట్ల మురార్జీ ఆపాదిస్తున్న లక్షణాలు వ్యక్తిగా ఒక్క మురార్జీ మనస్సునుంచి ఉట్టిపడిన భావాలు మాత్రమే కాదు. గాంధీజీ నుంచి మురార్జీ వరకూ మహిళలపట్ల ఉన్న సాదరాభిమానాలు స్త్రీ నోరెత్తనంతవరకే. ఇందుకు కావలసిన ఉప్పును అందిస్తున్న సాంఘిక వ్యవస్థ, ధర్మాలూ, ఆచారాలూ, శాసనాలూ మనకు ఉన్నాయి. చివరికి మన వ్యవస్థ స్త్రీని స్త్రీయే నిందించగల సాహసం చూపగలది. ఆడది నోరుమూసుకున్నంతకాలం మూగది, తెరిస్తే రాకాసి. ఆడదాన్ని అమృతం అన్నవాళ్ళూ, అదే నోటితో హాలాహలం అన్నవాళ్ళూ మనవాళ్ళే. "ఆడదాని బుద్ధి ఆపదలకు మూలం" అని సామెతలలోనే చేర్చివేశారు. ఎదురు తిరగకపోతే ఆవిడ అబల, తిరిగిందా "ఆదిశక్తి" అన్నారు. చరిత్రలో మనం ఒక మైత్రేయినీ, ఒక గార్గినీ, లేదా ఒక లీలావతినీ ఎంతగా మెచ్చుకున్నా నాటినుంచి నేటి వరకూ స్త్రీ పట్ల మన వ్యవస్థ పాటిస్తున్న నియమాలన్నీ ఇలాగే ఉన్నాయి. "పురుషుడికి స్త్రీ రేయింబవళ్ళు బానిసగానే పడిఉండాలన్న మనువును మన ధర్మశాస్త్రాలు ఎంతగా పొగడుతున్నాయో స్త్రీని "గాడిద బరువు"గా భావించిన లెవిటిస్‌ను యూరోపియన్ వ్యవస్థలూ అంతగా ప్రేమిస్తున్నాయి. ఇలా "లోకంలో దేవతగా నరకంలో దెయ్యం"గా స్త్రీమూర్తి ఏజియన్ ద్వీపకల్పంలోనూ, ఫ్రీజియా, సిరియా, అనటోలియా, యావదాసియాలోనూ సంచరించినట్టు "కవిలకట్ట"లు రాసిపడేసారు. గణిత శాస్త్రంలో మనం ప్రేమిస్తున్న పైథాగిరస్ పురుషుణ్ణి వెలుగుగానూ, స్త్రీని చీకటిగానూ చిత్రించాడు. ఫ్రెంచి విప్లవానికి చేదోడు వాదోడైన రూసో కూడా "పురుషుల సంతోషం కోసమే స్త్రీపుట్టింద"న్నాడు. పాతరోమన్‌లా అంతా రోతగా మారింది ఇందువల్లనే. సాహసానికి మారుపేరు జోన్‌ఆఫ్‌ఆర్క్, క్రిస్టియానా. పట్టుదలకు పరాకాష్ఠ అంధులకు విద్యాదానం చేసిన అంధ మాతృమూర్తి హెలెన్ కెల్లర్. వ్యక్తులనూ, ప్రాంతాలనేగాదు నాగరికతలనే కవ్వించిన విదుషీమణులు డొరోతీ పార్కర్, కాథరీన్ మాన్స్‌ఫీల్డ్, "కుమ్మరి"మొల్ల. ఇక మన చిలకమర్తి వారి మాటలలో "ముదితల్ నేర్వగ రాని విద్యగలదే ముద్దార నేర్పించినన్ !"

మనం నేర్చుకోవలసింది చాలా ఉంది. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యానికి ముందు మారవలసిన ధర్మశాస్త్రాలు చాలా ఉన్నాయి. స్త్రీ- పురుష విభజన పని విభజననుబట్టిగాక 'సెక్స్'ను బట్టి సాగడానికి బీజాలన్నీ ఈ (అ) ధర్మశాస్త్రాలలోనే ఉన్నాయి. వాటిపైన ధ్వజమెత్తనంత కాలం మనువుకు అయినా మనలో మురార్జీవంటి వారికయినా సొంత అభిప్రాయాలు వ్యక్తం చేయగల స్వేచ్ఛను ఎవరూ అడ్డుకొనలేరు !!

# ప్రజాస్వామ్యం ఖరీదెంత ?

పత్రికా వృత్తిలో ఒక సామెత ఉంది : కుక్క మనిషిని కరిస్తే వార్తకాదు, మనిషి కుక్కను కరిస్తే వార్త అని ! అలాగే మన నవీన సమాజంలో-అదే ప్రజాస్వామ్యం-చేను కంచెను మేయడం కన్నా కంచే చేనును మేయడం కూడా ఒక వార్తే. కాని అలవాటు బహు చెడ్డది. అందువల్ల కంచె మేసినా చేను గురించి పెద్దగా ఇప్పుడెవరూ పట్టించుకోవడం లేదు. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పనులు కూడా ఇలాగే తయారయినాయి. విత్తనంకొద్దీ పెత్తనం అన్న సూత్రం చెలామణిలో ఉన్న వ్యవస్థలతో ఎన్నికల నిర్వహణ, అభ్యర్థుల ఎంపిక, ప్రచార సాధనాలూ, కార్యకర్తల కామాటం - అన్నీ కొన్ని పరిధులకు లోబడి వ్యవహరించవలసి ఉంటుంది. అంత మాత్రాన డబ్బులు ఉన్న ప్రతివాడూ నెగ్గగలడని భావించడమూ తప్పే. కాని డబ్బు ప్రభావాన్ని తక్కువ అంచనా వేయడం అంతకంటే పెద్ద అపరాధం. మన పార్లమెంటరీ డెమోక్రసీ చాలా "విలువ"యినది. అంటే గుణాన్నిబట్టి కాదు; దాని ఖరీదునుబట్టి విలువను మదింపు వేస్తున్నారు. మన ఎన్నికలు ఎంత ఖరీదైనవంటే, 1951 నాటి ప్రజా ప్రాతినిధ్య చట్టం అభ్యర్థుల ఎన్నికల ఖర్చుకు పెట్టిన పరిమితులుగానీ, 1969 నాటి కంపెనీల (సవరణ) చట్టం రాజకీయ పక్షాలకూ కంపెనీలు ఇచ్చే విరాళాలకు విధించిన నిబంధనలుగానీ పనికిరాకుండా పోయాయి; ఆచరణకు దూరమయి పోయాయి. పార్టీల ప్లేటు ఫిరాయింపులను మన ప్రజాస్వామ్యం ఎలా నిరోధించలేక పోయిందో ఈ చట్టాలు కూడా ఎన్నికల ఖర్చులను అలాగే అదుపు చేయలేకపోయాయి. ఈ విషయంలో కూడా అధికార పక్షమయిన కాంగ్రెస్ ఉపదేశాలను పాటించడంకన్నా ఉల్లంఘించడంలోనే మార్గదర్శి అయింది.

కొన్ని అంచనాల ప్రకారం ఎన్నికలలో ప్రచార ఖర్చులు (డిపాజిట్ల నుంచి పోలింగ్ ముగిసే వరకూ) 1971 లోక్‌సభ ఎన్నికలలో కంటే మూడురెట్లు పెరిగిపోయాయి లోగడ కాంగ్రెస్‌కు ఇచ్చే కంపెనీల విరాళాల గురించే ప్రతిపక్షాలు గలభా చేసేవి. కాని ఈసారి ఏదో నామమాత్రంగానే ఈ గల్లంతు వినిపిస్తోంది గాని, తమ పసరుల గురించి ప్రతిపక్షంకూడా అంతగా టీదతనం కనపరచడంలేదు. అయితే ఒక్కటి మాత్రం సత్యం- ఎన్నికల ప్రకటన వెలువడిన తరవాత అధికార పక్షం అధికార స్థానాలను సన్యసించనంత వరకూ దానికి ఉన్నన్ని ప్రయోజనాలు ప్రతిపక్షానికి ఉండవు. నిధులూ, వాహనాలు, ఇతర ప్రచార సాధనాలు అన్నింటికీ మించి రక్షణ యంత్రాంగం ఇవన్నీ అధికారపక్షం చేతి ఎత్తు బిడ్డలుగా ఉంటాయి. ఇక ప్రతిపక్షాలకు ప్రధానంగా ఆధారపడగలిగింది ఆచరణలో అధికారపక్షం వైఫల్యాలపైనా, అధికారయంత్రాంగం దుర్వినియోగ పద్ధతులను బహిర్గతం చేస్తూ తమ ప్రత్యామ్నాయవిధానాలనూ, లక్ష్యాలనూ సాధ్యమయినంత శక్తి మంతంగా ప్రచారం చేసుకోడంపైనా. మన ప్రజాస్వామ్యంలో మరొక విచిత్రం- ఖర్చు పెట్టగలిగిన వాడికీ, లేదా అతని తరపున పెట్టగలిగిన రాజకీయ పక్షానికే ఎన్నికల సమరాన్ని సమర్థవంతంగా ఎదుర్కొనగల సత్తా ఉండడం; ఫలితంగా సామాన్యుడి అభ్యర్థిత్వానికి చోటులేకుండా పోవడం; తద్వారా పెట్టిన ఖర్చులు రాబట్టుకోడానికి ఉత్తరోత్తరా తమ ప్రాతినిధ్య బాధ్యతలను తాకట్టు పెట్టుకోవడమూ ఇదొక చిత్రమయిన గొలుసుకట్టు.

ఇలాంటి అవకాశాలు లేకుండా చేయాలన్న ఉద్దేశంతోనే 1971 ఎన్నికలలో చట్టం అనుమతించిన పరిమితిని మించి ఖర్చు చేసిన కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ ఎ. ఎన్. చావ్లా ఎన్నిక చెల్లనేరదని ఒక కేసు సందర్భంగా సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. అంతేగాదు, ఒక అభ్యర్థి తానుగా పరిమితిదాటి ఖర్చు చేసినా లేదా అతని తరపున పార్టీ భూరి విరాళాలు సేకరించి ఖర్చుచేసినా- అది ప్రత్యర్థి విజయావకాశాలను దెబ్బతీయడానికి ఉద్దేశించిన అక్రమ చర్య అని కూడా వ్యాఖ్యానించింది. అంతే, ఆ తర్వాత సుప్రీంకోర్టు తీర్పును కూడా తోసిపుచ్చి చట్టాన్ని మార్చి - అభ్యర్థులకు ఏ వనరులనుంచి ఎలా విరాళాలు సమకూడినా సమ్మతమేనని చెప్పారు! కంపెనీల చట్టాన్ని కూడా అందుకు అనుకూలంగా సవరించేసారు! ఇలా మన వోటర్లు ఆశించే ప్రజాస్వామ్యం ఒకటి అవుతోంది, వారికి ఆచరణలో ఎదురయ్యే ప్రజాస్వామ్యం ఒకటిగా ఉంటోంది. ప్రజాస్వామ్యంలో ఓ విదళ బీజం!